# "వినతి పత్రము"

మూలం హిందీ :

శ్రీ గోస్వామి తులసీదాసు

తెలుగు గద్యానువాదము :

శ్రీ పొత్తూరు నారాయణప్ప చౌదరి

హిందీ పండితులు,

జె.ఓ.క్వా. 4,

తి.తి.దె. క్వార్టర్సు, కపిలతీర్థ రోడ్,

తిరుపతి.

వినతి పత్రము :
గోస్వామి తులసీదాసు రచన

తెలుగు అనువాదం :
పి. నారాయణప్ప చౌదరి,
హిందీ పండితులు



ప్రతులు : 750

ధర : రూ. 125-00

ప్రచురణ :
పి. నారాయణప్ప చౌదరి

ప్రతులకు చిరునామా :
పి. నారాయణప్ప చౌదరి
J.O.Q. 4, T.T.D. Qrts.,
K.T. Road, TIRUPATHI.

1998



తిరుమల తిరుపతి దేవస్థానముల వారి

ఆర్థిక సహాయంచే . . .

# "అనువాదకుని అభిప్రాయము"

హిందీలో శ్రీ గోస్వామి తులసీదాసుగారు రచించిన గ్రంథములలో "రామ చరిత మానస" (రామాయణము) తరువాత మిక్కిలి ప్రసిద్ధి గాంచినది - వినయపత్రిక. ఇది పండితుల పామర జనరంజకముగల కావ్యము. భక్తి ప్రధానమైనది. రాముడు సర్వసద్గుణ సంపన్నుడు. పూర్ణపురుషుడు. రామునియందు సౌందర్యము, బలము, సౌశీల్యము - ముప్పిరిగొని త్రివేణివలెనున్నవి.

రాముని పరబ్రహ్మ స్వరూపముగా భావించి, కలియుగములో కలిబాధలనుండి రక్షించగల రాముని ఎడ భక్తి కల్గియుండుట శ్రేష్ఠముగా భావించి తులసీదాసుగారు వినయ పత్రికను వ్రాసిరి. ఆంధ్ర ప్రదేశ్‌లోని ఆంధ్రులందరికి సులభముగా అర్థము అగుటకు సరళమైన శిష్టవ్యావహారిక భాషయగు తెలుగులోనికి అనువదించితిని. "వినయ పత్రము' వచన భక్తి కావ్యము. దీనిని అచ్చువేయుటకు తిరుపతి తిరుమల దేవస్థానములు, తిరుపతి వారు ఆర్థిక సహాయముచేసి నన్ను ప్రోత్సహించిరి. వారికినా శత-శత ధన్యవాదములు.

తిరుపతి - తిరుమలలో వెలసిన కలియుగ వైకుంఠుడు శ్రీ వెంకటేశ్వరస్వామి రామావతారమే. ఈ దేవుని కృపవలననే నేను ఈ గ్రంథమును హిందీలో నుండి తెలుగులోనికి అనువదించితిని. గద్యము సర్వజనులకు సులభముగానర్థమగునను ఉద్దేశ్యముతో గద్యము (వచనము)ను వ్రాసితిని.

"పలికెడిది వినతి పత్రంబె
పలికించెడువాడు రామభద్రుడే,
నే పలికిన భవహరమగునట
పలికెద; వేరొండు గాథ పలుకగనేలా!

ఈ పుస్తకము అచ్చు అగుటకు సహకరించిన వారందరికి వినయపూర్వక నమస్సుమాంజలులు అర్పించుకొనుచున్నాను.

ఆంధ్రులు ఈ భక్తి వచన కావ్యమును ప్రీతితో స్వీకరింతురని విశ్వసించుచున్నాను.

శ్రీ ఆర్. రాజీవలోచన గారికి, తిరుపతి ప్రత్యేక ధన్యవాదములు. వారు ఈ గ్రంథమును గురించి ఆంగ్లములో అభిప్రాయము వ్రాసి ఇచ్చిరి. వారికి నమస్సుమాంజలి.

మీ

తేది : 17-3-1998.

పొత్తూరు నారాయణప్ప చౌదరి

తిరుపతి.

# VINAYA PATRIKA

Epics and Hindu mythology have occupied a unique place in Indian Philosophy and would remain so far all times to come.

The Hindi version of "Vinaya Patrika" depicting the melody of Tulasi Das where he makes fervent appeals to Sri Rama for his divine Blessings is considered as a rich contribution for Hindi Literature.

Translation is proved to be a difficult task to some extent and speaks out the credibility of the Translator. Sri Narayanappa Choudary garu, Hindi Pandit by profession and a resident of Rayadurg in Anantapur District has ventured the challenging task of translating the Hindi Version of "Vinaya Patrika" to Telugu Version and done a yeomen service to Readers in Telugu. He has a unique and privileged style of his own in making the essence of 'Telugu Vinaya Patrika' to reach the Readers.

Knitting every context with apt words, pregnant with Bhava, he has given a realistic masterly tower of divine nature for the Translation.

'Vinaya Patrika' reflects the Puranic traditions and the cultural universe of the medieval traditions of Rama Bhakti which shaped Tulasidas himself an unparallel devotee.

Sri Choudary choosing simple words, effectively narated Rama's infinite glories and excellence. The way he wrote, rather translated the aspect of 'Bhakti Rasa' and the most appealing 'Saranagati' a total surrender with no demands is commendable.

I sincerely feel that Sri Choudary, a simple man with full of divinity in him, has lived in the role of Tulasi Das during the Translation.

The holy acts of Sri Rama and the Pathetic appeals of Tulasi Das has been beautifully sketched in Telugu version by Sri Choudary.

By bringing about this Telugu Version of 'Vinaya Patrika' Sri Choudary has contributed in a rich way to Telugu Sahitya loka. He has succeeded to a great degree in doing justice to the Translation and I am sure the Readers in Telugu would become richer in True literacy sense.

**Rallapalli V. Rajeevalochan,**
*Retired Director,*
Sri Venkateswara University,
TIRUPATI.

# "తులసీదాసు లోకనాయకుడు"

తులసీదాసు హిందీ సాహిత్యమున సర్వాధికుడైన సుప్రసిద్ధ లోక ప్రియుడైన కవిగా మాన్యత పొందుచున్నారు. వారి "రామ చరిత మానస్" (రామాయణము) ధర్మమునకు ప్రాణమై హిందువులకు ప్రాణప్రదమైనది. అటులనే సాహిత్య పరిశోధనా విషయమున ఖ్యాతి గాంచినది.

సామాన్య ప్రజల మరియు శిష్ట జనులలో తులసీదాసు లోకప్రియుడు అగుటకు వారి రెండు గ్రంథములు - 1. రామాయణము, 2. వినయ పత్రిక ఆధారములు.

తులసీ రామాయణము ప్రజల, భక్తుల, దార్శికుల, ఆలోచనాపరుల మరియు సాహితీ ప్రియులయందు సమానముగా లోకప్రియమైనది. వీరి సమన్వయ భావన ఎనలేనిది. ఈ సమన్వయ భావన వలననే తులసీదాసుగారిని మధ్యయుగమున లోకనాయకునిగా భావించడమైనది.

భారతదేశమున లోకనాయకునిగా గుర్తించుటకు - డా. గ్రియర్సన్ గారు పేర్కొన్న విషయము సమన్వయ వాదము. భారతదేశమున కాలాంతరమున అనేక విధములైన సంప్రదాయములు, పరస్పరము వైరుధ్యమైన సాంస్కృతిక విధానములు, ఆలోచనలు, వర్ణములు (కులములు), ఆచార వ్యవహారములు, నిష్ఠలు ప్రబలినవి.

ఈ వైరుధ్యమైన వికృతులు, సహిష్ణుతలేని మూల కారణములను చక్కగా అవగాహన చేసుకుని సాంఘిక మనస్తత్వము బాగుగా గుర్తెరిగి, ప్రాచీనతను తెలుసుకుని, యుగానుకూలమైన నూతనత్వమును సమ్మిశ్రముచేసి, నవీనయుగమునకు గ్రాహ్యమైన, శుభప్రదమైన వాటిని అందించుటలో సమర్థుడయి వుండవలయును. అతని ఆలోచనలు, భావనల వలన సమాజములోని సర్వజనులకు, అన్ని వర్గములవారికి శ్రేయోదాయకమై వుండవలయును.

భారతదేశమున అనేక శతాబ్దములకు అవకాశముగా ఇటువంటి లోకనాయకులు జన్మించుచున్నారు.

సమాజమున ప్రభుత్వము, వైభవ ప్రభావము పెంపొందినప్పుడు విలాస (భోగ) ప్రవృత్తి ప్రధానమై రూపొందును. విలాసము, వైభవము, అత్యాచారములకు పరస్పర సంబంధములున్నవి. ఇవి ఒకదానికి ఒకటి ఆశ్రయమును కలిగియుండును. వైభవము చేత భోగలాలసత (విలాస ప్రవృత్తి) పెంపొందును. విలాసము అత్యాచారములను కలిగించును. ఇట్టి పరిస్థితులయందు సామాజిక మాన్యమైన సంప్రదాయములు నశించును. పూర్వము నిర్ణయించిన మర్యాదల ఉల్లంఘన జరుగును. ఈ విశృంఖలత్వమున అరాచకత్వం ప్రబలును. కాలము గడుచుకొలది సామాన్య మానవులు కింకర్తవ్య మూఢులై (ఏమి

చేయవలెనో తెలియక) వుందురు. శక్తి, వైభవము స్వేచ్ఛగా విప్పారి అత్యాచారములను చేయును. సామాన్య బుద్ధిగలవారు ఈ విషమ పరిస్థితి ననుభవించుచుందురు. దీనిని తొలగించుటకు కొద్దిపాటి స్వల్ప ప్రయత్నాలు చేయుచుందురు. ఇటువంటి విషమ దుర్భర పరిస్థితులలో ఒకానొక మహాపురుషుడు ఆవిర్భవించును. ధార్మికమైన పదజాలములో భగవంతుని అవతారం, ఆలోచనాపరుల మాటలలో లోకనాయకుడని చెప్పవచ్చును.

మహాభారత కాలమున శ్రీకృష్ణుడు ఇటువంటి లోకనాయకునిగా అవతరించెను. ఈయన కర్మక్షేత్రమున అత్యాచారమైన శక్తులను రూపుమాపి ఆలోచనాక్షేత్రమున జ్ఞాన, కర్మ, భక్తి విషయములయందు ఏకత్వమును స్థాపించియుండెను. కాలాంతరమున బాహ్య కర్మకాండలు ప్రబలినపుడు గౌతమ బుద్ధుడు వాటిని వ్యతిరేకించి సత్యాహింసలను (సత్యము, అహింసలను) ప్రచారము చేసెను. బుద్ధుని తర్వాత కాలాంతరమున కర్మకాండ, ఆడంబరముల మాయాజాలమున చిక్కుకొనెను. శంకరాచార్యుడు వాటిని పరిష్కరించెను. జగత్తుయొక్క మిథ్యాత్వమైన (అసత్యమైన) మాయావాదమును స్థాపించెను.

తదుపరి శంకరుని ఈ మాయావాదము వికృతమయ్యెను. తులసీదాసు తన సౌమ్యమైన వ్యక్తిత్వము, తత్వగ్రహణమైన బుద్ధిద్వారా, సమాజము యొక్క కోరిక ప్రకారము విశృంఖలములను సమన్వయపరచి సమాజము యొక్క మర్యాదతో కూడిన ఒక ఆదర్శమును ప్రసాదించెను. కృష్ణుడు, బుద్ధుడు, శంకరుడు, తులసీదాసుగారు తమ తమ యుగములయందు లోక నాయకులైరి. సమాజమున సరియైన నియమములను ప్రతిపాదించిన సమర్థులైన వారే సరియైన, నిజమైన లోకనాయకులుగా మాన్యులగుదురు. మన ఈ యుగమున మహాత్మాగాంధీగారు కూడ లోకనాయకులే.

మనము ధర్మమును, శుద్ధమైన సాహిత్యమునగు వాటిని దృష్టిలో పెట్టుకొనక, ఈ లోకనాయకుని సామాజిక దృష్టితో అధ్యయనము చేసిన లోకనాయకులు సంపద, వైభవములను వ్యతిరేకించినారు. ఈ భావన చేత వీరిని మహోన్నతమైన సామాజిక శాస్త్రజ్ఞులుగా, మనస్తత్వ శాస్త్ర నిపుణులుగా మాన్యతవుండును. వైభవము, విలాసమునకు జన్మకారణము. విలాసము అన్యాయములకు సాంఘిక అత్యాచారములకు, సాంఘిక విశృంఖములకు కారణము. ఇందువలన ధనమును (సంపదను) సంపూర్ణముగా విషమతలకు (చిక్కులకు) మూలమని భావించవలెను. ఈ లోకనాయకులు ఈ విషయమును గుర్తెరిగి గౌతమ బుద్ధుని మొదలుకొని గాంధీగారి వరకు వైభవమును వ్యతిరేకించిరి. నిరాడంబరమైన, నిర్మాణత్వముతో వైరాగ్య జీవితమును సమర్థించిరి.

తులసీదాసుగారి కాలము వైభవకాలము. మొగలాయుల యుగము వైభవ (భోగలాలసత)మును దృష్టితో అన్నిటికంటె భోగలాలసతా సామ్రాజ్యముగా భాసిల్లినది.

ఆ కాలమున సమాజమునందు రెండు స్పష్టమైన వర్గములు ఉండెను. ఒకటి ధన సంపన్నమైన, వైభవముతో కూడిన పరిపాలకుల వర్గము. ఈ వర్గమున ముస్లిములు,

అధికార వర్గము వారియొక్క అన్యాయములకు గురి అగుచుండిరి. మొగలాయిల సామ్రాజ్య విస్తరణ (కోరిక) నిరంతరము యుద్ధములను ప్రోత్సహించుట జరిగినది. ఆ అగ్ని సామాన్య ప్రజలను కాల్చివేయుటలో సమర్థమై యుండెను. ఆదర్శములు లేని ప్రజలకు ఏమి చేయవలయునో తెలియకుండెను. ఆనాడు సమాజమున అనేక మతములు మతాంతరములు వ్యాపించియుండెను. కొంతమంది వైరాగ్యమును ప్రభోదించుచుండిరి మరికొందరు సారహీనమైన కర్మకాండను, ఇల్లు, వాకిలి వదలి బైరాగులగుట సామాన్యమై యుండెను. చదువురాని డాంభికమైనవారు వేదములను, పురాణములను, సాధువులను నిందించుచు సామాజికమైన మర్యాదలను మరింత ఎక్కువగా ఉల్లంఘించి, విశృంఖలతను పెంపొందించిరి. యోగమార్గులైన సాధువులు - తమ చమత్కారముల ద్వారా ప్రజలపైన తమ ప్రభావము కల్గించుటకు ప్రయత్నశీలురై యుండిరి. అలఖ్ (అగుపడని) దర్శించుటకు మిక్కిలి ఎక్కువగా భావన యుండెను. సంత్ (సాధువులు)యోగ మార్గములయందు విద్యలేని ఉన్నతవర్గము, కులముల (జాతుల) యెడ భయంకరమైన, నిర్లక్ష్య భావము నిండియున్నందున వారి ఆత్మ విశ్వాసము దురావహమగు గర్వభావమును దాల్చెను. సూఫీ వ్యక్తిగతమైన సాధన, ప్రేమ మహిమను ప్రచారము చేయు ప్రచారకులుండిరి. కృష్ణుని భక్తులు భగవంతుని లోక కళ్యాణ రూపునిగా (లోక రక్షకునిగా) అనగా మహాభారత కృష్ణునిని స్థాపించక బాలకృష్ణుని ఉపాసనయందు తన్మయులై యుండిరి. ప్రజలకు ధర్మము, ఉపాసనల విభిన్నమైన రూపముల, తమను రక్షించు శక్తివంతమైన ఆధారము లభించనందున వారు పిరికివారై భయభీతులై యుండిరి. ఇటువంటి సమయమున తులసీదాసు పిరికివారైన, భయభ్రాంతులైన ప్రజల మనస్సులకు అనుకూలమైన రాముని రూపమును ఆధారముగా శక్తి, శీలము, సౌందర్యమగు - మూడు గుణములుకల సమన్వయము అద్భుతమైన వికాస శీలమగు సిద్ధాంతమును ప్రసాదించెను. ఒక విధముగా తులసీదాసు భగవద్గీతా కృష్ణుని పునరావృతి చేసెను. తులసీరాముని కార్యము ఇదియే : "ధర్మమునకు హాని కలిగినపుడు అసురులు (రాక్షసులు) పెంపొందినప్పుడు, భగవంతుడు మానవ రూపమున అవతరించి సజ్జనుల భయముల - పీడలను తొలగించును".

రాముని యొక్క ఈ స్వరూప కల్పనయందు ప్రజలకు తమ రక్షకుడు లభించెను. ఆ ప్రజలు సంతృప్తితో ఆశావహులై యుండిరి. రామచరిత మానస్‌లోని విభిన్న పాత్రలలో ప్రజలు తమ ఆదర్శములకు తగిన నాకార రూపములను చూచిరి. తీవ్ర కోరికతో (ఆతురులై) స్వీకరించిరి. తులసీదాసు లోక ప్రియుడగుటకు ఇదియే ప్రధానమైన, మహిమాన్వితమైన రహస్యము.

తులసీదాసు సమాజమునకు జాగరూకతగల రక్షక (ప్రహరీ) గోడ, ప్రాణిమాత్రమునకు

(ప్రతివాడికి) శుభము చేకూర్చుట ఆయన ముఖ్యమైన ఉద్దేశ్యము అయివుండెను. ఈ శుభము (కళ్యాణము) విరోధము, విధ్వంసముగా కాక పారంపర్యమైన లోకమున - కాలానుగతమైన ఉదయించే శక్తుల, శుభతత్వముల సమన్వయము ద్వారానే సంభవించును. తులసీదాసు ఈ విషయమును గుర్తెరిగి యుండెను. ఆయన ఒకచోట నిట్లు వ్రాసెను. గంగా జలమువలె సర్వుల శుభములుకలుగునట్లు కీర్తి, మాట, వైభవము బాగుగా నుండవలెను. ఇందువలన తులసీదాసు తన కావ్యమును లోక కళ్యాణము చేయకోరెను. పరస్పరము వైరుధ్యమైన, విభిన్నమైన ఆలోచనా పరంపరల యొక్క సారమును సంగ్రహించి సమకూర్చి వాటిని సమన్వయ పరచినప్పుడే సంభవమని భావించెను. తులసీదాసు యొక్క సంపూర్ణ సాహిత్యము ఈ సమన్వయము యొక్క విరాట్ స్వరూపయత్నమే. ఆయన లోకమును, శాస్త్రమును సమన్వయము, భాషా-సంస్కృతి సమన్వయము, కర్మ, భక్తి, జ్ఞానముల సమన్వయము, గార్హస్థ్య (గృహస్థ) వైష్ణవ సమన్వయము, నిర్గుణ-సగుణ సమన్వయము, బ్రాహ్మణ - చాండాలుని సమన్వయము ద్వారా విషమతలను (వైషమ్యములను) నిరాకరించి, ఒక ఆరోగ్యమైన, నవీనమైన, స్ఫూర్తిదాయకమైన, సమానత్వము ద్వారా ఆదర్శమును స్థిరపరచెను. రాముని శక్తి శీలము, సౌందర్యమును సమన్వయ పరచి ఒక ఉత్తమ వ్యక్తిత్వమును రూపమున అన్ని శుభతత్వములను ఉపయోగించి రాముని యొక్క లోక కళ్యాణము యొక్క రూపమును, మిక్కిలి మార్మికముగ, కళాపూర చిత్రమును సమకూర్చి ఇచ్చెను.

తులసీదాసు కాలమున హిందూ ధర్మమున అనేక విధములైన అపోహలు ప్రబలియుండెను. తులసీదాసు శివుని - రాముని ఏకత్వమును ప్రతిపాదించి, వైరుధ్యమును తొలగించుటకు ప్రశంసనీయమైన ప్రయత్నము చేసెను. శివ-కేశవుల లేక హరి-హర అభేదమును ప్రతిపాదించెను. దీనితోపాటు తులసీదాసు చెడ్డవాటితో రాజీపడలేదు. శాక్తేలయందున్న రహస్య సాధనములను సమాజమునకు హానిగా, అపాయమైనవని భావించుచుండెను. ఇందువలన ఆయన శాక్తేయులను వ్యతిరేకించెను. వైష్ణవుల కుటీరము క్షేమము. శాక్తేయుల గ్రామము గొప్పకాదు. అని వక్కాణించెను. సీతయందు ఆదిశక్తి రూపమును ఆపాదించి, శాక్తేయులను కూడ సంస్కరించుటకు ప్రయత్నించెను. ఇదియేకాక తులసీదాసు జీవ-బ్రహ్మల, జగత్తు-మాయల మొదలగు సంబంధంగల వివిధ ధార్మిక ఆలోచనల ఒక అంగమును సమాజమునకు కళ్యాణకారిణికాదని భావించెను.

ప్రజలు వీరి వాగ్ధాటికి దిగ్భ్రాంతిచెంది కపట ఆచార్యుల మాయాజాలమున చిక్కుకొనుచుండిరి. ఈ విధముగా తులసీదాసుగారు శాస్త్రజ్ఞానము యొక్క దుర్వినియోగమును వ్యతిరేకించి ఒక సరళమైన, సహజమైన, ఉపాసనా మార్గమును ప్రతిపాదించెను. అది సహజ గమ్యమయ్యెను. దీనికొరకు కూడ తులసీదాసు పూర్వపరాయనముగల సారమును గ్రహించే బుద్ధితో కార్యమును సాధించెను. ఆయన

అభిప్రాయములో-అద్వైతము, విశిష్టద్వైత్వము, ద్వైతము, పుష్టిమార్గము మొదలగునవి సంపూర్ణమైన సత్యమును ఆవిష్కరించక కేవలము కొద్ది సత్యాంశము వరకే చేరుకోగలిగినవి ఆయన ఈ ఆలోచనలలో కూడ ప్రజాకళ్యాణము ఇమిడి ఉన్నది. ప్రజలు ఈ తాత్విక (ధార్మిక) మాయా జాలమును పూర్తిగా అర్థము చేసుకోలేక వుండిరి. వారికి భక్తి మార్గమొకటియే సులభ సాధనము. ఈ సాధనము ద్వారా మానవులు తమ శీలమును చక్కదిద్దుకొని పరిపూర్ణమైన మానవులుగా దిద్దుకొనవచ్చును. తులసీదాసుగారి భక్తి మార్గము- కర్మ, భక్తి, జ్ఞానముల సమన్వయమై యుండెను. ఇతర మార్గములు సంపూర్ణముగాక ఏకాంగమై యుండెను. అయిన ఆపరి స్థితుల ప్రకారము తులసీదాసు జ్ఞానముకంటె భక్తిని ఎక్కువగా సహజ సులభమైనదిగా భావించెను. ఎందుకనగా ఆ కాలమున జ్ఞానము ద్వారా లభించు గ్రహణ శక్తి క్షీణించియుండెను. సామాన్య ప్రజల మనస్సులు దానిని తెలుసుకొనుటకు అసమర్థమై యుండెను.

తులసీదాసు - లోకద్రష్ట, జాగరూకుడు, సాంఘిక మనస్తత్వమున లోతైన పరీక్షకుడు. లోకహితము యొక్క జ్ఞానము పరిపూర్ణముగా నుండెను. లోకమర్యాదను పాటించనంతవరకు జనకళ్యాణము అసంభవమని, తులసీదాసుకు తెలియును. మర్యాదాలోపము వలన - లోక వ్యవస్థ ఉత్పన్నమగుట, ఆకాశ సమానమువలె కల్పన సమానముగా నిరుపయోగము. తులసీదాసుగారి ఒక పంక్తి గూడ మర్యాదను ఉల్లంఘించలేదు. ఆయన రాముడు మర్యాదా పురుషోత్తముడు. వారు పూర్తిగా మానవులే. మానవులకున్న సుఖ-దుఃఖములు, రాగ-విరాగములు, సంపూర్ణమగు భావనలు వారిలోనుండెను. ఇందువలన రాముని రూపమున ఆ యుగము మానవుల పూర్ణ రూపమును దర్శించిరి. వారిలో తమ ఆదర్శముల పరిపూర్ణమై ప్రతిబింబమును చూచి ప్రజలు అతివేగముగ ఆతురతతో స్వీకరించిరి. ఇవి తులసీదాసు గారి విరాట్ కల్పన పరిణామము.

తులసీదాసుగారి లోక ప్రియత్వమునకు వ్యాప్తి అగుటకు మరియొక కారణమున్నది. వారు కబీరు దాసుగారి మొండిపట్టుదల, ఘర్షణ స్వభావమునకు బదులుగా సౌమ్యత, సహిష్ణుత (ఓర్పు) అనే ఆధారములుగా తీసుకొనెను. ఆయన సంఘములోని అవ్యవస్థను దెబ్బకొట్టెను. అయిన ఆ దెబ్బలో కబీరు దాసువలె నిర్మమత మరియు విధ్వంస భావనలు లేక ఒక నిర్మాణాత్మకమైన కళ్యాణకారిని యగు భావన కల్గియుండెను. తులసీదాసుగారు ఖండించు సమయమున కటుత్వమునకు మారుగా మధురిమతో ఎక్కువగా ఉపయోగించుకొనిరి. వారు దుష్టులకు కూడ వందనము చేయక వుండలేక పోయిరి. తులసీదాసు మిక్కిలి ఎక్కువగా మర్యాదవాది. వేదములు, పురాణములు, శాస్త్రములు, తీర్థ స్థానములు, వర్ణ వ్యవస్థ, లోకాభిప్రాయము మొదలగు వాటిని ఆయన పూర్తిగా సమర్థించెను. తులసీదాసు విధ్వంసమునందు విశ్వాసము లేకుండయుండెను. నిర్మాణాత్మకమైన పరివర్తనమునందు విశ్వాసము కలిగియుండిరి.

తులసీదాసు చాలా ఔదార్యముగల గొప్పమనిషి. జీవితములోని ప్రతి అంశమును సమన్వయాత్మకముగా నుపయోగించెను. భాషా సాహిత్య క్షేత్రమున కూడ సమన్వయమును ఉపయోగించుకొనెను. వారు ప్రజా భాషయగు (ప్రజ-అవధి) సంస్కృత భాషలయందు నిష్ణాతుడు తులసీదాసు వ్యక్తియొక్క జ్ఞానమును లోకోపకారము చేయుటను సమర్థించెను. ఇందువలన ఆశ్రయదాతలైన రాజుల అతి ప్రశంస చేయు కవుల ఎడవారి భావములు ప్రచండముగా నుండెను. వారు జ్ఞానము యొక్క దుర్వినియోగము చూచి మిక్కిలి బాధపడుచు వుండిరి. జ్ఞానము రాజుల ప్రశంసకు కాక ప్రజలకు ఉపయోగపడవలెనని భావించెను.

తులసీదాసు సంస్కృత భాషయందు గొప్ప జ్ఞానము కలవాడు, విద్వాంసుడు. సంస్కృతము ఇప్పుడు ప్రజల భాష కాదని గుర్తెరిగెను. అందువలన సంస్కృతములో కావ్యరచన చేయుట తన జ్ఞాన దుర్వినియోగమగునని తలంచెను. ఇందువలన ఆయన జనసమూహమునకు సమాజము యొక్క సాహిత్య భాషలగు అవధి - ప్రజ భాషలను స్వీకరించెను. దీనితోపాటు తులసీదాసు తన భావములను కావ్యములద్వారా ప్రజల మనస్సు హత్తుకొనునట్లు వుండకోరి ప్రజాభాషలను ఎన్నుకొనెను. పూర్వము అమలులో వున్న సమకాలమున (తనకాలమున) నున్న కావ్య పద్ధతులన్నియు స్వీకరించి తన భావమును చెప్పెను. ఆయన ఛప్పయ, కబీర్‌దోహాలు, పదములు, సూరదాసు, విద్యాపతిగారి గీతిక పద్ధతులను, జాయస. ఈశ్వరదాసుగారి దోహా పద్ధతులను, రహీమ్ బరవై, గంగ కవి మొదలగు వారి సవైయా కవిత్వ పద్ధతి, మంగల కావ్యముల - మంగల పద్ధతిని స్వీకరించి సాధారణ ప్రజలయందు ప్రచారములోనున్న సోహార్, నహఛూ, చామర, వసంత మొదలగు పద్ధతులలో రామకావ్యమును వ్రాసెను. ఇది కూడ తులసీదాసుగారి సమన్వయాత్మకమునకు ఒక ప్రతీక.

ఇన్ని వైరుధ్యములకు సమన్వయము కల్పించి చేసినందువలననే లోకనాయకుడయ్యెను. తులసీదాసు ఒకవేళ బుద్ధుడు, కబీరు వలె ప్రత్యేకమైన ధార్మిక పంథాను నిర్వహించలేదు. హిందూధర్మమునందు ఇంకా ఎన్నియో సనాతనమైన మానవతా క్షేత్రములున్నను తులసీదాసు అందరికంటె సర్వోత్తమమగు ఉన్నతుడై యున్నాడు, సర్వశ్రేష్ఠుడుగా ఉన్నాడు.

వారి కావ్యమగు రామాయణము ప్రత్యక్షముగా పరోక్షముగా నేడు కూడ ప్రజలకు మార్గ నిర్దేశము చేయుచున్నది. మహాత్మాగాంధీగారు ''రామరాజ్య'' ఆదర్శమును తులసీదాసు నుండియే స్వీకరించెను.

# వినయ పత్రిక

రామచరిత మానస్ (తులసీ రామాయణము) పిమ్మట మిక్కిలి ప్రసిద్ధిగాంచిన గ్రంథము "వినయ పత్రిక". దీనిని మనము తులసీదాసుగారు తన ఆత్మానందము కొరకే వ్రాసుకొనెను అని చెప్పవచ్చును. ఇందులో సామాజిక విశ్లేషణ కంటె ఆత్మ విశ్లేషణయందే ఆయన నిమగ్నుడయ్యెను. అను విషయము స్పష్టమయ్యెను. అయినను ఈయన తన ఆత్మవిశ్లేషణలలో కూడ సాధారణ మానవుల ఆత్మవిశ్లేషణే యున్నది. అది తన విరాట్ స్వరూపమున సర్వమానవుల ఆత్మవిశ్లేషణయే అయినది. సాధువు (భక్తుని) యొక్క తన సుఖము కొరకు (స్వాంతఃసుఖాయ) అనునది ఎల్లవేళలా, సదా జనహితముగానే నుండును. భక్తుని (సంత-సజ్జనుని) వ్యక్తిగతమైన సుఖ-దుఃఖములు, విశాల మానవుల సుఖ-దుఃఖములు అగును. ఎందుకనగా సంత్ (జ్ఞాని-సజ్జనుడు) వ్యక్తిగా పరిమితముగాక సర్వమానవుల ప్రతీక అగును. ఇదే సిద్ధాంతము తులసీదాసు గారి "వినయ పత్రిక"కు అన్వయించును. ఇందులో తులసీదాసుగారు భౌతిక ఐశ్వర్యములయందు లిప్తుడైన మానవుల కరుణామయమైన మానసిక పరిస్థితిని మార్మికముగా ఆవిష్కరించెను. స్వార్థములో నిమగ్నమైయున్న మానవులు ప్రపంచములోని వైభవ - విలాసములయందు పడి ఎంతో భయంకరమైన, మానసికమైన అశాంతికి గురి అగుచున్నారు. ఈ విషయమును "స్వ" (తన) కథనముగా భావించి, తన మాధ్యమముగా చేసుకుని విశ్లేషించెను. ఒక విధముగా తులసీదాసుగారు సర్వమానవుల పీడితులైన మానవతకు ప్రతినిధి అయ్యెను. తులసీదాసుగారి ద్వారా చిత్రించిన ఈ చిత్రము యొక్క రెండు పక్షములున్నవి. అవి తమ విరాట్ రూపముననున్నను ఒకదానికి మరియొకటి భిన్నముగాక ఒకటిగానే యున్నది.

ఒక ప్రక్క వైభవ - విలాసములయందు వున్నందున అనేక పాపకర్మల యందు లిప్తమైన మానవులు - వీరు సత్కర్మలకు, సదాచారములకు తిలోదకములిచ్చి, తమ వాసనలను (కోరికలను) నెరవేర్చుకొనుటకు అహర్నిశము ప్రయత్నములు చేయుచున్నారు. ఎల్లప్పుడూ సంతోషము లేక అసంతృప్తి అనెడి దాహమున దగ్ధమగుచున్నారు. వీరికి ఎప్పటికిని మానసిక శాంతి లభించదు. రెండవ పక్షమున ఆ పీడిత దళిత మానవులు; వీరు అన్నవస్త్రాది లేమి చేత సదా బాధపడుచు దుఃఖమును పొందుచున్నారు. ఈ రెండు వర్గముల ప్రజలకు తమ తమ అభావములు (లేమి-కొరత) ఇరువర్గములవారు పీడితులై ఉన్నారు. శారీరకంగా- మానసికంగా కూడ. ఈ దుఃఖమునుండి విముక్తి పొందుటకు ఒకే ఉపాయము (మార్గము) ఉన్నది. రాముని ఎడ భక్తి కలిగియుండుట, కేవలము రామభక్తి ("రామనామ" సక్మరణ చేయుటతోనే పరిమితము కాదు. దీని మూలమున సత్ప్రవర్తన భావము ప్రధానమై యుండవలెను. రామభక్తి యొక్క వాస్తవమైన అభిప్రాయము - ప్రతి వ్యక్తి సత్ ప్రవర్తకుడు కావలెను. ప్రపంచములోని అన్ని కోరికల ఎడ నిష్కాను భావనను

కలిగి నిరాడంబరమైన, సరళమైన జీవితమును గడపవలెను. ఈ మాదిరి ప్రతిమనిషి ప్రవర్తించినచో ప్రపంచములోని అన్యాయములు, అత్యాచారములు, అభావము (లేమి, లోటుపాట్లు) మొదలగునన్నియు సమూలముగా నాశనమగును. తదుపరి సర్వమానవాళి సుఖముగా, శాంతి, సంతోషము ఆనందములో నిండిన జీవితమును అనుభవించవచ్చును. "వినయ పత్రిక" యొక్క మూల సందేశము ఇదియే అని ద్యోతకము అగుచున్నది. భక్తితో కూడిన ఈ లోక కళ్యాణ కారకమగు రూపమును స్థాపించుటయే తులసీదాసు సమస్త జీవితము యొక్క చరమ సాధన - ఉపలబ్ధి.

## "వినయ పత్రిక ఎందుకు వ్రాయబడినది?"

పైన వినయ పత్రిక మూల ఉద్దేశ్యమును గురించి, దాని ఎడ సంకేతము చేసితిమి. అది మన దృష్టికోణము. ఆచార్య రామచంద్ర శుక్ల వంటి సాహితీ మనీషి తులసీదాసు గారి సాహిత్య మూల ఉద్దేశ్యము ఇదియేనని భావించిరి. ఇదియేగాక రామ భక్తుల దృష్టియందు వినయ పత్రిక ఒకే ఒక ఉద్దేశ్యమును రామనామ స్మరణ వలన వ్యక్తి యొక్క సర్వ పాపములు తొలుగును. అతడు పరిశుద్ధుడగును. అతనికి మోక్ష ప్రాప్తి కలుగును. తులసీదాసు మోక్ష ప్రాప్తిని కోరక (యాచించక) కేవలము రాముని ఎడ భక్తి యుండుటకు, భక్తి కలిగియుండుటను కోరును. సాధారణముగా వినయపత్రికను భక్తి గ్రంధముగా భావించువారు దానియందు మూలముననున్న సత్రృవర్తన, సందేశము, సత్రృవర్తన మహిమ, సత్రృవర్తన పరిభాష (నిర్వచనము) దాని లోక కళ్యాణ కారిణియగు స్వరూపమును తెలుసుకొనుటలేదు. ఈ కారణమున వారు ఈ గ్రంధము యొక్క లోతైన జ్ఞానమును తెలియక, దాని బాహ్య రూపము వరకే పరిమితమై యుందురు. కేవలము "వినయ పత్రిక' 'యే కాక తులసీదాసుగారి సంపూర్ణ సాహిత్యమంతయు సత్రృవర్తనపై ఆధారపడి, ఆరోగ్యకరమైన మానవ సమాజ నిర్మాణమునకు వలసిన సందేశమును ఇచ్చుచున్నది.

వియోగి హరి (హిందీకవి) వినయ పత్రిక ఎందుకు వ్రాయబడినది అనుటకు ఒక కట్టుకథను పేర్కొన్నారు. అది ఇట్లున్నది - ఒక హంతకుడు "నా చేతనున్న ఆహారమును తిని, నన్ను హత్యాపాపముల నుండి విముక్తి కల్గించమని చెప్పుచూ తిరుగుచుండెను". తులసీదాసు అది విని అతనిని తన వద్దకు పిలిచెను. అతని చేతనున్న అన్నము తినెను. ఇది విని కాశీ పండితులు తులసీదాసును విమర్శించి, వారు తులసీదాసును ఆ హంతకుడు పాపములనుండి విముక్తుడయినట్లు ఏమి ప్రామాణము (ధృవము) వున్నదని అడిగిరి. తులసీదాసు ఇట్లు జవాబు ఇచ్చెను - రామనామ ఉచ్చారణా ప్రభావము అటువంటిది. అది ఉచ్చరించిన మానవుని సర్వపాపములు తొలగిపోవును. కాని అవిశ్వాసపరులైన, తార్కికులైన కాశీపండితులు ఇట్లు ఒక షరతు పెట్టిరి - కాశీ విశ్వనాథుని నంది - ఈ హంతకుని చేతియందున్న అన్నము తినినచో మేము ఒప్పుకొందుమనిరి. (వాడు పాపములనుండి

విముక్తుడైనట్లు స్వీకరించెదమనిరి). ఫలితముగా అటులనే చేయబడెను. రాతి నంది అందరి ఎదుట హంతకుని చేతియందున్న అన్నము అంతయు తినెను. రామనామము యొక్క ఈ ప్రత్యక్ష ప్రభావమును చూచి ప్రజలయందు రామనామ ప్రచారము పెంపొందెను. అందరు రామ నామ జపము చేయసాగిరి. ఇది చూచి కలియుగము కోపగించుకొనెను. అప్పటినుండి రామనామ ప్రభావము తొలగిపోయినది. ఇందువలన అతడు తులసీదాసును మందలించి భయపెట్టెను. అప్పుడు తులసీదాసు దుఃఖించి రామభక్తుడగు హనుమంతునికి విన్నవించుకునెను. అప్పుడు హనుమంతుడిట్లు చెప్పెను. ఈ దినములు అన్నియు (నేడు) కలియుగ రాజ్యమే. అందువలన మనము రాముని ఆజ్ఞ లేకుండ ఏమియును చెప్పలేము. అందువలన నీవు రాముని సేవలో ఒక "వినతి పత్రము" వ్రాయుము. రామునికి ఇవ్వుము. కలియుగమునకు దండన ఇప్పించగలమని తెలిపెను. హనుమంతుని యొక్క ఈ మాటవిని తులసీదాసుగారు ఈ వినయ పత్రికను వ్రాసెను.

ఈ వృత్తాంతము చమత్కార ప్రధానమైన మస్తిష్కము యొక్క బలిష్టమైన కల్పనవల్ల నుత్పత్తిగా ప్రతీక అగుచున్నది. ఈ రూపమున వినయ పత్రిక మూల ఉద్దేశ్యమును స్పష్టము చేయుటకు ప్రయత్నము చేసెను. కలియుగమునకు దండన కల్గించడము ఉద్దేశ్యము. కలియుగమునకు దండన కల్గించడము అనగా లోకముననున్న పాపములను, అత్యాచారములను సర్వనాశనము చేసి సద్ధర్మమును స్థాపించుట. ఈ పరిమాణము వలన మానవ సమాజమునందు సత్ప్రవర్తన స్థాపించుటయే దాని చరమ పరిణితి అగును. అఖిల మానవుల కళ్యాణము, వినయపత్రిక మూల ఉద్దేశ్యము ఇదియే.

## రచనాక్రమము :

వినయపత్రిక రచనాక్రమమును గురించి విద్వాంసుల, పండితులయందు భేదాభిప్రాయములున్నవి. కొంతమంది ఉద్దేశ్యము ప్రకారము ఈ గ్రంథ రూపములో చేయలేదు. మనకు ఈనాడు ఈ గ్రంథము లభించుచున్నది. వీరి ఉద్దేశ్యములో భిన్న-భిన్న పరిస్థితులలో వ్రాసిన విడిముక్తకములను తులసీదాసు లేక వారి అనుచరులు వీటిని కూర్చి ప్రస్తుత రూపముననున్న దానిని తులసీదాసు రచించెనని తెలిపిరి. వినయపత్రిక లోని చివరి కొన్ని కవితా గేయముల యందు ఈ ధ్వనియే లభించుచున్నది.

"తులసీదాసు వ్రాసిన చివరి పంక్తులు ఇలా ఉన్నవి - "వినయ పత్రికా దీన్‌జీ, బాపు! **ఆపు హీ బాంచ్రో! హిమే హేరి తులసీ లి ఖీ సుభాయ్ సహీకం బహురి పూఃఛియే ప్రాచో"**

ఈ పంక్తులు ప్రకాశము కానపుడు వీటిని ఆధారము చేసుకుని, తులసీదాసు ఈ గ్రంథమును ఇదే రూపమున, క్రమమున వ్రాసివుండెనని నిరూపించవచ్చును.

ఈ పత్రిక యందు తులసీదాసు రాజుగారి ఆస్థానమునకు అర్జీ (వినతి పత్రము) పంపే పద్ధతిని ప్రచారములోనున్న క్రమమును ఒక విధముగా అనుకరించెను. ఏదేని శుభకార్యమును

ఆరంభించుటకు ముందుగా గణపతి పూజ ప్రార్థన చేయుట ఆచారము. తులసీదాసుకూడ ఈ గ్రంథము ప్రారంభమున "గాయియె గణపతి జగవందన" అని చెప్పి ప్రారంభించెను. తదనంతరము సూర్యునిని, విద్యలేనందున జనించిన అంధకారమును (అజ్ఞానము) తొలగించి, రాముని చరణముల యందు వుండునట్లు కోరెను. తదుపరి రామనామమును చక్కగా తెలుసుకున్న ఆది ప్రతిష్ఠాపకుడైన జగద్గురువు అగు (శివుని) శంకరుని ప్రార్థించి, భయంకరుడగు రౌద్రమూర్తి భైరవుని స్తుతికూడ చేసెను - ఇతని వలన కలియుగము భయకంపమును పొందుచున్నది. మధ్యలో సంక్షిప్తముగా పార్వతి, గంగా(నది), యమున, కాశి, చిత్రకూటమును (ఆశ్రమము) గుణగానము (ప్రశంస) చేసిన తదుపరి, రామునికి పరమ ఆప్తుడగు, స చైతన్య సేవకుడు, జాగృత సేవకుడు (అప్రమత్తుడగు)నగు హనుమంతునితో తన వ్యధా కధ (బాధతో కూడిన కధ) (వృత్తాంతము) చెప్పి, ఆయనను రామ భక్తి ప్రసాదించకోరెను. తర్వాత సంక్షిప్తముగా భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల స్తుతించి, తదుపరి రెండు గేయములలో (పద) మాతయగు జానకితో - చాలా కరుణామయమైన మాటలలో ప్రార్థన చేసెను. ఎప్పుడైన కరుణాకధను రేకెత్తించి ప్రభువు (రామునికి)కు నన్ను జ్ఞాపకము చేయుము. ఈ రెండు పద గేయములు 41, 42 చాలా మర్మగర్భముగా నున్నవి.

రాముడు ఆ స్థానములోని సభాసదుల, దేవీ దేవతల స్తుతి చేసి తులసీదాసు తన ప్రభువగు - రాముని ప్రక్కకు ఉన్ముఖుడగును. మొదట ఆయన ఒక పదములో (గేయము) సంక్షిప్తముగా రామచరిత్రను వర్ణించుదురు. అందులో సంపూర్ణముగా రామాయణ కథ వచ్చును. గేయము (పదము) సంఖ్య 43. తదుపరి రాముడు, కృష్ణుడు, దశావతారములు, బిందుమాధవుని వందనము చేయబడును. ఇవి అన్ని చేసిన పిమ్మట తులసీదాసు ప్రభువు, శీలము, ఉదారము, తన దీనత్వము కల్మషము, కోర్కెలు లేని వాటిని వేరు వేరు పదగేయములలో విస్తారముగా వర్ణించిరి. 276 వరకు ఇదే విధానము వుండును. అందులో మనస్సు, జీవుడు, జగత్తు కల ప్రభావము ఆధిక్యము మొదలగు వాటిని వినూత్న పద్ధతులతో మాటిమాటికి (పునఃపునః) వర్ణించెను. ఇటుల పత్రిక (వినయ పత్రిక) మూల విషయము సమాప్తమగును. రాముని ఎదుటకు వినయపత్రికను ఎవరు తీసుకెళ్ళి ఇవ్వవలెననెడి ప్రశ్న (సమస్య) వున్నది. తులసీదాసుకు ఇద్దరు సభాసదులు (1) లక్ష్మణుడు (2) హనుమంతుడు. వీరిని మొదటనే సిద్ధము చేసుకుని వుండెను. సీత కూడ తులసీదాసును సమర్థించుటకు సిద్ధముగా నుండెను. ఒక దినము మంచి అవకాశమును చూచి హనుమంతుని, భరతుని, సమ్మతి సహకారములను పొంది లక్ష్మణుడు వినయపత్రికను సిఫారసు చేసి రాముని ఎదుట వుంచును (హాజరు పరచును).

"కలికాలమున ఒక కింకరుని (ప్రసిద్ధిగల) నామస్మరణ రక్షింపబడుట (నిర్వహింపబడుట)".

సభ అంతయు లక్ష్మణుని ఆమోదమును తెలుపును. రాముడు చిరునవ్వు నవ్వి

స్వీకరించును. ఈ విషయము సీత ద్వారా విన్నాను. తదుపరి ఆపైన మీ స్వీకృతి ప్రధానము చేసితిరి. అందరి యొక్క కలిసిన భక్తితో దీనుడగు తులసీదాసు పని పూర్తి అగును. తులసీదాసు నిమగ్నుడయి రాముని ఎదుట నతమస్తకుడగును.

**వినయ పత్రిక సమాప్తమగును.**

వినయ పత్రిక క్రమము ఇదియే. ముగ్ధులైన భక్త జనము ఈ విషయములన్నింటిని విశ్వసించును - తులసీదాసు తప్పకుండ తన వినయ పత్రికను రాముని ఆస్థానమున ఇచ్చివుండును. రాముడు దానిని స్వీకరించి యుండును. ముగ్ధులు సత్య-అసత్యముల భేదమును గుర్తెరుగరు. తులసీదాసుగారి మొత్తము వినయపత్రిక ఒక వైశాల్యమైన రూపకము; అని ఊహించలేరు. దాని బలోపేతమైన, కాల్పనికమైన, పరిశుద్ధమైన సంపద. కవి కౌశలము ఇదియే తెల్పును. కల్పన కూడ సజీవమైన నాకార రూపమును ప్రదత్తతము చేసినది. ఈ జన కళ్యాణకారిణియగు కాల్పనికమైన చమత్కారముల వలన కట్టుకథలు తులసీదాసును హనుమంతునిని ఆత్మీయులుగా చేసినవి. రామాయణ కథాపఠనము నిర్వహించుచోట, హనుమంతుడు ఏదో ఒక రూపము (వేషము)న అక్కడ ఉండును. తులసీదాసు చిత్రకూటమున రామ-లక్ష్మణులను దర్శించుకొనెను. హనుమంతుడు ఆ రహస్యమును చెప్పివుండెను. కలియుగము తులసీదాసును మందలించెను. తులసీదాసు హనుమంతునికి ఈ ఫిర్యాదు చేసెను. రాతినంది తినెను, తిని వుండెను మొదలగునవి.

సరళమగు అమాయకపు మన హృదయములు రూపకము యొక్క వాస్తవమును తెలియక దానినే యదార్థమైన సత్యముగా భావించెదరు. నేర్పరులైన వ్యక్తులు (చతురులు) కట్టుకథల నల్లి వారి భ్రమను ఇంకనూ ఎక్కువ ప్రగాఢము గావించుదురు. ఇందులో ఒక చెడు ఉన్నది. అమాయకులైన ప్రజలు వాస్తవ స్థితి వరకు చేరుకోలేరు. బాహ్యరూపముననే చిక్కుకొని ఉందురు. ఫలితముగా మూలసందేశము, సరియైన జ్ఞానమునుండి వంచితులగు చున్నారు. తులసీదాసుగారి ఈ విషయమున అంధవిశ్వాసము కలిగియుందురు. "రామనామ స్మరణ వలన సంపూర్ణమగు పాపములు నశించును." అను భావన ఏర్పడును రామనామము వ్యక్తిని సత్ప్రవర్తన, ఆశలేనివానిగా, మహాత్ముని గావించును. తులసీదాసు గారి ద్వారా చెప్పబడిన భక్తులకు (సంత్-సాధువుల) చెప్పిన లక్షణముల గురించి గమనించరు. రాముడు ఎవరినైనా స్వీకరించిన వారికి ఏ రూపము కల్గినను విషయము చైతన్యము లేక యుందురు. తులసీదాసు గారి గేయము ఈ విషయమును స్పష్టము చేయుచున్నది. ఈ పదగేయమున తులసీదాసు సరియైన రామభక్తుని గురించి వర్ణించెను. మానవులందరు మంచి మనస్సుతో రాముని స్మరించినచో అనగా రాముని ఆదర్శ జీవితమును స్వీకరించి తన జీవితమును సత్ప్రవర్తన, ఆశలేని విధానమును ఆచరించిన సర్వ మానవుల

చెడు భావములు గలవాడు, ఈర్ష్యగలవాడు, సోమరి, రామ నామ స్మరణ వలన ముక్తి, లోకమున కావలసిన సంపదలు లభించుననుకొనును. కాని మానవుడు తులసీదాసు చెప్పిన విధముగా పూర్తిగా ఆశలేని, సత్ప్రవర్తనగల వాడుగావుండు విషయము పాటించడు. వినికూడ నిర్లక్ష్యము చేయును. ఇట్లు చేసినచో విరాగుడగును. అతని జీవితములో ఆకర్షణ ఏమియును వుండదు. ఈ విధముగా ప్రజలు మూలము వరకు చేరక మూర్ఖులు అగుచున్నారు. తులసీదాసు మానవుని సమూలముగా సత్ప్రవర్తన గల వానిగా చేయప్రేరణ కలిగించును. కేవలము పైపై మనస్సుతో రామనామము వదరుటవలన లాభము లేదు. ఇందువలన తులసీదాసు "వినయ పత్రిక" యందు బాహ్యాపూజ, ఉపాసనలు మొదలగువాటిని తులనాత్మకముగా మానసికమైన ఉపాసనకు, మహత్తునకు ప్రసాదించెను. మానసికమైన ఉపాసన అంటే లేకికార్థము - మనస్సు సంయముతో దానివి అశుభముల నుండి దూరముగా వుంచి శుభముల ఎడ ప్రోత్సహించవలెను. మనోవిచారము యొక్క పర్యాయ పదము అనగా విచార శుద్ధత మానవ కళ్యాణమునకు ఒక ముఖ్య సాధనము. వినయ పత్రిక యొక్క ముఖ్య ఉద్దేశ్యము ఇదే.

**వర్ణించిన విషయము :**

ఇంతకు ముందు "వినయ పత్రిక" క్రమ వివేచనము గురించి స్థూలరూపముగా దాని వర్ణించిన విషయమును గురించి కూడ పేర్కొని యుంటిమి. ఈ విషయమును గురించి కొద్దిగా విస్తరించి పేర్కొనవలసిన అవసరము ఉన్నది. (ఆలోచన చేయవలసి ఉన్నది). సంక్షిప్తముగా ఈ గ్రంథము కవిగారి వినయము యొక్క మాటల పదకోశము. దీని మొదటి వర్ణనాంశం "వినతి" (ప్రార్థన). తులసీదాసుగారు తన వినయ భావనను విభిన్న మాధ్యముల ద్వారా వ్యక్తపరచెను. సంక్షిప్తముగా ఈ గ్రంథమున వర్ణించినవి ఈ విధముగా పేర్కొనవచ్చును.

1) సర్వ దేవ - దేవతల, తీర్థ-స్థానముల ఎడల పూర్తిగా శ్రద్ధ కలిగియుండుట.

2) ప్రపంచ జీవనము ఆసక్తి లేకుండుట, ఆసక్తిని వ్యతిరేకించుట ఆసక్తి యొక్క భయంకరమైన ఫలితములు.

3) మనస్సును వశములో ఉంచుకొనుటకు అనేక విధములైన పద్ధతులలో దానికి ప్రబోధము కలిగించుట.

4) రామ నామ మహిమ, దానియెడ సంపూర్ణమైన సమర్పణ భక్తిభావన, కలుషితము లేని (నిష్కల్మషమైన) జీవితము, మనస్సు యొక్క నిరంతర చంచలత్వము (చపలత్వము).

5) రాముని శరణు మహిమ, దాని లోపము.

ఈ గ్రంథమున తులసీదాసు భేద-భావము లేకుండ హిందూ ధర్మమున మాన్యత పొందిన దేవీ-దేవతలను స్తుతించెను. పవిత్రమైన తీర్థ ప్రదేశముల, ముఖ్యముగా రాముని జీవితమునకు సంబంధించిన పుణ్య ప్రదేశములను శ్రద్ధతో వర్ణించెను. ఈ స్తుతుల

ప్రత్యేకత, సర్వదేవతల స్తుతి తర్వాత, ఆ దేవతల నందరి రామభక్తిని తులసీదాసు యాచించెను. గణపతి, శివుడు మొదలగు దేవతలు పెద్దవారు (గొప్పవారు), మహిమ గలవారు. తులసీదాసు వారి కృపను పొందగోరును. ఆయన, చివరి యందు వారిని వేడుకొనును. తద్వారా రాముని చరణముల యందే అనన్యమైన భక్తి ఉండునట్లు చేయకోరును. తదుపరి రాముని గురించి గుణగానము చేయును. ముగ్గురు అన్నదమ్ములను, సీతను కూడ ప్రార్థించుచు రామునికి నా జ్ఞాపకము చేయమనవి చేయును. ఈ పిమ్మట రామునితో తులసీదాసు ఏమియును చెప్పడు. మొదట తన నాలుకకు శిక్షణ ఇచ్చును. రాముని నామస్మరణ వల్లించి అనేక పుటల చీవాట్లుపెట్టును. తులసీదాసు ఆత్మ విశ్లేషణ చేసుకొనును. "రాముని భక్తిని నేను కోరుచున్నాను. మొదట నా స్వవిషయమును నేను చూచుకుందునుగాక అనగా తన కర్మలు (పనులు) ఎట్లున్నవి? ఇదే సందర్భమున ఆయన (తులసీదాసు) జడమైన జీవునికి చైతన్యమగుటకు ప్రభోదము కలిగించును. ఈ జగత్తులోని విషయ-వాసనలు క్షణికము, అశాంతికి మూలకారణము, సారము లేనివి. కావున జీవులు వీటి వ్యామోహము నుండి విముక్తులు కావలెను. రాముని చరణములు స్మరించవలెను.

జీవుడు చైతన్యముగా ఎట్లు వుండును? రాముని కృపవలనే జీవుడు అజ్ఞానమనెడి బంధనము నుండి ముక్తుడయి జ్ఞాన లాభమును చేకూర్చుకొనగలడు.

రాముడు ఎందుకు కృప చూపెట్టును? రాముడు దుఃఖములో ఉన్న వారిపై ఎల్లపుడు కృప చూపునని తులసీదాసు చెప్పును. ఈ ధృడమైన విశ్వాసము వలన తులసీదాసు తన పరిచయము ఇచ్చును. నేను రాముని సేవకుడను. అప్పుడు అప్పుడు 2, మూడు దఫాలు రామనామ స్మరణ చేయుచుండును. రాముడు తనకు శరణు ఇచ్చుగాక అని భావించుచున్నాను. ఇంకేమియు వలదు. నేను నీ శరణు కోరుటకు తగిన యోగ్యత లేని వానిని కాని వేద పురాణముల మాటలు విన్నందున గొప్ప గొప్ప పాపిష్టులను నీవు (రాముడు) శరణులోనికి తీసుకొన్నపుడు నేను ఒక నరాధమున్ని (నరుల యందు అధముడను) నన్ను కూడ స్వీకరించెదవు.

భక్తి క్షేత్రమున ప్రభువు (భగవంతుడు) మహిమ, తన అల్పత్వము, అనుభవముల లక్ష్యము వరకు చేర్చుటకు ఒక ముఖ్యమైన సాధనముగా భావించబడినది. తులసీదాసుగారు కూడా ఇదే పద్ధతిని అనుసరించిరి.

"రాముని కంటె గొప్పవారెవరు? నాకంటె చిన్నవాడు (అల్పుడు) ఎవరు? రామునికంటె శ్రేష్టుడెవరు? నావంటి దుష్టుడెవరు? అని వ్రాసెను. తులసీదాసుగారు రామునితో తన విభిన్న సంబంధములను తెల్పును."

"నీవు దీనదయాళుడవు. నీవు దాతవు, నేను భిక్షగాడిని నేను ప్రసిద్ధిగాంచిన పాపాత్ముడను. నీవు పాపపుంజములను హరించువాడవు".

"బ్రహ్మవు నీవు నేను జీవుడను. నీవు యజమానివి. నేను సేవకుడను. తల్లి, తండ్రి, గురువు నీవే. అన్ని విధముల నా హితుడవు నీవే".

తదనంతరము తులసీదాసు తన ఆత్మ విశ్లేషణ చేయ ప్రారంభించెను. నేను రాముని వంటి మంచి యజమానిని పొందినప్పటికి పరిశుద్ధమైన, పవిత్రమైన, నిశ్చలమైన మనస్సుతో వారి సేవ చేయలేక పోతినని ఆత్మగ్లాని పొందును. అయినను రాముడు కృపాసాగరుడు. వారు దీనుల అపరాధములను క్షమించి వారిని సదా కృపతో చూచును.

"రామా! నీవలె శుచి, శుద్ధిగలవారెవరు? పెద్దవు. నేను శక్తిలేని వానిని".

"ఉదరము నింపుకొనుటకు కింకరునిగా పిలవబడితిని. నా చేతుల ద్వారా విషయములను అమ్మితిని. నేను వంచకుడను. దయా సాగరుడా! నా కపటమును విస్మరించి నా యందు దయను చూపుము".

"నేను ఏమేమి చేయలేదు. అయినా నా చేతులకు ఏమియు లభించలేదు".

"ఎక్కడికి వెళ్ళలేదు? (అన్ని ప్రదేశములకు వెళ్ళితిని). ఏమి చేయలేదు? (అన్నియును చేసితిని). నేను నా శిరస్సు ఎక్కడ వంచలేదు? (అన్ని చోట్ల శిరస్సు వంచితిని)".

"భగవంతుడగు రాముడు అగు ప్రభువు తప్ప ఎన్ని జన్మలెత్తినను, జన్మజన్మాంతరముల యందు, దశ దిశల యందున్న దుఃఖమును హరించువారు లేదు".

అయినా రామ నాకు యింతవరకు ఏమియు లభించలేదు. ఆశ, పేరాశ, కోరికలు కల్గించుచున్నవి. తన పాపములను స్వీకరించినచో మనస్సుకు శాంతి లభించును. తులసీదాసు కూడ తన ఆత్మగ్లానిని అభివ్యక్తము చేయుచూ కొద్దిగా తేలికదనమును పొందును. కాని మనస్సు చాలా బలిష్ఠమైన చపలత్వము గలది. అది మాటిమాటికి లోకమునందలి విషయ వాసనల ప్రక్కకు పరుగిడును. ప్రయత్నించినను అది వశీభూతము కాదు. దీని చక్రంలో పడి జీవితమంతయు గడిచి పోయినది. ఇది ఎప్పుడును రాముని చరణముల ప్రక్కకు మరలలేదు. తులసీదాసు మనస్సుకు చాలా ఎక్కువగా నచ్చచెప్పను.

తులసీదాసైన నేను అన్ని ఆశలను వదలి, రాముని సేవయందే (సేవకుడనై) యున్నాను.

అయిన మనస్సు వూరకున్నది. దీనిని వశములో వుంచుకొనుటకు చేసిన ప్రయత్నములన్నియు నిష్ఫలమైనవి. చివరకు దీనికి కారణమేమని తులసీదాసు యోచించును. ఇది మాయవశములో ఎందుకు పడివున్నది? మాయ ప్రభువు (భగవంతుడగు రాముడు) దాసి. ఇందువలన దాని వలనుండి మనస్సుకు విముక్తికలగవలెనన్న రాముడు మాయను ఆజ్ఞాపించి అటుల కాకుండ నిలుపుదల చేయగలడు. తులసీ దాసు మనస్సు నందు ఒక అనుమానము జనించును - నా అటువంటి పాపి కొరకు భగవంతుడు మాయను ఎందుకు ఆజ్ఞాపించునో! పరమాత్ముడు గొప్ప గొప్ప పాపాత్ములను స్వీకరించినపుడు,

తులసీదాసునైన నన్ను కూడ రాముడు తప్పక స్వీకరించునని వివశుడగును. సదా భక్తుల హృదయములయందు పరమాత్మ ఉన్నాడు. భగవంతుని ఆస్థానంలో ధనవంతులని, పేదవారని, గొప్పవారు, తక్కువ వారని, కులము కలవారు, కులహీనులని భేదము వుండదు. అందరిని సమానముగా స్వీకరించును. ఇక్కడ తులసీదాసు పాక్షికమైన (సామాజిక) విధానమును చూపెట్టుచున్నాడు. రాముడు నాయటువంటి పాపిని కూడ తప్పక స్వీకరించునని నమ్మకము కల్గును. ఈ విశ్వాసము కల్గిన వెంటనే ఆయన ద్వంద్వమును వదలివేయును. భగవంతుని కృప కల్గినచో దుఃఖములన్నియు, అశాంతి, సంశయము అన్నియు తొలగిపోవును. రాముని కృపలేక ఇది తొలగడము అసంభవము. భగవంతుని కృప ఎటుల సంపాదించ వలెనో అను ప్రశ్న జనించును. మరల తులసీదాసు తన మనస్సుకు నచ్చచెప్పి రాముని శరణు జొచ్చిననే నీ కళ్యాణమగును. తులసీదాసు రాముని ఉదారత్వము (ఔదార్యమైన స్వభావము), భక్తుల ఎడ వాత్సల్యము, కృప మొదలగు వాటిని స్మరించును. ఈ విధముగా యోచన చేసినను సంపూర్ణమైన మనో విశ్వాసము ఏర్పడలేదు. మనసును వశములో నుంచుకొనుటకు ఆయన చేసిన ప్రయత్నములెల్ల నిష్ఫలమగును. రాముడు స్వయముగా వచ్చి తన మనస్సు, హృదయమందు నివసించువుండు గాక అటులైన మనస్సు వశమగును. రాముడు అతని మనస్సున ఎందుకు వుండును? తులసీదాసు మూల వినయ పత్రిక మూలసంచేశము వరకు చేర్చుకొనును. రామునియందు భక్తి కలిగియుండుట చిన్న పిల్లల క్రీడవంటిది కాదు (సులభము కాదు). దీనికొరకు వైగార్యభావము తప్పక అవసరము. తులసీదాసు తన అభిలాషను ఈ విధముగా అభివ్యక్తము చేయును.

ఎంతవరకు ఈ పరిస్థితిలో వుండవలయును. శ్రీరఘునాధుని కృపవలన సంత్ (జ్ఞానులు, భక్తులు) మంచి స్వభావములను గ్రహించగలిగిరి. భగవంతుడు ఇచ్చిన సంపదతో సదా సంతోషము కల్గియుంధును. దీనికంటె ఎక్కువ ఏమియును వద్దు. నిరంతరము పరహిత భావము త్రికరణ శుద్ధిగా నుండ కోరుచున్నాను. ఈ పరహిత కార్యమును నిర్వహించు శక్తిని నొసంగుము. పరుష వచనములు మిక్కిలి సహించరానివి. శ్రవణముల విని పాపమును దహింపబడవు. (చెవుల ద్వారా వినకూడదు). గర్వము తొలగిపోవలెను. మనస్సు సమశీతలమై యుండవలెను. పరగుణములు, దుర్గుణములని పలుకును. దేహజనితమైన చింతను త్యజించెదము. సుఖ, దుఃఖములను సమబుద్ధితో అనుభవించెదను. తులసీదాసునైన నేను ఈ పథమును (మార్గమును) నుండనిమ్ము. అవిచలమైన హరిభక్తి నొసంగుము.

తులసీదాసు యొక్క మూలసందేశము ఇదియే. ఒకవేళ మానవ సమాజమంతయు ఈ జీవితమును స్వీకరించిన వైషమ్యములు అన్నియు తొలగును. భక్తుల భాషలో భక్తులకు రాముని కృప లభించును. రాముని కృప లభించినచో తులసీదాసు అభిప్రాయము ఇటువంటి జీవితమును గురించి ఏమున్నది; ఇట్టి జీవితము ఉన్నతమైన మానవ

జీవితము. ఇట్లు రాముని భక్తి సంపాదించుకొని ముక్తి పొందవలెను. తులసీదాసు జగత్తులోని విషయములను (కోరికలను) త్యజించెను - అవి కోరికలు మానవుని [illegible] మానవునిగా వుండనివ్వవు. మానవుడు వైరాగ్యమును కలిగి యుండుటయే రాముని భక్తి అభిప్రాయము. అందున మానవునికి ఏ విధమైన దుఃఖములు శేషించి యుండవు. ప్రాపంచిక విషయములు (ఆకర్షణలు) దురాశవంటివి, దుఃఖమును కలిగించునవి. ఇందువలన వీటిని మొదట త్యజించుటకు షరతు పెట్టబడినది. నాధుడగు రాముని అనురాగము వలన జగము కూడ మేల్కొనును. దురాశను త్యజించవలెను. ఇదియే విజయము. కామాగ్ని అంతము కాదని తులసీదాసు చెప్పుచున్నాడు. విషయ భోగములు ఎక్కువగా చుట్టిముట్టి వున్నవి.

పరోపకారము చేయుటయే వేదసారము. మానవ శరీరమును నరుడు పొందినందుకు మానవుడు పరోపకారము చేయవలెను. ఇది శ్రుతి వేదముల యొక్క సారము. మోసమగు విచారము వలదు.

ఒకవేళ మానవుడు ఈ వేదసారమును గ్రహించి (తెలుసుకొని) అతనికి దుఃఖములను అనుభవించనవసరము లేదు. కాని తులసీదాసు రాముని శరణమే ఎందుకు కోరుచున్నాడు? రాముడు అతని "ఆదర్శమానవుడు" అని జవాబు వచ్చును. తులసీదాసు రాముని వ్యక్తిత్వమునందు ఆదర్శమానవుని రూపమును దర్శించెను, తెలుసుకొనెను. సర్వ మానవులు కూడ ఈ ఆదర్శమైన జీవితమును స్వీకరించిన మానవత సుఖముగా నుండును. విషమతలన్నియు తొలగును. ఇందువలన తులసీదాసు అహర్నిశలు రాముని ఆదర్శమును వరింప కోరుచున్నాడు. ప్రాప్తింప కోరుచున్నాడు. యోగుల మోక్షమును తులసీదాసు దృష్టి లోపమున్నట్లు తెలుసుకుని అవహేళన చేయును. మృగచర్మమున తరుల క్రింద కింకరులవలె (రాముని సేవకుల వలె) నుండుట నటన. దీనికంటె నరకమే మేలు నిజము చెప్పాలంటే, పరమ భక్తి లేనిచో దుఃఖము దహించును. భక్తియే ముఖ్యము. తులసీదాసుకు సమానమైన రూపక భాషయందు చెప్పవలసినచో రాముడు స్వీకరించునట్లు ఎట్లు తెలియనగును? తులసీదాసు దీనికి జవాబు చెప్పుచున్నాడు.

నీవు స్వీకరించుము. మనసు మారినపుడు తెలుసుకొనుము. విషయ వాసనలయందు నిమగ్నమై యున్నచో స్నేహము వదలి కపటుడగును. ఇది సహజము, స్వభావము. సుతుని ప్రీతి, ప్రతీతి మిత్రుడగు రాజు ఎటుల భయంకంపితుడగును. స్వామియెడ జపమును కలిగి చాతక పక్షి నియమముగ నొక చంద్రుని నాధారముగా చేసుకుని వుండును, నియమము తప్పదు. అతి ఆదరమున హర్షము కలుగదు. అనాదరమున సంపద తొలగిన బాధపడకుండుము. సుఖ, దుఃఖములు, లాభనష్టములు సమదృష్టితో చూచును. హితము, అహితముకల చేష్టలుగా భావించి చెడు ప్రవర్తనను తొలగించుకొనవలెను. ప్రభువు గుణములను విని మనస్సున హర్షము కలుగును. కన్నుల ఆనందభాష్పములు చిమ్మును.

తులసీదాసునగు నేను రాముని ఎడ విశ్వాసమును. ప్రేమను చూచి ఆనందము వుప్పొంగి హృదయము నిండిపోవును.

ఇదియే భక్తి యొక్క పూర్ణత్వము (పరిపూర్ణత) దీనిని సంపాదించుకొనుటకు తులసీదాసు అహంభావమును తొలగించు కొని మానవులను ఈ శుభకరమగు మార్గమున వెళ్ళవలెనని కేకవేసెను (ఆహ్వానించెను). వినయ పత్రిక సారాంశమిదియే. ఇవియే ఈ గ్రంథము యొక్క ముఖ్యమైన వర్ణించిన విషయములు. ఇతర విషయములన్నియు విశాలమైన ఆధ్యాత్మిక రూపకమును అలంకరించి వుండెను. గాంధీగారు ఈ రహస్యములన్నియు తెలుసుకున్న వాడయి తులసీదాసుకు గొప్ప భక్తుడు. తులసీదాసువంటి గొప్ప చింతకుడు ఆధ్యాత్మికముగా ఆవరణ యంతటిని చుట్టుకొని గొప్ప క్రాంతియుతమై సందేశమును సమర్థముగా నివ్వగలగిరి. తన ఈ సందేశమువలననే తులసీదాసు యుగయుగముల వరకు మానవులు శ్రద్ధాసక్తుడయ్యెను. (ప్రగాఢ ప్రియుడయ్యెను).

**భక్తి పద్ధతి :**

ఆచార్య శుక్లగారు శీలము యొక్క ఆకర్షణను ప్రేమ-భక్తి ఆలంబన చేసి స్థిరీకరణ చేసి తులసీదాసుగారు సత్ప్రవర్తన - భక్తి ఒకదానికొకటి అన్యోన్యాశ్రయములుగా చూపెట్టనని తెలిపిరి.

తులసీదాసు గారి యొక్క భక్తి పద్ధతి రహస్యమంతయు పై వాక్యమున దాగియున్నది. భక్తికి రెండు పక్షములుండును. ఆలంబనము అనగా ఎవరి ఎడ భక్తి చేయునో (భక్తి కలిగియుండునో) భక్తుడు అనగా భక్తిని చేయుచుండును. ఆలంబమునందు శీలము యొక్క అసామాన్యమైన ఉత్కర్ష కలుగుట. భక్తునికి తన ప్రక్కకు ఆకర్షణ కల్గించుకొనుటకు మొదటి షరతు. ఒకవేళ ఆలంబనయందు అసాధారణమైన ఉత్కర్ష కలుగునపుడు భక్తి అతని ఎడ ఎప్పటికిని ఆకర్షింపబడదు. తన ఉపాసనలో భక్తి యొక్క అసామాన్యమైన ఉత్కర్ష (అభివృద్ధి) చూచి భక్తుడు దాని ఎడ ఆకర్షితుడగును. ఈ ఆకర్షణ చేత ప్రేమ జనించును. అది ఒక విధముగ భక్తి రూపమును పొందును. ఇందువలన భక్తికి మూడు సోపానములుగా నిర్ణయించబడెను. ఆకర్షకుడు (ఆకర్షించువాడు) ప్రేమ, భక్తి. ఇది ఆలంబనము. ఉపాసకుని పక్షము విషయము. రెండవ పక్షమున భక్తుని తన విశేషతలు సామాన్య వ్యక్తులు శీలము ఎడ అధికముగ(ఎక్కువగా) ఆకర్షింపబడును. హృదయమునందు మూలమున ప్రేమ యొక్క కోమల (మృదు) భావములు నిండి సంపూర్ణముగా నుండవలెను. ప్రారంభమున ప్రేమ ప్రచ్ఛన్న రూపముగా నున్నను, అది వుండుట అవసరము. ప్రేమికుడే అనన్య భక్తుడగును, ఇతరులు కాదు. ప్రేమ సత్ప్రవర్తనకు జనకుడగును. ఇందువలన భక్తునియొక్క రెండు విశిష్టతలు నిర్ణయించబడినవి. ప్రేమికుడు - సత్ప్రవర్తకుడు. ప్రేమ సత్ప్రవర్తన యొక్క చరమా పరిణితి యొక్క రెండవ పేరే భక్తి. తులసీదాసుగారి భక్తి పద్ధతిని తెలుసుకొనుటకు ఈ విషయమును తెలుసుకొనుట అవసరము. భక్తుని యొక్క పూర్వజన్మ

ఫలమున ఉత్పన్నమగునా? లేక ఇతర పద్ధతుల ద్వారా అనువివాదమున పడగోరుట లేదు. ఈ రెండు వుండటము చాలా అవసరము. ఇవిలేక ఎవరును సరియైన భక్తుడు కాలేడు. ప్రేమ యొక్క ఉత్కృష్ట భావనయే భక్తి స్వరూపమునొందును.

మనము ఈ ఇరుపక్షములను ఇంకా ఎక్కువగా చూడ విశ్లేషణచే కోరినాము. ఆలంబనమున శీలము అసామాన్యమైన ఉత్కర్షను చూపి భక్తుడు ఆలంబనము ప్రక్కకు ఆకర్షితుడగును. తులసీదాసు ఈ కారణముననే రాముని యందు శీలము యొక్క అసామాన్యమైన ఉత్కర్షను చూపెట్టెను.

"సీతాపతి శీల స్వభావములను విని మనస్సు మోదమును పొందుటయేగాక శరీరము పులకాయ మానమైనది. కన్నుల ఆనంద భాష్పములు వచ్చెను. నరుడు, శివుడు, శైశవమున మాతా, పిత బంధువుల, గురువుల, సేవకుల, మంత్రుల, సఖుల ఎడ రాముడు, చంద్రుని వంటి ముఖము గలవాడు స్వప్నమున ఎవరిని చూడరు?" రాముని ఈ అసామాన్యమైన శీలమునకు అధికారి. అయిన ఈ శీలమునకు రెండు సోపానములున్నవి. సౌందర్యము, శక్తి. సౌందర్యము చేత హృదయం ఆకర్షించును, మోహించును. శక్తివలన ఆశ్చర్యము, శ్రద్ధాగుణములు కల్గును. శీలమునుండి హృదయము తద్రూపమును పొందును. ఈ శక్తి, శీలము. సౌందర్యము సమన్వయము వలన ఒక ఆదర్శమైన రూపం! విగ్రహం తయారగును. అది భక్తికి ఆలంబన అగును. కాని ఈ మూడు గుణములలో శీలము సర్వాధికమైన మహత్తు కలిగియుండును. శీలము లేక సౌందర్యము ఉచ్ఛృంఖలమే, అత్యాచారియగును. శక్తి ఉధృతమై, ఉత్పీడన, అత్యాచారి రూపమును పొందును. శీలమే- సౌందర్యము, శక్తికి శోభయు కళ్యాణకారిగా, ఆకర్షణీయము కలిగించును. ఆచార్య శుక్లాగారు ఈ కారణముననే సౌందర్యము, శక్తి యొక్క అసామాన్యమైన ఉత్కర్షణ విషయమును చెప్పక శీలము యొక్క అసామాన్యమైన ఉత్కర్షను చెప్పెను. తులసీదాసుగారు కూడ ఈ కారణముననే వినయ పత్రిక యందు రాముని శీలమునే ఎక్కువగా వర్ణించెను. శక్తి, సౌందర్యములను వర్ణించలేదు. ఈ విధముగా తులసీదాసు రాముడు సౌందర్యము, శక్తి, శీలము, సమన్వయము రూపముగా నుండును. అందులో మనకు శీలము యొక్క అసామాన్యమైన ఉత్కర్ష గోచరించును. భక్తుల ఉపాసనకు ఆధార రూపమయ్యెను.

తులసీదాసు శీలప్రధానమైన రాముని యొక్క ఈ స్వరూపమును, భక్తులయందు కూడ ఈ శీలము యొక్క ఔన్నత్యము మిక్కిలి అవసరమని భావించిరి. భక్తుల యందు ఈ శీలము ఎట్లు ఉత్కర్షయగును. ఇందుకు తులసీదాసు రెండు మార్గములు చేసిరి - సత్సంగమము, రాముని శరణుడొచ్చుట. సత్సంగము వలన ప్రాపంచిక విషయముల ఎడ వైరాగ్యము ఉత్పన్నమగును. సహజమైన, సరళమైన (నిరాడంబరముగా) జీవితము ఎడ ఆకర్షణ పెంపొందును. దీనివలన మనస్సు శుద్ధమగును. మనస్సు పరిశుద్ధమైన వికారభావనలు తొలగిపోవును. ఈ విధముగా సత్సంగము మనస్సును, రాముని భక్తి ఎడ ధృఢమైన

ఆధారమును ప్రసాదించును. దీనిని మనము ఒక విధమైన మానసిక పృష్టభూమిగా వర్ణించవచ్చును. ఇప్పుడు రెండవ పక్షమున - రాముని శరణుజొచ్చుట వున్నది. రాముని చింతన చేయుట వలన మనస్సు ఏకాగ్రమగును. రాముని స్వరూపము, శుభము. శుభము నందున్న మృదుభావనలనున్నందున మనస్సును తన ప్రక్కకు ఆకర్షించును. శుభము రూపము ఎడ ఆకర్షింపబడినప్పుడు, మనస్సు చపలత్వము క్రమముగా తొలగిపోవును. ఎందుకనగా శుభము యొక్క ప్రభావము సదా మనస్సును స్థిరముగా, ఏకాగ్రముగా నుంచును. మనము ఏదేని సౌందర్యరూపమును చూచినప్పుడు ముగ్ధులమయి కంటిరెప్ప ఆర్పక (ఏకాగ్ర దృష్టితో) దాని ప్రక్కకు చూచుచూ వుండెదము. ఈ విధంగానే శుభము తన ఎడ ఆకర్షింపచేసి, విస్మయము, విముగ్ధులను చేయును. ఇట్టి స్థితిలో మనస్సు తన చపలత్వమును త్యజించి అనగా ప్రాపంచిక విషయముల నెడ ముక్తురాలై తన దేవుడగు రాముని వివరణ గోరును. దీనివలన భక్తుని హృదయమున నున్న కలుషితము తొలగిపోవును. అతడు పూర్తిగా నిర్మలమైన ఆత్మ స్వరూపుడగు బ్రహ్మ అగును. భక్తుడు భగవంతునియందు భేదము లేని స్థితిస్థాపనకు ఇదియే రహస్యము.

రాముడు నిస్పృహుడు (ఆశలేనివాడు) సమదర్శకుడు (స్థిత ప్రజ్ఞుడు)గా నుండునో భక్తుడు కూడ అటులనే కాగోరును. ఈ విధముగా అయినవాడు యోగి, పరమహంస సంత్ (సత్పురుషుడు) అగును. భగవంతుని కూడ పరమ యోగిగా భావించబడినది. తులసీదాసుగారు రామునిని వర్ణించునపుడు ఆయన శీలమునందు పైన పేర్కొనిన గుణములన్నియు వున్నవి. చరమ ఉత్కర్షగా వర్ణించడమైనది. ఇటువంటి గుణములున్న వ్యక్తియే సత్ప్రవర్తకుడుగా భావించబడును. తులసీదాసు సరియైన భక్తుని లక్షణములు ఇవియే, భావించెను. భక్తి - సత్ప్రవర్తన ఒకదానికొకటి ఆశ్రయించియుండును. సరియైన సత్ప్రవర్తన గలవాడే సరియగు భక్తుడు అనగా సత్ప్రవర్తకుడగును. రామునివలె ఆదర్శమును ఆలంబన అనుకరణ చేసినపుడే మానవుడు సరియగు భక్తుడు అనగా సత్ప్రవర్తకుడు కాగలడు. తులసీదాసు యొక్క మూలభక్తి పద్ధతి.

ఇప్పుడు ఈ స్థితి వరకు ఎటుల చేరుకోవలెనో తులసీదాసు "వినయ పత్రిక" యందు విస్తారముగా వర్ణించెను. తులసీదాసు దేవతలను స్తుతించెను. గణపతి, శివ, సూర్య - హనుమంతుడు వీరితో రాముని చరణముల యందు నుండి శోభిల్లుటకు యాచన చేసెను. ఈ నలుగురు దేవతలు మానవుల విభిన్న విశేషతకు ప్రతీకలు. గణపతి విద్యకు, శుభమునకు ప్రతీక. గణపతిని స్మరించి తులసీదాసు లోకములోని సదాచారమును, కావ్య పరంపరను (సంప్రదాయమును) గౌరవించెను. రెండవ ప్రక్కన బుద్ధిని దానముగా కోరెను. శివుడు కళ్యాణము, ఉదారమునకు ప్రతీక. సూర్యుడు అజ్ఞానమును వినాశనము చేసి జ్ఞానమును సమానము వితరరణ చేయు దేవతకు ప్రతీక. హనుమంతుడు అనన్యమైన భావనకు ఒకే ఒక ప్రతీక. శివుని యొక్క భైరవ రూపము సంహారము చేయుటచే

అనిష్టములను తొలగించువాడు. ఈ విధముగా తులసీదాసు ఈ దేవతలను స్తుతించి, అప్రత్యక్షముగా విద్యను, జ్ఞానము, కళ్యాణమును, ఏకాగ్రతను ఆహ్వానించుచున్నారు. ఈ అన్ని శుభగుణములచేత శోభిల్లు రాముని ఉపాసన చేయవలెను. అనగా రాముని ఆదర్శ రూపమునకు అనురూపముగా, స్వయముగా తనను తానే నిర్మించుకొనుటకు సమర్థుడు కావలెను. భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు, సీత స్తుతిని చేయుట, రూపకమును పరిపూర్ణము చేయుటకనే తెలియవచ్చును. గంగానది నిర్మలత్వమునకు ప్రతీక. ఈ విధముగా తులసీదాసు విద్య, జ్ఞానము, అనన్యభావన, కళ్యాణము (శుభము), నిర్మలత్వము ద్వారా తన మనస్సును ప్రాపంచిక విషయ వాసనల ఆకర్షణలనుండి విముక్తము అయి సంపూర్ణ శుభములకు ప్రతీక రాముని చరణములయందు నిమగ్నుడు కాగోరును. ఇది అతని భక్తి భావమునకు మొదటి సోపానము. అనగా ఆధారము. ఇంతవరకు భక్తి యొక్క స్థిరీకరణ కాదు ఇది భక్తికి భూమిక మాత్రమే.

సంపూర్ణమగు శుభములను ఆహ్వానించిన పిమ్మట తులసీదాసు మూలవిషయము వరకు వచ్చును. భక్తి యొక్క రెండవ సోపానమున భక్తుడు తన అహంకారమును త్యజించవలెను. అహంభావము మానవుని సహజ స్వభావమైన విశేషము, అన్నిటికంటె పెద్ద బలహీనత కూడ. మానవుల యొక్క అన్ని మంచి - చెడ్డ పనులకు ప్రేరణ ఈ భావమే కలిగించును. ఇదియే అతనిని ప్రాపంచిక విషయ వాసనల యందు చిక్కుకునునట్లుగా చేసి శుభ పక్షములనుండి దూరముగా తీసుకుని పోయి దుఃఖములకు సృష్టి అగుటకు దోహద పడుచున్నది. ఇందువలన తులసీదాసు అన్నిటికంటె ముందు అహంభావము నశించుటకు గట్టిగా ప్రయత్నము చేయును. అహం నష్టం కావలయునన్న మానవుడు ఎవరిదో (దేనిదో) తనకంటె గొప్ప ఆదర్శమును స్వీకరించవలయును. ఇందువలన తులసీదాసు రాముని సౌందర్యము, శక్తి, శీలముతోకూడిన అద్భుతమైన మనస్సు మోహింపచేయు ప్రేరకుడునగు, శక్తి, శాలియగు స్వరూపమును ఎదుట ప్రవేశపరచెను. భక్తుడు రాముని యొక్క స్వరూపము ఎదుట తనను హీనమైన వానినిగా భావించ మొదలుపెట్టును. ఇదియే తులసీదాసు అభిప్రాయము. ఇందుకు తులసీదాసు తన దీనత్వము (హీనత్వము) రాముని మహత్యమును గొప్పగా వర్ణించెను. తన దీనత్వమును స్వీకరించుట వలన అహం నష్టమగును. మనస్సు నిర్మలమయి శుభకార్యముల యందు ప్రవృత్తమగును. శుభము ఎడ మనస్సు ఆకర్షణ కలిగించుటయే భక్తికి మొదటి మెట్టు.

ఇందుకు తులసీదాసుగారు తన దీనత్వము (దైన్యము). రాముని గొప్పతనము యొక్క వివిధములైన వర్ణనలు చేసి, మనసా! నీవు అన్ని త్యాగము చేసి సమరస భావమనెడి (సమదృష్టి) భావమును ధరింపుము. ఇటుల చేసినచో నీవు సుఖ, దుఃఖములనెడి వాటి ఆక్రమణల నుండి విముక్తుడయి సంపూర్ణమైన ఆత్మజ్ఞానము యొక్క స్వరూపుడవు అగుదవు. ఒకవేళ మనస్సు సమదృష్టిని కలిగించుకొనినచో ప్రాపంచిక విషయ వాసనల

ఆకర్షణ దూరమగును. అనగా భక్తుని మనస్సునందు వైరాగ్యభావము సంచరించ మొదలగును.

హృదయమున వైరాగ్యము ఉత్పన్నమయినచో మానవుడు అన్ని విధములుగ ఆనంద లాభమును పొందగలడు. లభించిన దానితో సదా సంతోషముగానున్న నాకు ఏమియు వలదు. సంతోష భావము ఉత్పన్నమయినచో కామము, క్రోధము, లోభము, మోహము, రాగ - ద్వేషములు మొదలగు దోష భూయిష్టమైన భావములు స్వయముగా నష్టమగును (తొలగిపోవును). ఈ విధముగ మనస్సు క్రమముగ హరిభక్తి ఒక్కొక్క మెట్టును దాటి అనగా ప్రాపంచిక విషయముల ఎడ వాటి ఆకర్షణలపైన విజయమును సాధించును. నిర్మలుడై, నిష్కలమగు జీవితము ప్రక్కకు అగ్రసరుడై సాగును. అయినా మధ్య మధ్యలో ప్రాపంచిక విషయ వాసనలు అతనిని తన ప్రక్కకు లాగుచుండును. మనస్సు వికలమై చంచలమగును. దీనినుండి ముక్తి పొందుటకు తులసీదాసు రెండు ఉపాయములను చెప్పెను. సత్సంగము చేయుట, అహర్నిశము రాముని చింతన యందు నిమగ్నమగుట తులసీదాసు తన భక్తి మార్గమున సత్సంగమునకు ఎక్కువ స్థానమిచ్చెను (మహత్యమును కల్గించెను). సాధు సంత్‌ల (భక్తుల - జ్ఞానుల) కలయిక (సత్సంగము) చేసినచో మానవుడు తన ఆత్మ స్వరూపమును గుర్తించగలడు. ప్రాపంచిక విషయ వాసనలు అతనికి నిస్సారమైనవిగా అగును. రాముని చరిత్రను, గుణములను గానము చేయుటయందే, వినుటయందే మనస్సు నిర్మలమగును.

రాముడు నీకు ఇష్టమయిన (బాగుగా ఇష్టమయినచో) ఇందుకు అతని సౌందర్యము, శక్తి, శీలమును ధ్యానించుము. ఈ విధముగ సౌందర్యము, శక్తితో సమన్వమయిన శీలమును తన జీవితములో కల్గించుకొనుము. రామునికి నీవు ఇష్టమయిన నీవు స్వయముగా పవిత్రుడవు కావలయును. ఇవి అన్నియు అగుటకు నీకు రాముని ఎడ సంపూర్ణమగు నిష్ట అనగా అనన్య భావన వుండవలెను. తులసీదాసు భక్తుని కొరకు రాముడు తప్ప మరొకరు ధృడమైన సంబలము (ఆధారము) కాదు. భక్తుని ఆశ్రయము రాముని చరణములే.

రాముని ఎడతులసీదాసుకు సంపూర్ణమైన విశ్వాసము వున్నది. కేవలము రామునితో అనన్య సంబంధము, ప్రేమయే ఆయనకు ఇష్టము (ప్రియము). చాతకపక్షి, చకోరములకు చంద్రుడు, మేఘముల ఎడ అనన్యమైన భావము (ప్రేమ) వుండునట్లు, తులసీదాసు రామునిని ప్రేమించును. చాతకపక్షి తన ప్రేమకు ప్రతీక.

ఒకదానిపైన ఆధారపడిన ఒకే బలము. ఒకే ఆశ - విశ్వాసము. ఒకే రాముడు ఘనశ్యాముడు తులసీదాసు హితుడు.

కాని ఈ అనన్యతలో ఇచ్చునది - తీసుకునుననది అనుభావము ఉండదు. పరిపూర్ణమైన నిష్కామమే. స్వర్గాదులను కోరి భక్తి చేయుట వ్యర్థము. తులసీదాసుగారు జన్మ జన్మములకు

నానుయే కల్పతరువు. కలియుగ౦ ఇది శుభమును కల్గించును. కర్మ, ఉపాసన, వేద సమ్మతమైన జ్ఞానమునందు నిఖరముగా తేలవలెను (నిగ్గు తేలుట). నాకు అంధత్వము శ్రావణమేఘములు. కనిపించవు. రంగు పచ్చగా గోచరించును (అజ్ఞానము, తొలగవలెనని భావము). అనన్య భావన యొక్క పరాకాష్ట. ఈ విధమయిన అనన్యతా భావముచే భక్తి చేసిన భక్తియే ఉపలబ్దమగును. ఆత్మ స్వరూప బోధన ఏర్పడుటకు వీలువున్నది. తులసీదాసు మోక్షమును కోరడు. వారు (తులసీదాసు) అన్యమార్గములను, సిద్ధాంతములను చెడ్డవి అని చెప్పరు. కర్మ, ఉపాసన, జ్ఞానము, వేదమతము అన్నియు శ్రేష్ఠమయినవే. ఈ విధముగా నిష్కామ భక్తిని స్థాపించెను. రెండవ పక్షమయిన సంప్రదాయములను చెడ్డవని చెప్పలేదు. తెలుసుకొనిన రామభక్తియే సర్వశ్రేష్ఠము. ఎందుకన రాముని నిర్మలమైన చరిత్రను చింతించిన, అనుకరించిన మానవుడు ప్రాపంచిక దుఃఖములను, వికృతమును, విషమతలనుండి విముక్తుడై పరిపూర్ణుడగు చున్నాడు. నిష్కామ భావన కలిగియుండుటయే మాన జీవిత సార్ధకత. కోరికలు మానవునికి దుఃఖములను కలిగించును. ఇందువలన తులసీదాసు రాముని చరణములయందే నిష్కామ ప్రేమ కోరెను.

తులసీదాసు భక్తి పద్ధతి ''సేవ్య, సేవిక'' భావమువంటిది. దానికి మూలాధారము ప్రేమ రూపమయిన భక్తి. తులసీదాసు స్పష్టముగా పేర్కొనెను. సేవక - సేవ్య భావము లేక సంసార (భవ-సంహితమును) సముద్రమును గరుడుడు కూడ దాటలేడు. తులసీదాసు భక్తి - జ్ఞానముల యందు భేదమును పాటించడు. జ్ఞానము - భక్తిలో భేదము లేదని చెప్పెను. "జ్ఞానహి భగవతిహి నహి కచు భేదా''. కాని వారు జ్ఞానము కంటె భక్తిని సరళము, సులభము (సహజ) భావించెదరు. ఎందుకనగా వారి ననుసరించి జ్ఞానమార్గము కత్తి పదనువలె కఠినము. కొద్దిగా గురితప్పిన హాని కలిగించును. భక్తి రాజమార్గమువలె ప్రశస్తమై బాధలు లేక సరళముగా నుండును. కాని జ్ఞానము లేక భక్తి అసంభవము. జ్ఞానమే భక్తునికి సత్యమును చూపెట్టును. (సత్యమును దర్శింపజేయును). దీనివలననే భక్తుడు సత్యాసత్యముల భేదమును తెలుసుకొని వివేకదృష్టిని పొందును. జ్ఞానము లేకుండ చేయు భక్తి అంధునివలె మార్గమున ఇటు అటు దారితప్పి తిరుగుచుండును. అందువలన భక్తి కొరకు జ్ఞానము యొక్క అనగా వివేకబుద్ధి వుండుటయు మిక్కిలి అవసరము. జ్ఞానము లేకయే భగవంతుని సత్యస్వరూపమును తెలుసుకొనుట అసంభవము. జ్ఞానము భగవంతుని యొక్క సరియగు స్వరూపమును వెల్లడిచేయును. భక్తుని మనస్సులో భగవంతుని ఎడ విశ్వాసము ఏర్పడును. విశ్వాసము జనించినచో భగవంతుని ప్రేమించును. ఈ విధముగా భక్తి సంపాదించుకొను ప్రక్రియ నిశ్చితమగును. జ్ఞానము + విశ్వాసము = ప్రేమ.

తులసీదాసు మొదలగు సగుణ భక్తులు జ్ఞానమును తిరస్కరించి భక్తికి ప్రాధాన్యతనిచ్చిరి, అనునది నిరాధారమైనది.

భక్తికి మూలాధారము జ్ఞానము స్వతహాగా ప్రాప్తించదు. భగవంతుని కృప వున్నవారికే ఇది (జ్ఞానము) లభించును. భగవంతుని కృపవలన సత్సంగము చేయుట భగవంతుని గుణములను, చరిత్రలను గానము - శ్రవణమువలననే లభించును. సత్సంగము వలన మానవుని చెడు వాసనలు తొలగును. అతని మనస్సున శుభ్రమగు భావనలు కలుగును. అటులనే గమించిన ప్రభువు కృప లభించును (అధికారి అగును). అనగా సత్ప్రవర్తన గలవాడే (మానవుడు) భక్తికి అధికారి అగును.

భగవంతుడు పాపములను వినష్టము చేయును. ఇందువలన సత్ప్రవర్తన అవసరము లేదని కొందరి భావము. ఇటువంటివారు అజామిలుడు, గణిక మొదలగువారిని తరింపచేసిన ఉదాహరణలు ఇచ్చెదరు. ఇది భ్రమాత్మకమైన భావన. తులసీదాసు, భగవంతుని యొక్క పతితపావనుని నిరూపమును ఎంతో ప్రశంసించెను. పాపాత్ముడు తాను పరిశుద్ధుని కాలేనను భావము, కలుగకుండ ఉండుటకే మిక్కిలి గొప్ప పాపికూడ అవకాశములు లభించిన గొప్ప విద్వాంసుడు, ఋషి అగును. వాల్మీకి ఇందుకు ఉదాహరణము. షరతు ఏమనగా మర్యాదా పురుషోత్తముడగు రాముని నామము భజింపవలెను. అనగా అతనిని ఆదర్శముగా భావించి, తన జీవితమును అతనికి అనురూపముగా తీర్చిదిద్దుకొనుటకు ప్రయత్నించవలెను. తులసీదాసుగారు ఆదర్శమైన ఒక సముచితమైన రూపురేఖను ప్రస్తుతీకరించెను (సిద్ధము చేసెను) భక్తుడు పూర్తిగా సత్ప్రవర్తనునిగా, నిష్కామునినిగా అగుటకు ప్రేరణ ఇచ్చినది. ఇందువలన సత్ప్రవర్తనా లోపమునందు భక్తిని కల్పన చేయుట కూడ అసంభవమే.

సంక్షిప్తముగా తులసీదాసు గార్కి భక్తిని పొందుటకు శ్రద్ధ, విశ్వాసము, నిశ్చలత్వము, లోకసేవ, వివేకము, వైరాగ్యము, నామస్మరణ, సత్సంగము మొదలగు సాధన విధానములు చేయబడినవి. ఈ సాధనములద్వారా పొందిన భక్తియందు భగవంతుని సాన్నిధ్యము లభించును. అనగా భక్తుడు స్వయముగా భగవంతుని కృపకు అధికారిగా భావించును. ఇది మోక్షప్రాప్తికంటె ఎక్కువ ఆనందమును కలిగించును. యోగివలె మాయా - మోహముల నుండి విముక్తుడయి స్థిరమైన హరిభక్తిని పొందటమే తులసీదాసు ధ్యేయము. ఆయన భక్తి లోక కళ్యాణమనెడి సంజీవని మూలకాయుతమయి వున్నందున గృహస్థుడు - వైరాగుల ఉభయులకు ఉపయోగకరము. తులసీదాసు పరోపకారము వేదసారము అనగా సర్వశ్రేష్ఠ ధర్మము. పరోపకారములోనే లోక కళ్యాణము కలసికూడి ఉన్నది. రాముడు ఇటువంటి పరోపకారి. ఇందువలన తులసీదాసు రాముని తన ఆదర్శముగ, ఉపాస్యుడిగా చెప్పెను. ఈ కారణముననే తులసీదాసు తన భక్తి మార్గమును శ్రుతి సమ్మతముగా చెప్పెను. చెప్పే అభిప్రాయము ఏమనగా తులసీదాసు భక్తి లోకకళ్యాణము యొక్క ప్రచారకుడు, వ్యక్తి,

వ్యక్తి మూలధనముగా సమాజమునకు లోక కళ్యాణము ప్రేరణ ఇవ్వగల్గెను. దీనిని స్వీకరించిన వ్యక్తి ఔన్నత్యమగును, సమాజ అభివృద్ధి కలుగును.

తులసీదాసు భక్తికి తొమ్మిది సాధనములు చెప్పిరి. (1) భజన (నామస్మరణ), (2) శరణాగత భావము (3) చరిత్ర శ్రవణము, (4) మనన, (5) కీర్తన (6) సత్యం (7) జ్ఞానుల, భక్తుల స్వభావమును ప్రాప్తించుకొనుటకు ప్రయత్నము. రాముని స్వరూపము గురించి ధ్యానము, రామునికి సంబంధించిన గంగా, చిత్రకూటము మొదలగు పుణ్యస్థలముల సందర్శన (తీర్థ స్థలముల సేవనము), బ్రాహ్మణ సేవ, శివ-హనుమంతుని ఎడ భక్తి, తులసీదాసు వినయ భావన యందు భక్తుని దీనత్వము, అభిమానము, సహనము, భయదర్శనము, నింద, ఓదార్పు, మనోరాజ్యము, విచారణ మొదలగునవి వినయము యొక్క ఏడు భూమికలు సమ్మిలితమై యున్నవి.

ఇతరత్రా లభించని భక్తి విశేషతలు తులసీదాసు భక్తిలోనున్నవి. ఉదాహరణకు భక్తి - సమీకరణము, మానవుని గొప్పతనము, మోక్షమును అవహేళన చేయుట, తులసీదాసు భక్తిని కులం, జాతి, జ్ఞానము, సంపద మొదలగు పరిధుల నుండి విముక్తము చేసెను, ఇటువంటి విప్లవాత్మక భావన మరెక్కడా లేదు. భక్తిని మానవ మాత్రునికి సులభముగా అందునట్లు చేసెను. ఇందువలన తులసీదాసు మాటిమాటికి నీచజాతుల భక్తులను కూడ వారి నామములను స్వీకరించెను. వీరు నీచజాతికి చెందిన మిక్కిలి పేదవారు కూడ. శబరి, నిషాదుడు, గణిక మొదలగువారు భక్తులే అనగా సమాజమున బ్రాహ్మణులవలననే నీచజాతుల పేదవారు కూడ భక్తికి అర్హులేనని చెప్పెను. తులసీదాసు భక్తి, జ్ఞానములపైన ఏ వర్గము వారిపై తృక సంపదకాదు. ఇది సర్వసాధారణమైన మానవులకు అందవలెనని భావించెను. ఆయన అప్రత్యక్ష (పరోక్ష) రూపమున దీనులు, దళితుల పైననే రాముని విశేష కృపను చూపెట్టి భక్తి విశేషాధికారులనుగా భావించెను. రాముడు నిర్ధనుల ఎడ దయగల, పతితుల పాపనుడు, దీనదయాళుడు అనియు సమృద్ధి చెందిన, సామర్థ్యముగల వారి యెడల చూపించుదయ, కృప, కరుణ - అందరి ఎడ సమానముగా చూపెట్టును. రాముని విశేషమేమనగా ఈయన ప్రజలకు సంక్షేమమును కలిగించును; సంపద ఎల్లపుడూ అహంకారమును, అత్యాచారములను సృష్టించును. ఇందువలన తులసీదాసును రాముడు వీటికి వ్యతిరేకి, నాశనము చేయువాడు, ఈ విధముగా తులసీదాసు భక్తి సామాజీకరణము (సంఘపరము) చేయుటలో సఫలురు అయిరి.

తులసీదాసు 84 లక్షల (ఎనభైనాలుగు లక్షలు) యోనుల కంటె శ్రేష్ఠమైన వానిగా భావించెను. మానవ శరీరము చాలా మహిమ గలది, దేవతలు కూడ ఈ మానవుని శరీరమున అవతరించుటకు తహ తహ పడుచుందురు, విధాత యొక్క ఈ సంపూర్ణమైన సృష్టిలో మానవుడు సర్వశ్రేష్టుడు. మానవ శరీరము భగవంతుని యొక్క పెట్టుబడి, ఈ మానవ జన్మ చరమ సార్థకత. భగవంతుని యెడ కలిగియుండుట అనగా (పాణి

మాత్రమునకు సేవ చేయుట (ఉపకారము) తులసీదాసు మానవుని మహాత్మునిగా భావించెను. ప్రపంచమును మిథ్యగా చెప్పుటయు హాస్యాస్పదమే. మానవుడే సత్యము. ఇందువలన ప్రపంచమున అతడు సర్వాధికుడు·దేవ దుర్లభమైన అంశ వున్నందున ఈ ప్రపంచము మిథ్య ఎట్లు అగును? మానవ శరీరమునకు గొప్పదనము నాపాదించి, తులసీదాసు పరోక్షముగా హఠ యోగము మొదలగునవి శరీరమునకు కష్టము కలిగించు సాధనములను వ్యతిరేకించెను. ఇందువలన "అలఖ్"ను జాగృతము చేయు హఠ యోగులను నిందించెను.

తులసీదాసు భక్తి విశేషత మరొకటి ఏమనగా మోక్షమును త్యాజ్యము చేసెను. యోగుల యొక్క సాధన చరమ లక్ష్యము మోక్షము, యజ్ఞముల వారి యొక్క లక్ష్యము ప్రాపంచిక సంపదలు పొందుటయే. తులసీదాసు ఈ రెండింటి లక్ష్యములను అవహేళన చేసెను. తులసీదాసుకు ఒకే ఒక కోరిక - రాముని భక్తి. అనగా రాముని సాన్నిధ్యమును పొందుట. ఇది తప్ప మోక్షము కలిగినను ఆయనకు బాధయే అగును.

తులసీదాసు నాలుగు ఫలములను - ధర్మము, అర్థము, కామము, మోక్షము (ధర్మార్థ కామ మోక్షములు)లను కోరక, వీటిని త్యజింపవలసినవిగా భావించెను. ఎందుకనగా వీటివలన మానవ కళ్యాణము కాదు. కేవలము వ్యక్తిగత లాభము చేకూరును. తులసీదాసు వ్యక్తిగత లాభమును ప్రాప్తిని వ్యతిరేకించెను. రాముడు సర్వజన కళ్యాణము చేకూర్చును. అందువలన అతని భక్తుడు కూడ సర్వజన కళ్యాణము అగునట్లు వాడుగా వుండవలెను.

ఈ విధముగా తులసీదాసు భక్తిని వ్యక్తిగతమైన పరిమితమైన సంకీర్ణ పరిధుల నుండి బయటికి తెచ్చి దాని జనకళ్యాణమును కలిగించు వ్యాపకమైన రూపము ఇచ్చును. వారి భక్తి పద్ధతి రహస్యము ఇదియే. అందువలన ఆయనను లోకనాయకుడు అనగా లోకమునకు మార్గదర్శకుడుగా చేసినది.

**దార్శనిక సిద్ధాంతము :**

తులసీదాసు గారి దార్శనిక సిద్ధాంతమును గురించి పండితుల యందు భేదాభిప్రాయములున్నవి. కొంతమంది ఆయనను అద్వైత వాది యని భావింతురు. మరికొంతమంది విశిష్ఠ ద్వైతవాది అనిరి. గిరిధర శర్మ, డా॥ బలదేవ్ ప్రసాద్ మిశ్ర, పండిత శ్రీధర్ పంత్ మొదలగు పండితులు తులసీదాసును అద్వైతవాదిగా భావించిరి. తద్ విరుద్ధముగా రామచంద్ర శుక్ల, వియోగిహరి, రామకుమార్ వర్మ, డాక్టర్ గులాబ్ రాయ్ మొదలగువారు తులసీదాసును ఒక ప్రకారముగా విశిష్టాద్వైతవాదిగా భావించిరి. తులసీ స్వయముగ వీటిలో దేనిని కూడ ప్రతిపాదించలేదు. ఆయన ప్రచారములోవున్న అన్ని సిద్ధాంతములను పూర్ణమయినవిగా భావించక, ఆంశిక రూపమున (కొద్దిపాటి) సత్యమైనవిగా భావించెను.

చేయుటకు ముందు మనము అద్వైతవాదము, విశిష్ట ద్వైత్వమును గురించి సంక్షిప్తముగా తెలుసుకొనవలసి యున్నది. ఈ వాదముల యందు బ్రహ్మ, జీవుడు, జగత్తు, మాయ మరియు వీటి పరస్పర సంబంధమును గురించి తారతమ్యము చేయబడినది. అద్వైతవాదము ప్రకారము బ్రహ్మసత్యము, జగత్తు మిధ్య (అసత్యము), జీవుడు బ్రహ్మయే, రెండవది కాదు "అహమ్ బ్రహ్మస్మి" సిద్ధాంతము అద్వైతవాదమునకు మూలము. అద్వైతవాదమున బ్రహ్మ నిర్గుణుడు, అతనియందు సజాతీయ, విజాతీయ, స్వగతము అను మొదలగు భేదము లేదు. జీవ - బ్రహ్మల భేదము అవిద్యవలన (మాయ) తెలియనగుచున్నది. అద్వైతవాదమును ఈ కారణముననే "మాయా వాదమని" చెప్ప బడుచున్నది. దీని ప్రవర్తకుడు శంకరాచార్యుడు.

విశిష్టాద్వైత వాదమున జీవుడు, బ్రహ్మ, జగత్తు మూడింటి ఐకమత్యము ఒకటిగానే భావించబడుచున్నది. ఇది అద్వైతవాదమే కాని ఇందులో విశిష్టము చిత్తము (జీవుడు) మరియు చిత్తములేని (జడజగత్తు) రెండును విశేషణా రూపమున బ్రహ్మతో జతకలసి యుండును. ఒకే ఆకారము అయినప్పటికి, అవి సూక్ష్మరూపమున వేరుగానుండును. స్థూల రూపమున జీవుడు, జగత్తు రెండును సత్యమైనవే. వీరి బ్రహ్మ సజాతీయ - విజాతీయ భేదముల, రహితుడై వుండును. కాని అందులో స్వగత భేదము వున్నది. ఇందువలన జీవుడు జగత్తును బ్రహ్మ అంశముగా చెప్పుట - రామానుజాచార్యగారి విశిష్టాద్వైతము పైన పేర్కొనిన రెండు వాదములయందు బ్రహ్మ, జీవుడు, జగత్తు, మాయ - ఈ నాల్గింటికి వేరు - వేరుగా వివరణ చేయబడినది. ఇందువలన మనకు తులసీదాసు దార్శనిక ఆలోచనలు, విశ్లేషణ చేయుటకు ముందుగా నాల్గింటి విషయములో తులసీదాసు అభిప్రాయము తెలుసుకొనవలెను. ఈ ఆలోచనలయందు శంకరాచార్యుల అద్వైత భావముల ప్రభావము కొన్నిచోట్ల గోచరించును. మరికొన్ని చోట్ల రామునాచార్యుల విశిష్టాద్వైతము ప్రభావము కనిపించును. కొన్ని చోట్ల తులసీదాసు స్వతంత్రమైన మౌళికమగు అభిప్రాయములు లభించును.

**జగత్తు :**

పైపైన చూచినచో తులసీదాసు గారు జగత్తును గురించి కొన్ని అభిప్రాయములు ప్రకారము అద్వైతవాదిగా గోచరించును. ఈ ప్రపంచమును ఎండమావులుగా, (రజ్జు సర్పత్రాటిని సర్పముగా భావించుట - భ్రాంతి) గోచరించు, రజతసీప (వెండి ముత్యపు చిప్ప) అగుపించునట్లు చెప్పెను. తులసీదాసు అద్వైతవాదిగా అగుపించునట్టిది ఏమనగా జగత్తును మిధ్యగా భావించెను. రెండవ పక్షమున తులసీదాసు జగత్తును దేవుని అంశముగా భావించి స్వీకరించెను. బ్రహ్మ సత్యమైనప్పుడు ఆయన సృష్టించిన జగత్తు (బ్రహ్మ అంశము) అసత్యమెట్లగును?

"ఈ జగమంతయు సీతారాములమయమే. లోకమంతయు చేతులు జోడించి నీ ప్రకాశమునే స్తుతించి ప్రణమిల్లు చున్నది". జగత్తును తులసీదాసు సీతారామమయము అన్నప్రుడు మనకు ఒక సందేహము కలుగుచున్నది. అప్పుడు ఈ జగత్తు అసత్యమని ఎందుకు వివరించును? వియోగిహరి అభిప్రాయము ప్రకారము హరిశూన్యమైన లోకమే అసత్యమని భావించవలెను. హరిమాయ జగత్తును కాదు. తులసీదాసు జగత్తును అసత్యమైనదిగా చెప్పుటకు కారణము జగత్తు యొక్క బాహ్యమైన రూపము యెడ విరక్తి కలిగించుటకు - భావన ఉత్పన్నము చేయుటకు మాత్రమే చెప్పెను. జగత్తు యొక్క బాహ్యా రూపమనగా ప్రాపంచిక ఆకర్షణల నుండి అనగా విషయ వాసనల వలన జగత్తు సత్యమైనది కాదని చెప్పెను. ఈ జగత్తు ప్రాపంచిక ఆకర్షణలు క్షణ భంగురము. అశాంతి, అసంతృప్తి కలిగించును. జీవునిని సన్మార్గము నుండి తప్పించి, భ్రష్టుని చేసి, లోభము - స్వార్థము అనెడి బురదలోనికి తీసుకెళ్ళి ముంచును. కావున జీవుడు ఈ జగత్తులోని ఆకర్షణలనుండి ముక్తిని కలిగించి, వైరాగ్యభావము అనగా సమదృష్టిని కల్గించి భగవంతుని భక్తిని పొందవలెను. తన పూర్తి శక్తిని ఏకాగ్రతతో నిరాడంబరమైన పనులయందు ప్రవృత్తుడు కావలెను. ఈ విధముగా తులసీదాసుగారు జగత్తు యొక్క బాహ్యారూపమునకు ముగ్ధులయి కాముకుల స్వార్థపరులైన మానవుల ఎదుట జగత్తును మిథ్య అని ప్రకటన చేసెను. నిష్కాముకుల, అనాసక్తుడగు, కర్మయోగి కొరకు లోకమును పరిపూర్ణమగు సత్యముగా భావించెను. ఆయన ఇటువంటి వారికి - జగత్తు సత్యమైనది, సారయుతమైనదని ప్రకటించెను. సంక్షిప్తముగా తులసీదాసు మాయలో చిక్కుకొన్న జీవునికి హెచ్చరిక కల్గించుటకు జగత్తు సారము లేనిదనే విషయమును పేర్కొనెను. విషయవాసనల నుండి విరక్తుడగు జీవునికి జగత్తు సత్యమైనదిగా భావించి వివరించెను.

ఇక్కడ ఇంకొక సత్యము చూడదగినది. తులసీదాసు అద్వైత వాదుల ననుసరించి జగత్తును మిథ్యగా భావించిన వారి వలెనే మోక్షమును కోరుట జరుగును. వాస్తవముగ జగత్తు యొక్క బాహ్యారూపమున విరక్తిని కలిగించుటయే. జగత్తును పునఃపూర్తిగా మిథ్య అని భావించరు. ఇందువలన తులసీదాసును అద్వైతవాదిగా లేక మాయావాదిగా భావించకూడదు.

**మాయ :**

అద్వైతముననుసరించి మాయయే జీవుని - జీవుని మధ్య భేదమును కలిగించుచున్నది. అందువలన దీని కారణముననే మిథ్యా జగత్తు సత్యమైనది ద్యోతకమగును. ఈ మాయాజాలమున పడి జీవుడు తన స్వరూపమును మరచి, భ్రమ వలన అనేక దుఃఖములను అనుభవించుచున్నాడు. మనము మాయాజాలమునుండి ముక్తులు (విడుదల) అగుటకు ఒకే ఒక కారణమున్నది : రాముని కృప. రాముని కృప కల్గిన వెంటనే మాయ జీవుని ముక్తుని చేయును. మాయ రాముని ఆజ్ఞను వినును. ఏలయన రాముడు మాయకు పతి.

ఇందువలన తన స్వామి (భర్త) ఆజ్ఞను మాయ పాటించును. ఆజ్ఞను ఉల్లంఘించు శక్తి మాయకు లేదు. మానవుడు ఎన్ని ప్రయత్నములు చేసినను మాయాపాశము నుండి (బంధనము నుండి) విముక్తి పొందలేడు. తులసీదాసు అద్వైతవాది అయినను స్వయంగా ప్రాప్తించిన జ్ఞానము చేత, పురుషార్థము ద్వారా ఈ మాయాపాశము నుండి ముక్తుడగు విషయమును చెప్పెడివాడు. జ్ఞానమును, పురుషార్థమును ప్రశ్నించెడివాడు. కాని అయన ఎల్లపుడు ప్రభువు యొక్క కృప ద్వారానే మోహము నుండి ముక్తుడగుటకు చెప్పుచూ భావించెడివాడు. మాయను గురించి తులసీదాసు వాస్తవ అభిప్రాయము ప్రాపంచిక ఆకర్షణలనుండియే వున్నది. ఈ ఆకర్షణలు మాయ జీవున్ని మాయాజాలమున పడవేసుకొని వుంచును. అనగా మానవుడు జీవితము యొక్క వాస్తవమైన ఉద్దేశ్యములను లోకకళ్యాణమును మరచి (విస్మరించి) తన స్వార్థమును పూర్తిచేసుకొనుట అను ప్రయత్నమున నిమగ్నమగును. ఒకవేళ మాయాజాలమున్నను, ప్రభువు కృప చేతనే మాయనుండి ముక్తుడగుటకు వీలున్నది. ప్రభువు యొక్క కృప అనగా, సరళ-సాత్విక భావనల ఉత్పన్నమే. నిష్కామ పరోపకారియగు మానవుడే ప్రాపంచిక ఆకర్షణలనుండి విముక్తుడై ఈ జీవితమును పొందగలడు.

**జీవుడు :**

"అహమ్ బ్రహ్మాస్మి" మరియు సో అహమస్మి మొదలగు సిద్ధాంత వాక్యములు ప్రతిపాదన అద్వైతవాదులు జీవుడు - బ్రహ్మ యొక్క వేరు శక్తిని స్వీకరించరు. కాని భక్తి అంతవరకు సంభవించదు - భక్తుని - పరమాత్మ యొక్క పూర్ణమైన అస్తిత్వము వుండక పోయిన వీలు కలుగదు. విశిష్టాద్వైతము ప్రకారము జీవుడు - జగత్తు బ్రహ్మ కాక దాని అంశము మాత్రమే. తులసీదాసుగారు కూడ ఈ విషయమునే ఒప్పుకొనును.

జీవుడు తన అంశమునకు మూలమగు బ్రహ్మనుండి తొలగిపోయిన, మాయ అతనిని తన వలయందు పడవేసుకొనును. అప్పుడు జీవుడు తన ఆత్మస్వరూపమును మరచిపోవును. జీవుడు తన వికారములను త్యజించునందున దుఃఖములనుండి రక్షణ పొందగలడు.

ఇక్కడ తులసీదాసు మరల జీవుని ముక్తి ఆలోచనను త్యజించకోరును. ఈ విధముగా తులసీదాసు జీవుని అంశము బ్రహ్మ అంశంగా భావించును. జీవుడు బ్రహ్మనుండి వేరయినపుడు అనగా బ్రహ్మ యొక్క స్వరూపమును విస్మరించినట్లయితే మాయాజాలమున చిక్కుకుని నానా రకములైన కష్టముల ననుభవించును. అతని భక్తి, రాముని కృప చేత సంభవించును. భావమేమనగా జీవుడు సరళమైన జీవితమును విస్మరించి ప్రాపంచిక విషయ వాసనలయందు చిక్కుకొనును.

ఈ విధముగా తులసీదాసు జీవుడు - బ్రహ్మ వేరు సత్తాగా స్వీకరించును.

**బ్రహ్మ :**

తులసీదాసు రాముడు బ్రహ్మయే. వేదముల, స్మృతుల, పురాణములయందు బ్రహ్మ యొక్క ఎన్ని విశేషణములున్నవో తులసీదాసు రాముని యందు అన్ని విశేషణములున్నవి. రాముడు అనాది, అనంతుడు, జన్మ లేనివాడు, నిర్వికారుడు, నిర్గుణుడు, నిరంజనుడు మొదలగు అనేకములున్నవి.

అనఘుడు, అద్వైతుడు, అనపద్యుడు, అవ్యక్తుడు, అజుడు, అవికారుడు, ఆనందసింధు. నిర్గుణుడైనప్పటికి, జగత్తు వికలత్వమును చూచి సగుణరూపమును ధరించును.

తులసీదాసు బ్రహ్మను నిరాకారునిగా - సాకారునిగా రెండింటిని స్వీకరించెను. బ్రహ్మయే జగత్తు - జీవుడు, ఇందువలన అద్వైతుడు, అవతారము పొందినపుడు ద్వైతుడు అనగా సగుణుడగును. తులసీదాసు రాముని యొక్క సుగుణ రూపమునకే ఎక్కువ మహత్తును ఇచ్చెను. తులసీదాసు రాముని యందు మానవాతీతమైన గుణములు, శరణాగత వాత్సల్యము, పతిత పావనుడుగానే ప్రాధాన్యత వున్నది. సంక్షిప్తముగా రాముడు మానవత్వము యొక్క సర్వోన్నతమైన ప్రతీక.

పైన పేర్కొన్న వివేచన ఆధారముగా తులసీదాసుగారి దార్శనిక సిద్ధాంతము, ఏదేని వాద విశేషమైన పరిధిలో బంధించుటకు వీలుకాదని నిష్కర్ష చేయవచ్చును. వారు అద్వైతవాది కాదు, ద్వైతవాదికాదు, విశిష్టాద్వైత వాది కూడ కాదు. అయిన ఈ మూడింటి వాదముల సారాంశము వారి తత్వమున లభించును. తులసీదాసు ఈ వాదముల యొక్క జటిలమైన, తర్క ప్రధానమగు వలనుండి ముక్తుడయి ఆత్మబోధ అనగా వ్యక్తి యొక్క శీలము యొక్క పరిష్కారమగు భక్తి మూలాధారమును భావించెదరు.

అద్వైత వాదము మొదలగునవి భ్రమను కల్గించును. అవి మానవుని సరియైన మార్గదర్శనము కలిగించక, అవి సత్యము యొక్క అంశిక రూపమును చూపెట్టుచున్నవి. పూర్ణసత్యమును సిద్ధించుటకు ప్రయత్నించుచున్నవి. ఇదియే ఈ సిద్ధాంతముల అపూర్ణత్వము. అనగా బలహీనత, పరిపూర్ణమైన సత్యము రాముడే. వారిని నిర్మల నిష్కామ భక్తి ద్వారానే ప్రాప్తించుకొనవచ్చును. ఈ భక్తికి మూలము సత్సంగము, సత్ప్రవర్తన పరోపకారము. ఈ విధముగా తులసీదాసు మానవునకు విభిన్నమైన పరస్పర వైరుధ్యముగల తర్కముల కాధారమైన దార్శనిక సిద్ధాంతముల మాయాజాలము నుండి ముక్తిని కల్గి, దాని భక్తి యొక్క విస్తృతమైన, సుగమమైన నిర్విఘ్న రాజపథము పైన వెళ్ళుటకు ప్రేరణ ఇచ్చిరి. సత్ప్రవర్తనపై ఆధారపడిన భక్తియే ప్రతి మానవ జీవితము యొక్క ఉపలబ్ధి.

తులసీదాసు విభిన్నమైన దార్శనిక సిద్ధాంతముల విరోధియను ప్రశ్న ఉదయించును. వారి కావ్యమునందు మనకు అక్కడక్కడ ఈ సిద్ధాంతముల దృశ్యము గోచరించును. ఆ సిద్ధాంతములన్నింటిని భ్రమాత్మక మైనవిగా భావించక వాటిని కొంత అంశికరూపముననే

సత్యమని భావించుచుండెను. అని మనము మొదట తెలుసుకుని వుండవలెను. ప్రతి సిద్ధాంతమున ఏదో కొంత తత్వము తప్పక యుండును. తులసీదాసు సంగ్రహకారుడు, సమన్వయాత్మకమైన బుద్ధికి అధికారియైన విద్వాంసుడు. ఇందువలన ఆయన తన కాలము నాటి ప్రచారములో వున్న సిద్ధాంతములలోని మంచి విషయములను స్వీకరించి భ్రమను కల్గించు అంశములను వ్యతిరేకించెను. ఆయన అద్వైత వాదములోని కొన్ని సిద్ధాంతములద్వారా ప్రపంచము సారము లేనిదిగా నిరూపించెను. కాని మూలరూపమున అద్వైత వాదము యొక్క అన్ని స్థాపనలను స్వీకరించలేదు. మనకు తులసీదాసు మాటలలో (పదములలో) విభిన్నమైన దార్శనిక అభిప్రాయముల మూలసిద్ధాంతముల ఖండించునవి వున్నవి. డాక్టర్ రాజగోపాల్ శర్మ "దినేశ్" గారు అనేక ఉదాహరణములు పేర్కొనిరి.

## అద్వైతవాదము యొక్క విరోధము :

"అహం బ్రహ్మాస్మి" విస్పష్టముగా ఖండించెను. ద్వైతవాదమును వ్యతిరేకించెను - తులసీదాసు భక్తిమార్గమున నుండువాడు. అందువలన ఆయన వాణియందు భక్తి యొక్క నిగూఢ రహస్యములను వెదకుటయే లాభదాయకము. జ్ఞానమార్గ సిద్ధాంతములను వెదక నవసరము లేదు. సంక్షిప్తముగా తులసీదాసు జీవితము యొక్క ప్రధాన లక్ష్యము రాముని యొక్క నిష్కామ భక్తిని సంపాదించడమే. ఈ భక్తి ఎదుట ప్రధాన లక్ష్యము "మోక్షము"కూడ త్యాజ్యమే.

## నిష్కర్ష :

తులసీదాసు భక్తి పద్ధతి లేక దార్శనిక సిద్ధాంతము యొక్క సారము "వినయ పత్రిక" యందు అక్కడక్కడ వెదజల్లబడి వున్న వాటిని ఈ పంక్తుల ద్వారా తెలుసుకొనవచ్చును.

1) రామనామ మనెడి నూతన స్నేహ మేఘమును మనసు అనెడి చాతకపక్షి హఠముగ (పట్టుదలతో) ప్రేమించును.

2) రాముని చరణముల అనురాగమనెడి నీరులేక అతిమాలిన్యమైన వాటిని నాశనము చేయలేదు.

3) భక్తుడగు వాని మనస్సు మధుకరుడై (తులసీదాసు) రఘుపతి నందనుని కమలముల వసించుచుండును.

4) రఘుపతి భక్తి భక్తుల - జ్ఞానుల సాంగత్యము లేక యే భవ (ఈ లోకము) దుఃఖములు నశింపవు.

5) శ్రుతి సారము పరోపకారము.

6) తులసీదాసుకు రఘువీరుని బాహుబలమున్నది. సదా నిర్భయము. ఎందుకు భయపడవలెను?

7) భవ భంజనుని పాదకమల విముఖుడు - తన జీవితమును నరక రూపముగా ననుభవించును.

8. సురనదిలో నీరు లేనట్లుగా, మానవుని జీవితమున రఘురాముని ప్రేమలేనివారి జీవితము వ్యర్థము.

9. రామనామ స్మరణ తప్ప ఇతరమును స్మరించిన జిహ్వ జిహ్వ కాదు.

10. జలము - చేపకు ఉన్న సంబంధమువలె రాముడు భక్తునికి ప్రియము.

11. తులసీదాసుకు ప్రభువు (రాముడు) రాముడే మోహ శృంఖములను తొలగించి గట్టు చేర్చును.

**తులసీ సంప్రదాయము :**

కొంతమంది విద్వాంసులు ఈ ఒక ప్రశ్న లేవనెత్తిరి. "తులసీదాసు ఏ సంప్రదాయమును పాటించిరి?" కొంతమంది ఈయనను స్మార్త వైష్ణవుడనిరి. తులసీదాసు "రామచరిత మానస్" కావ్యమును వ్రాయుటకు ప్రారంభించినపుడు స్మార్త రామనవమి దినము వైష్ణవుల నవమి కాదు. అని దీని ఆధారముగా చెప్పిరి. రామానంద సంప్రదాయము పాటించువారు రామనామము రామభక్తిని స్వీకరించినందున ఎవరైన ఆయనను (తులసీదాసును) రామానంద సంప్రదాయక వైష్ణవుడని భావింతురు. తులసీదాసు వంటి మహా మానవుడు ఏదేని వ్యక్తి, పథము, మతము, సంప్రదాయమగు విశేష బంధనముల అనుయాయునిగా భావించక, స్వతంత్రమైన భావములుగల ఆలోచనాపరుడు, శుభములు సంగ్రహించు వానినిగా, శుభముల యొక్క నితాంత సర్వగ్రాహ్యుడుగా మౌళికమైన ఉన్నత భావముల జనింపచేయువాడు అని వాస్తవికతను గుర్తించాలి. సూరదాసునందు పుష్టిమార్గము యొక్క సిద్ధాంతములలో పునశ్చరణము లేనట్లుగానే తులసీదాసుగారిని ఏదేని విశిష్ట సంప్రదాయముల బంధించి వుండిన ప్రవృత్తి గోచరించదు.

తులసీదాసు గురించి విమర్శించునపుడు శ్రీ వియోగి హరిగారు ఒక ప్రామాణికమైన విషయమును చెప్పిరి. గోసాయిగారి (తులసీదాసుగారి) మాయావాదమునకు నైతికముగా గోచరించును. దార్శనికముగా కాదు. తులసీదాసు సత్ప్రవర్తన పైన ఎక్కువ బలమును చూపెట్టును. అంత ఇతర విషయముల ఎడ చూపెట్టలేదు. ఆయన భక్తిని సత్ప్రవర్తనను ఒకదానికొకటి ఆశ్రయము కల్గివుండునట్లు చేసెను. ఇది తులసీదాసుగారి మౌళికమైన వర ప్రసాదము శాశ్వతమైనది. ఇందువలన తులసీదాసుగారిని ఏదేని విశేష సంప్రదాయకునిగా భావింపక, స్వతంత్రమైన ఆలోచనాపరుడు అగు యుగద్రష్ట, మహామానవ రూపునిగా స్వీకరించుటకు బాధ్యులముగా నుండవలెను.

**తులసీదాసు రాముడు :**

తులసీదాసు చిత్రించిన రాముని స్వరూపము తెలుసుకొనుట అవసరము. ఏలయన

రాముని శీలము నాధారము చేసుకునియే తులసీదాసుగారి భక్తి భావన యొక్క భవ్యమైన భవనము ఆధారపడివున్నది. తులసీదాసు రామునికి రెండు రూపములు ఉన్నవి: (1) మానవుడు (2) బ్రహ్మ. ఈ రెండు రూపములననుసరించి రాముని చరిత్ర కొంత ప్రకటితము మరికొంత గుప్తము.

తన ప్రకటిత రాముడు మానవుడు. గుప్త రూపమున బ్రహ్మగా నుండును. రాముని యొక్క మానవీయ చరిత్రయందు అక్కడక్కడ పరంపరా ఉల్లంఘన, దోషములు మొదలగునవి గోచరించుచున్నవి. తులసీదాసు రాముని అలౌకికత, బ్రహ్మత్వమును చాటుగా చేసుకొని లీలగా చెప్పి దోషములను పరిహరింపచేయుటకు ప్రయత్నించును. అపుడు రాముడు మానవుడుగా కాక పూర్ణ బ్రహ్మ అగును. బ్రహ్మ దోష రహితుడు. ఇందువలన వారి కార్యములన్నియు మానవుని రక్ష కళ్యాణము కొరకే అయివుండును. తదుపరి కావలయునంటే ఈయన ద్వారా సామాజిక మాన్యతలను ఉల్లంఘించును. తులసీదాసు రాముని చరిత్రయొక్క విచిత్రతను సంకేతము చేయుదురు.

రఘుపతి చరిత్ర చాలా విచిత్రమైనది. మిక్కిలి ఎక్కువ జ్ఞానులే తెలుసుకొనగలరు. మతిమందులు (బుద్ధిమాంద్యముగలవారు) మిక్కిలి మోహవశులై పొందుచున్నారు. హరి విముఖులైన వారికి ధర్మరీతి వుండదు. తన అలౌలిక రూపమున రాముడు విష్ణువు యొక్క అవతరము కాక సాక్షాత్తు బ్రహ్మయే. ఏ విధముగ హరి, శంభుడు ఆడించునట్లుగా వుండును. తులసీదాసు "మానస్" ప్రారంభమున రామునియొక్క ఈ స్వరూపమునే స్థాపించెను. ఈ విశ్వము, అఖిలమంతయు, బ్రహ్మాది దేవతలు, సురులు అందరు ఆయన మాయావశులై యున్నారు. సకలము రజ్జు సర్ప భ్రాంతితో ప్రయత్నించిన తెలియక వుండుదురు.

తులసీరాముడు మానవుడైనప్పటికి, తులసీదాసు మాటి మాటికి రాముడు సాక్షాత్ బ్రహ్మయేయని మనకు జ్ఞాపకము చేయును. నరరూపమును ధరించి లీలను చేయుచున్నాడు. విరక్తి చెందిన (నిర్లక్ష్యముగలవాడై) రూపములేని, నామములేని, పుట్టుకలేని సచ్చిదానంద, పరంధాముడు. విశ్వరూపమున వ్యాపించియున్నాడు, భగవంతుడైనాడు. ఆయనే అనేక రూపములను ధరించి నానా (అనేక) కర్మలు చేయుచున్నాడు.

మానవ రూపములోనున్న రాముని చరిత్రయందు లౌకిక-అలౌకిక గుణములు సమన్వయమగును. అయిన అతని లౌకిక గుణములు అలౌకిక గుణములతో సమన్వయము చెంది యుండును. వారిలో లౌకిక భక్తవత్సలత, శరణాగతవత్సలత నున్నవి. వాటితో పాటు సౌందర్యము, శీలము, భక్తి అలౌకికములు. ఇక్కడ అలౌకిత అనగా గుణముల యొక్క చరమ అసామాన్య ఉత్కర్షయే: ఏ చమత్కారముతో కాదు. రాముని యొక్క బ్రహ్మరూపమును సంక్షిప్తముగా ఇట్లు ప్రతిపాదించడమైనది.

1. నిర్గుణ బ్రహ్మ (రాముడు) సాధారణముగా జన్మలేని అగమ్యుడు, అగోచరుడు, సర్వవ్యాప్తిగా యున్నాడు. స్వయంగా అకర్త, అయినా ఆయన ప్రకృతి పని చేయుచుండును. వారు భక్తుల వశములోనుండి సగుణ రాముని రూపమును ధరించును.

2. సగుణ రాముడు దశరధరామునివలె యున్నాడు. అతడు, అనాది, అనంతుడు, సర్వోపరి, దేశకాలములకు అతీతుడు. బ్రహ్మ, విష్ణు, మహేశులు అతనిని ఆరాధించెదరు. సాకేతము అతని నివాసము. సీత అతని ప్రకృతి లేక మాయగా వున్నది.

3. ఈ సగుణ బ్రహ్మ దశరధరాముడయి మాటిమాటికి అవతారమును పొంది లీలను చేయును. వాస్తవముగా సగుణ-నిర్గుణములయందు ఏమియును భేదము లేదు. (సగుణ-నిర్గుణ భేదము ఏ మాత్రము లేదు).

4. సీతారాములతో అదే విధముగ అభిన్నమై యున్నాడు. వాణి-అర్థము (పదము-భావము) నీరు - అల అభిన్నముగా వున్నవి.

మానవ రాముని రూపములు కూడ రెండు వున్నవి - (1) అసామాన్యము, (2) సామాన్యము. తులసీదాసు అసామాన్యమైన చరిత్ర సంబంధమును రాముని అవతార రూపమున జోడించును. చేతనమును జడముగా, జడమును చేతనముగా చేయగలడు. దానికి సమర్థుడు రఘురాముడే. అతనిని భజించి జీవులు ధన్యులగుచున్నారు.

తన సామాన్య రూపమున రాముడు పూర్ణమానవుడు. వారు సరళ స్వభావకులు. అందరికి ప్రియుడు, పుత్రుడు, రాజు, యజమాని, మిత్రుడు, మొదలగు అన్ని రూపముల యందు ఆదర్శముగలవాడు. ఈ విధముగ తులసీదాసు, రాముని చరిత్రమునందు, లౌకిక అలౌకికములను సమన్వయము చేసి పూర్ణమైన మానవునిగా ఆదర్శ చరిత్రను ప్రవేశపెట్టెను. అది సమిష్టి రూపమున శుభము (కళ్యాణము)నకు సంకేతమై యున్నది. భక్తికి ఆధారము రాముని యొక్క ఈ రూపమే శుద్ధ పూర్ణ బ్రహ్మ కాదు.

**తులసీదాసు అభిప్రాయము (ఉద్దేశ్యము) ఒక విశ్లేషణ :**

ఇంతకు ముందు తులసీదాసును గురించి వివరించునపుడు ఆయన సిద్ధాంతముల (అభిప్రాయముల, ఉద్దేశముల) పరిభ్రమణలో పడలేదని తెలుసుకొన్నాము. సారమును గ్రహించు బుద్ధితో, ప్రతిభ ద్వారా శుభములను సంగ్రహించే, మహా మానవుడు. గ్రంథముల సంప్రదాయముల చేయు వారిని బాగుగా మందలించెను. తులసీదాసు తన అభిప్రాయములను స్థాపించి, ప్రచారము చేయుటకు తన లక్ష్యముగా నుంచుకొనెను. వివేకము, వైరాగ్యములతో కలిసిన (సంయుక్తమైన) శ్రుతి సమ్మతమైన "హరిభక్తి" పథమును స్థిరీకరించుట తులసీదాసు ఉద్దేశ్యము. ఈ పథమును ఇతర పథము శ్రేణిలో చేర్చకూడదు. ఎందుకనగా ఇందుకు ఏదేని సంప్రదాయమును, విధి-విధానములు అవసరము లేదు.

లేదు. ఈ మతము ఎంతో వ్యాప్తి కల్గియున్నది. ఇందులో అన్ని ధర్మములు, మతముల మొదలగు వాటి సారము సమ్మిశ్రితమై యున్నది. అయిన ఇది తన ప్రత్యేకతను కలిగి యున్నది.

ఈ పథములోని అన్నిటికంటె గొప్పది - బుద్ధి హృదయముల సమన్వయము. ఆయనది. బుద్ధివాదులకు జ్ఞానము యొక్క గంభీరమైన సమస్య వివేచన, రహస్యాత్మకత యొక్క సమావేశములున్నవి. హృదయవాదులకు భక్తియొక్క - నిర్మలమైన గంగా ప్రవాహము ప్రవహించుచున్నది. బుద్ధివాదులు ఎక్కువగా ఏదేని మతము యొక్క బాహ్య ఆచారములను, క్రియలను వ్యతిరేకించెదరు. తులసీదాసు రామ నామము జపము చేయుట తప్ప మిగతా బాహ్య విధానములను గురించి చెప్పలేదు. ఎక్కడైన కపట బూటకములకు అవకాశము లేకుండా వుండునట్లు చేసెను. కపటమునకు అవకాశము లేకుండునట్లు ప్రయత్నించెను.

మూలముగా శంకరాచార్యుని అద్వైతవాదములోని అన్ని ధర్మముల అభిప్రాయముల సారము వచ్చును. తులసీదాసు అభిప్రాయములు, శంకరాచార్యుల అభిప్రాయములలో ప్రధాన భేదము ఒకటి వున్నది - శంకరాచార్యుని సాధ్యము, ముక్తి సాధనము జ్ఞానాశ్రిత భక్తి. కాని తులసీదాసుకు భక్తియే సాధ్యము. సాధనము రెండు వున్నవి. కొంతమంది బుద్ధివాదులిలా చెప్పచున్నారు. తులసీదాసు రాముడు పాపనాశనముపై బలముగావించి పాపాత్ములకు పూర్తి స్వేచ్ఛాశలవును ఇచ్చెను. కాని ఈ విషయము సరియైనది కాదు. తులసీదాసు స్పష్టముగా ఇట్లు చెప్పెను.

నరుడు మోహవశమున అనేక పాపములు చేయుచున్నాడు. స్వార్థపరుడై పరలోకమును నాశనము చేసుకొనుచున్నాడు. కాలరూపమున సోదరా నేను చెప్పచున్నాను : శుభాశుభములకు ఫలము (దాత) దేవుడు ఇచ్చుచున్నాడు. తులసీదాసు మోహమును అన్ని పాపములకు మూలమని భావించిరి. తులసీదాసు తన సంపూర్ణమైన మేధాశక్తితో పాపములనుండి వేరగుటకు ఉపాయమును (మార్గమును) తెలుపుటకు ప్రయత్నము చేసెను.

తులసీదాసు అభిప్రాయములలో బుద్ధి, హృదయముల సమన్వయము వున్నదని ఇంతకు ముందు చెప్పితిమి. హృదయమునకు మూడు విషయములు ముఖ్యమైనవి.

1. అభీష్ట విషయము, ఏకాగ్రత.
2. విఘ్నములు, బాధలయందు కూడ, స్థిరమైన భావములతో ఆ -
3. ఏకాగ్రతను రక్షించుకొనవలెను.

వైరుధ్యమైన విషయములను పరిత్యజించుటకు తగినంత మనోబలము అనగా ఆత్మ నిగ్రహమును కలిగియుండవలెను.

ఏటి అన్నిటికి తులసీదాసు చాతకపక్షి ప్రేమను ఆదర్శముగా స్వీకరించెను. ప్రేమ యందు చాతకపక్షి సాటిలేని, కష్టసహిష్ణుత, సహజత్వము నుండగోరిరి. దీనితోపాటు లోక కళ్యాణమను భావము తప్పని సరిగా వుండకోరెను. లోకకళ్యాణములేని భావన, ప్రేమ సీమితము (పరిమితమై) సంకీర్ణమయి, ఆదర్శహీనమగును. లోకకళ్యాణమునకు వివేకము, వైరాగ్యము తప్పనిసరిగా వుండవలెను. ఎందుకనగా వివేకము, ఆసక్తివలన జీవుని కళ్యాణము కానపుడు, లోకకళ్యాణమెట్లు అగును? కావున తులసీదాసు రామభక్తిలో వివేకము, వైరాగ్య తత్త్వములను సమన్వయము చేత లోకకళ్యాణము సాధనము స్వతఃగా వచ్చును.

తులసీదాసు అభిప్రాయములలో మరియొక విశేషత - సనాతనమైన హిందూ ధర్మమునకు పరిశుద్ధమైన రూపము, సనాతన ధర్మము మిక్కిలి వ్యాప్తి చెందినది. ఎందుకనగా ఆయన భారతీయ సంస్కృతి, మానవ ధర్మము రెండును పరస్పరము కలసి-మెలసి ఒకేఒక ఆకారమును పొందును. మానవత్వమే దానికి ఆధారము. తులసీదాసు అభిప్రాయములు సీమిత క్షేత్రమునుండి అధిక వ్యాపకము అయి జీవ మాత్రము (ప్రాణి మాత్రమునకు) తన పరిధిలో లీనము చేసుకొనును. (సమీకరించును). జీవముతోపాటు జడము కూడ రాముని స్వరూపమును దర్శించును. ఈ జడ-చేతనముల ప్రపంచము (జగత్తు) అంతయు రామమయమే.

తులసీదాసు వర్ణాశ్రమ ధర్మములను, బ్రాహ్మణ పూజను గురించి కూడ సంకేతమును కల్గించెను. దీని ప్రకారము తులసీదాసును బ్రాహ్మణవాది, రూఢివాది అని నిరూపించకూడదు. తులసీదాసు ఈ జగత్తును గురించి స్పష్టముగా చర్చించెను. బ్రాహ్మణులు, క్షత్రియులు తమ - తమ కర్తవ్యములను త్యజించి చెడు ఆచారములకు అలవాటుపడినారని, వర్ణాశ్రమ ధర్మమును పునః (మరల) స్థాపించనవసరమున్నదని చెప్పెను. తులసీదాసు జాతి - వైషమ్యముల నుండి వేరయి రామభక్తినే శ్రేష్ఠమైనదిగా భావించెను. అతడు శూద్రుడైనా లేక బ్రాహ్మణుడైనా ఒకటియే.

ప్రజలు అజ్ఞాతమైన స్వర్గ సుఖముల కొరకు ఆశపడి, లోకమున తన కర్తవ్యములను విస్మరించుటకు తులసీమతము సమ్మతించదు. అది సత్ప్రవర్తన యందు ఆశ్రితమయి, సాధువుల, జ్ఞానుల, భక్తుల లోకమతము సమన్వయము చేయును. వారి ప్రచారము లోకమును దృష్టియందు వుంచుకుని చేయడమైనది. లోకసేవయే ప్రభుసేవ (మానవ సేవయే మాధవసేవ) ఈ భావన శీలము లేనిదే ఏర్పడదు. ఇందువలన తులసీదాసు శీలమును గురించియే ఎక్కువ బలపరచి చెప్పెను. శుక్లజీగారు శీలము నిర్వచనము గురించి నిర్వచనమును చేయుచూ, శీలము, హృదయము యొక్క ఆస్థాయి శక్తి (స్థిరమైన శక్తి) సత్ప్రవర్తన ప్రేరేపణ స్వయముగా కల్గించును. ఇటువంటి శీలమును ప్రతిష్ఠించినపుడే హృదయమున స్వతఃప్రేరణ కల్గును. అది సమస్త వైరి విరోధముల ఈర్ష్యాద్వేషముల నుండి రక్షణ పొంది, ఆత్మకళ్యాణముతో పాటు లోక కళ్యాణము దిశకు ప్రేరణ కలిగించును.

సారాంశమేమనగా తులసీదాసు మతమున (ఉద్దేశ్యములలో) హరిభక్తి ప్రధానమైనది. హరిభక్తి శ్రుతి సమ్మతమై వైరాగ్యము, వివేకముల సమ్మిశ్రమము చేత (కలయిక) మానవుడే కాక, జీవ మాత్రమైన (ప్రాణిమాత్రమును) కళ్యాణ సాధన అగును. అందులో శక్తి, మానవ ధర్మము యొక్క మూల సిద్ధాంతముల సమన్వయమై కళ్యాణకారి అగుచున్నది.

## వినయ పత్రిక యందు గేయ తత్వము :

వినయ పత్రిక ఒక క్రమముతో వ్రాసినప్పటికి మూలరూపమున ముక్తక కావ్యమే. గేయ తత్వము కావ్యమునకు ప్రాణముగా భావించబడుచున్నది. గేయకావ్యము ఉత్పత్తి భావావేశమున ప్రేరితుడయి తన హృదయములోని భావములను కావ్యోచిత భాషయందు ప్రకటన చేయుటకు వీలు అగును. వ్యక్తి యొక్క వ్యక్తిగతమైన తన ఆంతరికమైన (ఆత్మ) అనుభూతిని సజీవమగు భాషలో సాక్షాత్కరింపచేయుటకు రీతియే గీతిక కావ్యము యొక్క విశేషత. వ్యక్తిగతమైన భావములు, అనుభూతి యొక్క తీవ్రత అందు రాగాత్మకమును ప్రవేశింపచేయును. గీతిక కావ్యము యొక్క మూడు ప్రధానమైన విశిష్టతలు. (1) రాగాత్మకతా, (2) తన వ్యక్తిత్వము, (3) అనుభూతి ప్రాధాన్యత. పారిభాషిక పదములలో మనము గేయ తత్వము, స్వ అనుభూతి భావము, మృదుభావముల పుంజము అని కూడ చెప్పవచ్చును. మృదుభావముల రక్షణ కొరకు అందులో సంగీతము సమావేశము తప్పక యుండును. సుకుమారమును రక్షణ కొరకు సంగీతము యొక్క ప్రాధాన్యత, కోమలమగు రసముల సమావేశము అవసరము. ఇందుకు శాంత శృంగార, వాత్సల్యములు గీతి కావ్యములకు ప్రియమైన రసములు. సంక్షిప్తముగా మనము గీతి కావ్యముల సంపూర్ణమగు విశేషతలను ఈ విధముగా ప్రశంసించనగును.

సంగీతమున పూర్తిగా భావాభివ్యక్తి, అంతర్జగత్తును గురించి చిత్రీకరణ, ప్రతిపాదన, భావ సౌందర్యము, వ్యంజకత్వము, పదముల మధురమైన కూర్పు, భావమునకు అనుకూలమగు భాష - సామంజస్యము, సాక్షాత్ ప్రభావము, సంక్షిప్తత.

వినయ పత్రిక గీతి కావ్యము యొక్క సరళమైన రచన. తులసీదాసు యందు భావము మిక్కుటమే అయినా రామచరిత మానస్ వంటి గ్రంథము నందు సామాజికమైన ఆసక్తి, ఆత్మీయత కంటె అధికము. ఫలితముగా వారి రచనలయందు వ్యక్తిగతమైన, రాగాత్మకమైన అనుభూతికంటె, సామూహికమైన చైతన్య చిత్రణ కోరిన దానికంటె ఎక్కువ అయినది. వినయ పత్రికలోని ఎక్కువ పదముల (గేయముల) యందు మనకు సూరదాసు, మీరా తన్మయత్వము దర్శనమిచ్చును. కాని తులసీదాసు దార్శనికమైన వివేచన, సామాజిక చిత్రణ మొదలగు వాటి వలలో చిక్కుకొనును. ఇక్కడ గీతి కావ్యము తన సహజ సౌందర్యము కోల్పోవును, వికృతమగును. చెప్పదలచుకున్నది ఏమనగా, వినయ పత్రిక రచన గీతి కావ్యము పద్ధతిలో రచించినప్పటికి, దీని పూర్తి గేయములయందు "గీతి" శ్రేణిలోనికి స్వీకరించుటకు వీలుపడదు. ఆత్మసమర్పణ యొక్క సహజమైన అభివ్యక్తి

**నీ చరణములను వదలి ఎక్కడికి పోవుదును?**

**నీవు పతిత పావనుడవు, జగత్తులోని అతిదీనులకు**

**మిక్కిలి ప్రియమైన వాడవునీవు.**

తులసీదాసు వినయపత్రిక రచన గీతి పదశైలిలో వ్రాసెను. మధ్యయుగమున హిందీ సాహిత్యము యొక్క కవులకు మిక్కిలి ప్రియమైన శైలిగా వుండెను. ప్రముఖముగా పదశైలియే గీతికావ్యముల ప్రధానశైలిగా భావించబడినది. ఇందువలన ఈ దృష్టితో వినయ పత్రిక గీతి కావ్యముగా స్వీకరించబడుచున్నది.

గీతి కావ్యము యొక్క ప్రధానమైన విశేషత అది గేయమగుట. అనగా గానము చేయనగును. పదము గేయ ఛందస్సు ఇందువలన వినయ పత్రిక సంగీతము యొక్క సమావేశము స్వయముగా వున్నది. సూరదాసు "భ్రమర గీత"కు సంబంధించి గేయములు రాగ-రాగినుల యందు రచింపబడినవి. అదే విధముగా "వినయపత్రిక"లోని ఎక్కువ గీతములు (గేయములు) అధికాంశముగా రాగ-రాగినుల యందు సంధింపబడినది. ఈ గేయములు కళ్యాణి, గౌరి, అసావరి, భైరవి, కేదారి, ఘనాశ్రీ, మల్హార్, రామ్‌కలి, తోడి, మారూ, విలావల మొదలగు అనేక ప్రకారములై రాగముల నాధారము చేసుకుని వ్రాయబడినవి. ఇందువలన వీటిని సులభముగ గానము చేయవచ్చును. తులసీదాసు విభిన్నమైన భావములను వాటికి అనుకూలమగు రాగములయందు సంధించుటకు ప్రయత్నించెను. ఉదాహరణకు - కరుణ భావమును మల్హార, అసావరీ, కేదారి, సోరద, జయిశ్రీ ఆదిరాగముల యందు, ఉపదేశ భావనలను లలిత, సారంగ మొదలగు రాగముల యందు, వీరభావములను మారూ మొదలగు రాగముల యందు, విభిన్న ప్రకారములగు వర్ణనలను దండక, టోడీ, రామకలి మొదలగు రాగములయందు పొందుపరచి వ్యంగీకరించెను.

తులసీదాసు భావమునకు అనుకూలమగు భాషను ప్రయోగించి, అందులో సంగీతమును సమ్మిశ్రితము చేసి, వినయపత్రిక మిగత ఛందములను తగినంత లోక ప్రియత్వము కలిగించెను. అయిన గీతి కావ్యము యొక్క సఫలత్వమును దృష్టిలో పెట్టుకుని చూచిన కొన్ని గేయములు (పదములు) మాత్రమే పూర్తిగా సఫలమైనవని చెప్పబడును. దైన్యభావము, శరణాగత కామనను వ్యంజీకరణము చేయు పదములను శ్రేష్ఠము, సఫలమగు గీతముల రూపము స్వీకరించవచ్చును. కొన్ని పదముల యందు దార్శనికమగు వివేచన దర్శన ప్రధానమైన గేయములను, వర్ణనగల ఈ గేయములను సఫలమైన గీతి కావ్యములుగా స్వీకరింపబడవు.

సమిష్టి రూపముగా వినయ పత్రికను గీతి కావ్యము యొక్క ఒక సఫలమైనదిగా

స్వీకరించనగును. అయినప్పటికి మనకు అందులో ఆ తన్మయత్వము అక్కడక్కడ లభించును. గీతావళికి తన ప్రత్యేకమైన విశిష్టత ఉన్నది.

## ఉక్తి వైచిత్ర్యము మరియు అర్థగౌరవము :

సాహిత్యమున ఉక్తి వైచిత్ర్యము యొక్క అభిప్రాయం చెప్పే విధానమును గురించి సాటిలేని పద్ధతిగా భావించబడుచున్నది. ఉక్తి వైచిత్ర్యము ద్వారా ఏదేని విషయమును సరళమగు పద్ధతిలోకాక, వర్ణిత విషయమందు ఒక మార్మికమైన అభివృద్ధి, దాని ఎడ పాఠకుల దృష్టిని ఆకర్షింప చేసుకొనుట అని చెప్పవచ్చును. అనగా ఏదేని విషయమును సాదా పద్ధతిలో చెప్పక త్రిప్పి, మరలించి విచిత్రమైన పద్ధతిలో చెప్పుట. అని దాని అర్థమును, మార్మికత్వమును వృద్ధి చేసి చెప్పుటయే ఉక్తి వైచిత్ర్యము అని చెప్పబడును. ఇటువంటి ఉక్తులయందు లక్షణ - వ్యంజనా శక్తుల యొక్క లేక క్రకోక్తి అలంకారము యొక్క ఆధారముచేసుకొనును. అర్థ గాంభీర్యము ఇందులో సహజముగా లుప్తమయి వుండును (దాగివుండును). వినయ పత్రిక యందు తులసీదాసుగారి ఈ కళ అనేక చోట్ల కనపడును. దిగువ అనేక ఉదాహరణలిచ్చి తులసీదాసుగారి కావ్య కళ యొక్క అద్భుతమైన విశేషతను చూపెట్టుటకు ప్రయత్నించెదను.

తులసీదాసు రాముని "అనాథపతి" పదవిని ప్రదానము చేయుచు రాముని ఎడ ఎక్కువ కృతజ్ఞతలు చెప్పుచున్నారు.

"నీవు సనాథుడవు సరే కాని అనాథులకు పతివి". రామునికి అనాథపతి పదవి లభించును. కాని ఒక షరతు ఏమనగా తులసీదాసు లఘుత్వమునకు భయభీతుడు కాకూడదు. ఇక్కడ "లఘుత్వమునకు", "భయభీతుడగుట" విచిత్ర లక్షణమైన ఉక్తి. విశాలత్వమునకు భయభీతుడగుట వినదగును కాని లఘుత్వమునకు భయభీతుడగుట అద్భుత విషయము. ఈ ఉక్తి యందు వాక్ చాతుర్యము, వైచిత్ర్యము, హాస్యము యొక్క ఒక మార్మికమైన సమ్మిశ్రతము అయినది. అది అర్థగౌరవమును అభివృద్ధి చేయుచున్నది. రాముడు బ్రహ్మ లఘుత్వము చేత ఆయనకు భయము, భీతి సంభవించుట కల్పన చేయబడినది. రెండవ ప్రక్క తన లఘుత్వము యొక్క పరాకాష్ఠ కూడ అభివ్యంజనము అయినది. తులసీ ఇంత లఘు అనగా పాపి. రాముడు అతని యొక్క రూపమును చూచి భయభీతుడు కాకుండు గాక. ఇన్ని విచిత్రముల సమ్మేళనము ఒక పంక్తియందు చేసి చూపెట్టుట ఉక్తి వైచిత్ర్యము యొక్క ఉదాహరణమని భావించబడుచున్నది.

తులసీదాసు రాత్రింబవళ్లు రామునితో తనను ఉద్ధరించమని ప్రార్థించుచున్నాడు. కాని రాముడు వినలేదు. తన ఈ ఉపేక్షను చూచి తులసీదాసు రాముని దూషించును.

రాముడు యజమాని, తులసీదాసు సేవకుడు. సేవకుడు తన యజమాని ఎడ దౌష్ట్యముగా ప్రవర్తించకూడదు. కాని పరిస్థితులు చాలా విషయమించి పోయినవి. ఇందువలన

సేవకుడు మర్యాదలేని వానినిగా కావలసివచ్చెను. చివరకు అతడు ఏమి చేయును? యజమాని యశస్సు కళంకము కానున్నదని భ్రమ కలిగెను. యజమాని తన విషయమున నిశ్చింతగా నున్నాడు. కాని కర్తవ్య పరాయణుడగు సేవకుడు యజమాని అపకీర్తిని ఎట్లు ఓర్చుకొనగలడు? సేవకునికి ఈ సందేహము కలిగినందున - నా యటువంటి వ్యక్తిని ఉద్ధరించలేనపుడు, ప్రపంచము యజమానికి నిష్ఠురుడు అను పేరును ప్రధానము చేయకుండ వుండవలెను. ఇటుల అయినచో "కరుణ సాగరుడు" మొదలగు విశేషములన్నియు నిస్సారమగును. తులసీదాసు వాస్తవముగా రామా! నీవు నన్ను ఎందుకు ఉద్ధరించవు? ఎందుకు ఆలస్యము చేయుచున్నావు? ఇంత నిష్ఠడవు ఎందుకు అయితివి? తులసీదాసు ఇట్లు చెప్పక - రాముడు చెడ్డపేరు తెచ్చుకొనకుండుటకు భయమును చూపెట్టుచున్నాడు. నన్ను ఉద్ధరించక పోయినచో ప్రపంచం నిన్ను నిష్ఠురుడుగా అనును. ఇదే విషయమును గురించి నాకు రాత్రి పగలు చింత బాధించుచున్నది.

ఇంతవరకు తులసీదాసు లోకము ద్వారా రాముడు బద్‌నామీ (చెడ్డపేరు) తెచ్చుకొనునని భయము చూపించుచుండెను. అయిన రాముడు తన ప్రక్కకు ధ్యానము పెట్టలేదు. తానే స్వయముగా చెడ్డపేరు ఆపాదించెదనని భయపెట్టు చేయును. నన్ను ఉద్ధరించనపుడు నీకు చెడ్డపేరు వచ్చును. పైపైన చూచినపుడు ఈ ఉక్తి పొగరుగా, గర్వముగా ఉన్నట్లు, అశిష్టమై, సేవకునికి అన్ని విధాల తగనిది అని ప్రతీత (తెలియపచ్చును) మగును. కాని దాని ఆంతర్యమున ప్రవహించే రాముని ఎడ తులసీదాసు భక్తి భావము సాటిలేనిదిగా సాకారమును పొందును. తులసీదాసుకు తన రామునిపైన సంపూర్ణమైన అధికారమున్నట్లు తెలుసుకొందుము.

కాని రాముని ద్వారా ఉపేక్ష చూపించబడినపుడు, తులసీదాసు తన సంయమనము కోల్పోయినట్లు గోచరించును. అక్కడ కూడ రామునికి చెడ్డపేరు వచ్చుననే చింత (దిగులు) బాధిస్తుంది. ఇది ఒక ఆనందము. తులసీదాసు చింతకు ఒకే ఒక విషయము ఎక్కడైనా, ఎప్పుడైనా నా ఉద్ధారమున ఆలస్యమయిన రామునికి చెడ్డపేరు కలుగకూడదు.

నేను నీ అనేక కృత్యములను (గుణములను) చూచుచున్నాను. అయినా నీవు హెచ్చరిక కాలేదు. అనగానేను చెప్పినది, కోరినది చేయలేదు. ఇప్పుడు నావద్ద ఒకే ఒక ఉపాయము (మార్గము) మిగిలివున్నది. నీ బొమ్మను చేసి ప్రపంచమంతటా నీ లుబ్ధత్వము గురించి తప్పెటకొట్టి చాటింతును, తిరుగుచుందును. నీదు ధ్యానము చూపెట్టకపోతే ఏదేని విశేషమైన అహితము కలుగునని కాదు. అయినా నన్ను దుఃఖముతో వుండగా చూచి జగత్తు అంతయు నన్ను పరిహసించుచున్నది. ఇతడు ఎట్లా రామభక్తుడు, ఇంత దుఃఖమును అనుభవించుచున్నాడు. అయినా రాముడు ఇతని ప్రక్క ధ్యానము (ధ్యాస) లేదు. అనగా అప్రత్యక్ష రూపమున (పరోక్షముగా) నీకే (రామునికి) చెడ్డపేరు.

పరిచయము చేసెను. అవి అర్థ గౌరవముతో పుష్టిచెందినవి. తులసీదాసు గారి ఈ ఉక్తుల యందు రీతికాలమునకు చెందిన పద వైచిత్ర్యములు కనపడవు. అద్భుతమైన అర్థము యొక్క గంభీరము వున్నది. ఈ అర్థ గాంభీర్యము యొక్క సమావేశము ఉన్నతమైన కోటికి (శ్రేణికి) చెందిన కావ్యోక్తులను కల్గించును. ఉక్తి (పదము) మరియు అర్థము యొక్క సంతులన సమావేశం అసాధారణమైన ప్రతిభాశాలురగు కవుల నిధివలె వుండును. పదాడంబరము చూపెట్టువారిది కాదు. తులసీదాసు గారు ఈ క్షేత్రమున సాటిలేనివారు. వారి వినయ పత్రిక కూడ ఇటువంటి ఉక్తులతో నిండివున్నది.

## "వినయ పత్రికలో ప్రసిద్ధమైన అంతర్గత కథలు"

### 1) అజామిలుడు :

అజామిలుడు జన్మతః బ్రాహ్మణుడు. ఆయన కర్మ ద్వారా గొప్ప పాపాత్ముడు. ఒక దఫా అతను లేనపుడు కొంతమంది సాధువులు అతని ఇంటికి వచ్చిరి. అతని గర్భవతి అయిన భార్య వారికి బాగుగా అతిధి సత్కారము చేసెను. దానికి సంతోషించి సాధువులు ఆమెను ఆశీర్వదించి నీకు పుత్రుడు పుట్టును. అతనికి "నారాయణ" యని పేరు పెట్టుము అని సాధువులు చెప్పిరి.

పుత్రుడు జన్మించిన తర్వాత ఆజామిలుడు అతనిని (పుత్రునిని) ఎక్కువగా ప్రేమించసాగెను. మృత్యుసమయమున అజాపాలుని తీసుకుని పోవుటకు యమభటులు వచ్చి అతనిని మిక్కిలి పీడింప మొదలుపెట్టిరి. అతడు తనకుమారుని పేరు ఎలుగెత్తి చెప్పెను. (పిలిచెను). "నారాయణ" అను పదము వినిన వెంటనే భగవంతుని దూతలు అక్కడికి వచ్చి చేరుకొనిరి. యమదూతల నుండి అతనిని రక్షించి, భగవంతుని వద్దకు తీసుకొని పోయిరి. భగవంతుడు అతనికి మోక్షము ప్రసాదించెను.

### 2) అంబరీషుడు :

రాజు అగు అంబరీషుడు విష్ణు భక్తుడు. అతడు ప్రతి ఏకాదశినాడు వ్రతమును పాటించి, ద్వాదశినాడు బ్రాహ్మణులకు భోజనము పెట్టించి తన వ్రతమును ముగించుచుండెను. ఒక దఫా దుర్వాస ఋషి ద్వాదశి దినమున అంబరీషుని ఇంటికి వచ్చెను. అంబరీషుడు ఆయనను భోజనము చేయమని కోరెను. దుర్వాసుడు స్నానము చేయుటకు వెళ్ళెను. చాలాకాలమయినను తిరిగిరాలేదు. ఇక్కడ పారణ సమయము అయ్యెను. అంబరీషుడు తన ఇంటియందున్న ఇతర బ్రాహ్మణుల అనుమతితో వారి చరణోదకమును స్వీకరించి వ్రతము ముగించెను. దుర్వాసుడు తిరిగివచ్చెను. అప్పుడతనికి ఈ విషయము తెలిసి క్రోధితుడయి అంబరీషునికి శాపము నిచ్చెను. అంబరీషుడు విష్ణువును స్మరించెను. స్మరించిన వెంటనే "సుదర్శన" చక్రము అక్కడికి వచ్చి చేరుకొనెను.

ఆ చక్రము కృత్యాను చంపి, దుర్వాసుని వెంబుడి పడెను. దుర్వాసుడు భయభీతుడయి నలుదిశల పరుగిడసాగెను. అప్పుడు విష్ణువు దుర్వాసునిని అంబరీషుని వద్దకే పొమ్మని సలహా చెప్పెను. దుర్వాసుడు అంబరీషుని వద్దకు రాగానే అంబరీషుడు సుదర్శన చక్రమును నివారించి, దుర్వాసునిని బాగా ఆదరించెను.

**3) అరుణ :**

దక్ష ప్రజాపతి యొక్క ఇద్దరు అందమైన కూతుళ్లు - 1. కద్రువ, 2. వినతలను బ్రహ్మ కుమారుడైన మహర్షి కశ్యపునితో పెండ్లి అయి వుండెను. ఒకసారి మహర్షి సంతోషించి (ప్రసన్నుడయి) తన ఇద్దరి భార్యలను వరములను కోరుకోమని చెప్పెను. కద్రువ ఒక వేయి నాగ ప్రతులను కోరెను. వినత కద్రువ కుమారుల కంటె తేజస్సుగల కేవలము ఇద్దరు కుమారులను కోరెను. సమయము వచ్చినపుడు కద్రువకు ఒక వేయి, వినతకు రెండు అండములను కల్గి ఇచ్చిరి. కద్రువ అండముల నుండి శీఘ్రముగా పుత్రులు పుట్టిరి. కాని వినత అండముల నుండి అయిదు వందల సంవత్సరములు గడచినను పుత్రులు జన్మింపలేదు. దీనివలన అధీరురాలయి ఒక దినము వినత ఒక అండమును పగులగొట్టెను. అందులో నుండి "అరుణ" పుట్టెను. అతని శరీరము నడుము వరకు పై భాగము బాగుగా సంపూర్ణముగా నుండెను. క్రింది భాగమంతయు లేకుండెను. ఇందువలన ఇతడు వికలాంగుడు అయ్యెను. అరుణుడు వినతతో నీవు నా ఎడ చేసినది చేసితివి. కాని ఇప్పుడు రెండవ అండము అయిదు వందల సంవత్సరముల వరకు పగులగొట్ట వద్దు అని చెప్పెను. ఐదు వందల సంవత్సరముల తర్వాత అండమునుండి గరుడ జన్మించెను.

అరుణుడు పుట్టిన వెంటనే ఆకాశమున ఎగిరి పోయెను. అప్పటినుండియే ప్రాతఃకాలము తూర్పుదిశ ఎల్లపుడు అరుణ (ఎర్రని) దర్శన మిచ్చుచున్నాడు.

సముద్ర మంధనము తర్వాత విష్ణువు దేవతలకు అమృతము పంచుచున్నపుడు చంద్రుడు, సూర్యుడు మారువేషముతో దేవతల మధ్య కూర్చుని వున్న రాహువును చూపెట్టిరి. (రహస్యమును వెల్లడి చేసిరి). రాహువు అప్పటి నుండి సూర్యచంద్రులను బాధపెట్టు చుండెను. సూర్యుడు ఇట్లు ఆలోచించెను. నేను ఈ దేవతల మేలు కొరకు రాహుతో వైరము కొని తెచ్చుకొన్నట్లయినది. రాహువు నన్ను బాధించుచూ వుండగ, దేవతలు ఎవరూ నాకు సహాయపడుటలేదు. ఇందువలన అతడు కోపగించుకొని నేను అస్తాచలమున పోయివుందును. అక్కడి నుండి విశ్వము నంతటిని దగ్ధము చేయుదునని నిర్ణయించుకొనెను. సూర్యుడు అటులనే చేసెను అతని వేడిమికి బాధపడి దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళిరి. ఈ ఆపద నుండి రక్షింపమని ప్రార్ధన చేయసాగిరి. ఇదివిని బ్రహ్మ మహర్షి కశ్యపుని మహా తేజస్వి అగు పుత్రుడు "అరుణుడు" సూర్యుని రధముపైన కూర్చునెను. అతనికి (సూర్యునికి) రధసారధి అగును సూర్యుని వేడిమిని (తేజస్సును) అపహరించును. బ్రహ్మ ఆజ్ఞ చేత అరుణ, సూర్యుని సారధి అయ్యెను. అప్పటినుండి సూర్యుడు సదా అరుణతో ఆవృత్తుడయి ఉదయించుచున్నాడు.

## 4) అనసూయ :

మహర్షి అత్రి అతని భార్య అనసూయ - చిత్ర కూటమున పుత్రుని కోరికతో ఘోరమైన తపస్సు చేసిరి. దీనికి ప్రసన్నులయి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురు దేవతలు దర్శన మిచ్చిరి. వరమును కోరుకొమ్ము అని చెప్పిరి. అనసూయ - నా గర్భము నుండి మీ ముగ్గురికి సమానమైన తేజస్సుగల పుత్రులు జన్మించవలెనని కోరెను. ఆ వరమును పూర్తి చేయుటకు ముగ్గురు దేవతలకు తమ తమ గృహములను వదలి అనసూయ గర్భమున జన్మించవలసి వచ్చెను. బ్రహ్మ అంశము చేత చంద్రుడు, విష్ణువు అంశచే దత్తాత్రేయుడు, శివుని అంశము చేత దుర్వాసుడు అనసూయ గర్భమున జన్మించిరి.

## 5) అగస్త్యుడు :

"వింధ్యాచలమును అడ్డగించుట" :- వింధ్యా చలము చాలా ఎత్తైన పర్వతము. సూర్యుని ప్రచండ తాపమునకు ఆ అచలమునందున్న వృక్షములు కాలిపోసాగెను. ఆ అచలమునకు కోపము వచ్చి సూర్యుని కప్పివేయుటకు అటు ప్రక్క పోసాగెను. దానియొక్క ఈ భయంకరమైన భవిష్యత్ పరిణామముల శంక నొంది, దేవతలు గాబరాపడి అగస్త్య ఋషి వద్దకు వెళ్ళిరి. వింధ్యా చలమును అడ్డగించమని ప్రార్ధించిరి. అగస్త్యుడు "రామనామ" స్మరణ చేసి, వింధ్యాచలము శిరస్సుపైన హస్తమును వుంచి క్రిందికి వంచెను. తదుపరి ఇటుల ఆజ్ఞాపించెను. నేను దక్షిణము నుండి రానంతవరకు నీవు ఇటులనే పడివుండవలెనని అనెను. అగస్త్యుడు మరల ఎప్పటికిని ఉత్తరమునకు తిరిగిరాలేదు. వింధ్యాచలము ఆయన నిరీక్షణలో ఇంతవరకు తలవంచి పడివున్నది.

"సముద్రము ఎండిపోవుట" : ఒకసారి పూర్ణిమ దినము రాత్రికి సముద్రగట్టున కూర్చొని తపస్సు చేయుచుండెను. సముద్రములో అలలు పొంగుచుండెను. సముద్రములోని అలలు ముందుకు సాగి మహర్షి పూజా సామగ్రిని తీసుకుని పోయెను. అగస్త్యుడు క్రోధితుడయి రామనామ స్మరణ చేసి, మూడు దోసిల్లలో సముద్ర జలమును తాగెను. తదుపరి దేవతల ప్రార్ధన వలన దానిని (జలమును) మూత్ర రూపమున మరల బయటికి వెడలనంపెను. అప్పటినుండి సముద్రజలము క్షారముగా (ఉప్పగా) అయినవని చెప్పెదరు.

## 6) అహల్య :

అహల్య గౌతమ ఋషి భార్య. ఉత్తమ సౌందర్యవతి. ఒకసారి ఇంద్రుడు ఆమె రూపమునకు మోహము చెంది ఋషి లేనపుడు ఋషి రూపమును పొంది (ధరించి) ఆమెతో సంభోగించెను. గౌతముడు యోగ దృష్టితో రహస్యమంతయు తెలుసుకొనును. అహల్యను నీవు రాయివి కమ్మని శపించెను. ఇంద్రునికి నీవు సహస్ర భగుడవు కమ్మని శాపమిచ్చెను. తర్వాత ఇద్దరును బ్రతిమాలి - బ్రతతిమాలి ప్రార్ధించగా ఋషి - రాముని చరణముల స్పర్శ చేత పునః (మరల) నీ రూపమును పొందగలవని, రాముని ద్వారా శివ

ధనుస్సు త్రుంచినపుడు, ఇంద్రుని సహస్ర భాగములు కన్నులుగా పరివర్తన మగునని చెప్పెను. చివరలో రాముని పాదస్పర్శచేత అహల్యా ఉద్ధరణ (విముక్తి) జరిగెను.

### 7) ఉలూకము మరియు కొంగ :

తులసీదాసుగారు బకము (కొంగ)ను గురించి వ్రాసెను. కాని వాల్మీకి రామాయణము నందు ఉలూకము (గుడ్లగూబ) పేరు వచ్చినది. రెండింటి భావము ఒకే కథనుండి వచ్చినది. కథ ఈ విధముగా ఉన్నది.

ఒక అడవిలో ఒక ఉలూకము (గుడ్లగూబ), ఒక గ్రద్ద వుండెను. ఒక దినమున గ్రద్ధ మనస్సులో అపనమ్మకము ఏర్పడెను. అది ఉలూకముతో ''ఈ ఇల్లు నాది'' అని చెప్పందొడగెను. నీవు దీనిని వదలివేయుము''. రెండింటి యందు వివాదము కలిగెను. చివరకు రెండును న్యాయము కొరకు రాముని ఆస్థానమునకు పోయెను. రాముడు వాటి వృత్తాంతమునంతయు విని, గ్రద్ధ నిట్లు అడిగెను - నీవు ఆ వృక్షముపైన ఎప్పటినుండి వుంటున్నావు? మానవుని సృష్టి అయినప్పటినుండియని గ్రద్ధ చెప్పెను. ఉలూకమును ఇదే ప్రశ్న వేయగా - వనస్పతి (వృక్షములు చెట్లు) పుట్టినప్పటి నుండి వున్నాను అనెను. మానవులకంటె ముందుగానే వృక్షములు సృష్టి అయ్యెను. ఇందువలన ఉలూకమునకు ఇంటిపైన అధికారమున్నది. అందువలన ఇల్లు ఉలూకమునకే లభించవలయును.

### 8) కుక్క మరియు బ్రాహ్మణుడు :

ఒకసారి ఒక కుక్క రాముని ఆస్థానమునకు వచ్చి ఫిర్యాదు చేసెను. మహారాజా! నేను దారిలో పడివుంటిని. తీర్థ సిద్ధి అను పేరుగల బ్రాహ్మణుడు నన్ను ఏ నేరము చేయనప్పటికిని కొట్టెను. రాముడు బ్రాహ్మణుని పిలిపించెను, కారణమడిగెను. బ్రాహ్మణుడు ఇట్లు చెప్పెను - ఇది దారిలో పడుకుని వుండెను. నేను దీనిని తొలగిపొమ్మని చాలా దఫాలు చెప్పితిని. ఇది తొలగనందున కొట్టితిని. బ్రాహ్మణుడు అపరాధిగా నిరూపణ అయ్యెను. కాని బ్రాహ్మణుడు దండార్హుడు కాదు. ఇందువలన అతనికి ఎట్లు దండన విధించవలెనని సందిగ్ధ స్థితిలో నుండెను. కుక్క రాముని సందిగ్ధమును తెలుసుకొని సలహా ఇచ్చెను. మహారాజా! ఇతనిని కాలింజరు మఠమునకు మహంతునిగా (సన్యాసుల మఠాధికారిగా) చేయమనెను. ఈ విచిత్రమైన దండన చూచి, సభలోని వారెల్లరు ఆశ్చర్య చకితులైరి. కారణము అడుగగా కుక్క ఇట్లు చెప్పెను - తాను పూర్వ జన్మమున కాలింజర్ మఠాధిపతిని. ఆకారణముననే, నేను ఈ జన్మలో కుక్కనై జన్మించితిని. రాముడు బ్రాహ్మణుని కాలింజర్ మఠమునకు అధిపతిని చేసి ఏనుగు మీద కూర్చుండబెట్టి పంపెను.

### 9) కాలనేమి :

ఇతడు మహా మాయావి అగు రాక్షసుడు. రామ, రావణ యుద్ధమున లక్ష్మణుడు ''శక్తి'' తగిలినపుడు (శక్తియను బాణము) మూర్ఛపోయెను. హనుమంతుడు సంజీవినీ వనమూలిక

తెచ్చుటకు వెళ్ళెను. అప్పుడు ఈ రాక్షసుడు రావణుని ఆజ్ఞచేత హనుమంతుని ఆపుటకు సాధువు వేషము ధరించి వారు వచ్చు మార్గమున కూర్చొని యుండెను. కానిరహస్యము తెలిపిన వెంటనే హనుమంతుడు, ఈ రాక్షసుని తోకతో కొట్టి చంపెను.

## 10) కృష్ణుని మరణము :

యాదవ వంశము వినాశనము తర్వాత కృష్ణుడు ఒకసారి ఒక దట్టమైన అడవియందు ఒక వృక్షము క్రింద కాలు మీద కాలువేసుకొని అర్థము పడుకొని యుండిరి. దూరము నుండి ఒక బోయవాడు ఆయన చరణమున అయిన పద్మ చిహ్నమును జింక కన్నుగా భావించి దానిని బాణముతో కొట్టెను. కృష్ణుడు బోయవానిని సశరరముగా స్వర్గమునకు పంపెను. తదుపరి తానుకూడ వైకుంఠలోకము (తన లోకము)నకు వెళ్ళెను. ఈ బోయవాడు పూర్వజన్మమున "వాలి" (సుగ్రీవుని అన్న)గా వుండెను. రాముడు, వాలిని, దాగుకొని చంపివుండెను. ఈ జన్మమునందు అతడు బోయవాని రూపమున కృష్ణుని చంపి. తన (పాత వైరమును) పగ తీర్చుకొనెను. తదుపరి శరీరముతో స్వర్గమునకు వెళ్ళెను.

## 11) కుంజరోవా :

మహాభారత యుద్ధమున (కురుక్షేత్రమున) గురుద్రోణాచార్యుని బాణములకు పాండవ సైన్యమున హాహాకారము వ్యాపించెను. అపుడు కృష్ణుడు అర్జునినితో ద్రోణుని చంపుటకు ప్రేరేపించును. ఒకటి ద్రోణుని చేతియందు విల్లు - బాణములున్నంతవరకు అతనినిచంపుట అసంభవము. రెండవది గురువు హత్య మరియు బ్రాహ్మణ హత్య దోషము వచ్చునని అర్జునుడు నిరాకరించెను. ఇది చూచి కృష్ణుడు "అశ్వత్థామ అను పేరుగల ఏనుగును చంపెను. సత్యవాది యగు యుధిష్టరుడు (ధర్మరాజు)తో ఇట్లు ప్రకటన చయమని కృష్ణుడు చెప్పెను. "అశ్వత్థామా హతో, నరోవా కుంజరోవా". అనగా "అశ్వత్థామ చంపబడెను ఏనుగు లేక మనిషి". ధర్మరాజు అటులనే ప్రకటన చేసెను. కాని అతడు ఇంతవరకు ప్రకటన చేసెను. "అశ్వత్థామా హతానర" - అప్పుడు కృష్ణుడు చాలా బిగ్గరగా శంఖము వూదెను. ఫలితముగా ద్రోణాచార్యుడు పూర్తి వాక్యములోని మొదటి భాగములోని అంశమును వినెను. మిగతా శేషభాగము "వాకుంజరోవా" వినలేకపోయెను. ద్రోణుని పుత్రుని పేరు అశ్వత్థామయే. అతడు (ద్రోణుడు) తన కుమారుడే చనిపోయినట్లు భావించి, శోకముతో వికలుడై. అతడు ఖడ్గమును రథములో పారవైచెను. నిరాశపడి కూర్చొని యుండిరి. ఇదే సమయమునన ద్రుపదరాజు పుత్రుడు దృష్టద్యుమ్నుడు అతని (ద్రోణుని) శిరస్సు ఖండించెను.

## 12) కుబ్జా :

కుబ్జా రాజగు కంసుని దాసి. భగవంతుని భక్తురాలు. ఆమె చాలా కురూపి, గూనిది, కృష్ణుడు మధురకు వచ్చినపుడు, మార్గములో ఆమె కృష్ణునికి స్వాగతము పలికి, ఆయనకు శ్రీగంధము పూసెను. కృష్ణుడు ఆమె వీపును అణచి, ఆమె గూని తొలగించెను. కృష్ణుని

స్పర్శచేత ఆమె సుందరి అయ్యెను. తర్వాత కృష్ణుడు ఆమె ఇంటికి పోయెను. ఈ విషయముననే గోకులములోని గోపికలు సవతి - ద్వేషముతో నిమగ్నమయి కుబ్జాను బాగుగా (ఎక్కువగా) నిందించిరి.

### 13) కేవట్ (పడవ నడుపు వాడు) :

కేవట్, గుహుడు, నిషాదుడు ఒకే వ్యక్తియే. ఇతడు రాముని గొప్ప భక్తుడు. వనవాసమున ఇతడు, రాముని చరణములు కడగకుండ గంగానది అవతల గట్టు చేరుకొనుటకు రామునిని నిరాకరించెను. (పడవపై కూర్చొనుటకు అనుమతించలేదు). తరువాత రాముని పాదములను కడిగి, చరణామృతమును తీసుకొని వారిని బాగుగా సత్కరించెను. తర్వాత పడవపైన కూర్చుండబెట్టుకొని గంగానదిని దాటించెను. అతని యొక్క స్నేహమునకు ప్రభావితుడయి రాముడు అతనిని తన సోదరునిగా భావించిరి.

### 14) గజేంద్రుడు లేక గజరాజు :

ఏనుగులలో మిక్కిలి బలిష్ఠమైన ఏనుగు (గజరాజు) వుండెను. దానికి తన బలము గురించి గర్వము వుండెను. ఒకసారి అది ఒక నదిలోనికి నీరు త్రాగుటకు పోయినది. ఒక మకరము (మొసలి) ఆ ఏనుగు కాలును పట్టెను. నీటిలోనికి లాగుటకు ప్రయత్నించెను. రెండింటియందు భయంకరమైన యుద్ధము చాలా కాలము జరిగెను. చివరకు మొసలి ఏనుగును నీటి లోతుకు లాగుకొని పోయెను. ఏనుగు తొండము నీటికి బయటి (పైన) వుండెను. అపుడు గజరాజు చాలా బాధపడి ఒక పుష్పమును తొండముతో పైకెత్తి, భగవంతునికి సమర్పించెను. భగవంతుని రక్షించమని ఎలుగెత్తి పిలిచెను. ఆ గజరాజు పిలుపు వినిన వెంటనే భగవంతుడు గరుడను వదలి పరుగిడి నడచి వచ్చెను. సుదర్శన చక్రముతో మొసలిని చంపి గజరాజును రక్షించెను.

### 15) జటాయువు :

అది ఒక ముసలి గ్రద్ధ. రావణుడు సీతను దొంగలించి తీసుకుని పోవునపుడు మార్గమున సీత రోదనను విని, జటాయువు రావణుని దారిని అడ్డగించెను. అయినా రావణుడు దానిని గాయపరచి ముందుకు సాగిపోయెను. రాముడు సీతను వెదకుచు గాయపడిన జటాయువు వద్దకు చేరెను. జటాయువు విషయమంతయు రామునికి వివరించి ప్రాణముల విడిచెను. రాముడు తన తండ్రివలె భావించి అంత్యక్రియలు చేసెను. పిండదానము సమర్పించెను.

### 16) జాంబవంతుడు :

ఇతడు ఎలుగుబంట్ల సైన్యమునకు రాజు. అనుభవము గల యోధుడు; చతురుడు. ఇతడే హనుమంతునికి అతని బలము గురించి జ్ఞాపకము చేసెను. అతనిని సముద్రము లంఘించి వెళ్ళుటకు ప్రోత్సహించెను. తర్వాత ఇతడు రామ, రావణ యుద్ధమున గొప్ప

పరాక్రమముతో పోరాడెను. అనేక సందర్భముల యందు ఇతడు రామునికి చాలా విలువైన సలహాలనొసంగెను.

### 17) గుణనిధి బ్రాహ్మణుడు :

గుణనిధి అను పేరుగల ఈ బ్రాహ్మణుడు పెద్ద దొంగ. ఒకపాపి అతడు శివలింగముపై ఎక్కి గంటను దొంగలించెను. దీనికి ప్రసన్నుడయి శంకరుడు తన లోకమగు కైలాసమునకు పంపెను. ఎందుకనగా ఇతరులు తనను పత్రపుష్పములనే సమర్పించెదరు. కాని అతడు తనను తాను స్వయముగా శివునికి సమర్పించెను. రెండవ కథ ఇటుల వున్నది : పూజారులు ఇతడు గంట దొంగలించుచుండగా పట్టుబడడము - చంపడము జరుగును. అయిన శివుడు ప్రసన్నుడయి అతనిని కైలాసమునకు పంపెను.

### 18) జలంధరుడు :

ఇతనిని "సింధు-సుత", "సాగర పుత్రుడు" అని కూడ చెప్పెదరు. ఇతడు పరాక్రమ. వంతుడైన దైత్యరాజు. ఇతడు తన పరాక్రమముతో దేవతలందరినీ జయించెను. దేవతలు శివుని దగ్గరికి వెళ్ళి ఇతనిని చంపమని కోరిరి (ప్రార్థించిరి). శివునికి-జలంధరుని మధ్య భయంకరమైన యుద్ధము జరిగెను. అయినా శివుడు జలంధరుని జయింపలేకపోయెను. దీనికి కారణము, జలంధరుని పత్ని (భార్య) బృంద చాలా పతివ్రత. ఆ ప్రతాపము చేత జలంధరుడు అజేయుడయి వుండెను. ఇది చూచి విష్ణువు ఆమె పాతివ్రత్యమును భంగము చేయుటకు సాధువేషమును ధరించి, జలంధరుని ఇంటవెళ్ళికూర్చుండెను. అక్కడ జలంధర-శివుని మధ్య యుద్ధము జరుగుచుండెను. బృంద సాధురూపములో నున్న విష్ణువును, యుద్ధ సమాచారము అడిగి తెలుసుకొనసాగెను. ఈ మధ్యలోనే విష్ణువు మాయతో జలంధర యొక్క తెగిన అంగములన్నియు మధ్యపడెను. ఇది చూచి బృంద విలాపమును పొందెను. (విలపించెను). నీవు సతీసాధ్వివి. ఇతని అంగములన్నియు జోడించిన ఇతడు జీవించునని చెప్పెను. వృంద అటుల చేయగానే జలంధరుడు జీవించి లేచెను. ఇది చూచి, వృంద కృతజ్ఞతతో సాధుపాదములను వత్తినది. పరపురుషుని స్పర్శ చేసినందున వెంటనే ఆమె పాతివ్రత్యము (సతీత్యము) నష్టమయ్యెను. అక్కడ సతీత్వము నష్టమయిన వెంటనే శివుడు జలంధరుని చంపివేసెను. అతడు చనిపోయిన వెంటనే సాధువు, మాయావియగు జలంధరుడు మాయమయిరి. అసలు రహస్యమును గుర్తించిన వృంధ విష్ణువుకు శాపము నొసంగెను. (శపించెను). నా భర్త రెండవ జన్మమున నీ భార్యను దొంగలించును. తదుపరి ఆమె విరహమున ఎక్కువ కష్టములను అనుభవించుదువు. తదుపరి భవిష్యత్తులో జలంధరుడు రావణునిగా పుట్టెను.

### 19) ధ్రువుడు :

రాజైన ఉత్తానపాదునికి ఇద్దరు భార్యలు వుండిరి. పెద్ద ఆమె సునీతి, చిన్న ఆమె

సురుచి. సునీతి ధ్రువుడు, సురుచికి ఉత్తమ అను పేరుగల పుత్రుడు పుట్టిరి. రాజు, ఉత్తమముని ఎక్కువగా ప్రేమించుచుండెను. ఇందువలన ఉత్తముముడు ఎక్కువ ప్రియము. ఒక దినము రాజు ఉత్తమముని తన ఒడిలో కూర్చుండబెట్టుకుని ఆడించుచుండెను. ధ్రువుడు కూడ అక్కడికి చేరుకొనెను. రాజుగారి ఒడిలో కూర్చొనుటకు ప్రయత్నించసాగెను. ఇది చూచి, సురుచి వ్యంగ్యముగా ఇట్లనెను. తపస్సు చేసిననే రాజుగారి ఒడిలో కూర్చొనుటకు అదృష్టము ప్రాప్తించును. ఇప్పుడే తపస్సు చేయుము. అప్పుడు దీనికి అర్హుడు కాగలవు. ధ్రువుడు ఏడ్చు ఛూతన తల్లి అగు సునీతి వద్దకు వెళ్ళెను. ఏడ్చుచూ ఏడ్చుచూ తనకు జరిగిన అవమానమును చెప్పెను. తల్లికూడ అతనికి తపస్సు చేయ సలహా ఇచ్చెను. తదుపరి ధ్రువుడు మిక్కిలి కఠోరమగు తపస్సు చేసెను. స్థిరమైన పదమును పొందెను. ధ్రువ నక్షత్రము తన స్థానమును పరివర్తనము చెందదని చెప్పుదురు.

## 20) నృగుడు :

రాజు అయిన నృగుడు గొప్పదాత. ఈ నృగుడు నిత్యము ఒక కోటి గోవులను, బ్రాహ్మణులకు దానముగా ఇచ్చుచుండెను. ఒక దఫా ఒక దానము చేయబడిన గోవు, తప్పించుకొనివచ్చి మరల రాజుగారి గోవుల యందు కలసిపోయినది. మరుసటి దినము రాజు ఆ గోవును కూడ ఒక బ్రాహ్మణునికి దానముగా ఇచ్చెను. మొదటి రెండవ బ్రాహ్మణుడు పరస్పరము కలహించుచూ రాజుగారైన నృగు వద్దకు చేరుకొనిరి. రాజు తన పొరపాటును క్షమించమని చాలా బ్రతిమాలెను. చాలా నచ్చచెప్పెను. కాని వారు కోపగించుకొని ఇట్లు శపించిరి - నీవు మమ్మలను మోసగించితివి. "ఊసరవెల్లి"ని అయిపొమ్ము. రాజు వెంటనే ఊసరవెల్లి అయి ద్వారకాపురి వద్ద ఒక బావియందు ఒక వేయి సంవత్సరములు ఉండెను. కృష్ణుడు బావినుండి వెలుపలికి తీసి అతనిని స్వర్గమునకంపెను.

## 21) నముచి :

ఇతడు దైత్యులు, బ్రాహ్మణుల భక్తుడు. ఇతడు బ్రహ్మనుండి ఈ వరమును కోరి పొందియుండెను - నా మరణము ఏదేని అస్త్ర-శస్త్రములతో కాకూడదు. తరల పదార్థము నుండి గట్టిగా నుండు ఘనపదార్థమున మరణము సంభవించకూడదు. బ్రహ్మ అతనికి తాను కోరిన వరమును ఇచ్చెను. ఈ వరదానము చేత అతడు మహాబలిష్టుడుగా, అజేయుడై యుండెను. దేవాసుర సంగ్రామమున అతడు ఎక్కువ ఉపద్రవమును కలిగించునపుడు, ఎవరితోను చంపబడనప్పుడు ఆకాశవాణి ఇట్లు పలికెను. "ఇతని మృత్యువు కేవలము సముద్రము యొక్క ఫేనము (నురుగు) తోనే అగును". అప్పుడు ఇతని వధ సముద్రము యొక్క నురుగు ద్వారా జరిగెను. సముద్రము యొక్క నురుగు, తరలముగా నుండదు, గట్టిగా ఘనముగా నుండదు.

## 22) తులసీదాసు - అక్బర్ :

తులసీదాసు ప్రసిద్ధి విని ఒకసారి అక్బరు అతనిని తన ఆస్థానమునకు పిలిపించెను. తర్వాత ఏదేని చమత్కారమును ప్రదర్శింపకోరెను. "నేను రాముని యొక్క తుచ్ఛమైన సేవకుడను. నేను ఏమి చమత్కారము చూపెట్టగలను? ఇది విని చక్రవర్తి అతనిని జైలులో నిర్భంధించెను. అక్కడ తులసీదాసు హనుమంతుని స్మరించెను. వెంటనే వానర సైన్యము వచ్చి అక్బరు వున్న మేడ చుట్టూ ఆక్రమించి ఉపద్రవము కలిగించెను. అపుడు బీర్‌బల్ నచ్చచెప్పిన పిమ్మట అక్బర్ తులసీదాసును జైలునుండి విముక్తున్ని చేసెను. అతడు (తులసీదాసు) విముక్తుడయిన వెంటనే కోతులనన్నియు మాయమయ్యెను.

## 23) తులసీదాసు - చిత్రకూటము :

ఈ సంబంధమును గురించి వదంతి కథలు ప్రచారములో నున్నవి. (1) తులసీదాసు ఒకసారి చిత్రకూటములో కూర్చుని రామనామ స్మరణ చేయుచుండ అప్పుడే ఇద్దరు అందమైన రాజకుమారులు అశ్వరూఢులై ఒక జింకను వెంటాడుచూ వున్న దృశ్యమును చూసెను. తులసీదాసు ధ్యానమునకు విఘ్నము కలుగుట గమనించి కన్నులు నేల ప్రక్కకు అనగా క్రింది చూసెను. కొంచెము సేపు అయిన తర్వాత హనుమంతుడు వచ్చి నీవు రామ - లక్ష్మణులను దర్శించితివా? అని అడిగెను. తులసీదాసు నిరాకరించగా వారు (హనుమంతుడు) ఆ ఇద్దరు రాజకుమారులే రామ - లక్ష్మణులు అని అనెను. ఇది విని గోస్వామి (తులసీదాసు) చిత్రకూటమున కూర్చొని తపస్సు చేయుచుండిరి. ఇది చూచి కలియుగము వచ్చి అతనిని ఎక్కువ భయపెట్టసాగెను. తులసీదాసు హనుమంతుని స్మరించెను. వారిని (హనుమంతుని) చూచి కలియుగము భయపడి పారిపోయెను. కాని అవకాశము వచ్చినపుడు తులసీదాసును పీడించుచుండెను. తులసీదాసు అతనితో (కలితో) బాధపడుచుండెను.

## 24) ప్రహ్లాదుడు :

ప్రహ్లాదుడు దైత్యరాజగు హిరణ్యకశ్యపుని పుత్రుడు. విష్ణుభక్తుడు తండ్రి పూర్తిగా విష్ణువు శత్రువు అతడు ప్రహ్లాదుడు విష్ణు నామమును స్మరించుట అడ్డగించెను. కుమారుడు విననప్పుడు ఎక్కువగా బాధపెట్టెను. హిరణ్యకశ్యపునకు ఒక వరము దానముగా ఇవ్వబడి వుండెను. "అతడు ఏ అయుధమున, రాత్రి, పగలు, నేలపైన, ఆకాశము నందు, మనుష్యులద్వారా, పశువుల ద్వారా చంపబడకుండవుండుట"ఈ వరమును పొంది అతడు అజేయుడుగా అయివుండెను. అతడు ఒకసారి, ప్రహ్లాదుని స్తంభమునకు బంధించెను. తదుపరి ఇట్లనెను - నీ దేవుడు - సర్వవ్యాప్తి అయినచో ఈ స్తంభములోనుండి నిన్ను రక్షించుటకు - ఎందుకు రాలేదు? పుత్రుడైన ప్రహ్లాదుడు నమస్కరించగా భగవంతుడగు నరసింహుడు స్తంభములోనుండి ప్రత్యక్షమయి అతని ముఖము సింహముఖము, శరీరము

(మొండెము) మానవునిది. అందువలన ఇతడు పశువుకాదు, మానవుడు కాదు. అప్పుడు సంధ్యాకాలము. రాత్రికాదు. ఆయన హిరణ్యకశ్యపుని తనొడిలో వుంచుకొని, గోళ్ళతో చింపి (చించి) చంపెను. అందువలన అతడు ఏ ఆయుధముతోను - చంపబడలేదు. నేలమీద కాదు. ఆకాశమునకాదు. ఈ విధముగా వరదానముల నియమములు పూర్తి అయివుండెను. భక్తుని రక్ష చేయబడెను. అత్యాచారిని వధించడమయ్యెను.

## 25) పరీక్షిత్తు -కలియుగము :

ఒకసారి పరీక్షిత్తు రాజు వనమున, వేటాడుచూ వుండగా ఒక నల్లని పురుషుడు, ఒక గోవును. ఒక కుంటి ఎద్దును కొట్టుచూ తోలుకొని పోవుచుండెను. ఈ విషయమును (ఈ దృశ్యమును) పరీక్షిత్తు చూచెను. అడిగినపుడు రాజుకెట్లు తెలియవచ్చెను. నల్లని పురుషుడు కలియుగము. ఆవు పృథ్వి (భూమి), కుంటి ఎద్దు ధర్మము. ఇది తెలుసుకొని రాజు కలియుగమును చంప యత్నించెను. అయిన అది బ్రతిమాలినప్పుడు దానిని ఈ షరత్తుపైన వదలెను. పరీక్షిత్తు రాజ్యములో వుండకూడదు. కలియుగము రాజును, 14 (పదునాల్గు) స్థానములును అడిగెను. అందులో ఒకటి స్వర్ణము. రాజు బంగారు కిరీటము ధరించి వుండెను. కలియుగము మౌనముగ అందులో ప్రవేశించెను. దాని ప్రభావము చేత రాజు ఒక ముని మెడలో, చనిపోయిన సర్పమును వేచెను. ఒక వారములో సర్పము ద్వారా కాటు వేయబడి చనిపోవు శాపమును పొందెను. దాని ఫలితముగ అతని మృత్యువు అయ్యెను.

## 26) పరీక్షిత్తు - బ్రహ్మాస్త్రము :

ద్రోణాచార్యుని కుమారుడు అశ్వత్థామ.మోసముతో ద్రౌపది కుమారులను నిద్రించుచుండగా చంపివేసెను. పూర్తిగా పాండవ వంశ నిర్మూలనకు, అతడు అభిమన్యుని ధవయగు భార్య గర్భమున నున్న, పరీక్షిత్తుని వధించుటకు బ్రహ్మాస్త్రమును వదలెను. కాని కృష్ణుడు నేర్పుతో పరీక్షిత్తును రక్షించెను.

## 27) పాండవుల పుట్టుక :

పాండురాజు రోగిఅయినందున సంతానోత్పత్తికి అసమర్ధుగా నుండిరి. వారి అయిదు మంది పుత్రులు పంచపాండవులు విభిన్న దేవతల సంతానముగా భావించబడుచున్నది. యుధిష్టరుడు (ధర్మరాజు) యముని పుత్రుడు. భీమసేనుడు వాయు పుత్రుడు. అర్జునుడు ఇంద్రుని పుత్రుడు. నకుల, సహదేవులు అశ్వినీ దేవతల పుత్రులు.

## 28) పింగళ వేశ్య :

ఈమె ఒక వేశ్య. ఒక దినము అర్ధరాత్రి వరకు శృంగారము చేసుకొని కూర్చొని యుండెను. తన ప్రేమికుని నిరీక్షణ (వేచియుండు) చేయు చుండెను. అయిన రాలేదు. ఇది చూచి ఆమెకు చాల ఆత్మగ్లాని కల్గెను.నేను ఇంతకాలము వరకు భగవంతుని భజన చేసి యుండినచో నా జన్మచక్ర బడెడిది. ఈ పాపకర్మనుండి విముక్తి కలిగెడిది. ఇది

## 29) బలి చక్రవర్తి :

బలి చక్రవర్తి చాలా దానము చేయువాడు. గొప్ప శక్తి సంపన్నుడు. అతడు ముల్లోకములను జయించెను. ఇంద్రుని రాజ్యము లాగుకొనినందున, గాబరాపడి విష్ణువు వద్దకు వెళ్ళెను; సహాయ చేయమని ప్రార్ధించెను. విష్ణువు అతనికి సహాయము చేయుటకు మోసముతో పనిచేయ గడంగెను. అతడు (విష్ణువు) వామన రూపము పొంది, బలి వద్దకు చేరుకొనెను. బలిని మూడడుగులు, నేల దానముగా అడిగెను. బలిదానము ఇవ్వగానే, వామనుడు, పృథ్వి, బ్రహ్మలోకమును రెండు అడుగులతో నింపెను. మూడవ చరణము (అడుగు)ను కొల్చుటకు బలిచక్రవర్తి తన వీపును ఇచ్చెను. ఈ విధముగా విష్ణువు స్వర్గ రాజ్యమును పునః(మరల) స్థాపించి, బలి చక్రవర్తిని, పాతాల లోకమునకు పంపెను.

## 30) వాల్మీకి :

ఇతడు తన జీవిత ప్రారంభమున బందిపోటు (దొంగ)గా నుండెను. ఒకసారి కొంతమంది ఋషి - మునులు అడవి దావరా పోవుచుండిరి. ఈయన వారిని పట్టుకొనెను. దోపిడి చేయ యత్నించెను. అప్పుడు ఋషులు ఇతనితో ఇట్లు అనిరి. నీవు నీ కుటుంబీకుల పోషణార్థము పాప-కర్మలు చేయుచున్నావు. నీ జీవిత భాగస్వామినియగు నీ భార్య నీ పాపకర్మలను అనుభవించుటకు పంచుకొనునా? అప్పుడు వాల్మీకి ఇంటికి వెళ్ళుటకు ముందు ఋషులను వృక్షములకు కట్టి వుంచెను. తదుపరి ఇంటికిపోయి, ఈ విషయమును అడిగెను. అప్పుడు ఇంటివారు, భార్య మొదలగువారు పాప కర్మ ఫలము పంచుకొనుటకు అంగీకరించలేదు. ఇది విని వాల్మీకికి జ్ఞానోదయము అయ్యేను. అతడు తిరిగివచ్చి, ఋషులను క్షమించమని కోరెను. తన వృత్తిని వదలి రామనామము జపింపసాగెను. అతడు ఎంత పాపాత్ముడంటే - రామ అనుపదము ఉచ్చరించలేక విరుద్ధముగా (వ్యతిరేకముగా) మరా "మరా" అని పలుకసాగెను. తరువాత ఇతడు గొప్ప సమాధిని మగ్నుడు అయ్యేను. ఇతని శరీరము పైన "చెదలు" పుట్టలు పెట్టెను. సంస్కృత భాషయందు చెదలు ఇంటిని "వాల్మీకము" అని వ్యవహరింతురు. అప్పటి నుండి ఇతని పేరు వాల్మీకి అని వ్యవహరింపబడెను. తరువాత - ఈ ఋషి వాల్మీకి రామాయణము వ్రాసి సంస్కృతమున ఆదికవిగా ప్రసిద్ధి చెందెను.

## 31) విదురుడు :

ఇతడు దాసి పుత్రుడు. కౌరవుల ఆశ్రయమున నుండెను. అయినను మిక్కిలి నీతిజ్ఞుడు. హృదయమున పాండవుల సమర్ధకుడు. కృష్ణుని భక్తుడు. ఇతడు రచించిన "విదుర నీతి" ప్రసిద్ధమైన గ్రంధముగా భావించ బడుచున్నది. ఒక దఫా దుర్యోధనుడు,

కృష్ణునిని తన ఇంటికి భోజనమునకు ఆహ్వానించెను. అయినా, కృష్ణుడు ధుర్యోధనుని ఇంటికి వెళ్ళక, విదురుని కుటీరమునకు వెళ్ళెను. విదురుని భార్యను భోజనము అడిగెను. విదురుని భార్య తన ఇంటియందుగల ఆకు కూరలను చాలా ప్రీతితో వడ్డించెను. ఆమె కృష్ణుని వద్ద కూర్చొని అరటి బెరడు తీసి అరటి పండు ఇవ్వ మొదలిడెను. భక్తి ఆవేశమున మైమరచి బెరడు కృష్ణునికి ఇవ్వసాగెను. కండ పారవేయుచుండెను. కృష్ణుడు చాలా ప్రీతితో (ప్రేమతో) అరటి బెరడు తినుచుండెను. ఈ సమయముననే విదురుడు వచ్చి ఈ అద్భుత దృశ్యమును చూచి, తన భార్య యెడ ఎక్కువ కోపగించి, తానే స్వయముగా బెరడు తీసి, కండను ఇవ్వసాగెను. కానీ, కృష్ణుడు బెరడువలె ఇవి తియ్యగా (మధురముగా) లేవని అనెను. రుచిగా లేనందున నేను తినను అని అనెను.

## 32) యమలార్జున వృక్షములు :

ఒకసారి కుబేరుని పుత్రులగు నలకొబరుడు, మణిగ్రీవుడు నారదునిని బాగుగా పరిహాసము (వేళాకోళం) గావించిరి. నారదుడందులకు కోపగించి మీరిద్దరు రెండు వృక్షములు అగుదురు గాక అని శాపమిచ్చెను. అందువలన వృక్షములయిరి. ఇద్దరును గోకులమునందు యముల, అర్జున పేరుగల వృక్షములయిరి. ఒక దినము యశోద (తల్లి) అల్లరిచేయు కృష్ణుణ్ణి ఆ వృక్షములకు కట్టివేసెను. తదుపరి ఇంటి పనులయందు నిమగ్నురాలాయెను. కృష్ణుడు తన కాళ్ళను పైకెత్తి రెండు వృక్షములను తాడనము (తన్నుట) చేసెను. వృక్షములను క్రిందికి పడవేసెను. వృక్షములు పడిన వెంటనే వాటిస్థానమున ఇద్దరును దివ్య సౌందర్య రూపులయిన యక్షులు చేతులు జోడించి కృష్ణుని ఎదుట నిలబడిరి. కృష్ణుడు వారిని యక్షలోకమున కంపెను.

## 33) సంపాతి :

సంపాతి మరియు జటాయువు అన్నదమ్ములు. ఒకసారి తన బల అహంకారమున, సూర్యునివరకు చేరుకొనుటకు, ఆకాశమున ఎగిరెను. జటాయువు సూర్యుని తాపము (వేడి) సహించలేక, మధ్య(లో)నే వెనుకకు తిరిగి వచ్చెను. కాని సంపాతి ఇంకనూ పైకి ముందుకు సాగిపోసాగెను. చివరకు సూర్యుని తాపము (వేడి) చేత దాని రెక్కలు కాలిపోయి సముద్రము గట్టున ఒక కొండ (పర్వతం) పైన పడిపోయెను. హనుంతుడు సీతా అన్వేషణలో, సముద్రపు గట్టున చేరుకొనెను. సంపాతి అతనికి (హనుమంతునికి) సీత చిరునామా లంక చేరుకొనే మార్గము చెప్పెను. హనుమంతుని కృపవలన దానికి కొత్త రెక్కలు లభించెను.

## 34) సత్యభామ - పారిజాతము :

నారదుడు ఒకసారి కల్ప వృక్షము యొక్క ఒక పుష్పాన్ని తీసుకొని వచ్చెను. కృష్ణుని పట్టపు రాణియగు రుక్మిణికి ఇచ్చి వెళ్ళెను. ఇది చూచి కృష్ణుని రెండవ భార్య సత్యభామ

అలిగి (కోపగించుకొని), కృష్ణుణ్ణి నాకుకూడా అటువంటిపుష్పమును తెచ్చి ఇవ్వమని కోరెను. ఇంద్రుడు ఆ పుష్పమునిచ్చుటకు నిరాకరించగా, ఇద్దరియందు భయంకరమైన యుద్ధము జరిగెను. చివరకు కృష్ణుడు, ఇంద్రుణ్ణి ఓడించి, కల్ప వృక్షమునే పెకలించి తెచ్చెను. సత్యభామ గృహాంగనమున నాటెను. ఇంద్రుడు, కృష్ణునితో దీని(ని) కారణముననే వైరమును కలిగియుండెను.

### 35) శబరి :

ఈమె కులమునకు చెంచు జాతిది. ఈమె మాతంగ ఋషికి సేవ చేయుండెను. వారి ఉపదేశముననే ఆమె రాముని భక్తురాలాయెను. సీతాపహరణము అయిన తరువాత రాముడు సీతను కనుగొనుటకు, ఈమె ఇంటికి చేరుకొనెను. చాలా ప్రేమతో వారికి సత్కారము చేసెను. రామునికి రేగుపండ్లు తియ్యనివే ఇచ్చి తినిపించుటకు ముందుగా తానే వాటిని కొరికి రుచి చూచి, తియ్యగ వున్నవే తినిపించెను. రాముడు చాలా ప్రేమతో, ఆమె ఇచ్చిన రేగు పండ్లను తినుచూ వుండెను. చివరకు రాముడు, ఆమెకు నవ విధములైన భక్తిని ఉపదేశించి ముక్తురాలునుగాచేసెను.

### 36) సింహికా రాక్షసి :

ఈమె సముద్రమున నివసించు చుండెను. ఆకాశమార్గమున పోవునట్టి, ప్రాణులనీడను పట్టి వాటిని క్రిందికి లాగి తినుచుండెను. హనుమంతుడు లంఘించి (ఎగిరి) సముద్రమును దాటుచుండెను. అప్పుడా రాక్షసి, హనుమంతునిని అతని నీడను పట్టి క్రిందకు లాగెను. కానీ హనుమంతుడు ఆ రాక్షసిని వధించెను.

### 37) శతకోటి రామాయణము :

వాల్మీకి శతకోటి రామాయణములను వ్రాసెనని చెప్పుదురు. వాటిని శివునికి వినిపించుటకు కైలాసము చేరుకొనెను. ఈ విషయమును విని దేవతలందరు రామాయణమును వినుటకుకైలాసమును చేరుకొనిరి. రామాయణము కథ ఒక సంవత్సరము పూర్తి అయ్యెను. దేవతలు శివునితో ఇట్లనిరి. ఈ రామాయణములోని కొన్ని భాగములు మాకు లభించిన ముల్లోకములలో దీనిని ప్రచారము చేయుదుము. శివుడు మూడింట ఒక భాగము అనగా (1/3) ముప్పై మూడు శ్లోకములు మరియు పది అక్షరములు బ్రహ్మాది దేవతలకు ఇచ్చెను. వాటిని వారు స్వర్గమునకు తీసుకెళ్ళిరి. ఇంతయే భాగము ఋషిమునులకు ఇచ్చెను. వాటిని వారు సప్త ద్వీపముల నవఖండంబులయందు పంపకము (పంచి) చేసిరి. శివుని దగ్గర కేవలము రెండు అక్షరములు "రా" మరియు "మ" వుండెను. వీటిని మూడు భాగములు చేయుటకు వీలు లేక పోయెను. ఇందువలన శివుడు ఈ రెండు అక్షరములను తన హృదయమున వుంచుకొనెను.

### 38) శివుడు విషపానము చేయుట :

ఒకసారి దేవతలు రాక్షసులు కలసి సముద్ర మధనము చేసిరి. అందులో అనేక రత్నములతోపాటు "విషము - అమృతము" పుట్టెను విషము చాలా భయంకరమై వుండెను. దాని జ్వాల చేత ముల్లోకములు కాలిపోసాగెను. అప్పుడు శివుడు అందరిని రక్షించుటకు దానిని (విషమును) త్రాగెను. దానిని తన కంఠమున ధరించెను. విషము ప్రభావము చేత శివుని కంఠము 'నీలము' అయ్యెను. అప్పటినుండి నీలకంఠునిగా పిలవబడెను.

### 39) శిశుపాల వధ :

శిశుపాలుడు, కృష్ణుని మేనత్త కొడుకు చేది దేశము (ఇప్పుడు చందేరీ) రాజుగా వుండెను. రుక్మిణీ స్వయంవరమున, కృష్ణుడు అతని మాన మర్ధనము చేసి, రుక్మిణిని ఎత్తుకొని పోయెను. ఇందుకు క్రోధుడై అతడు (శిశుపాలుడు) ఎల్లప్పుడు కృష్ణునిని "తిట్లు" తిట్టుచుండెను. శిశుపాలుని తల్లి-తన చిన్న కుమారుడు (శిశుపాలుడు) అగు అతని నూరు తిట్లు సహించుకొమ్మని - మాటను తీసుకొనెను. పాండవుల రాజసూయ యాగమున - యజ్ఞ సందర్భమున కృష్ణుణ్ణి నూరు తిట్లు కంటే ఎక్కువ తిట్లతో శిశుపాలుడు నిందించెను. కృష్ణుడు వెంటనే సుదర్శన చక్రము ద్వారా, అతనిని వధించెను. చూస్తూ చూస్తూ వుండగానే శిశుపాలుని ఆత్మజ్యోతి, కృష్ణుని నోటిలోనికి చేరిపోయెను.

### 40) హనుమంతుని వలన విభిన్న వ్యక్తుల గర్వభంగము (అగుట) చేయుట : సూర్యుడు, ఇంద్రుడు, రాహువుల గర్వభంగము :

ఒక అమవాస్య దినమున ఉదయించునప్పుడు ఎర్రని పండని భావించి సూర్యుణ్ణి తినుటకు బాలుడైన హనుమంతుడు అతని వద్దకు చేరుకొనెను. ఈ సమయముననే సూర్యగ్రహణము అయినందున రాహువు కూడా సూర్యుణ్ణి మ్రింగుటకు అక్కడి చేరుకొనెను. అయినా హనుమంతుని తేజస్సుకు భయపడి ఇంద్రుని వద్దకు వెళ్ళి ప్రార్థించెను. నా భోజనము (ఆహారము) ఎవరో రెండవ వాడు తినుటకు వచ్చి యున్నాడు. ఇంద్రుడు వెంటనే ఐరావతము పైనెక్కి రాహువును వెంట తీసుకొని (పిలుచుకొని) సూర్యుని వద్దకు వెళ్ళిరి. హనుమంతుడు రాహువును చూచి అతనిని తినుటకు పరుగిడెను. రాహువు పారిపోగా హనుమంతుడు ఇంద్రునిపైకి దుమికెను. ఇంద్రుడు, హనుమంతుని చిబుకము (గడ్డము)పైన వజ్రాయుధముతో మోదెను. అందువలన అతడు మూతి సొట్టపోయి మూర్ఛిల్లెను. (హనుమాన్ - హనుమంతుని పేరు అప్పటినుండి వ్యవహరింపబడినది. ఎందుకనగా సంస్కృతమునందు "హను" చింబుకము అని అనెదరు) తన పుత్రుడు మూర్ఛపోవడము చూచి పవనుడు క్రోధితుడయ్యెను. అతడు తన గతి (చలనము వీనుట) నిలిపి వేసెను. అందువలన జగత్తులోని సర్వజీవుల శ్వాస నిలిచి పోసాగెను. అప్పుడు

ఈ విధముగా ఈ ఘటన ద్వారా హనుమంతుని వలన సూర్యుడు, ఇంద్రుడు, రాహువు - ఈ ముగ్గురి గర్వమును భంగపరిచెను. సూర్యునికి ఈ గర్వము వుండెను. ఎవరును నా తేజమును (వేడిమిని) సహించలేరు దానిని సహించి అతనికి (కి) గర్వభంగమును కల్గించెను. రాహువుకు ఈ గర్వముండెను నేను ఎంతో బలరాలిని. నేను సూర్యునిని తినగలను (భక్షించగలను) అటువంటి వానికి భయభీతులను కల్గించి అక్కడనుండి పరుగెత్తించి అతని గర్వమును అణచెను. ఇంద్రునికి ఈ గర్వముండెను. నా వజ్రఘాతము చేత ఎవడునూ బ్రతకడు. అయితే వజ్ర ఘాతము కూడా వ్యర్థమయ్యేను. హనుమంతుడు రక్షింపబడెను. వజ్రాయుధం యొక్క పదును మొద్దు పోయెను. ఈ విధముగా ఇంద్రుని గర్వమును తొలగించెను.

## 41) భీమసేనుని గర్వభంగము :

భీమ సేనునిలో పదివేల ఏనుగుల బలముండెను. ఇందువలన అతనికి తన బలమును గురించి గర్వముండెను. వనవాస సమయమున ఒక దినము భీమసేనుడు "విశాలకాయము" గల ఒక వృద్ధ వానరము (ముసలి కోతి) తన తోక ద్వారమును ఆపి, నిలిపి నిశ్చింతగా వుండుట చూచెను. ఇది చూచి భీమసేనుడు, వానరునిని (కోతిని) మేల్కొలిపెను. చెప్పెను - దారిలోనుండి తొలగి మాకు దారి ఇవ్వుము. కోతి ఇట్లు చెప్పెను - "నేను ముసలి వాడను లేవలేను. అందువలన నీవు నా తోక ఎత్తి తొలగించి ఒక ప్రక్కకు వుంచుము, వెళ్ళి పొమ్ము" భీముడు తన బలమంతయునుపయోగించి ప్రయత్నించగా తోక మునుపటివలెనే వుండెను. ఇదిచూచి ఈమసేనునికి చాలా ఆశ్చర్యమయ్యేను. అతడు వానరునితో దీనికి కారణము అడిగెను. అప్పుడు భీమునికి ఆ వానరుడు హనుమంతుడేనని తెలిపెను.

## 42) అర్జునిని గర్వభంగము :

మహాభారత యుద్ధమున (కురుక్షేత్రమున) అర్జునుడు - కర్ణుని మధ్య మహా భయంకరమైన యుద్ధము జరుగుచుండెను. అర్జునుడు, కర్ణుని రథము పైకి బాణమును వేసినప్పుడు కర్ణుని రథము వెనుకకు చాలా దూరము పోవుచుండెను. కర్ణుడు అర్జునిని రథము పైకి బాణములు వేసినప్పుడు అర్జునిని రథము కొంచెము కూడా తొలగకుండా (కదలకుండా) వుండెను. ఇదిచూచి అర్జునినికి గర్వము కలిగెను. కృష్ణుడు ఈ గర్వమును తెలిసికొనెను. ఆయన అర్జునిని ధ్వజముపైన కూర్చొనియున్న హనుమంతునిని కొంచెము కాలము దిగిపొమ్మని చెప్పెను. హనుమంతుడు మౌనముగా క్రిందికి దిగివచ్చెను. ఇది జరిగిన తరువాత కర్ణుడు బాణములు వేయగా అర్జునుని రథము కొసలదూరము వెనుకకు

పోయివుండెను. ఇది చూచి అర్జునినికి చాలా ఆశ్చర్యమయ్యెను. కృష్ణునితో దీని కారణమడిగెను. కృష్ణుడు ఇట్లు ఉత్తరము (జవాబు) చెప్పెను. నీ పతాకముపైన హనుమంతుడు కూర్చొని యుండెను. ఇందువలన అతని భారము చేత రథము వెనుకకు పోకుండా వుండెను. ఇప్పుడు వారు క్రిందికి దిగి పోయినారు. అతడు త్రిలోక (ముల్లోక) నివాసి. నీ రథముపైన కూర్చొని యుంటిని అప్పుడు రథము వెనుకకు ఎక్కువగా తొలగక యుండెను. ఒకవేళ నేను కూర్చొని వుండకపోయినచో కర్ణుని బాణములు, నిన్ను ఎక్కడికి పారవేయుచుండునో తెలియదు. ఈ విధముగా హనుమంతుడు అర్జునిని గర్వమును భంగము చేసెను.

## 43) గరుడ గర్వభంగము :

గరుడకు తన శక్తిని గురించి తన వేగమును గురించి ఎక్కువగా గర్వముండెను. ఒకసారి భగవంతుడు హనుమంతునిని పిలుచుకొని వచ్చుటకు పంపెను. గరుడు హనుమంతుని వద్దకు చేరుకొని భగవంతుని సందేశమును వినిపించెను. నీవు పొమ్ము నేను వెనుక వెనుకనే వచ్చెదననెను. గరుడు వ్యంగ్యముతో కూడిన చిరునవ్వుతో అక్కడి నుండి వెళ్ళెను. వీరు హనుమంతుడు నా శక్తిని ఎట్లు ఎదుర్కొన గలడాయని యోచించి తన బలమంతా వుపయోగించి భగవంతుని దగ్గరకు చేరుకొనగా, తనకంటే ముందే హనుమంతుడు అక్కడ విరాజమానుడైవుండెను. ఇది చూచి గరుడకు తన వేగయుతమైన పోకడ గర్వమూగెను. చాలా సిగ్గుపడెను.



# "వినతి పత్రము"

## వినాయక - స్తుతి

1. వినాయక! శంకరపుత్ర, భవానీ నందనా!
గణపతి! జగత్ వందనీయ; సిద్ధి సదన,
కృపాసింధు, సుందరా, సర్వనాయక;
మోదకప్రియ, ముద-మంగళ-దాయక
విద్యావారిధి, బుద్ధి విధాత; నాయక!
కరముల్ జోడించి యాచించితి, వినాయక -
హృదయమున సదా సీతారాముండు వుండుగాక.

## సూర్య- స్తుతి

1. దివాకర! దీనదయాలుడా! దేవా! మునులు,
దేవతలు, రాక్షసుల్; మానవులు -
సేవింతురు నిన్ను; కోకిలల్ తామరుత్, చక్రవాకంబుల్
లోకంబున ప్రకాశించు తేజ ప్రతాపరూపముల్,
రసరాశియైనొప్ప, సారధి వికలాంగుడైన అరుణుండు;
దివ్యరథారూఢ గామియై, త్రిమూర్తుల రూపుండవై;
వేద పురాణములందు నీ ప్రశంస నర్ణింపబడెన్.
నేను తులసీదాసుండ, ప్రార్థింతు నిన్ను, బ్రోవుమా.

## శివ - స్తుతి

1. శివా! శంకరా! శంభు - నిన్ను గాక అన్యులన్ యాచించనేను;
దీన దయాలుడవు నీవు; అన్ని విధముల సమర్థుండైన దేవుడవు నీవు, దాసుండనేను
కాలకూట విషంబు ప్రజ్వరిల్ల; సురాసురుల్ వేడ
లోకమున్ రక్షింప, విషంబు త్రాగితివి నీవు;
జగమున్ పీడించు, దనుజ సుతుండు త్రిపురాసురునిన్ నొక్క
బాణంబున సంహరించితివి నీవు.
మహామునులున్ పొందని ముక్తిని సులభంబు -
గ నీ పురి కాశియందు వసించు వారికెల్లరకున్
నొసంగితీవు. భేదంబులేక, వేదపురాణముల్

పొగడుచుండు శ్రుతుల్, భక్తులందరున్;
అల్పసేవలుపొంది మహాముదంబును బొందెదవు.
కల్పతరువోలె సర్వుల కోరికల్ నెరవేర్చెదవు
పార్వతీపతీ! ఉదారుడవు నీవు; పరమ జ్ఞానివీవు;
దేహంబులన్ వెలయు కామంబునకు రిపుడవీవు.
ఐనరతికోర అనంగుడై వెలయునట్లు చేసితివి నీవు;
కృపానిధీ! తులసీదాసుండనైన నాకు, రామ -
భక్తియే నొసంగుము, ఇది ముక్తికంటెమిన్న.

2. శంకరుని వంటి దైవము లేడిలలోను
వాణి (శారద) పేర్కొనెన్; దీనదయామయుండు
ఎల్లరకున్ ప్రియుండు
యాచకులన్ చూచి సంతసించు నెల్ల వేళ
లన్; కామదేవునిన్ చంపి;
రతికోర, రక్షించె, అతడనంగుడయ్యె
వెలిసె లోకంబున; గొప్ప ఋషులున్, మునులెల్లరున్
ఘోరతపస్సునన్; ముక్తిన్ పొందనేరరు. అడుగ
ముక్తి సంకోచింప; ఆకాశపురాధికారి విశ్వే
రుండొ సంగు ఎల్లరికిన్ ముక్తి; కీటకముల్
మిడుతలున్ పొందు మోక్షంబు;
ఉమాపతి! ఈశ్వరుండెంతో ఉదారుడు రక్షిం
చునెల్లరిన్, ఇతని వదలి అన్యదేవతలన్
గొల్వ ముక్తి కల్గునే?
(భక్తి మార్గంబె, యోగంబునకంటె శ్రేష్ఠంబు)

3. బ్రహ్మ నొకదినంబున కైలాసమునకున్,
వచ్చి - పార్వతికిన్ వినిపించెనిట్లు -
ఓ భవానీ! నీ భర్త; పిచ్చివాడాయెనేమో?
కోరిన వారికెల్ల దానంబు చేయు నిరతమున్;
వేదమర్యాదనెరిగి - పాత్రతన్ నెరిగి దానం
బు చేయనగు.
తన భక్తులగు రావణ, బాణాసురలకెల్ల
వృద్ధినొందించె, నీ గృహము చూచుకొనుమ

టంచనెన్, భక్తులకు కోరిన వరం
బులిచ్చుచుండు, యోచించడు తన గృహంబు గురించి
నేను జీవనరుల నదృష్టము వ్రాయ; తద్
విరుద్ధముగ దానంబులీయ; నాకేమి
పనిలేదా?
మహాదానియైన; నీవు సర్వజ్ఞురాలవు.
శివుడిచ్చిన సంపదలన్‌పొందిరెల్లరున్;
సుఖంబు నుండ
నీ యింటి సంపదలేకున్నందున చూచి,
శ్రీలక్ష్మి శారదల్ ముదంబు చెందగాన్
నీకు ఏమియున్ నొసంగడాయె.
స్వర్గమునకున్ నెల్లరిని నింప; చోటు చాల
దయ్యె! సరికొత్త వసతులన్ కల్పించ
నేను శ్రమపడవలసివచ్చెనమ్మ.
ఎవరికైన ఈ విధాత పదవినిప్పించనమ్మ.
ననంగనంత శివపార్వతులిద్దరున్ -
బ్రహ్మ స్తుతివిని ముదమందిరి.
తులసీదాసైన నేను ముదముతోన్
చెప్పెదన్; శివుండు మహా ఉదారుడు -
భక్తవత్సలుండు.
(వేదాను వర్తినం రుద్రమ్, దేవమ్ - నారాయణమ్ తథా)

4. అన్నపూర్ణ - విశ్వేశ్వరుండునుండు
కాశికి వెళ్ళి అడుగవలె దానంబు;
వారి నికేతనంబునన్ అణిమాది సిద్ధు -
లన్నియు, దాసియైయుండు
పాత్ర అపాత్రయను భేదంబున్
పరిశీలించకనే, ఎల్లరకును సమంబు
గన్ దానంబు జేయు అల్ప-స్వల్ప
సేవలకే కరగు హృదయంబు,
తన భక్తుల భక్తికిన్ సంతసించి
భక్తుల కోరికలన్ తీర్చు, మరల
అనాథలై, దీనులై తన ఎదుట నిలబడ

ఇచ్చు సత్వరంబు వరములన్, తొలగిం-
చు దుంఖంబులన్.
శివుని ప్రార్థింప సంపదల్, సుఖములన్,
సద్బుద్ధియున్, సౌందర్యమున్, ముక్తి -
యు లభించున్
శరణుజొచ్చిన వారికెల్లరికిన్, రక్షణ
కల్పించు, క్షణంబులలోన్
తులసీదాసైన నేను - రఘునాథుని భక్తి
కొరకు శంకరువేడెదన్, రాముని
నిర్మలంబుగా భక్తిలభించుగాక.

5. తులసీదాసుండనేను, దీనుండను;
నా ఎడ దయ చూపు శంకరా.
నా వంతు వచ్చు వేలఏల, లుబ్ధుండనైతి
వో? వేదపురాణంబులన్నియున్
నిన్ను దయామయుండని వర్ణించ,
"గుణనిధి" యను బ్రాహ్మణునిన్, తరిం
పజేసి, కైలాసమంపితివి, కైవల్యపదం
బిచ్చుట కతడేమి చేసె? భక్తులకున్
మహామునులకున్ సదాభనంబగు
ముక్తినెట్లు నొసంగితీవు?
నీపురంబున కీటకాదులన్నియున్
మోక్షంబునొందు
నీవు తులసీదాసుండనైన నాకు వరము
నిమ్ము - ఎల్లవేళలన్, కామరిపుం
డవైన శంకరా! సదా రామచరణ రీతుడనై
యుండునట్లు నీవునేనని భేదంబులేని
జ్ఞానంబునిమ్ము దేవదేవా.

6. ఓ శివ! శంకరా! మహాదేవుండ నీవు
హరహరా! భోళాశంకరుడవు, నిర్మ
లుండవు. నాకున్ నీవు గొప్ప దేవుడవు.
ప్రార్థించిన వారికెల్లర దుఃఖంబు

లెల్ల, దూరంబు చేసితీవు.
సేవాభావంబున స్మరియింపగా, బిల్వ
పత్రంబులన్, బియ్యంబుల్ సమర్పింప;
వారికి లోకసంపదలనెల్ల ధనములు, ఏను
గులు, అశ్వంబుల, గోవులన్ ఇచ్చితీవు.
సుఖ - సంతసంబుల నిచ్చి సంతృప్తి
కల్గించితీవు.

ఓ కామదేవా! శివా! నేను నీ వారణాశి యందున్నను ఇంతవరకు ఏమియున్ కోరలేదు.

కాని ఇప్పుడు శారీరక బాధల్ చుట్టు-
ముట్టె; నన్ను ముట్టడించనవి, కావుము.
మోహము, మదము, మత్సరం బాదులన్నియున్ -
నీదాసులు, నన్ను పీడించె మిక్కుటంబుగ;
దయయుంచి, ఈ కఠిన నిర్ణయంబుగ -
రాశినెల్ల, శీఘ్రంబు - తొలగించవయ్య.
వాటి దౌష్ట్యంబు లెక్కించ వీలుకాదు.
నామనంబున నున్న భక్తి తొలగించుదేవ దేవ!
అరిషడ్ వర్గంబులెల్ల నాగజముడయ్యె -
తొలగించి, తులసిచెట్టు హృదయంబునన్ పెంపొం
దనిమ్ము. (తులసి అనగా భక్తియని భావము).

7. కళ్యాణ స్వరూపా! మంగళమయుడా! శివా! నాపై దయ చూపుమా. కరుణాంమయుండవు నీవు. నీ కీర్తి విశ్వమంత వ్యాపించియున్నది. నను లాలించుము. నీ మాయను తొలగించుమా. నా ఆదిభౌతిక దుఃఖములన్ హరింపుమా. కమల నేత్రుడా! సర్వసద్గుణ సంపన్నుడవు నీవు. కామాది శత్రువులన్ చంపి ప్రసిద్ధి పొందితీవు. నీ మహిమ నెవ్వరున్ తెలుసుకొనలేరు.

నీ కృప లేకయే, రామచంద్రుని కమల చరణమందు భక్తి స్వప్నంబునన్ కలుగదు. నీ కృప చేతనే ఎవరైన రామభక్తుండగున్.

ఋషులు, మునులు, సిద్ధులు, మనుజులు, దనుజులు, సురలు, అన్యప్రాణులెల్లయున్ నీ దయ లేకనే ఇహలోక సాగరంబు దాటలేరు. (ముక్తి పొందలేరు).

కోట్ల కల్పంబుల వరకు ప్రయత్నించినన్ పొందలేరు, సర్పములనే ఆ భూషణములుగా ధరించితీవు. దూషణ రాక్షస శత్రువైన రాముడు నీ సేవకుడు. నీవు దేవ దేవుడవు.

మహాదేవా! త్రిపురారి! మోహమనెడి మంచు తొలగించు. సూర్యునివంటి కిరణంబులన్ గలవాడవు.

నేను నీ శరణుజొచ్చుచున్నాడ. శోక, భయంబులన్ తొలగించుము. కాశీనివాసీ! విశ్వేశ్వరా! పార్వతి మాన సరోవరముననున్న మరాళమా! రామచంద్రుని పద కమలముల యందే, చెరగని భక్తి కల్గించుమా అని తులసీదాసైన నేను కోరుచుంటిని.

(శైవ-వైష్ణవ భేదంబు తొలగించ ప్రయత్నించె, తులసీదాసు.)

మహాదేవ! రుద్ర! ఓ శంకర! మోహమనెడి అంధకారంబు తొలగించు సూర్యుండవు నీవు. నీ దర్శనంబున అజ్ఞానము తొలగున్. ఈ జగత్తును ప్రసన్నముగా నుంచుటకు, లోక కళ్యాణకారుండవు: శివ! నేను నీ శరణుజొచ్చి వేడుచున్నాను; నా దుఃఖముల్ తొలగించు.

నెలవంకను శిరస్సుపై ధరించిన చంద్ర మౌళి! నీ నేత్రంబుల్ కమలంబుల వోలె మనోహరంబయ్యె.

కోటి మన్మథులకంటె సౌందర్యవంతుడవు నీవు. మానవాళి యెల్లరు, నీ సౌందర్యమున్ ప్రశంసింతురు. నీ దేహంబు - శంఖము, చంద్రుడున్ ధవల కర్పూరంబు వోలె సుందరమై భాసిల్లుచుండె. పవిత్రమై, పటిష్టమై, కుందనము వోలె నేత్రంబు పండెఁ.

నీ శరీర తేజంబు - మధ్యాహ్న సమయంబున నున్న కోటి సూర్యుల కాంతితో వెలుగొందు. సర్వాంగములయందు భస్మంబు లేపనంబయ్యె (విభూదితో అలంకరించబడి) శైలాత్మజ అర్ధాంగమై యుండ - శోభిల్లితీవు. మెడలోని సర్పంబు, నరుల కపాల మాలయును ధరించి శోభిల్లితివి నీవు.

శిరస్సుపై జటాజూటంబును, ఆపైన విద్యుత్తు ప్రకాశమువలె ప్రకాశమానంబుగు గంగయుండె. కర్ణంబుల కుండలములు, కంఠంబున విషంబును కల్గియున్నావు. నీవు కరుణాస్వరూపమగు సత్ + చిత్ + ఆనంద రూపుడవు. యోగి వేషంబు ధరించితివి. హస్తంబున త్రిశూలము, బాణము, పినాకమను ఖడ్గంబు ధనుర్బాణాదులు శోభిల్లుచుండు.

అగ్ని వనంబుల కాల్చినట్లు, శత్రు సంహారమున్ చేయుదువు. వృషభంబు వాహనము. పులిచర్మమున్ ధరించి యున్నావు నీవు. లోకంబున సర్వజ్ఞాన-విజ్ఞానములకున్ ఆధారము నీవు. దేవతలు, మునులు, మానవులు - నిన్ను పూజించు చుందురు. తాండవ నృత్యంబు చేసెదవు. డమరుకన్ (ఢమ-ఢమ-ఢమ-ఢమ) మ్రోగింతువు. బాహ్యంబున నీ రూపము వికృతము. మహాప్రళయంబు సంభవింప చేసెదవు (బ్రహ్మాండంబును, సౌరమండలంబును భస్మంబు చేసెదవు) నీ భవనంబు కైలాసమైనన్ కాశికాపట్టణమందు వుండెదవు నీవు. సర్వ తత్వములకు జ్ఞాత నీవు; త్రిపురారీ! విశ్వమంతయు నీ అంశంబునన్ పుట్టె. బ్రహ్మ, ఇంద్ర, చంద్ర, సూర్య, వరుణ, అగ్ని, వసు, పవనము, యముడు ఆది సర్వ దేవతలున్, నీ చరణ

సేవ చేయుట వలనన్, తన పదవులయందు అధికారులై యున్నారు. చంద్రుని వోలె తరుగుట. పెరుగుట లేనివాడవు. శుద్ధ స్వరూపుడవు. సత్‌రజ తమో గుణ రహితుండవు నీవు. నిరంతర మాయా రహితుండవు. జన్మ రహితుడవు. నిర్వికారుడవు. ఈ బ్రహ్మాండమంతయు నీ రూపమె. భయంకర రూపముననున్నన్‌సర్వ కళ్యాణకారుడవు. దేవాది దేవుడవు. మహాదేవుండవు. సర్వజీవుల రహస్యంబెరుగువాడు.

నీ కృప చేత - జ్ఞాన, వైరాగ్య, ధన, ధర్మ, మోక్షములన్, సుఖములన్, సౌందర్యమున్, సౌభాగ్యములను అనాయాసముగానే సర్వప్రాణులకు నిత్తువు. అయిన నేను (తులసీదాసు) మూర్ఖమానవుడ లోకములో విషయ వాంఛలన్ తగిలి పరిభ్రమించుచుండు. శంభు! నేను బుద్ధిహీనుండను. మిక్కిలి దుష్టుండను. సదా కష్టములన్ మునిగి, నిర్లజ్జుడైన తులసీదాసైన నేను నీ శరణుజొచ్చుచున్నాడు. కామదేవ శత్రువా! నాకు వరము నిమ్ము - భేదబుద్ధినుండి ముక్తునిన్ చేయుము. సదా శ్రీరాముని చరణ కమలముల యందే భక్తి కల్గించు దేవా!

## భైరవరూప - శివ - స్తుతి

భీషణాకారుండవు, భైరవుడవు; భూతప్రేత ప్రథమాధిపతివి నీవు; తారన-తరన అభయకర్తవు; మోహమూషకమునకు మార్జాలము నీవు; లోక భయహరుండవు, విగ్రహము గౌరవర్ణమ్ము; అమలమై, అతి ధవళమై, అతుల బలశాలియై, ధరణిపాలకుండవు. శిరస్సుపై దట్టమైన జటాజూటంబు; సౌందర్యమొప్ప మకుటంబు వోలె నొప్పారె, కాంతియుతమైన విద్యుత్తు వోలె; శిరస్సుపై దేవనది గంగ శోభిల్లుచుండె. నీ లలాటంబు విదియ చంద్రుడు అలంకృతుడై యుండు. నీవు కుబేరుని మిత్రుండవు. ఇట్టి శివ! నీకు నేను నమస్కరింతు.

చంద్రుడు, సూర్యుడగ్ని - నీ నేత్రంబులయ్యె. కామదేవుని దహనంబు చేసితీవు. సర్వసద్గుణ జ్ఞాన రూపుడవు. పర్వతీశుని పుత్రికయైన పార్వతితో ప్రణయంబు చేతువు. కైలాసవాసి, కర్ణంబుల కుండలములు, ముఖ సౌందర్యము అనుపమయ్యె (సాటిలేనిది).

నీ హస్తంబుల త్రిశూలము, ఖడ్గము, డాలు, డమరుక, ధనుర్బాణంబుల పూని వృషభంబునెక్కి భయంకర రూపుడవైనన్ కరుణాసాగరుండవు.

సముద్రమథనంబున వెల్వడిన విషంబు మ్రింగి, సుర - అసుర మానవలోకంబు రక్షించితివి. శరీరంబున భస్మంబు లేపనము చేసి, మృగచర్మధారియై, సర్పంబు మెడయందు; నరుల కపాలంబుల హారంబు కల్గి, నీవు, భూత, ప్రేత, పిశాచగణంబులు భూమ్యాకాశంబుల విహరించునట్టి - వీటి యంత్ర యంత్రాది ఘాతకముల నుండి రక్షించితి వెల్లవేళలన్. భయానకంబగు పాపంబుల హరింతువు. కాలునకు కాలుడవై మహాకాలుండవై, కలియుగంబున పాపసంహారముకొరకు, సర్వభక్షకుండగు గరుడవు నీవు త్రిపురారివి. మహాప్రళయంబున దిశాదిగ్గజంబుల త్రిశూలముచే సంహరింతువు. తాండవ నృత్యం చేసితివి నీవు.

ఓ భైరవ రూపంబున నున్న శివా! రామయాప్తుడైన రుద్రా! నన్ను రక్షింపు, నీవ నా బంధువు, నరుడవు, మాతా పితలు, విధాతవు నీవు సర్వస్వము నాకున్.

నీ అగణిత గుణంబులన్, నిర్మలమతియగు శారద, వేదములు, నారదుండు, బ్రహ్మాచారులు, శేషనాగుండు, ఎల్ల వేళలన్ వర్ణించుచుందురు. సర్వేశ్వరా! కాశీ నివాస! శరణాగతుల భయ దుఃఖంబులన్ తొలగించు శివా! నేను ప్రణమిల్లుచున్నాడన్.

2. సర్వజనులకు కళ్యాణకారియైన, సజ్జనులకున్ ఆనందప్రదాత, హిమమంతుని పుత్రిక పార్వతి-పతి, కామదేవుని గర్వంబుడంచితీవు. కమలనేత్ర, భక్తి - భావంబు నన్ చెందవచ్చు. శంఖ సమానమగు దేహంబు, కుందనపురంగును, చంద్రుని ధవలత్వంబు-శీతలత్వంబు కల్గి, తెల్లని కర్పూర రంగునొప్పు గౌరవర్ణ, శుభాకార, సచ్చిదానంద! సిద్ధ, సనక, సనందన, సనాతన, సనత్ కుమారాది - ఋషి యోగులందు, సర్వశ్రేష్ఠ యాజ్ఞవల్క్య; సర్వదేవతల్; విష్ణు బ్రహ్మలున్, నీ చరణ కమలంబులందు, వందనముల్ చేయుచుంద్రు; ఇట్టి శివబ్రహ్మ - బ్రహ్మజ్ఞానంబు గల వారికెల్లెడలన్ ప్రియుండవు. బ్రహ్మజ్ఞానులున్ నీకు ప్రియులే. దుర్జనులకు నీవు లభింప సాధ్యంబు కాదు. వేషంబు భయంకరంబు, సంపూర్తిగా నీవు భైరవుండవే. ఆయిన సర్వవైభవ స్వామివి నీవు. వేదంబుల్ నీ రహస్యంబులెరుంగవు.

కరుణామయ! తులసీదాసు అయిన నేను ప్రార్థించుచున్నాను. హాలాహల విషంబును, అమృత సమానమైన గంగను ధరించిన నిర్మల గుణాతీతుడవు నిర్గుణ నిరాకారుండగు శివా! నమస్కారం, లోకంబుల - శోకములన్ హరించి, త్రిశూలధారి. కాలుని మర్ధించువాడ, మోహరూపంబున నున్న అంధకారంబు తొలగించు సూర్యుండవు నీవు. అజరుండవు. సంహారకర్త! కలియుగమనెడి వనంబును - భస్మంబుచేయు దావానలంబు నీవు. అజ్ఞాన రూపమనెడి సముద్రంబుల - ఉదరంబున నిల్పుకొన్న అగస్త్య రూపా! సర్వాంతర్యామి. సౌభాగ్యములకెల్ల మూలాధారుండవు. జన్మ మరణంబుల వలన కల్గు దుఃఖములన్ తొలగించువాడవు. భక్తవత్సలుడవు. పరమ కృపాలుండవు. శివా! నేను (తులసీదాసు) నీ శరణుజొచ్చితిన్.

3. శివ చరణ రజంబున్ సేవించుము. కళ్యాణముల కామధేనువై నొప్పారు. కర్పూర గౌరవర్ణ శివా! సర్వులన్ సమంబుగ నుద్ధరించు వాడవు. లోకంబున సర్వసారమగు సర్పరాజగు వాసుకిన్ మెడలోన ధరించితీవు. సంపూర్ణ సుఖములకున్ కేంద్రమై యొప్పుదువు.

సత్, రజ, తమో గుణంబులకు అతీతుడవై పాంచభౌతిక మాయారహితుండవై శుద్ధ ఆత్మస్వరూపుడవు. త్రినేత్రధారీ! కామంబున్ వహించితివి. అహంకార రూపంబున నున్న మంచును తొలగించు భాస్కరుడవు. నిన్ను దర్శించిన అహంకారము తొలగు. ముల్లోకముల శోకంబులన్ అనం చెదవు.

బ్రహ్మనెవని నుదుట ముక్తి వ్రాయడో వారికిన్ ముక్తినిచ్చెదవు. కాశీపతి ప్రమథరాజ!

నీవలె పరోపకారులెవరు? సురాసురుల్ సముద్రంబు మధనంబు చేయ గరలంబు పుట్టెన్, లోక కళ్యాణమునకు త్రాగితివి నీవు.

శివా! నీ కృప లేక నెవరున్, ఎన్ని కల్పంబుల్ బ్రతికినన్ - మాయ నెరుగలేరు. విజ్ఞాన కేంద్రమా, గిరిసుతా రమణా! నా భయంబు తొలగించుము అని ప్రార్ధించె తులసీదాసు.

4. ఓ శివా! చూడుము, ఉమాకాంతా! నీవే స్వయముగా వనము అయ్యితివి. (వన రూపమున్ అయితివి) పార్వతియే వసంతరూపము నిన్నున్ చూచుటకున్ విచ్చేసినది. ఆమె శరీరకాంతి చంపా పుష్పముల హారమువలెన్ నున్నది. ఆమె నీలవస్త్రంబులు, తమాల వృక్షంబు వలె నున్నవి. రంభాసమానులు ఊరులుండె. పాదంబులు అరుణ కమలంబులై యొప్పె. నడుము సింహ మధ్యము వలెనుండు. హంసనడక. ఆమె భూషణంబులెల్ల వనంబున వికసించిన రంగురంగుల ప్రసూనములె. ఆమె నూపురంబుల కలనాదమున్, కింకిణీ పాదముల్ - పక్షుల మధుర కూజనంబులయ్యె. ఆమె హస్తంబుల్ నవీన పొగడపు వృక్షంబువలెన్నుండ. అరచేతులు లేత మామిడి ఆకులోయననొప్పు. కుచద్వయంబ శ్రీఫలములవలెన్. చోళి(రవిక) విభిన్న లతాజాలంబొ, పద్మ ముఖి; కేశంబుల్ మధుపంగుంజనంబు. (అందమైన ఉంగరపు జుత్తు) విశాల లోచనంబుల్ నవనీలకమలంబువలెనుండు. నోటిమాటలు పికకూజనంబై యొప్పె; మంచి శీలంబు (చరిత్ర) మత్తమరాల చిలుకయై యొప్పెన్. ఆమె హాసంబు ధవళ పుష్పంబులైనుండె. ఆమె క్రీడలు సుగంధ భరిత, శీతల, మందపవనంబువలెనుండు. పరమ చతురుండవైన ఓ శివా! కామదేవుడు మనసున చేరి ఉపద్రవము కల్గించు చుండె ఋతువసంతంబునన్ తులసీదాసైన నేను ప్రార్థించి చెప్పితిన్ - కాముని కోరికల ఉచ్చులో పడక రక్షింపుమయ్యా! ఎల్ల వేళల; శ్రీరామకృపను హృదయంబుల నుండన్ చేయగదే! (ఎల్ల వేళలను రామభక్తి నా హృదయంబున నుండగాక)

## "దేవీ - స్తుతి"

1. ఓ దేవీ! భయంకర పాపంబుల్ నివారించుదువు నీవు. దుఃఖంబులన్ హరించుదువు నీవు. దుఃఖములన్ హరింతునీవు. నాపై దయ చూపుమా. ఈ విశ్వంబునకు మూలము. నీ భక్తులకెల్ల వేళల సానుకూలమై యుందువు. హస్తంబున త్రిశూల ధారిణివి. పరాప్రకృతివి. నీ అంగాంగములు విద్యుత్తుకరణి ప్రకాశించుచుండు. నీ వస్త్రముల్ దివ్యమైనొప్పు. పరమ సౌందర్య భూషణాలంకృత, నేత్రంబుల్ లేతయగు మృగనయని. కాటుక పెట్ట నేత్రి, విశాలమై చంచలమై మొప్పు. చంద్రముఖీ నీ రూపంబు చూచిన కోటి మన్మధ-రతుల కంటె మిన్న.

రూప గుణముల, మర్యాదవతివి. దుష్టులకున్ భయంకర రూపంబు. లక్ష్మి, పార్వతి, సరస్వతివి నీవు.

గణేశ్, కార్తికేయుల మాతవు. శివుని అర్ధాంగి నీవు. భవానీ, మహిషాసుర మర్ధనీ! చండదైత్యుని గర్వమణచితీవు.

గజరాజున్ సింహంబుచంపువగిది, శుంభ-విశుంభులన్ మర్ధించితీవు. శత్రుసమూహమున్ సంహరించితివి. వేదముల్ నిను వర్ణించలేవు. సహస్ర జిహ్వల శేషనాగుండు కూడ వర్ణించలేడు.

తల్లీ! తులసీదాసుడ వరమునిమ్ము - నా ధృఢ ప్రతిజ్ఞయు, ప్రేమయు, నియమము ఘనశ్యాముడగు సుందర శ్రీరాముని యందెల్లవేళ్ల అనురక్తుడవైనుండునట్లు ప్రాణముల్ వోయినన్, రాముని యెడ ప్రేమనియమంబు తొలగకుండుగాక.

2. హే జగజ్జననీ! ఓ దేవీ! నీకు జయము జయము. సర్వదేవతలు మునులు, అసురులు, మానవులు నీ సేవ చేయుదురు.

భక్తి ముక్తిదాయిని. భయము హరించు కాళికవు నీవు. మంగళమై, సిద్ధి మోదమున్ కల్గించు కేంద్రమీవు. పూర్ణచంద్రుడవు. శారీరక, వాచిక, మానసికమైన తాపంబులన్ తొలగింతువు. భక్తుల దుఃఖములెల్లని వారింతువు. శరీరంబున కవచంబును హస్తంబున నివారింతువు. త్రిశూలము, డాలు, ఖడ్గంబుల, మాల, ధనుస్సును, బాణంబులు కల్గియుందువు. రాక్షస సమూహమున్ దునుమాడుచున్, రణక్షేత్రంబున భయంకర రూపియై యుందువు.

పూతన, పిశాచ, ప్రేత, శాకినీ, డాకినీ ఇత్యాదులను, భూత, కుగ్రహంబులును, భైతాళ రూపియగు పక్షులన్ మృగ పంక్తులన్ బంధించి వశమున నుంచుకొను శక్తిశాలివి నీవు.

జయ మహేశ భామినీ, అనేక రూపనామినీ, సమస్తలోక స్వామినీ. హిమశైలబాలకా! తులసీదాసైన నాకు రఘుపతి పాదముల యందు ప్రేమ మిక్కిలి ఉండునట్లు, చలించని, నియమంబున్ కల్గించు, సంతసించి వరమునిచ్చి నన్ను రక్షించు దేవీ!

## "గంగా - స్తుతి"

1. జయ జయ భగీరథ నందినీ! వెన్నెల చకోరములకున్ నానందము కల్గించునట్లు మునుల కందరికిన్ ముదము కల్గింతువు నీవు. మానవుల్ నాగ దేవతలందరున్ నీకు నమస్కరించెదరు.

నీవు జహ్ను ఋషిపుత్రికవైనందున జాహ్నవి యైతివి. విష్ణుచ రణంబులనుద్భవించి, శివుని శిరస్సులనలంకరించి, మూడు మార్గముల స్వర్గ, మర్త్యలోక పాతాలమున నుండి ప్రవహింతువు. పుణ్యరాశివి. పాపహరిణి. నీ ధారయందు నిర్మలమైన, అగాధజలంబులన్ ధరించి ప్రవహింతువు నెల్లవేళలన్.

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధి దైవిక తాపంబుల హరించెదవు. (కాయక, వాచిక,

మానసికంబగు వ్యథల్ తొలగింతువు శీతల జలంబుతోన్).

పున్నమి చంద్రుని జ్యోత్స్న నీ జల ప్రవహంబుననుండు, పూజ కర్పించ పుష్పంబులు, అందమై శోభిల్లు, నదీ జలప్రవాహంబులన, లోకంబున జన్మ-మరణంబుల బాధల్ ఉపశమింప జేసెదవు.

నీ నీటి సుడులు, విభంగతరమై, తరంగ మాలికలైనొప్పు. పురజనులకెల్ల పూజార్హమై. శశిధవలధార శోభిల్లుచుందువు. భవభారభంజన; భక్తి కల్పవృక్షంబు పగిది స్థావరంబై నీ స్పర్శ వలన రామభక్తి మనస్సున పెల్లుబికి, స్థిరమైయుండు.

నీతటంబున నివసించు పక్షులెన్నో జలచరంబులు, పశుపతంగములు. కీటకములు, జటాధరులైన తపస్వీకులున్ - అందరినిన్ సమంబుగ పాలించెదవు.

తులసీదాసైన నేను నీ తటంబున రఘువంశ వీరుని (రాముని) స్మరించుచున్ విహరించునట్లు ఆశీర్వదించు.

2. ఓ దేవనది! అఖిలలోకాల పవిత్రంబు సేయుదువు నీవు. నీకు జయము. విష్ణుచరణ కమలంబుల సుగంధమువలెన్. సుందర పవిత్ర జలధారిణి. పాపములన్ దుఃఖ సమూహములన్ తొలగింతువు నీవు.

బ్రహ్మ విష్ణుచరణంబులన్ కడుగన్ ఆ జలంబె గంగలో ప్రవహించుచుండెన్. నిర్మలంబై పవిత్రమైన త్రిపురారి శిరస్సు పైనెక్కి ప్రవహించుచున్నావు.

జాహ్నవీ కన్య, పుణ్యకృత ధన్యురాలవు. సాగరపుత్రికవు, ఆత్మజ్ఞాన ప్రదాయిని, నీవు కామ, క్రోధ, మద, లోభాది అరిషడ్వర్గంబున్ త్రుంచి వేసెదవు. సర్వవికారములన్ తొలగించి మానవుల అంతఃకరణంబు శుద్ధి చేసెదవు.

నీ ఇరుతటంబుల పేముబెత్తముల లతన్ వృద్ధి చెందియుండు. సంతోషమున్, సుఖమునిచ్చెదవు నీవు. సర్పరాజమైన శేషుండు నీలరంగు బల్లపై పరుండెనేమొ?

దేవతల స్వామినైయున్న గంగా! శేషనాగుని సహస్ర ఫణులవోలె నొప్పుదువు. నీ మహిమ అపారము. నీ రూపము అపురూపమయ్యె. మణి జటిత రాజముకుటంబు శిరస్సుపై ధరించువేల చక్రవర్తులే వందనములు చేయుదురు నీకు. స్వర్గ, పృధ్వి, పాతాలములందు ప్రవహింతువు నీవు. మూడు పాయలై లోకంబున ఆవాగమనంబుల తొలగింతువు. శివప్రియా! నీవు, తులసీదాసునగు నాకు శ్రీరాముని చరణములయందే సంపూర్ణమగు, ప్రగాఢమైన ప్రీతి ఉండునట్లు అనుగ్రహింపుము.

గంగ (జలంబున) గర్భంబున కార్తికేయుడు జన్మించె, గంగ హిమాలయ పర్వతుని పెద్ద కూతురు, పార్వతి చిన్నపుత్రిక).

3. ఓ దేవనది గంగా! నిన్ను స్మరించినంతనే త్రివిధ తాపంబులన్ తొలగింతువు. నీవు ఈ భువిపైన కల్పలతవు. (సంపూర్ణ మనోరథంబులన్ పూర్తి చేసెదవు) శోభాయమానమైనుందువు. భక్తులకానందము నొసంగెదవు. అమృతప్రదాయిని. నిర్మల, మధుర జలంబుల నిండి, నీ

శ్వేత ధార చంద్రుని సమమై మనోహరమై కన్పడున్. నీ నిర్మల తరంగములెల్ల రాముని పవిత్ర శీలంబు వలెన్ నున్నవి. ఈ కలియుగము ఎన్ని ఉపద్రవములన్ కల్గించునో? తులసీదాసును ఐన నేను అపారమగు ఈ సంసారమనెడి ఈ సముద్రమునెట్లు దాటగలనో?

4. ఓ గంగా! నీవు మహాదేవుని శిరస్సుపై నివసించుచున్నావు. త్రిపథగామి. ఆకాశంబున; పృథ్విపై; పాతాలమున ప్రవహించుచూ శోభాయమానమైనుందువు.

సుర, వర, నాగ, సిద్ధులు, మునులు, సుజ్ఞానులు ఎల్లరికిన్ కళ్యాణము కల్గింతువు.

నీ దర్శన మాత్రంబుననే సర్వదుఃఖపాపములో తొలగిపోవు. నీవు దరిద్రమనెడి దాహంబున్ తొలగించెదవు.

నీవే మహారాజగు సగరచక్రవర్తి కుమారులను (అరుబదివేలు) యమ యాతన నుండి, ముక్తి కల్గించితివి నీవు. (నరకంబు నుండి తొలగించి స్వర్గమునకున్ పంపితివి).

నీవు జలనిధి సముద్రునికి జలంబు చేత పూరించుచున్నావు. నీవే బ్రహ్మ, విష్ణు, మహేశుల మహిమన్ అనంతము చేసితివి.

తులసీదాసునగు నా వాక్కుల కూడ, నీ జలంబు వలె పవిత్రంగా, నిర్మలముగా, శ్వేత వర్ణంబుగా (శుభప్రదంబుగా) చేయుము. (శ్వేత రంగు శుభములకున్, సత్యములకున్ ప్రతీకమయ్యె).

## "యమునా నది స్తుతి"

1. వేసవి యందు, యమున సన్నగిల్లన్, కలబూచి, సంతసించున్, నా రాజ్యముని ష్కటంబగున్, యమునలో స్నానంబు చేయక, ఎవ్వరున్ స్వర్గంబున కెల్లలేరు. సర్వత్ర పాపరాజ్యంబు, వ్యాపింపచేతు.

వర్ష ఋతువున యమున జలంబు పెంపొందు; సత్య, దయ, అహింస గుణముల్ వ్యాపింప, కలియుగ రాజ్యంబు నశించు. మానవుల మనసులపైనున్న కలిప్రభావంబు తగ్గిపోయె. వరదవలన వచ్చిన జలంబు మురికియయ్యె. యముని భటుల ముఖంబులెల్ల మలినమయ్యె.

గ్రీష్మంబున యమున నీరు సన్నగిల్ల స్నానంబునకు జనులు రారు. కావున వారిని నరకంబునకు కొనిపోవచ్చు. కాని వర్ష ఋతువున నీరు పెల్లుబుకుటచే యమభటులకు బాధకల్గె ఏలయన, సర్వజనులు యమునలో జలకమాడి స్వర్గంబువెల్పైదరు.

(అధర్మంబు వినాశమయ్యె).

## "కాశి స్తుతి"

పురము నల్దిశలన్ - హద్దులేర్పడన్ - ఇవియ కామధేనువు నాల్గు చరణంబులు. ఈ పురిన్నెప్పుడు దేవతల్ సేవింతురు. నగరివాసులెల్ల కొల్చుచుందురు ఎల్లవేళలన్.

ఈ కాశీపురంబున వెలసిన పుణ్యతీర్థంబులన్నియున్, కామధేనువు యొక్క వివిధ అంగంబులై పరిఢవిల్లె.

కాశీ పట్టణ మధ్యభాగంబె, ఈ కామధేను మధ్యభాగంబగు పొదుగు. ధర్మ-అర్థ-కామ-మోక్షస్థానము. వినష్టముగాని విశలింగంబె రోమంబులయ్యె. అందమైనవరుణ నదియే. ఈ కామధేను గంగడోలు శుశోభితంబయ్యె. "అసి" అనునదియే తోక. దండపాణియగు యముడు, భైరవులె-రెండు కొమ్ములై వెలసెనివి దుష్టసంహారమునకున్ ఉపయుక్తమయ్యె. లోలార్క్కకూడ, త్రిలోచనయనెడి స్థానంబులే దీని నేత్రంబులయ్యె. కర్ణ ఘంటయను స్థలంబె. గోవు మెడలోని గంట.

మణికర్ణికా నామంబుగల ప్రదేశంబె ఈ ధేనువు ముఖము, చంద్రునివలె వెలసెను. గంగాజల ప్రవాహంబె దీని శోభ. స్వార్థ స్త్రీ, పుత్ర కలత్రాది సుఖంబు, పరమార్థము (మోక్షము), ఇహపర సుఖంబుల పరిపూర్ణమైన, ఐదు కోసుల పరిక్రమయే యశంబు. దయగల విశ్వనాధుడే దీనిని పాలించువాడు. "నమఃశివాయ' ఐదు అక్షరములు పంచప్రాణంబులగు. (అపాన, ఉదాన, ప్రాణ వ్యాన, సమాన) ఆనందమై యెప్పె. "పంచనద" అనుపేరుగల తీర్థస్థానంబె పంచగవ్యములకు సమానంబగు (గోవుపేడ, గోవు మూత్రము, పాలు, పెరుగు, నెయ్యి) మనస్సును పవిత్రంబు చేయున్. "ర" కార, "మ" కార అక్షరంబులె (బ్రహ్మ-జీవుడు) సత్కర్మల - కుకర్మలనెడి మానవుల, కర్మల గ్రాసంబె భక్షించు, జీవులకు ముక్తినిచ్చు. పరమ పవిత్రమైన దుర్గంబు తొలగి ముక్తినొందుచున్నారు. కాశీలో నివశించునంతనే, శుభాశుభ కర్మల ప్రభావంబు నుండి ముక్తినొందెదరు.

భగవంతుడైన కేశవుండె ఈ నగరిన్ తన హస్తకళానైపుణ్యముచే సాక్షాత్ కళారూపమున రచించెన్ అని పురాణంబుల్ తెల్పుచున్నవి.

తులసీదాసు ఇటు చెప్పుచున్నాడు - మానవుడు సంపూర్ణ సుఖంబు కోరినచో కాశిలో నివసించి, రామనామ జపంబు చేయుము.

## "చిత్రకూట - స్తుతి"

1. ఈ చిత్రకూటము, సర్వులకున్ చింతలన్ తొలగించి, కలియుగ ఘాత ప్రభావము నుండి ముక్తి కల్గించు. చిత్రకూట పర్వతంబు చాటుననుండిన స్థలమంతయు చిత్రకూటమనెడు పచ్చని వృక్షంబునకు అందమైన చెట్లపాదు. నల్దిశల వ్యాపించిన విచిత్రవనంబె విశాలవాటికై యొప్పె. మందాకిని నది ఎల్లవేళలన్ ఆర్ద్రతన్ కల్గించుచుండు. ఈ చుట్టుప్రక్కల నివసించు దళిత జాతులే వీని రక్షక భిత్తియై యుండిరి. వన్యజాతుల వారెల్లరున్ దీని రక్షించుచుందురు. చిత్రకూట కొండగుట్టలే ఈ వృక్షపు శాఖలై యుండె. ఇక్కడ ప్రవహించు కొండ సెలయేల్లు ఈ వృక్షమకరందమై నొప్పెన్. శ్రీ గంధపు పవనంబు వీచు నదియే దీని కోమలత్వమయ్యె.

ఇక్కడ నివసించు ముని గణంబు ఈ వృక్షముపై నివసించు చిలుకలు, కోకిలలు, తుమ్మెదలు రమ్యామైయుండె. యోగ, తపస్సు, ఉపాసనయే నాల్గు అందమైన ఫలంబులు - ధర్మ, అర్థ, కామ, మోక్షములయ్యె. చిత్రకూటంబు నేలింప, నాల్గు ఫలంబుల్ లభించు. ఇక్కడి చల్లని పవనంబు, లోకతాపంబుల నుంచి విముక్తి కల్గించు శీతల ఛాయ కూడ తాపంబుల నుండి రక్షించు. జన్మ, మరణాది దుఃఖముల నుండి ముక్తి కల్గించునట్టిది. జానకీవల్లభుడు, ఈ వనమునకు దివాకరుండు. ఇచట శ్రీరాముడు వసించి శోభకల్గించె.

ఇక్కడ సాధకులకు భాగ్యవంతులైనందున రామునిన్ పొందెదరు. ఇక్కడ వసించు పథికుల కోర్కెలు తీరున్. మనోరథంబు (ఆకాంక్షలు) పూర్తియగున్. ఈ చిత్రకూట వృక్షమహిమ ఏమో సదా నీడ ఒకే మాదిరి యుండున్.

అవిద్యా జన్యమైన సత్వర, రజ-తమ త్రిగుణములు; శుభాశుభ ఫలంబులు, కాలప్రభావంబునుండి ముక్తులగుదురు. దీని సేవించిన వారెల్లరున్; గుణ, కాల, కర్మల నుండి ముక్తిన్ పొందుదురు. కృపాలుడైన శ్రీరాముడు, సీత-లక్ష్మణులు ఇచ్చటే నివసించిరి, రాముడు పాలించెన్.

తులసీదాసు స్వయముగా తనకు తాను ఇట్లు చెప్పుకొనెను. రాముని చరణంబుల కోరిన ప్రేమ నిర్విఘ్నమగుటకు ఈ పర్వతమున్ సేవింపుము. దీని సేవించి లేక ఇట నివసించి నియమపూర్వకంబున సేవించితిరేని మనోకోరికలన్నియున్ సఫలంబగున్.

(చిత్రకూటమును కల్పవృక్షంబుగా వర్ణించెను).

2. తులసీదాసు తన మనస్సును సంబోధించి ఇట్లు చెప్పుచున్నాడు - ఓ మనసా! నీవు చైతన్యమున్ పొంది చిత్రకూఐటమునకు పొమ్ము. కలియుగము క్రోధించి శుభకరమగు మార్గములన్నింటిన్ మూతవేసి - వైచె. జపము, తపము, దయ, జ్ఞానము, భక్తి మొదలగు మానవకళ్యాణ మార్గంబుల (ఉపాయములను)న్నియు కల్గి ప్రభావంబున, మూతపడియె. మోహ (అజ్ఞానము), మాయ (అవిద్య) పాపముల్ నిరంతరంబున్ వృద్ధిజెందుచున్నవి..తన విజయంబు చూచి కలిప్రసన్నుడయ్యె. మోహము, మాయ, పాపంబులు మిక్కిలి వృద్ధి పొందెన్.

శ్రీరాముని పాదములకంకితంబైన ఈ ఆశ్రమ భూమి, దీనిని చూచిన (రాముని విహార స్థలంబున్, పర్వతంబుల, వృక్షంబులన్ దర్శించి) జన్మ మరణాది భయంబుల్ తొలగు. కపటము, మోసము, దంభము (గర్వము) మొదలగు వాటి రాశిన్ సంహరించ. ఇక్కడనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సర్వకపటంబుల్, మోసముల్ వదిలి జన్మించియుండిరి. ఇక్కడ ప్రవేశించిన పాండవమధ్యముండగు అర్జునుడు, నలుడు సర్వదుఃఖములనుండి ముక్తిన్ పొందిరి.

ఓ నామనసా! ఇక నీవు ఆలస్యము చేయక, నీ అందమైన గత స్మృతిన్ ఎన్నో వత్సరంబులను, ఒక రెప్పపాటు కాలంబుగ భావింపుమా. ఇక ముందు రానున్న కాలమున్ విలువైనదిగా. భావించి, జాగ్రత్తగా, నుపయోగించుకొనుము. నీవు చిత్రకూటంబున ఆ మంత్రమును (రామమంత్రము) జపించి, తరించుము.

రామనామ యజ్ఞంబు చేయు, పవిత్రమై మందాకిని జలంబున స్నానంబు చేయుము. కోరికల్ సిద్ధించు రాముని పాదసేవ అనాయాసముగనే లభించును. సుఖ, సాధన, మహాఫలంబు లభించున్. ముక్తిన్ పొందుము.

చిత్రకూటంబున కామతానాథ పర్వతమున్నది. సర్వకోరికల్ తీర్చు చింతామణి, కల్పవృక్షంబువంటి - యుగయుగాలుగా ఈ ధరణిపై ప్రకాశించుచున్నవి.

ఓ తులసీదాసు! నీవు మాత్రము - విశ్వాసము, ప్రేమ, బలమును నాధారము చేసుకొని యుండుము. ఇటుల ఉన్న శ్రీరాముడు ప్రసన్నుడయి నీకు శుభము కల్గించు.

## "హనుమంతుని స్తుతి"

1. జయము అంజనీ గర్భ సముద్రంబునుండి జన్మించిన చంద్రుడివోయన శోభిల్లుచున్నావు. దేవతల్ అనెడి కల్వలకున్ ఆనందమున్ ఒసగువాడవు. నీవు నీ తండ్రి కేసరి నేత్రంబులన్ ప్రసన్నుని చేతువు. చకోరము చంద్రునిన్ దర్శించినట్లు.

నీవు ముల్లోకముల శోకతాపంబులన్ హరింతువు. బాలకపి! నీకు జయంబగుగాక నీవు బాల్యంబున ఉదయించు సూర్యునిన్ మ్రింగుటకు ఉద్యుక్తుడవైతివి. ఎంతో కుతూహలంబయిన కార్యమదియు. అప్పుడు నీవు ఇంద్రుని, రాహువు వజ్రాయుధంబు, గర్వంబు అణచివేసితివి. శరణాగతుల భయంబు హరించువాడవు. లోకరక్షక నీకు జయమగుగాక.

రణంబున ధైర్యమున్ కల్గించుటకు రాముని హితము కొరకు దేవమణి చింతామణివలె. రుద్ర (శివ) అవతారము పొంది, లోకరక్షక జయము, జయము. నీ కాయంబు బ్రాహ్మణ దేవతల, మునులనాశీర్వాదము నొందిన మూర్తి సుమము.

ఇంద్రుడు వజ్రాయుధంబున నిన్ను మోదగా, నీ తండ్రి పవనుడే కృద్ధుడయ్యె. అపుడు దేవతల్ నిన్ను ఆశీర్వదించిరి. నీవు నిర్మలంబైన సాత్విక బుద్ధి సముద్రుడవు. విధాతవు, సుగ్రీవునికిన్, సీతాన్వేషణ కర్తవ్య నిర్వహణ శిక్షనొసంగతివి. మిక్కిలి నేర్పుతో సుగ్రీవునిన్ రక్షించితీవు. అతి బలిష్టుడైన వాలిని వధించుటలో ముఖ్యపాత్రుడవు నీవు.

సముద్రమున్ లంఘించి, సింహిక గర్వంబు అణచి సింహ సమానుడగు రాక్షసరాజైన రావణుని నగరమును బుగ్గిచేసితివి జయము నీకు.

భువనమాత సీత చింతన్ తొలగించి, అశోకవాటికను చిందరవందర జేసితివి. రావణ పుత్రుడగు మేఘనాథుని బ్రహ్మాస్త్రమున పట్టు బడితివి. నిశ్శంకుడివి. నీతోక మహిమన్ అగ్నిజ్వాలల ప్రకోపింపజేసితివి.నీకు జయమగుగాక.

రామ - లక్ష్మణుల సేవ జేసి ఎలుగుబంట్లను, కోతులన్ సమన్వయ పరచి, సముద్రంబున వారధి నిర్మింపకారకుండైన, నీవు సూర్యవంశపు రామునికి విజయంబు కొరకు ఎంతయో సహాయపడితివి నీవు. వజ్ర సమానమైన దేహంబు, భయంకరమైన

వేసినట్లు వారిని పిండి చేసిన నీకు జయము.

రావణ, కుంభకర్ణ, మేఘనాథుల వధించ సహాయపడి, అసంభవమైన కార్యంబులను సంభవింపచేసితివి భూమి, పాతాల, జల, ఆకాశముల, సమముగా గమనంబు చేసెదవు నీవు. జయము నీకు నీ నరవేషంబు విఖ్యాతమయ్యె విశ్వమంతటన్. పండితులు, వేదంబులును నీ బిరుదములకు నిర్మలంబైన వాక్కులను గానంబు చేయుచుందురు.

నీవు నీదాసుడగు తులసీదాసుకు భయంబు తొలగించితివి. సీతతోపాటు రాముని వెంట అయోధ్యకెళ్లి సుశోభితుండవైతివి. ఇటువంటి హనుమంతా! నీకు జయము జయము.

2. ఓ వానర రాజ! సింహంబువలెనన్ పరాక్రమున్ కల్గి యున్నావు. దేవతలయందు శ్రేష్ఠుండవు. ఆనందమునకు, కళ్యాణములకున్ నిలయము. కపాలహారంబు ధరించిన రుద్రుడవు అయి చీకటి రాత్రి భయంకరమును కల్గించు అట్టి దానిని నాశనము చేయు భాస్కరతుల్యుడా! హనుమా! మోహ, మద, క్రోధ, కామంబులన్ తొలగించువాడవు. చకోరముల దుఃఖములన్ తొలగించు చంద్రమా! తేజోవంతుడా! నీకు జయము. కమలంబుల వికసించే సూర్యుండవు.

విశాలమైన, భయంకరమైన శరీరమున్ కల్గి, వజ్రంబువలె కఠోరమైన భుజముల గలవాడవు. వజ్ర సమమైన చేతిగోల్లు, అందమయిన దంతములు గల వాడవు. విశాలమైన పొడవగు తోకయున్, చేతియందు ఆయుధముల ధరించి హనుమంత నీకు జయము. జానకి శోకంబు, దుఃఖంబునన్ నివారించిన వాడవు నీవు. రామ-లక్ష్మణులకు ఆనందమున్ కల్గించితివి. క్రీడవలె అతి సులభంబుగ గలంకన్ ప్రవేశించి నిప్పుపెట్టిన విధము మిక్కిల్ ప్రశంసనీయమగున్. వానరుల చపల-చంచల స్వభావము గల్గినట్టి వానరుడవు. నీవు అయినను క్రీడవలె స్వల్పకాలములోనే లంకా దహనము చేసితీవు. అశోకవాటికన్ విధ్వంసంబుగావించితివి. ఓ తేజస్వీ హనుమా! మధ్యాహ్నపురవి బింబమువలె ప్రకాశించు చున్నావు. నీకు జయము. సముద్రంబున రాతి బండలన్ తేలాడునట్లు చేసితివి. ఓడల వలెనున్నవి ఆరాతిబండలు. రావణుడు, కుంభకరుండు. పాపదైత్యులన్ హతమార్చుటకు తోడ్పడితివి నీవు. మేఘనాథుని వధయందు మర్మస్థలంబులన్ ఛేదించితివి నీవు. వారి పాపకర్మంబుల ఫలంబు కల్గించితివి. హనుమా! నీకు జయము.

లోకమునకు ఒకే ఒక ఆ భూషణంబగు విభూషణునికిన్ వరమునిచ్చు రామునికి మిక్కిలి హితము కల్గించి యుద్ధమున, జయంబు కల్గించితివి నీవు. రాముని కీర్తి పతాకమువలె శోభిల్లుదువు నీవు. రాక్షసుల్ నుపయోగించు యంత్రమంత్రంబులన్ నీతి విరుద్ధమైన క్రియలన్ విఫలంబు చేసితివి. శాకినీ, డాకినీ, పూతన, ప్రేతంబులన్, బేతాల

భూతంబులను, ప్రథమాది శివగణసమూహములను నియంత్రించిన ఓ హనుమా! నీకు జయమగుగాక.

వేదాంత శాస్త్రంబుల జ్ఞానివి. విద్యలకు విశారదుండవు. వేద వేదాంగములయందు విద్వాంసుడవు. పరమాత్మ స్వరూపంబు ఎరిగిరిన వాడవు. జ్ఞాన, వైరాగ్యముల్ కల్గినవాడవు. వేదాంగములు శిక్ష, వ్యాకరణము కల్ప, నిరుక్తము, ఛంధస్సు, జ్యోతిష్ శాస్త్రంబులందు పారంగతుడవు. ఆత్మజ్ఞానివి. సత్‌పాత్రుడవు. ఓ వైభవ శాలివైన హనుమంతుడా! నీకు జయమగుకాక! శుక దేవనారదాది ఋషులు, నీ నిర్మలమైన గుణంబులనే సదాగానము చేయుచుందురు. కాలము, గుణములు (సత్, రజో, తమాది) శుభాశుభములు సంచిత, ప్రారబ్ధములను క్రియమాణు కర్మలను, మాయను నశింప చేయుదవు. సిద్ధులు, దేవతలు, యోగులు ఎల్లవేళలనిను సేవించుచుందురు. ఇటువంటి హనుమంతునికి తులసీదాసైన నేను నమస్కరించు చున్నాను. నీవు భవభయమగు అంధకారమున్ తొలగించ భాస్కరుడవు. నీవలననే తులసీదాసు నగు నేను, ఇహలోకములోని దుఃఖంబులన్ దూరంబు చేసి ముక్తి కల్గించితివి నీవు. నేను రాముని భజన నిర్భయంబుగ చేయుచున్నాను.

3. కళ్యాణనిధి! లోకభారంబు తొలగింప వానరాకారంబున శరీరము ధరించిన త్రిపురారి శివుని అవతారము నీవు. రాముని క్రోధాగ్ని జ్వాలలన్ ప్రవహింప, రాక్షస సమూహంబు భస్మంబు చేయు హనుమ! నీకు జయము. పవన అంజనీసుతుడవు. వారికి ఆనందమున్ కల్గించువాడవు. వాలి భయంబున సుగ్రీవునికున్ బంధువువలె దుఃఖమును తొలగించ సహకరించితివి. రాక్షసుల భయంకరమగు క్రోధమున్ వారినివి నాశనంబు చేసితివి. సిద్ధ, దేవతా, సత్ పురుషులకున్ ఆనందంబు కల్గించితివి. నీవు సముద్రునివలె అమితమైన, లోతైన ఆనందమున్ ఇచ్చెదవు. నీకు జయము. ఏకాదశ రుద్రులందు అగ్రణివి. లోకమునందు సర్వ విద్వాంసులయందు శ్రేష్ఠమైన వాడవు నీవు. విశ్వవిఖ్యాత వీర చక్రవర్తి, సామగానంబునందు సర్వశిరోమణి కాముని జయించుటలో అద్వితీయుడవు. సర్వశ్రేష్ఠ బ్రహ్మచారివి. రామునికి హితమున్ కల్గించువాడవు. రాముని భక్తుల వెనుక వెనుక నడచు హనుమ జయమునీకు!

సంగ్రామములయందు విజయముల్ పొందిన రాముని సందేశమున్, సీతకు అందించిన, అటులనే అయోధ్యకు శలముగ రామునికు చేర్పించినావు. సదా కళ్యాణ కారకుడవు. రాముని ఎడబాటున అసంతృప్త తప్తుడగు భరతునికి - అయోధ్య ప్రజలకున్ రాముని కుశల సమాచారంబు చేర్పించినావు. కల్ప వృక్షమువలె సర్వుల కోర్కెలన్ పూర్తి చేయు హనుమ! నీకు జయము. సింహాసన్నారూఢులై సీతారాములన్ చూచి ముదము పొందిన, హర్షంబునన్ ఉల్లాసవంతుడవైన, నాట్యంబు చేసిన హనుమ! నీకు జయము. రామునితోపాటు అయోధ్యకు విచ్చేసి వారితోపాటు శోభాయమానమై విరాజిల్లిన హనుమ! నీకు జయము జయము. అదే మాదిరి తులసీదాసునగు నా హృదయ మనెడి అయోధ్యలో సదా రామ సహితుండవై సదా విహరించుము.

(తులసీదాసుకు రామునిఎడవున్న ఆసక్తి భావంబును ప్రకటించుచున్నది).

4. ఓ వాయుపుత్రా! నీకు జయమగుగాక. నీ పరాక్రమము జగత్ ప్రసిద్ధము. నీ భుజదండము విశాలమైనది. అపరిమితమైన బలసంపన్నుడవు. పొడవైన పింఛము కలవాడవు. చాలా ప్రకాశవంతమైనది. ఉదయభానుని ముఖము. పసుపుపచ్చని నేత్రంబులు బూడిదరంగు గల కఠినమైన (ఘట) జటాజూటము గల వాడ. వంకర కనుబొమలు, వజ్రమునకు సమానమైన కఠిన, బలిష్టమైన దంతములు గలవాడు! గోళ్లు గలవాడవు. అహంకారములో నిమగ్నమైయున్న శత్రుగజములను, సంహరింపగల శక్తి సంపన్న హనుమ, నీకు జయము.

భీమార్జునుల, గరుడ గర్వభంగమునొనరించవాడవు. అర్జునిని రక్షకుడవై అతని పతాకముపైన కూర్చొని కాపాడువాడవు. భీష్మ, ద్రోణ, కర్ణ ఆదులనుండి రక్షింపబడిన దుర్యోధనుని సైన్యమున్ వినాశమగుటకు, మృత్యువు రూపమున - అర్జునిని ద్వారా వారి శత్రువుల సంహరించితివి.

పోగొట్టుకొన్న రాజ్యములను పునః ఇప్పించే పనిలో సుగ్రీవుడు, విభీషణాదులకు రాజ్యములను ఇప్పించుటలో సహకరించితివి. భవ (ఈలోక) బాధలను తొలగించువాడవు (అతివృష్టి, అనావృష్టి, మిడుతలదండు; ఎలుకల, చిలుకల, రాజుగారి ఆక్రమణ మొదలగు) పెద్ద పెద్ద భయములు, విభిన్న కుగ్రహములు, ప్రేతములు, చోర, అగ్ని రోగాది విఘ్నములను తొలగించువాడవు. భయంకరమైన మహమ్మారి (స్ఫోటకము) మొదలగు రోగములను నివారించు హనుమా! నీకు జయము. వేదములను, శాస్త్రములను, వ్యాకరణము మొ॥వాటిని సూర్యునినుండి నేర్చుకొన్నావు. వీటికి టీకా తాత్పర్యములను చెప్పగల వినాయక నీకు జయము. కావ్య ఔచిత్యము (అలంకారము, వైచిత్ర్యము, రసము) అనేక రకములగు కళలకు సముద్రుని వంటి వాడవు. భక్తుల మనో వాంఛలను సంపూర్ణముగా తీర్చగలవాడవు నీకు జయము. సముద్రమువలె విజ్ఞానముగల ధీశాలవి నీవు విద్వాంసుడవు. సామగానము చేయువాడవు. భక్తులకోరికలను నెరవేర్చువాడవు. శివుని అవతారము, ప్రేమ వాత్సల్యమూర్తి. రాముని బంధువు వలె హితము చేకూర్చినవాడవు. హనుమ నీకు జయము. సూర్యుడు ప్రచండమైన వేడితో దగ్ధమైన సంహతి అనుపేరుగల గ్రద్ధ (పక్షి)కు, రెక్కలు, నేత్రములు, దివ్య శరీరమును ప్రసాదించిన, కలియుగ పాపముల సంతాపములలో నిండి నిమగ్నమై ఓలలాడే ఈ తులసీదాసునగు నేను నీకు నమస్కరించుచున్నాను. నీవే నామాతాపితలు. ఇటువంటి హనుమా! నీకు జయము.

5. సంపూర్ణ అనంద సమూహుడవు. వానరులలోసింహమువంటి వాడవు. అమిత పరాక్రమవంతుడైన కేసరీపుత్రుడవు. లోకమున సాటిలేని స్వామినీవు. అంజనా రూపముననున్న దివ్యభూమి (ఉదర రూపము) అందమైన గనినుండి లభించిన వజ్రము. భక్తుల బాధలను తొలగించువాడవు. ధర్మార్థ, కామ, మోక్షములను కల్గించుటలో సమర్థుడవు. బ్రహ్మలోకాది వైభవముల ఎడ విరక్తిగలవాడవు. మనసా, వాచా, కర్మణా, సత్యధర్మములయందు అరూఢులై, సీతాపతి రాముని చరణములయందు అనురాగముగల హనుమా నీకు జయము.

గరుడ బలమును, వేగము తీవ్రతను బుద్ధిని అంటిన గర్వమడంగించిన వాడవు హనుమ నీకు జయము నీకు కామదేవుని (మన్మధుని) దమనము చేయగల అఖండ బ్రహ్మచారివి. గొప్ప గ్రంథములన్ రచించిన పరమ నిపుణుండవు. కోట్లాది కవుల శిరోమణివి నీవు. సర్వశ్రేష్ఠకవివి నీకు జయము. వీర శిరోమణివి. మహాగర్వియగు రావణుడు జీవించి యుండగనే మండోదరి కేశంబులపట్టి నీడ్చిన వాడవు సీత దుఃఖమున నుత్పన్నమైన, యమరాజునకు సమమగు ప్రాణాంతకమై క్రోధమును కల్గి, రాక్షసులకు భయంకరమైన యాతనలు కల్గించు వాడవు.

రామాయణ కథను వినిన వెంటనే నీ శరీరము పులకాయ మానుడగుదువు. నేత్రముల్ ఆనంద భాష్పములచే నిండిపోవు నీకు జయము. రాముని కమల చరణముల మకరందమును భ్రమరంబు వోలె గ్రోలు చుండెదవు. త్రిశూలధారియగు శివుని అవతారము నీవు. హనుమ, తులసీదాసునగు నేను నీ శరణుజొచ్చితిని నన్ను రక్షించు నీకు జయము.

6. హనుమంతుని ఆశ్రయము లభించిన వారికి అనగా సదా హనుమంతుని కృపగల వారి ప్రతిజ్ఞలన్నియున్ పూర్ణమగు. ఈ మాట వజ్రమువలెను శిలాశాసనమయి యుండును. అసంభవములను సంభవింపచేయును. సుగ్రీవ విభీషణుల కలయిక అసంభమైనను సంభవింప చేసెను. రావణుని, వాలి రాజ్యంబులన్ వినష్టంబు చేసెను. ఇటువంటి కార్యములన్ సాధించిన కీర్తి ఈ లోకమున నెవరికిని లేదు. ఇటువంటి హనుమను స్మరించిన వెంటనే సర్వ కష్టములనుండి విముక్తి పొందుదురు. ఎందుకనగా ఆయన మూర్తియు ఆనందములకు సాగరము. హనుమంతుని స్మరించిన శివపార్వతులను, సీతారాములు లక్ష్మణుల కృపగల్గి యుందుము. తులసీదాసునగు నేను ఇట్లు చెప్పుచున్నాను. ఇటువంటి ఈ హనుమంతుని కృపాదృష్టి సంపూర్ణమై కళ్యాణములకు గని వంటిది. హనుమంతుని కృపాదృష్టితో భక్తులకు సంపూర్ణమగు కళ్యాణము చేకూరును.

7. ఎవరికైతే వానర కేసరీపుత్ర హనుమంతుని ఆధారమున్నదో అన్ని విధాలా హనుమంతుని నమ్మిన వారికి, వారి ప్రక్కకు ఎవరైన క్రోధముగా చూచుటకు సాహసించగలరా? తన భక్తులను ప్రసన్నముగా చేయుటకు, శత్రువుల వినాశకుడు. దౌష్ట్యములన్ పరిమార్చువాడు. హనుమంతునివలె మరొకడు వేరొకడు, బలవంతుడెవరున్నారు? అన్ని పురాణములయందు హనుమంతుని మహిమ వర్ణింపబడినది. అందున ఈయనకు సరిసమానమైన యోధుడు మరొకడు ఎవడున్నాడు? సుగ్రీవాదులను రాజ్యమునుండి వెడలగొట్టగా మరలా రాజ్యమున్ ఇప్పించిన ధీరుడవు. వాలి, రావణులవంటి సింహాసనాశీనులైన రాజులను, తొలగించి వినాశనము కావించి కారాగారములో బందీలైన దేవతలకు ముక్తి కల్గించినవాడు మరొకడు ఎవడున్నాడు? సముద్రమును లఘించి, లంకను జ్వలింప చేసిన వాడు. రాక్షసులవంటి బలశాలులను సర్వనాశనము చేసినవాడు మరొకడు లేడు వున్నాడా?

అతని బాలక్రీడలను స్మరించినచో ఉదయపు వేల సూర్యుడు, ఇప్పటికి తన ఎదలో

భయకంపితుడైనాడు. ఇంద్రునివల్ల తనకు చిబుకము వంకరైనందున వజ్రాయుధము ముక్క పోయినది (వంకర పోయెను) దాని పదును మొద్దు పోయినది యుద్ధములలో హనుమంతుని స్మరించినవారు, సేవకులైనవారు నిర్భయులై యుందురు. మంగళమగును. చకోరము ఎటులయితే పూర్ణచంద్రుని - తదేకదృష్టితో చూచినట్లు అదేమాదిరి షోడశ కళలపరిపూర్ణుడై రామచంద్రుని - కంటి రెప్పవాల్చక తదేకదృష్టితో చూచుచుండ హనుమంతుడు భక్తులకు కల్పవృక్షము అనగా భక్తులకోరికలన్నింటిని పరిపూర్తి చేయగలడు. తులసీదాసు నయిన నేను ఇట్లు చెప్పుచున్నాను. ధర్మ, అర్థ, కామ, మోక్షాది నాల్గు ఫలంబులు అరచేతిలో వుంచిన వస్తువువలె అనాయాసముగా (శ్రమలేకయే) లభించును.

8. ఓ హఠ స్వభావముగల హనుమా! నీవు భక్తుల మాట వినక యుండునట్టి తెలివి వుండకూడదు. నీవు నీ భక్తులమాట వినకున్నావు. చివరకు నా కష్టములు తొలగించునట్టి నిర్ణయము ఎందుకు తీసుకొన్నావు? రాముని భక్తులకు సహాయము చేయువారు ఇంకెవరున్నారు. అయిన పరిస్థితి ఏమనగా నీవు చూస్తూ చూస్తూ వుండగానే సింహశావకములను మండూకములు మ్రింగుచున్నవి. అనగా నీవు సింహమువలె బలవంతుడవు. బాలుడు తన తండ్రిపైన ఆధారపడియున్నాడు. అయిన మండూకమువలె, కాశియందు వున్న పండితులు (కలియుగ) వ్రణము రాజులు నన్ను తినుచున్నారు. ఈ పరిస్థితిని చూచినచో నాకు కల్గు అభిప్రాయము - కలియుగము, నీ గుణములను, మనస్సును కంటకము లేకుమేకుగా మార్చినదేమో? భక్తుల రక్ష చేయు నీ మనస్సును, దయను, ఉదారత్వమును, శక్తి ఆదిగుణములను నష్టము చేసెను.

ఒకానొక దినము, నీ గర్జన విని రావణుని అంగ - అంగములు భయ కంపితుడగుచున్నాడు. భయంబున అతని పొట్టలోనీరు అయినిండి వుండెను. నీ బలము సన్నగిల్లినది. గర్వము పెంపొందినది. తనరాముని సేవకుని ఆర్తనాదము విని కూడ సహాయార్థము రావటములేదు. నీ సేవకుల మర్యాద పోవుచున్నది. నా రహస్యము బయలు అగుచున్నది. రాముడు, హనుమంతుడు వుండగా వారి భక్తులకు (సేవకులకు) ఇన్ని కష్టములు అనుభవించవలసి వచ్చెనా? రాముని భక్తులు నిజమైన సిద్ధులు కాకుండా, కపటములు గలవారు అగుచున్నారు. నీవు బలవంతుడవు. వచ్చినన్ను రక్షించుము. నా గౌరవము కాపాడుము. నా సేవకు కళంకము రానివ్వకుము. నీ స్వభావము గానీ సేవకుల ఆర్తనాదము విని, సరియైన పద్ధతిలో అర్థము చేసుకొనుచుంటివి. వెంటనే వారిని రక్షించుచుంటివి.

తులసీదాసు యొక్క కష్టగాథనువిని, నీవే నన్ను రక్షించుటకు యశస్సును కల్గి రక్షించుచుంటివి. రామభక్తులకు మూడు కాలములలో శుభము కల్గును. నేను రామ భక్తుడును, నా ఉద్ధరణ జరుగును. నన్నున్న ఉద్ధరించినచో, ఆ కీర్తి నీకు దక్కదు.

9. సమర్థుడవైన పవనపుత్రా! రఘువీరుడగు రామునికి ప్రియమైన హనుమా! ఈ కష్ట సమయమున, నాఎడ జరుగు అత్యాచారములు, సోదరా, అన్నీ మనసారా వినుము. నీ

మహిమ చేత చింతపిక్కలు కూడ నాణెములవలె చెలామణి అగును. మొల్లకములలో న
కార్యముల ద్వారా, రావణాదులను వధించి ఆనందమనెడి ప్రకాశమును వెదజల్లబడునట్లు చేసిన హనుమా! నావంతు వచ్చునప్పటికి ఇంత అంధకారమును కల్గించితివి ఎందుకు? అనగా కలినన్ను ఎంతో పీడించుచున్నది. దానినుండి నన్ను రక్షింపకనున్నారు. నా యొక్క ఏ కార్యముననో నన్ను భక్తునిగా స్వీకరించితివి. కాని ఎందుకోనన్ను తిరస్కరించితివి. నేను ఏమి పాపము చేసితిని? నేను నీ పాదముల యందే నన్ను సమర్పించుకొంటున్నాను. నీ బలాధారముననే నేను ఈ లోకమున ఇంత ప్రఖ్యాతిని పొందితిని. నీవు నన్ను త్యజించినట్లుగా నేను నిన్ను త్యజించినచో నేను నిన్ను ప్రీతిగా ఎందుకు చూడాలి? నీనుండి నేను విముఖున్ని కాలేదు. అట్లయినా నాముఖము నీకు ఎట్లు చూపగలను? దుర్భాషలు పలుకనవసరము లేదు కదా? భావమేమనగా ఇప్పటికి నీపైన పూర్తి విశ్వాసము వున్నది. నేను నిన్ను నా వానినిగా భావించుచున్నాను. ఇందువలననే నేను ఇటువంటి కఠినమైన మాటలను చెప్పుచున్నాను.

ఈ లోకమున నీయంతటి సర్వజ్ఞుడు జ్ఞాన భాండారము మరొకరు ఎవరు వున్నారు? స్వామి ఎడ ద్రోహము చేసిన విష్టానరకమున పడుదురని, నాకు తెలియును. ఇందువలన నేను స్వామి ద్రోహము చేయను. నీ స్వామి రాముడు. స్వామిని సీత. ఆయన ఆస్థానమున ఈ తులసీదాసుకు నీవు తప్పమరెవరు వున్నారు. నీకు సహాయము చేయు దృష్టి గలవారు ఎవరును లేరు. భావమేమనగా నాకు ఒకే ఒక సహాయ కారివి నీవు మాత్రమే. సీతారాములకు నా విషయము సిఫారసు చేయగలవాడవు నీవే. (ఈ గేయమునందు తులసీదాసు యొక్క ప్రాణాంతకమైన ఆపద యందు కష్టములచే పీడితుడై హనుమంతుని ఎడ ప్రగాఢమైన, అగాధమైన నిశ్చలమైన భక్తి చూడ దగినది. దాస్య భక్తితోపాటు సఖాభక్తి కూడ వున్నది).

10. ఈ పదమున తులసీదాసు యొక్క ఆర్తనాదము విని హనుమంతుడు తులసీదాసు దుఃఖంబు నివారించి యుండును. తులసీదాసు తన వెనుకటి నిందా వాక్యములు పల్కినందుకు హనుమంతుని క్షమాపణకోరి యుండవచ్చును.

మిక్కిలి దుఃఖమున, మిక్కిలి స్వార్థమున చాలా దరిద్రమున, దుఃఖపడు మానవుడు. ఆ విషయమున చెడుగా భావించకూడదు. ఎందుకనగా ఇటువంటి వారు తెలుసుకొని ఆలోచించి మాట్లాడరు. కారణమేమనగా వారి బుద్ధి స్థిమితముగా నుండదు. మనస్సున నచ్చిన విధంబుగ చేయుచుందురు. లోకమున అతివృష్టి, అనావృష్టివలన బాధపడి భగవంతుని నిందించుచుందురు. ఇది స్త్రీ, పురుష స్వభావము అయినా భగవంతుడు వారి నిందలను చెడుగా భావించడు. ఎందుకనగా బాధలు పడుచున్నపుడు, వ్యక్తి బుద్ధి భ్రష్టమగుచు నుండును. నేను ఇంత చేదైన మాటలు అనుటకు వీలులేదు. కాని, కలి అత్యాచారములవలన నేను భయంకర రూపమునకు, బాధపడి భయకంపితుడనైతిని. అనగా నేను హనుమంతుడవైన నిన్ను ఎన్నో అనరాని మాటలను అంటిని. అప్పుడు కష్టము, భయము చేత నా బుద్ధి భ్రష్టమై యుండెను. నీవు క్షమాశీలుడవు. ఇందువలన నీవు నా ఈ గుణమును చూచి, నా దౌష్ట్యమును క్షమించుము.

ఆపదలు సంభవించినప్పుడు సమర్థుడైన, హితమును కల్గించువారే జ్ఞాపకమునకు వచ్చెదరు. వారినే సహాయము చేయమని ప్రార్థించుటయు జరుగుతుంది. సమర్థుడైన, హితము కల్గించువారు తన భక్తుల అపరాధములను విస్మరించి, ఆ ఆపదల నుండి ఉద్ధరించెదరు. సేవకుని చెడిన విషయమును స్వామియే చక్కదిద్దును. ఇది ఎల్లప్పుడు జరుగుచుండును. తులసీదాసునగు నాపైన నీకు సాటిలేని కృపయున్నది. దానిని పొందినందున నాకు ఏ విషయము బాధించుట లేదు. నీవు నా స్వామివి. నేను నీ దాసుడను. కష్టములు కల్గినప్పుడు ఆ ఆపదలను నివారించమని నీతోకాక మరి ఎవరితో చెప్పుకొందును? నీ కృపనాపైన ఎల్లవేళలా మేటియై యున్నది.

11. ఆపదల్ కల్గినప్పుడు, కఠినమైన (చేదుగల) మాటలు అనుచూ వుందురు. అయిన సరియైన మంచిస్వామి, ఆ విషమ పరిస్థితి తెలుసుకొని, (విని) అతనిని చెడుసేవకునికి కూడ తనమంచి తనముతో చేయు అలవాటుతో మంచినే చేయుచుండును. సమర్థుడైన, వీరుడైన, మంచిస్వామి (యజమాని) లభించినచో, సేవకుని కష్టములన్నియున్ తొలగిపోవు మంచి స్వామి (యజమాని) లభించినచో, సేవకుని కష్టములన్నియున్ తొలగిపోవు మంచి యజమాని పరాయపీడను కూడ తన పీడ (దుఃఖము)గా భావించి దానిని తొలగించును. నదులు సముద్రము దిక్కుకు పరుగిడి పోయినట్లు సేవకులు ఆహ్వానము లేకపోయినను, స్వామి దగ్గరకు పరుగిడి పరుగిడిపోవు చుందురు. స్త్రీ పురుషులందరు తమ మేలుకోరి మంచి, చెడు సంబంధము ఇష్టపడి దానినే అర్జించుచుందురు. వారి యొక్క అర్చనా సంబంధమును బట్టి, ఉపాస్యుని యొక్క మంచి చెడును గురించి ఆధారపడి వుండును. ఒకవేళ ఎవరైనా నీవు హనుమంతుని ఉపాసన ఎందుకు చేయుచున్నావు? అని అడిగినచో ఇందులోనే, నేను నా మేలు కోరుకొనుచున్నాను. తలంచుచున్నాను. నాకు ఇతరులతో సంబంధము లేదు.

ఒకవేళ నేను నీ సేవకునిగా వుండుటకు యోగ్యుని కాని పక్షమున, అయిన నీవు నన్ను హఠముతో నీ భుజబలము యొక్క ఆధారమును కల్పించి, నీ శరణములో స్థానమిచ్చితివి. అటువంటి సమయమున నేను, నీసేవ చేయవచ్చు, చేయకపోవచ్చును. నన్ను నీకు నీ సేవకునివలె పోషించు బాధ్యతవున్నది. నేను నీ సేవకుడనయినాను. పొరపాట్లు చపలత్వమునా సహజమైనవి. నేను నా అస్థిరమైన (చంచలమైన) కడు పొరపాట్లు, తప్పులు చేయుచుందును. అయినా నీవు గొప్పవాడవు. నాయటువంటి దుష్టులను కూడ క్షమించి. వారిని రక్షించు భారము పూనుచున్నావు. నేను నిన్ను ఎన్నో కఠిన కర్మలకూడిన వచనములతో బాధించితిని. నీచవ్యక్తికి ఎక్కువ మర్యాద ఇచ్చిన అతడు దుష్టుడగును. మిక్కిలి దుష్టులు అగుచున్నారు. ఒకవేళ నిర్భయముగా మిక్కిలి చెడుపనులు చేయుటకు దిగజారును.

వేదశాస్త్రములందు, నీవు కారాగృహములనున్న వారిని కూడ విముక్తుల చేసెదవని వర్ణించబడినది. నీవు దేవతలను కారాగారము నుండి విముక్తము గావించితిని. నన్ను

(తులసీదాసుడను) అక్బరు కారాగారము నుండి విముక్తి కల్గించితివి. నీద్వారా నా మేలు అయినది. నీకు యశస్సు లభించును.

12. మారుతినందన! నీవు మంగళమూర్తివి. సర్వ అనిష్టలను తొలగించు వాడవు. పవన తనయుడవు నీవు. సజ్జనులన్ భక్తుల హితము చేయువాడవు నీవు. నీ హృదయంబు సదారాముండు నివారించు చుండు. మాతాపితలు, గురువులు, గణపతి, శారదయు, పార్వతి సహితుండైన శంభు, శుక, నారదులు మొదలగువారి పాదంబుల నమస్కరించి వారితో ఈ విధముగా ప్రార్థన చేయుచున్నాడు. రాముని చరణములయందే సదా నాకు సేవానురక్తులు వుండునట్లు వరమున్ ప్రసాదింపుము. నేను, రామ, లక్ష్మణ, సీత - మువ్వురికిన్ నమస్కరించుచున్నాడను. తులసీదాసుకు స్నేహితుడు లేక సర్వాధికమైన ప్రియుడు.

(హనుమంతుని స్తుతి అనంతరము రామలక్ష్మణాది స్తుతి సంకేతమును తెలియచేయుచున్నది.)

## లక్ష్మణుని - స్తుతి

1. ఓ ప్రియమైన లక్ష్మణా! నీవు భక్తుల హితమున్ కోరువాడవు. భక్తులు నిన్ను స్మరించిన వెంటనే వారి కష్టముల్ తొలగించువాడవు. అన్ని విధముల శుభములన్ చేకూర్చువాడవు. నీ ప్రతిజ్ఞను పాటించువాడవు; దయామూర్తివి నీవు. ఈ పృధ్వినే మోయునట్టి లోకములోని బాధలన్ హరించువాడవు. సాహసివి. వేయి పడగలు శేష నాగము యొక్క అవతారము నీవు. నీవు ఎల్లవేళల సత్యారూఢవై ప్రతిన చేయువాడవు. సత్యవ్రతమును ధరించిన వాడవు. ధర్మమును మిక్కిలి ఎక్కువగా ప్రేమించువాడవు. కర్మ వాక్కులయందు సదా నిర్మలుడవైయుందువు.

నీవు రూపమున మిక్కిలి ఎక్కువ అందమైన రూపవంతుడవు. హస్తధనుర్బాణములు, నడుమున అంబుల పొది కలిగి మహావీరునివలె విశ్వవిఖ్యాతుడవు. గొప్ప గొప్ప యుద్ధములయందు విజయుడవు నీవు. నీవు నీ సేవకుల, భక్తులకు సుఖములను ఇచ్చుచూ అన్ని విధముల యోగ్యుడవు. రాముని గుణముల గానము చేయుచుందువు. నీవు భరతునికి ప్రియమైన వాడవు; తల్లి సుమిత్రకు, వదిన అగు సీతకు ప్రియాతి ప్రియుడవు. అటులనే ఘనశ్యాముడగు రామునికి సాటిలేని ప్రియుడవు. నీవు ఊర్మిళకు భర్తవు. స్నేహవశుడయి సహజముగ అందరికి లభించువాడవు.

తులసీదాసునగు నాయటువంటి పేదవానికి, "రామభక్తి" అనెడి ధనమును ఇచ్చు ధనవంతుడయిన దానపరుడవు.

2. అనంతమైన ఐశ్వర్యములకు యజమానివి. పృధ్విని మోయునట్టి సర్పరాజగు శేష సర్పము యొక్క అవతారము నీవు. ఈ లోకమునకు యజమానివి. లోకభారమును అనగా

దుఃఖములను తొలగించువాడవు. దుష్టులను జూచినచో ప్రళయకాలపు అగ్నివయి, భయంకరమైన జ్వాలలను సృష్టించువాడవు. ప్రళయకాలమున శేషుండు తన సహస్ర ఫణములనుండి విషంబు చిమ్ము - లక్ష్మణుడు శేష సర్పము యొక్క అవతారమే. సర్వతాపంబులను శమింపజేయుదువు. విభిన్నమైన లీలను చేయుటకు అవతారమును ధరించిన ఓ లక్ష్మణా! నీకు జయమగుగాక. దశరథ రాజకుమారుడవు. యుద్ధమున పరిపూర్ణమైన సమర్థుడవు. సుమిత్రనందనుడవు. శత్రుఘ్న, రామ, భరతులకు బంధువు (సోదరుడవు) అందమైన సంపంగి వర్ణముగలవాడవు. అత్యంతమైన దివ్యమైన అభూషణములు ధరించిన భవ్యరూపుడవు. సౌందర్యమున సముద్రుడవు. ఓ లక్ష్మణా నీకు జయము.

తాటకి, సబాహుల వంటి రాక్షసులను వధించి, విశ్వామిత్రునికి; రాముని ద్వారా అహల్యకు ముక్తి కల్గించి గౌతమ ఋషికి, సీతాస్వయంవరమున వీరత్వము కూడిన వచనములు పల్కి, జనక మహారాజుకు ఆనందము కల్గించితివి. లోకమునకు కష్టములు కల్గించు కంటకులవంటి రాక్షసులను సంహరించిన వాడవు. పలు రకములగు చాతుర్యమైన మాటల ద్వారా పరశురాముని గర్వమును అణచి సద్భావపరుడవై సదారాముని వెనుక సంచరించు వాడవు. రాముని ఆజ్ఞను పాటించువాడవు. లక్ష్మణా నీకు జయము. సీతాపతిరాముని మనస్సు కిష్టమైన సేవయందు సదా నిమగ్నమై యుందువు. ప్రాపంచిక భోగములు సుఖముల ఎడ విరక్తిగల వాడవు (లక్ష్మణుడు పదునాల్గు సంవత్సరాలు అఖండమైన బ్రహ్మ చర్యమును పాటించినవాడు. రాత్రికి మేల్కొన్నవాడు).

నిష్కటంకమైన అనగా కామనాది కోరికలనుండి ముక్తుడయి మహాబలిష్టుడు. సింహమువలె పరాక్రమము కలవాడు. మేఘనాథుని సంహరించినవాడవు. గొప్ప యోధుడవగు లక్ష్మణా నీకు జయము అగుగాక.

ర రూపమగు భయంకరమైన సముద్రమును దాటి అనగా భయంకరమైన, భయంకరమగు రణమున సంపూర్ణమగు విజయమును పొందు రామునికి హితముచేయు, నీ అందమయిన భుజముల వంతెనను చేసి, ఊర్మిళపతి! కళ్యాణమయి మంగళము చేకూర్చు స్థానము నీవు. తులసీదాసు దోషములను భస్మము చేయునట్టి దావానలము (అగ్ని) వంటి సమానమగు ముఖ్యమయిన ఓ లక్ష్మణా! నీకు జయము.

## భరతుని స్తుతి

1. పృథీపుత్రి సీతతో రమించు రాముని చరణకమలముల మకరందరసమును కోరునట్టి భ్రమర సమానుడగు ఓ మహాభాగ్యశాలివి అగు భరతా! నీకు జయమగుగాక. నీవు ఈ లోకమునకు అ భూషణము; అనగా సర్వశ్రేష్టమైన సూర్యవంశము యొక్క భూషణము నీవు. రాజులయందు శిరోమణివి. రామచంద్రుని ప్రేమించువాడవు. దేవతలకు రాజైన ఇంద్రుడు కుబేరాదులకు దుర్లభమైన విశాల రాజ్యము, సామ్రాజ్యము నుండి లభించు

సుఖమును త్యజించి విరక్తుడవైన భరతా! (రాజ్యసుఖమును త్యాగము చేసి సన్యాసివయి పదునాల్గు వత్సరములు రాజ్య పరిపాలన చేసితివి కత్తి పదును వంటి వ్రతధారణ కల్గిన, కఠినమైన నియమంబులతో వ్రతముతో పాలించిన రాజులలో స్థిరమగు పరిపాలన చేసినవాడవు. శుద్ధమతి రూపమనెడి యువతి తన ప్రేమికుడగు రాముని ప్రేమయందు సదారతమై, ఆర్ద్రమై నిమగ్నమైయుండును భరతుడు. నిర్మలమైన బుద్ధితో సదారాముని సేవ చేయుచుండును. ఓ భరతా! నీకు జయమగుగాక. నిష్కటంకమైన, నిష్కామమైన భక్తిభావముతో, తన హృదయమును నియంత్రణము (సంయమము) చేసి, తన అన్న రాముని హితము కొరకు వారిని వాపసు పిలుచుకొని వెళ్ళుట కాలినడకన చిత్రకూట పర్వతము వద్దకు వెళ్ళెను. నీవు రాముని పాదుకలను రాజసింహాసనమున ఉంచి, వాటినే రాజుగా భావించి స్వయముగా మంత్రి అయి పృధ్విని పాలించితివి. పరమ ధర్మముగా వీరయోధుడివయి ఇటువంటి ఓ భరతా! నీకు జయము.

సంజీవని వనమూలిక తెచ్చునప్పుడు హనుమంతునికి ఆపద వచ్చినప్పుడు భరత బాణము చేత పెద్ద తడి నేలమీదపడి మూర్ఛపోయి ఉండెను. అప్పుడు హనుమంతుడు భరతుని ధనుర్బాణముల మహిమ గానము చేసెను. హనుమంతుని వంటి యోధుడు ఒక బలములేని బాణము చేతగాయపరచి మూర్ఛకలిగించిన భరతుడు ఒక అసాధారణమైన యోధుడు. అతని భుజబలము గొప్పది. అపరిమితము గొప్ప పరాక్రమవంతుడు. అతనిని గూఢమైన శక్తిసాధారణమైన వ్యక్తులకు అర్థముకాదు. అతని క్రియలువాస్తవమైన పరిస్థితి సీతాపతియగు రామునికి తెలియును. ఓ భరతా! నీకు జయమగు గాక. రణక్షేత్రమున గంధర్వులగర్వమును చూర్ణము చేసినవాడవు; వారి చేత రాముని గుణగానములు చేయించిన వాడు భరతుడు. మాండవి చిత్తమనెడి చాతక పక్షికి, నవీన మేఘము వలె వర్ణము గల (భరతుని భార్యమాండవి భరతుని చూచి ప్రసన్నురాలగుచుండును) వాడు భరతుడు, శరణుజొచ్చిన వారిని అభయమునిచ్చు ఓ భరతా! నీకు జయము అగుగాక.

తులసీదాసునగు నేను దాసుడనయి నీ శరణు జొచ్చితిని.

## "శత్రుఘ్నుని స్తుతి"

1. ఓ శత్రుఘ్న! నీవు శత్రువులనెడి ఏనుగులకు సింహము వంటివాడవు. నీకు జయమగు గాక. శత్రువులనెడి అంధకారము, మంచును, వినాశనము చేయునట్టి శౌర్య ప్రకాశ కిరణములు గల సూర్యునివంటి వాడవు అని భూదేవతలు (బ్రాహ్మణులు) పృధ్వి, గోవులు, భక్తులు, జ్ఞానులు, సిద్ధులు, మునులు మొదలగు వారికి కళ్యాణకారుడవు. సర్వాంగ సుందరుడవగు సుమిత్రపుత్రా! విశ్వవిఖ్యాతి చెందిన భరతుని ఆజ్ఞను పాటించు కవచధారి, డాలు, ఖడ్గము, ధనుర్బాణములు, అంబులపొది, ధరించిన ఓ శత్రుఘ్న! నీకు జయము. (సంకటములను తొలగించువాడవు) శత్రువులను దమనము చేసి, శత్రువులతోనే ప్రణామములు పొందినవాడవు. నీవు వారి శత్రువుల ఆపదలనుండి రక్షించువాడవు.

లవణాసుర రూపమున నున్న సముద్రమును (అగస్త్య ఋషివలె) వధించినవాడవు. గొప్ప గొప్ప భయంకరమైన దైత్యులను, దుష్టులను, పాపులను వినాశనము చేయు లక్ష్మణుని చిన్న సోదరుడవు. భరత, రామ్, సీతా చరణముల ధూళిని నీలలాటమున తిలకమువలె ధరించిన శత్రుఘ్ను నీకు జయమగుగాక. శృతికీర్తిపతివి నీవు. రాముని ఎడ విముఖులుగా నున్నవారికి లభించుట దుర్లభము, రాముని భక్తులకు సులభంగా లభించగలవు. ప్రణమిల్లువారికి సుఖమును; భక్తులకు భక్తి-ముక్తులను ఇచ్చు శత్రుఘ్నా! నీకు జయమగుగాక. ఓ ప్రభూ! తులసీదాసునగు నేను నీ శరణుజొచ్చి కూడ దుఃఖములను పొందుచున్నాను. ఓ దీనుల దుఃఖుల దుఃఖములను తొలగించు సంతాపమును పోగొట్టు శతృఘ్నా! నీవు తులసీదాసును రక్షింపుము.

(లవణాసురుడు మధురకు రాజుగా ఉండి, గొప్ప అత్యాచారిగానుండెను. రాముని ఆజ్ఞతో శత్రుఘ్నుడు అతనిని వధించెను).

## "శ్రీ సీతా స్తుతి"

1. ఓ మాతా! నీకు అవకాశము లభించినప్పుడు అనగా రాముని మనస్సు బాగుగా ఉన్నప్పుడు వారికి నన్ను జ్ఞాపకము చేయుము. (కాని అకస్మాత్తుగా తొందరపడి చేయవద్దు) నన్ను జ్ఞాపకము చేయుటకు ముందు ఏదేని కరుణా ప్రసంగమును చేసి తదుపరి చెప్పుము. ఓ ప్రభు! ఒక దీనుడు, సాధనము లేవియు లేనివాడు, దుర్బలమైన శరీరముగల వాడు (తులసీదాసు). మీ పేరు పేర్కొని పొట్టనింపుకొనుచున్నాడు, అనగా రామనామస్మరణతో భిక్షము అడుగుకొని, తన పొట్టనింపుకొనుచున్నాడుః ఇదివిని ప్రభువు అడిగినచో "అతడు ఎవరు?" నా పేరు చెప్పి, నా దశను, పరిస్థితిని గురించి పరిచయము జేయుము. కృపగల రాముని వలన వినిన వెంటనే నా చెడిపోయిన కార్యము సఫలమగును. ఏలయన దయతో నా కష్టములన్నియు తొలగించును రాముడు. ఓ జగన్మాతా! జానకీ! ఒకవేళ నీవు నీ మాటల ద్వారా నా ఈ సేవకునిని సహాయము చేసితివి. తులసీదాసునగు నేను నీయజమాని (భర్త) గుణములను గానము చేయుచూ భవ సంసార సాగరమును దాటిపోగలడు.

2. మాతా జానకీ! ఎప్పుడైనా సమయమును పురమాయించుకొని, స్వామికి, నా జ్ఞాపకము కల్గించుము. నేను ఆయన (రాముని) దాసుడనని పిలువబడుచున్నాడను. సదావారి పేరు స్మరించుచుండును. నేను చాతకపక్షివలె ప్రతిన చేసితిని. నేను వారి ప్రేమరసమును గ్రోలుటకు, దాహముతో బాధపడుచున్నాను. అనగా చాతక పక్షివలె పానము చేసెదను. వారి ప్రేమను గ్రోలెదను. లేనిచో విలపించి విలపించి ప్రాణములను విడి చెదను. కరుణానిధి అయిన (రాముని) స్వామి మనోప్రకృతి నీకు బాగుగా తెలియును. ఆయన సరలుడు (వారు నాపైన తప్పక కృప చూపెట్టును). ఆయనకు తన గుణములు. శత్రువుల ద్వారా జరిగిన చెడుపు తనదాసుని దోషములు, ఇతరులకు ఇచ్చిన దానములు ఎప్పుడును జ్ఞాపకముండవు. ఏదేని వ్యక్తికి ఎప్పుడైనా సన్మానము జరుగనప్పుడు అతనికి కూడా స్వామి

సన్మానము కల్గించును. పెద్ద పెద్ద పాపాత్ములను కూడా తన భక్తులుగా స్వీకరించి వారిని సన్మానితులుగా చేసెదరు. కానీ వారి అలవాటు ఏమనగా తన ద్వారా చేసిన పనులను మరచిపోయెదరు. అనగా స్వాభావికముగా మరుపుగలవాడు. ఒకవేళ మీరు ఆయనకు నాజ్ఞాపకము చేయకపోతే వారు నన్ను కూడా మరచిపోయెదరు. ఇందువలన ఓ మాతా! మీరు ఆయనకు నా విషయము జ్ఞప్తికి తీసుకురండి. నన్ను మరువకుండునట్లు చేయండి ఏలయనగా తులసీదాసునగు నాకు మనసా వాచా కర్మణా (త్రికరణ శుద్ధిగా వారిని తప్ప, అన్యము నేను స్వప్నములో కూడ తలంచను. ఆధారము లేదు. అనగా నేను సంపూర్తిగా ఆయనపైనే ఆధారపడి వున్నాను.

## "శ్రీరాముని - స్తుతి"

1. శుద్ధ ఆత్మ స్మరూపుడవు, చైతన్యుడవు, వ్యాపకుడవు (అంతర్యామి) ఆనంద స్వరూప! సచ్చిదానంద స్వరూప, పరబ్రహ్మ శరీరమును ధరించి నరలీల చేయుటకు వ్యక్తమైన సాకార రూపము ప్రభవించితివి. ఇప్పుడు బ్రహ్మాది దేవతలందరు, సిద్ధులు (దైత్యుల అత్యాచారములకు) వికలులైరి. వారి సంకోచమును చూచి వారు దైత్యులను దమనము చేయుటలో సమర్థులైనప్పటికీ, లోకమున బ్రహ్మద్వారా మర్యాదను స్థాపించకోరుచుండిరి. ఈ విషయమును గమనించి స్వయముగా బ్రహ్మయే, నిర్మల గుణయుక్తుడయి మానవ శరీరమును ధరించెను. అనగా అవతారమును పొందెను. ఇటువంటి రామా! నీకు జయమగుగాక. కళ్యాణ స్వరూపుడగు అయ్యోధ్య రాజు దశరథుడు కోసలకన్య కౌసల్య - ఇంటియందు మోక్షమునిచ్చు నాల్గు రూపములు అందమయిన ఫలములు ప్రత్యక్షమయ్యెను. అనగా రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్న మోక్షమునకు నాల్గు రూపములు (1) సామీప్య (2) సాలోక్య (3) సాయుజ్య (4) సారూప్య - రూపములుగా ప్రకటితమయిరి. అనగా ఈ నల్గురు పుత్రులే మోక్షమునకు నాల్గు రూపములుగా నుండిరి. వేదముల యందు సంపూర్ణ కర్మల (యజ్ఞాదులు) ధర్మ (సత్యము మొ॥)ను చేయువారు పృథ్వి, గోవుల, బ్రాహ్మణుల, భక్తులకు, సాధువులకు ఆనందము కల్గించు ఓ రామా! నీకు జయము.

విశ్వామిత్రుని యజ్ఞరక్ష, సజ్జనుల కష్టములను నివారించు, శాపవశమున గౌతమముని భార్య అహల్య పాపమును తొలగించిన వాడు, శివ ధనస్సును విరిచి పరశురామునితోపాటు సర్వరాజుల, గర్వముచేత ఉన్నత మస్తకములను దమనము చేసి క్రిందికి వంచిన అనగా అందరి మనస్సులను వినష్టము చేసిన ఓ రామా! నీకు జయమగుగాక. రాముడు జనక మహారాజు ద్వారా ఏర్పాటు చేసిన సీతా స్వయంవరమున నియమించిన శివధనుస్సును త్రుంచి, సర్వరాజుల గర్వమును చూర్ణము చేసెను. ఎవరికీ లొంగని పరశురాముని విశాల మస్తకమును తన ఎదుట అవనతము చేయించెను. ధర్మము యొక్క గురుభారమును ధైర్యముగా విచలితుడు కాకుండ ధరించిన రఘుకులమున వీరుడవు. గురువుల, మాతా

పితల యెడ, భ్రాతృ ప్రేమను స్వీకరించిన వాడవు. చిత్రకూటము, వింధ్యాచలము, దండకారణ్యాది యందు విహరించిన నీకు ధన్యవాదములు. అడవులలో పర్యటించి వాటిని పవిత్రముగావించిన ఓ రామా నీకు జయము.

పాకదైత్యుల శత్రువు, ఇంద్రుని పుత్రుడు వాయసము (కాకి) రూపమును పొందిన జయంతునికి అతని కర్మ ఫలమునిచ్చినవాడవు. ఘాతము తవ్వి విరాధరాక్షసుని అందులో పూడ్చిపెట్టిన బ్రహ్మ రూపమున అప్సర యొక్క దివ్యమైన రూపమును ధరించి, శూర్పణఖ యొక్క వాస్తమును తెలుసుకుని, అది రాక్షసి దాని ముక్కు చెవులు కోయించి ప్రపంచమునకు బాధా రూపమగు రావణునికి సిగ్గు కల్గించితివి. భావమేమన తనను లోకమున అజేయుడని భావించిన (రావణుని) అత్యాచారముల చేత లోకము నాశనము చేయుచూ, బాధలు పెట్టుచున్న రావణుని సోదరియగు శూర్పణఖను వికలాంగురాలిగా చేసి, రావణుని లజ్జింపచేసిన ఓ రామా! నీకు జయమగుగాక. ఖర, త్రిశిరా దూషణ, వారి పదునాల్గువేల యోధులను, మారీచాది రాక్షసుల సంహరించిన, కరుణాసముద్రుడా! నిష్కలంకమే శీలముగల, మూడు విధములగు దుఃఖములను (1) ఆధ్యాత్మిక (2) ఆదిభౌతిక (3) ఆది దైవిక లేక కామిక, వాచిక, మానసిక, దూరము చేయునట్టి రామా! నీకు జయము.

తన అహంకారమున దుష్టుడైన కబంధుని చంపి, మహాబలిష్టుడగు వాలిని వధించి, సుగ్రీవుని రాజుగా చేసిన, గొప్ప గొప్ప వీరులగు వానరుల, ఎలుగుబంట్ల సైన్యమును సమకూర్చుకొని, సౌందర్యమును కల్గించు, చరణముల వద్దకు వచ్చి ప్రణమిల్లిన వెంటనే రావణుని చిన్న తమ్ముడగు విభీషణునికి తృప్తి గల్గించిన ఓ రామా! నీకు జయము. క్రీడవలె అవలీలగా సముద్రముపైన వంతెన కట్టి, కాలునికి కూడ అగమ్యమైన అనగా మృత్యువు అచ్చటికి చేరుకొనుటకు సాహసించని అటువంటి అజేయమైన లంకను చుట్టుముట్టి, వెంటనే తన స్వాధీనము చేసుకొన్న రావణుని అతని వంశ సోదరుడు సైన్యము, వంశపూతుడైన మేఘనాథునిని, సోదరుడగు కుంభకర్ణునితో సహా యుద్ధమున వధించి, ముల్లోకములలో ఇంద్రాది దేవతలకు, లోకపాలకులకు భయము నుండి విముక్తి కల్గించిన ఓ రామా! నీకు జయము.

రామ, లక్ష్మణు - సీతా, తన మంత్రులతోపోయి, పుష్పక విమానములో కూర్చుని తన రాజధాని అయోధ్యకు వచ్చిరి. రాముడు అయోధ్యకు వచ్చివాడను విషయము అయోధ్య ప్రజలు ప్రసన్నులైరి. రాముడు రాజాయెను సీత రాణి అయినది. ఇటువంటి ఓ రామా! నీకు జయమగుగాక అని తులసీదాసునగు నేను చెప్పుచున్నాను.

(తులసీదాసు రాముని జన్మ మొదలుకొని, అయోధ్యకు తిరిగివచ్చిన విషయమును సంక్షిప్తముగా చెప్పెను. తులసీదాసు సామీప్య భక్తిని శ్రేష్టముగా భావించెను.

ఐశ్వర్యము, కృప, న్యాయము, శీలము, సౌజన్యము, క్షమ, ఉదారత, కరుణ, శ్రీ, తేజస్సు, వీర్యము మొదలగునవి బ్రహ్మ యొక్క దివ్య గుణములుగా భావించబడినవి).

2. రాజశేఖరులయందు అనగా చక్రవర్తులలో ఇంద్రునికి సమానముగా, అనగా సర్వశ్రేష్టుడవు. కమలనయన! రామనామమును ధరించిన, కలియుగమున కల్పవృక్షమువంటి సర్వుల మనోవాంఛలను పూర్తిచేయుదువు. సామ (సామ, దాన, భేద, దండోపాయములు - రాజనీతిలో నాల్గు పద్ధతులున్నను, సామ నీతినే ప్రయోగించువాడవు. అభ్యాసమనెడి సముద్రమున, అగస్త్య ఋషివలె పానము చేసి నష్టము చేసి నష్టము చేయువాడవు. రాక్షస సమూహమనెడి సఘనమైన చీకటిని తొలగించి భాస్కరుని వంటివాడవు. రామ! నీకు జయమగుగాక. మునులు. దేవతలు, మానవుల, యజమానియగు దశరథనందన రామ! నీవు అవధ (అయోధ్య) వాసులను దివ్యాత్ములునుగా చేసితివి. ఇందువలన దేవతలు, మునులు కూడ వారికి వందనములు చేయుదురు. ఇంద్రాది లోకపాలకుల రూపమున నున్న చక్రవాకముల శోకమును, ఆపదలను తొలగించువాడవు. సూర్యవంశము అనెడి కమలవనమును వికసింపచేయు రామా! నీకు జయము అగుగాక. సూర్యవంశపు వారు రాముని పేరు విన్న వెంటనే కమలములు సూర్యరశ్మివల్ల వికసించినట్లే సంతసించెదరు.

శృంగారమనెడి నీటిమడుగు వికసించిన కమలముల హారమువలె, సంపూర్ణ సద్గుణములకు కేంద్రము - విశ్వమునకు ఉపకారము కల్గించునట్టి సంపూర్ణ సౌభాగ్యముల సౌందర్యము, లావణ్యము యొక్క సాకార రూపము, నీ సౌందర్యము చేత కోట్లాది కామదేవతల సౌందర్యగర్వమును అడంచిన రామా! నీకు జయము. అందమైన శారంగ అను పేరుగల ధనస్సు అంబులపొది, బాణములు, శక్తి, సౌందర్యము, డాలు-ఖడ్గము కవచమును ధరించిన రఘుకుల సాటిలేనిమేటి వీరా! అద్వితీయమైన భుజభలముగల, ధర్మమనెడి భారము (ఇరుసు) బండి ఇరుసు వలె మోయుచున్నావు. ధైర్యముగలవాడవు. సాటిలేని వీరా! అద్వితీయమైన భుజబలముగల అతి తేలిగ్గా క్రీడవలె పృథ్వి భారమును తొలగించు వాడవు. ఓరామా! నీకు జయమగుగాక.

మణిజటిత స్వర్ణ మకుటము (కిరీటము) కుండలములు ధరించిన, అందమైన లలాటముపైన, ప్రకాశించుచున్న తిలకమును దిద్దుకొని, చంద్రునివలె అందమైన ముఖముగలవాడు, దివ్యమైన వస్త్రములను ధరించిన పసుపు పచ్చని జందెమున్ వేసుకొన్న రాముని ధ్యానము చేయనివాడెవడున్నాడు. ఇతనివలె. సర్వులకు కళ్యాణము కల్గించువాడు. రామునివంటి వారెవరున్నారు? నీకు జయమగుగాక. భరత, లక్ష్మణ, శత్రుఘ్ను ముగ్గురు సోదరులు నీ సేవచేయుచున్నారు. వారు ప్రసన్న ముఖులై సేవచేయుచున్నారు. (ఇక్కడ సుముఖపదమునకు అర్థము ప్రసన్న ముఖముగలవాడు). సుముఖ అనుపేరు గల రాముని మంత్రి ఇరు అర్థములతో పేర్కొనవచ్చును. మంత్రుల, సేవకులకు సుఖము, అన్నియును కల్గించువాడు. నీచులు, దుఃఖముతోనున్నవారు, దీనులు, పతితులు, పెద్ద పెద్ద పాపములు చేసిన వారు కూడ ఒక దఫా నమస్కరించిన రక్షించుమని కోరిన వెంటనే వారిని రక్షించు రామా! నీకు జయము.

నీ యశస్సు పదునాల్గు లోకములో ప్రకాసించుచున్నది. ఇటువంటి మిక్కలి గొప్ప

పుణ్యాత్ముడవు. పుణ్యాత్ముడవు. నీ గాథ అనెడి గంగ కవులయందు సర్వశ్రేష్టకవి వాల్మీకి ఋషి రూపమున నున్న పర్వతమునుండి జనించి ప్రవహించుచున్నది. అనగా వాల్మీకి వ్రాసిన రామకథ గంగా ప్రవాహమువలె సర్వులను ఉద్ధరించుచున్నది. దాని జలమును పానముచేసి అందులో స్నానము చేసి భక్త సమాజము సదా సంతసించుచున్నది. ఇటువంటి రామా! నీకు జయమగుగాక. నీ రాజ్యమున సర్వజనులు స్త్రీలు పురుషులు వర్ణాశ్రమ ధర్మమును పాటించుచుండిరి. వారందరు శ్రమ. దమ, దయ కలిగి దానములను చేయుచుండిరి. వారందరు సర్వపాపముల దుఃఖముల నుండి ముక్తులై యుండిరి. సంతోషముగా ఉండిరి. సదాసుఖముగా నున్నను రామరాజ్యలీలను గానము చేయుచుండిరి. వినుచుండిరి. ఇటువంటి ఓ రామా! నీకు జయము.

వైరాగ్యము, ఆత్మ జ్ఞానమునకు సముద్రమువంటి వాడును, ప్రణమిల్లిన వెంటనే సుఖమును కల్గించి పాపములను, దుఃఖములను దూరముచేయు రామా! నీకు జయము. తులసీదాసునగు నేను, నీ చరణముల శరణువచ్చిఉన్నాను. ఓ జానకీనాథా! సందేహములను తొలగించువాడవు. రామా! నాకు సహారా (ఆధారము) ఆసరా ఉండుము. నా అవిద్యను, సంశయమును తొలగించుము. సహాయము చేయుము.

3. ఓ మనసా! శ్రీరామచంద్రుని గురించి భజన చేయుము. వారు ప్రపంచములోని భయంకరమైన, ఇహలోకములోని దారుణమైన భయములను నివారించెదరు. వారి నేత్రము వినూత్నమైన వికసించిన కమలములవలె నుండును. ముఖము, హస్తములు, చరణములు కమలముల వలె యుండును. అందముగా యున్నవి. వారి సౌందర్యము అసంఖ్యాకమమై మన్మథుల సౌందర్యమున కన్నమిన్నగానున్నది. మేఘవర్ణము వాడు అందమైనవాడు. అందమైన శరీరముపైన పీతాంబరము చాలశోభను కల్గించుచుండును. నల్లని మేఘములో విద్యుత్ కాంతి చిమ్మినట్లుండును. ఇటువంటి సీతాపతి రామా! నేను నీకు నమస్కరించుచున్నాను. ఓ మనసా! దీనులకు, దుఃఖములోనున్నవారికి, బంధువు రాముడు. దానవుల, దైత్యుల వంశములను నశింప చేసినవాడు రాముడు. సూర్యునివలె ప్రకాశవంతమైన సూర్యవంశపు రఘువంశీయుడు. ఆనందమునకు మూలము. కోసల (అయోధ్య) యందు చంద్రునివలె వ్యక్తిత్వమను చల్లని వెన్నెలను వెదజల్లి సర్వులకు సుఖశాంతులను ఇచ్చువాడు, దశరథ నందనుడు రాసముని భజింపుము.

వారి శిరస్సుపైన కిరీటము, చెవులయందు కుండలములు, లలాటముపైన అందమయిన తిలకము శోభాయమానమై యుండును. అంగాంగములయందు అందమైన ఆ భూషణములు ధరించియున్నారు. మోకాల్లవరకు పొడవుగల హస్తములయందు ధనుర్బాణములు ధరించియున్నారు. యుద్ధమున ఖర, దూషణాది రాక్షసులను ఓడించి వధించి విజయము నొందెను. తులసీదాసునగు నేను ఇట్లు చెప్పుచున్నాను. శేషనాగాది మునుల మనస్సును సంతోషపరచునట్టి, కామాది దుష్టుల సమూహములను సంహరించినట్టి రాముడు నా హృదయమనెడి కమలమున సదానివసించి యుండుగాక.

హృదయమున భావించి విశ్వాసము నుంచి -ఒరే మూర్ఖా! సదా "రామ-రామ" యని జపించుము. కోసల దేశపు రాజగు రాముడు వినూత్నముగా వికసించి నల్లకలువవలె కాంతి, అందమైన శరీరము గలవాడు. వారిని కామదేవుని (మన్మధుని) శత్రువగు శివుడు తన హృదయమును రామ నామమును ధరించియుండును. కమలమునందు భ్రమరము నున్న యట్లుండును) సీతాదేవితో ఆనందించు సీతాపతి, సుఖమునకు కేంద్రము. ఈ లోకమునకు ఒకే ఒక దైవము. సంగ్రామములయందు దుష్టులను సంహరించినవాడు. పరమ కరుణామయుడు. రాక్షస సమూహములను వనములకు అగ్నివలె నున్న వాడు. మోకాళ్లవరకు పొడవుగా నున్న హస్తములు గలవాడు శ్రేష్టుడు, ధనుర్బాణములు గల్గియున్న చాలపదునైన పదునగు బాణములు కల్గియున్నాడు. వారి చేతులు, చరణములు, ముఖము ఎర్రని కమలముల వంటి, రాజీవ (నల్లకలువ) సమానమైన ప్రపుల్లత సౌందర్యము కలవాడు. వారు సద్గుణములకు కేంద్రము. అనేక మన్మధులకంటె శోభనిధి.

వారు వాసన అనెడి తెల్లకలువలకు రక్షనిచ్చి మూతకల్గించు, కామము, క్రోధము అహంకారమనెడి రూపముననున్న కమల వనమును నష్టము చేయుమంచువలెనున్నావు. లోకరూపముననున్న మిక్కిలి మదించిన ఏనుగునుకు సింహమువలె, భక్తులకు కళ్యాణము చేకూర్చు లోక భారమును తొలగించునట్టి వాడవు. ఆయన పేరు కేశవుడు. వారు దుఃఖములను తొలగించువారు. బ్రహ్మ, శివుడు ఇద్దరు వారి పాదములకు నమస్కరించుచుందురు. వారి చరణములనుండి గంగానది ఉద్భవించినది. వారు సర్వులకు ఆనంద ప్రదాత. సదా ఆనంద సమూహములను కల్గియుందును. మోహ (అవిద్య)ము ను తొలగించువారు. భయంకరమైన లోకసాగరమును దాటుటకు ఓడవలెనున్నారు. శోకము, సందేహములనెడి మేఘముల సమూహమును చెదరగొట్టగల ఘనుడు. పాపపర్వతములను చూర్ణము చేయగలవాడు. వజ్ర సమానుడు. భక్తులకు కామధేనువువలె కోరిన కోర్కెలను నెరవేర్చగల అందరికి సుఖ శాంతులను, విశ్రాంతులను కల్గించునట్టివారు. వారిపేరు కలియుగమనెడి ఘాతక ప్రభావమును తొలగించుటలో అద్వితీయమైనవారు. రామనామమనెడి ధర్మరూపమగు కల్పవృక్షమునకు ఉద్యాన స్వరూపుడగు (అనగా ధర్మమునకు సంపూర్ణముగా ఆశ్రయమునిచ్చి) స్వర్గమునకు వెళ్ళువారికి మార్గము సది (ఆహారము)వలె సహాయపడుచుండెదరు. సాకేతదామమార్గమున వెళ్ళువారికి రామనామస్మరణ చేయుచూ అక్కడికి చేరుకొందరు. భావము ఏమనగా కలియుగమున రామనామము మాత్రమే స్వర్గము చేరుకొనుటకు ఆధారము.

భక్తి, వైరాగ్యము, జ్ఞాన-విజ్ఞానములు, శమ, దమ, దానములు మొదలగు అనేక సాధనములు ఈ ఒక్కపేరు స్వాధీనముననున్నవి. రామనామస్మరణ లేనిచో మోక్షమనెడి ఫలంబును పొందలేరు. రామనామ జయమను స్మరణముతోనే స్వర్గము చేరుకొను

ఆధారము. సంపూర్ణ సాధనలు అనాయాసముగానే సులభమగును.

కలియుగము దగ్గరకు వచ్చినప్పుడు, పవిత్రమైన రామనామ స్మరమనెడి అమృతమగు పగలు-రాత్రి పానము చేసిన, తన సంపూర్ణమగు తపము, హోమము, సర్వస్వము దానము చేసి, విధి పూర్వకముగ కర్మకాండలన్నియు పుణ్యఫలములను సంపాదించుదురు. కలియుగమున రామనామస్మరణ జపము చేసిన మాత్రముననే దానము యొక్క సంపూర్తిగా ఫలము లభించును. రామనామ జపము లేకుండ చేయు కర్మకాండలన్నియు వ్యర్థము. చాండాలురు, దుష్టులు, చెంచులు (అడవిజాతివారు) అడవిజాతుల వారు, యవన (మ్లేచ్ఛులు) మొదలగు వారు భగవంతుని నామమహిమతోనే రామనామ జపముతో విష్ణు లోకమునకు వెళ్ళుచున్నారు. ముక్తులయిరి. వారి మలినమయిన బుద్ధి, రామనామమును పలుకుటవలన విశుద్ధులైరి. ఇందువలన ఓ తులసీదాసు! నీవు ఇపుడు ఆశ, భయ దుఃఖములను వదలి భవబంధనములను త్రెంచుటకు పదునైన కత్తి వంటి ఈ రామనామమును జపించుము.

(పంచేంద్రియములు - రూప, రస, గంధ, శబ్ద, స్పర్శ - విషయవాసనలకు ఆసక్తులను చేయును.

కేశవ పదము త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సమన్వయము. క(బ్రహ్మ), ఈశ (శివ), వం (విష్ణు)).

5. ఓ మనసా! రఘువీర రామునికి ఆరతి ఈ విధముగా చేయుము. ఆ రాముడు రాగద్వేషాది ద్వంద్వములనుండి ఉత్పన్నమగు దుఃఖములను తొలగించువాడవు. ఇంద్రియములకు యజమాని (గోవిందుడు) ఆనందమను వర్షమును సర్వ ప్రదేశములందు వర్షింపచేయు మేఘుడా! భగవంతుడగు రామా! జడ చేతనములు (చర, అచరములు) మొదలగు అన్నింటియందున్న దేవా! విశ్వములోని ప్రతి ఒక అణువు అణువులోనున్నావు. దేవా! ఈ వాసనాసుగంధి యొక్క ధూపమును ఇవ్వుము. అనగా రాముడు విశ్వవ్యాప్తి అని విశ్వసించాలి. ఆరతి ప్రారంభించినప్పుడు పూర్వము (మొదట) ధూపము మొదలగు వెలిగించుట వలన వాతావరణము సుగంధ భరితమగును. దుర్గంధము తొలగును. స్వచ్ఛమగును. రాముని విశ్వవ్యాప్తమయిన గౌరవము, అందులో ధృడమయిన విశ్వాసము ఉంచుకొనుట వలన, మనస్సుకు సంబంధించిన మాయా జన్యమయిన వాసనలు నిర్మలమగును. భక్తుని మనసులోని భేదభావము తొలగును. అతని వాసనలు సమాప్తమగును. ఆరతి ఇచ్చునపుడు, ధూపము చేసిన తరువాత దీపము వెలిగించబడును. తరువాత తన ఆత్మ జ్ఞానమనెడి దీపమును వెలిగించి, క్రోధ, అహంకార, మోహములను దట్టమైన చీకటిని తొలగించవలెను. ఇటుల చేయుటవలన, నీ అభిమాన వృత్తులన్నియు నష్టమగును. అనగా నీ గర్వమంతయు తొలగిపోవును. ఆత్మజ్ఞానము కలిగినచో మానవుడు సుఖదుఃఖభావనల నుండి ముక్తుడగును.

దీపము తరువాత నైవేద్యము సమర్పింపబడుతుంది. అత్యంతమైన శ్రేష్టమగు, నిర్మలమైన నైవేద్యము సమర్పింపబడును. అనగా తన నిష్కపట భావమును, భగవంతుని చరణములయందు అర్పితము చేయుము. ఈ భావరూపమగు నైవేద్యము లక్ష్మీపతియగు భగవంతునికి పరమ సంతోషమును ప్రదానము చేయుము. నిష్కపట భావనతో భగవంతుని ఆరాధించిన, పూర్ణ సంతుష్టుడగు భగవంతుడు భక్తునికి ప్రసన్నుడగును. నైవేద్యము తర్వాత భగవంతునికి తాంబూలము సమర్పణము జరుగును. తన ప్రేమ రూపమగు తాంబూలమున, శోకము అవిద్యవలన జనించిన అజ్ఞానము, ప్రపంచములోని వాసనలకు మూలము అగు బీజములు వినాశమును కల్గించుము. భగవంతుని నోరు రంజనయగును. దుఃఖము, అజ్ఞానము సమూలముగా నాశనమగును. ఈ ప్రేమయే తాంబూల రూపమున భగవంతునికి సమర్పించుము. తాంబూలానంతరము ఆరతి చేయబడును. తన శుభాశుభముల కర్మ రూపమున నిమగ్నమయియున్న పది ఇంద్రియ రూపమగు వృత్తాలను, త్యాగరూపమనెడి అగ్నితో ప్రజ్వరిల్లచేసి, శరీరరూపమునను్న దీపమునందు సర్వగుణరూపమగు ప్రకాశమును వెలిగించి శాంతమును పొందవలెను. భక్తి, వైరాగ్యము, జ్ఞానమనెడి దీపావలి హారతి జగత్తులో నివసించు వాడునగు రామునికి సమర్పింపుము. త్యాగము ప్రాప్తించిన మన పది ఇంద్రియములు (5 కర్మేంద్రియములు + 5 జ్ఞానేంద్రియములు) తమ తమ వాసనలనుండి విముక్తమగును. సత్వగుణమును పెంపొందును. త్యాగభావముతో అంతర్ముఖి అగును.

(హారతి తరువాత భగవంతునికి శయనము చేయించబడును) హారతి తరువాత తన నిర్మలమైన హృదయమున శాంతిరూపమైన అందమగు పర్యంకముపైన రాజగు శ్రీ రామచంద్రునిని శయనింపజేసి విరామము తీసుకోనివ్వవలెను. అనగా తన శరీరమును పూర్తిగా నిర్మలమునొనరించి, హృదయమును వాసనల నుండి విముక్తము చేసి; శాంతమైన స్థిరమైన మనస్సుతో సదాభగవంతుని ధ్యానము చేయుచూనుండవలెను. (మహారాజు నిద్రించుచోట కొంతమంది దాసులను నియమించవలసియుండును; వారు పరిచర్య చేయుదురు) భగవంతుని ఈ శయనాగారమునందు క్షమ, కరుణ మొదలగు - దాసులను భగవంతుని సేవకొరకు నియమించవలెను. దీనివలన భగవంతుడు మిక్కిలి ప్రసన్నుడయి సంతోషమును ప్రదానము చేయును. హృదయమున భగవంతుడున్నచో భేదభావమును కల్గించుమాయవుండదు. మనస్సులో అవిద్యాజనితమైన భేదభావమంతయు తొలగిపోవును. అతడు పూర్తిగా నిర్మలుడయి నిష్కాముడగును. భగవంతుని ఈ హారతి ఇచ్చుటవలన, సనక సనందనాదులు, శుకదేవ్, శేషనాగ, శివదేవతలు, ఋషులు, తత్వజ్ఞానులైన మునులు మొదలగు వారందరు కార్యోన్ముఖులైయుందురు. సదా ఈ హారతి చేయుచుందురు.

తదుపరి క్రోధము, మోహము, మదము అహంకారాది కలుషిత భావములు నష్టమగును. హృదయము నిర్మలమై పూర్తిగా సంతుష్టమయి భగవంతునితో సాటిలేని మేటి ప్రేమ పుత్పన్నమగును. అజ్ఞానము, ప్రపంచములోని వాసనలు వినష్టమగును. ఫలితముగా త్యాగభావన కల్గును. ఈ భావము ఉదయించిన వెంటనే మన ఇంద్రియములన్నియు. శుభాశుభ కర్మలను త్యజించును. సత్వగుణ సంపన్నుడగును. భక్తి, జ్ఞాన, వైరాగ్యము కల్గి లీనమగును. మనస్సు సంపూర్తిగా. శాంతమయి, బ్రహ్మ ప్రకాశముతో పరిపూర్ణుడగును. బ్రహ్మ ప్రకాశమువలన క్షమ, కరుణ, ఆది సద్గుణములు స్థితి పొందును. మాయ, భేదము మొదలగు అజ్ఞానము నశించును. ఈ మానసిక హారతి అభిప్రాయము, ఉద్దేశ్యము నిధియే. హారతికి ఆరు భాగములుండును - (1) ధూపము, (2) దీపము, (3) నైవేద్యము, (4) తాంబూలము, (5) హారతి, (6) శయనము.

భక్తుడు మనస్సులో రాముని ఆరాధన చేయును. అతనికి బాహ్యాచారములు అవసరము లేదు.

(భగవంతుడున్నచోట మాయజనిత భేదబుద్ధి ఉండదు.)

6. రామునికి హారతి ఇచ్చిన అది సర్వదుఃఖములను హరించును. క్లేశములను, పాపములను కాల్చి భస్మము చేయును. కామవాసనలను కూకటివేల్లతో పెల్లగించి తొలగించును. హారతి యొక్క సుందరమగు సుగంధభరితమైన ధూపము శ్రేష్టమైన దీపమాలిక. ఈ హారతి అజ్ఞాన జనితమైన మాయ అను చీకటిని తొలగించును. మనస్సుకు సత్యగుణనమును, శాంతియుతమైన ప్రకాశముతో నింపుము. హారతి ఇచ్చునపుడు చేతులతో చేసిన ధ్వని (కరతాళ ధ్వని) వినిన వెంటనే పాపరూపమనెడి పక్షులన్నియు వినష్టమగును. ఇది భక్తుల హృదయ రూపమనెడి దేవాలయమున వ్యాపించిన అజ్ఞానమనెడి చీకటిని తొలగించునట్టిది అయిన, అచ్చట నిర్మలమైన ఆత్మజ్ఞానమనెడి ప్రకాశమును పెంపొందించును.

ఈ హారతి, మోహ, అహంకారము, క్రోథము, క్లేశమనెడి కమలమును నాశనము చేయు హేమంతరుతువు రాత్రి వంటిది. హారతి మోహాది భావనలను వినష్టము చేయును. ముక్తి అనెడి నాయికతో కలయిక చేయించు దూతిక వంటిది. అనగా హారతి చేసిన ముక్తి లభించును. శరీరము కాంతి, విద్యుత్ కాంతివలె విశ్వములోని అణువు అణువున ప్రకాశమును నింపును. శరణాగతులగు భక్తుల రూపమున నున్న నల్లకలువల వనమును వికసింపచేయు చంద్రుని కిరణముల హారము, వెండివలెనున్నది. భక్తులు హారతి విని (చూచి) సంతోషించెదరు. తులసీదాసునగు నేను ఇట్లు చెప్పుచున్నాను - ఇది అభిమానమనెడి మహిషాసురుని వధించు కాళికలవలె అనగా జీవుని అభిమానమును తొలగించును.

(ఈ హారతి - భక్తులను ముక్తివరకు చేర్చించును).

## హరిశంకర గేయము

7. ఈ గేయమునందు ప్రతి ఒక మొదటి పంక్తియందు విష్ణువును గురించి రెండవ పంక్తియందు శివుని గురించి స్తుతి చేయబడినది. ఇటువంటి గేయములను హరిశంకర గేయమని చెప్పబడును. రెండు ఉపశీర్షికల అంతరములో వీటి నివారణకు ప్రయత్నము చేయుట పూనుకొన్నాను.

1) విష్ణుపక్షము : భగవంతుడగు శ్రీ మహావిష్ణువు దైత్యరూపముననున్న వనమును భస్మము చేయుటకు, దావాగ్ని, గుణముల సఘనవ నమ్మున గొప్ప గుణములు కలవారు సద్గుణములను గ్రహించునట్టి సర్వగుణ సంపన్న ఇంద్రియములస్వామి, నంద మొదలగు వారికి ఆనంనదము నిచ్చునట్టి అవినాశి (నాశనము లేనివాడవు).

2) శివపక్షము : భగవంతుడైన శివా! శంభు, శివ, రుద్ర, శంకర మొదలగు అనేక నామములు ధరించిన గొప్ప తేజస్వియగు, క్రోధ పుంజమున మిక్కిలి భయమును కల్గించు క్రోధ రూపుడవు.

1) విష్ణుపక్షము : భగవంతుడగు విష్ణువు అనంతుడు. మిక్కిలి ఐశ్వర్యము గలవాడు. ప్రపంచమును నాశనము చేయగల యముని భయమును కూడ తొలగించువాడవు. లక్ష్మీపతివి, పదునాల్గు భువనములకు ఆనందము కల్గించునట్టి వాడవు.

2) శివపక్షము : భగవంతుడగు శివుడు కైలాధిపతి (కైలాసపర్వత అధికారి) లోకమునకు అధినాయకుడవు. "ఈశ" అను పేరును ధరించి దీని అర్థము జగత్తుకు యజమాని అని భావించబడుచున్నది. జ్ఞానమునకు కళ్యాణమునకు అధికారిక కేంద్రము.

1) విష్ణుపక్షము : వామన రూపము ధరించిన వాడవు. నిరాకారుడవు. పవిత్రుడవు. సర్వత్ర వ్యాపించిన పరమాత్మ స్వరూపుడవు. మాయకు యజమానివి.

2) శివపక్షము : చంద్రశేఖరుడవు. శిరస్సుపైన చంద్రుని ధరించినవాడవు. పాపములను పారద్రోలగలవాడవు. నిష్పాపుడవు. జన్మరహితుడవు. అనంతుడవు. అఖండవు. వృషభము పైన స్వారి చేయుదురు.

1) విష్ణుపక్షము : నీలమేఘమువంటి సౌందర్యముగలవాడవు. శ్యామ శరీరముగలవాడవు. అనేక మన్మధులకంటె మిన్న సంయుక్తుడైన వాడవు. యోగులు రమించుచుండు రాముడవు. కమలనయనములు గలవాడవు. దయగలవాడవు.

2)శిపక్షము : శంఖము కర్పూరమువలె శ్వేత శరీరము ధరించినవాడవు. నిర్మలమైన శరీరముగలవాడవు. శిరస్సుపైన జటాజూటమును ధరించిన, శ్వేతాధారగల గంగను, శ్వేతపురుషుల మాలవలె దానిని సమమగు హారము ధరించినవాడవు.

1) విష్ణుపక్షము : బ్రహ్మ, చర అచరములయందు వ్యాపించి ఉన్నావు. పూర్ణ బ్రహ్మవు. అన్నింటనికి వేరుగనున్నవాడవు. పరమహితైషివి. జ్ఞాన ఇంద్రియములకు వేరుగా, భిన్నమై మాయాజనితమైన సత్, రజ, తమో, గుణముల వాసనల నుండి ముక్తి కల్గించువాడవు.

2) శివపక్షము : జలంధరుడును దైత్యుని గర్వమునెడి పర్వతమును చూర్ణము చేయుటకు వజ్రమువలె కఠినమైన, భయంకరమైన పార్వతివి నీవు. కళ్యాణములకు సారూప్యమైనవాడవు. ప్రజాపతి దక్షుని యజ్ఞమును విధ్వంసము గావించినవాడవు.

1) విష్ణుపక్షము : భగవంతుడగు విష్ణువుకు భక్తులు చాలయిష్టము. వారు భక్తుల సంపూర్ణమైన కోర్కెలను నెరవేర్చునట్టి కామధేనువు. భక్తుల భయంకరమైన, కఠినమైన ఆపదలను తొలగించును.

2) శివపక్షము : శివుడు భక్తులకు సుఖము, ఆనందమును వనరులను ఇచ్చును. రజోగుణరహితుడయిన, సంపూర్ణ వికార రహితుడై, ఆనంతవనమనెడి కాశీపట్టన వీధులలో విహరించువాడవు.

విష్ణు, శివ అనుపేర్లుగల ఈ అందమైన మంత్రమును పఠించిన రాగద్వేషాది దుఃఖములను తొలగించును. ఆనందమునకు గనివంటి విష్ణు లోకము, శివలోకములయందు చేర్చునట్టి శాశ్వతమైన నిచ్చెనమెట్లవంటిది. అని తులసీదాసు, ఈ విషయమును పరిశుద్ధమైన వాక్కులతో ప్రకటించుచున్నాడు అనగా స్పష్టీకరించుచున్నాడు.

(ఇందులో జలంధరుని కథవున్నది. జలంధరుడు రావణుని అవతారము రూపము)

8. రాముడు, సూర్యవంశరూపముననున్న కమలములను వికసింపజేయుటకు, సూర్యరూపుడు అనగా వారిని చూచి సూర్యవంశపువారు కమలములవలె ప్రసన్నులగుదురు. కోటి మన్మథులకంటె అందమైన సౌందర్యము గలవాడు రాముడు. కలియుగమనెడి సర్పమును మ్రింగుటకు, గరుడరూపమున, తన బలిష్టమైన భుజముల ప్రచండమైన ధనుర్బాణములను ధరించి, నడుము యందు అంబులపొదిని కల్గియున్న అంతులేని బలశాలివి. ఎర్రని కలువల వలె అందమైన నేత్రములున్నవి. అవి సౌందర్యమునకు కేంద్రము. వారి శరీర కాంతి అందమైన మేఘములు పీతాంబరములు ధరించియున్నావు. శస్త్ర విద్యలో నిపుణుడవు. దేవతలు, సిద్ధులు, సేవిస్తూ ఉంటారు. రాముని నాభినుండి కమలము ఉత్పన్నమయినది. విష్ణునాభినుండి జనించిన కమలముపైన ఆసీనుడగు బ్రహ్మ అని భావించవలెను. అన్ని విధములుగా సౌందర్యమునకు స్థానము (గృహము). విరాట్ స్వరూపము గలవాడు. పరమ చతురుడు. గుప్తగుణములు కల్గి ఉదారుడు, మహిమ గలవాడు. అనగా మహాత్మ్యము గలవాడు. అజేయుడగు యోధుడు. ఆయన మాయ ఎవరికి తెలియదు. మిక్కిలి దుర్గమము అనగా ఆయన వరకు చేరుకొనుట మహాకష్టము. చేరుకోలేరు. స్వర్గము, మోక్షమునకు యజమాని. అనగా దాత, సంసారమనెడి వృక్షము అనెడి జన్మ - మరణము భయమును కూకటి వ్రేల్లతోపెకలించి నష్టము చేయగల గొడ్డలి వంటివాడు.

రాముడు గౌతమ ము భార్య అహల్యకు శాపవిమోచనము కలిగించినవాడు

అహంకారమును అణచినవాడు. దేవతలు కూడ తమ రాజ్యములు వదలుకొనునప్పుడు మిక్కిలి దుఃఖించెదరు. కాని రాముడు తన తండ్రి మాటలను నిలబెట్టుటకు అడవికి పోయెను. గడ్డిపోచవలె రాజ్యాధికారమును త్యజించెను. సీతను వెంట నిడుకొని, లక్ష్మణుడు తోడురాగా వెళ్ళెను. అజన్ముడు, బ్రహ్మ అయన నరలీలలు చేయుచూ, లోకరక్షణ కొరకు రావణాది రాక్షసుల సంహారముకొరకు సంలగ్నుడైనవాడు రాముడు. తన పవిత్రమైన చరణములతో దండకారణ్యమును పవిత్రము చేయు, కపట మృగ (జింక) మారీచుని చంపుటకు యత్నించితివి. ఏనుగువలె బలిశాలియగు వాలిని సింహమువలె, మిత్రుడగు సుగ్రీవుని సర్వదుఃఖములను తొలగించు రాముడవు.

భయంకరమైన వీరశూరులగు ఎలుగుబంట్లను, వానరులను కూర్చివెంట తీసుకుని కుంభకర్ణుని వంటి పర్వతాకారముననున్న శత్రువులను సంగ్రామమున భయ భ్రాంతులను కల్గించిన సముద్రముపైన వంతెన నిర్మాణముచేసినట్టి, దేవతాసమూహాలకు రావణుని నుండి విముక్తి కల్గించిన వాడవు. పది తలలు ఇరువది హస్తములుగల, గొప్ప యోధుడగు రావణునిని, దుష్టులగు రాక్షసులసమూహాలను సంహరించగల యోధుడవు. పృథ్వీభారమును తొలగించువాడవు. పేరిని చంపుటకు విశిష్టమైన అవతారముపొంది వచ్చిన శుద్ధసత్వరూపుడవు. నిర్దోషుడవు. అద్వైతుడవు. నిర్గుణ (మూడు గుణములు లేని) సగుణుడవు (అవతారముగల) పరబ్రహ్మవు. మానవ రూపమును ధరించిన రాజరాజేశ్వర రామా నీకు నేను (తులసీదాసు) నమస్కరించుచున్నాను. శేషనాగుడు, వేదములు సరస్వతి, శివ, నారదుడు, సనకాది, మునులు, నీ గుణగానము చేయు చుందురు. అయినా నీ చరిత్రను సంపూర్ణముగా తెలుసుకోలేరు. శివునికి ప్రియుడవు. అయోధ్య యజమాని రామా! ఈ తులసీదాసు భవసాగరము దాట దుఃఖమును తొలగించుకొనుటకు నావవంటి వాడవు. రాముడే తులసీదాసును భవసాగర దుఃఖములనుండి ముక్తి కల్గించు సమర్థుడు రాముడు.

9. జానకీనాథ! రఘునాథ, రాగ ద్వేషాది రూపముననున్న అంధకారమును తొలగించుటకు, తరుణ (యౌవన)మున నున్న మధ్యాహ్నపు సూర్యునివనలె తేజస్సుకు నిలయమునీవు. సచ్చిదానంద స్వరూపుడవు. ఆనందమనెడి వర్షమును కురిపించుటకు మేఘములకు ఖని (గని)వీ నీవు. లోకమునకు శాంతి కల్గించు అందమైన పట్టువస్త్రములను ధరించిన, శిరస్సుపై రత్నములతో కూర్చిన స్వర్ణకిరీటము ధరించిన వాడవు. ఆ తేజస్సు కోటాను కోట్ల సూర్యుల తేజస్సు కంటె మిన్నగావున్నది. వారి కర్ణములందు కుండలములు ఉన్నవి. లలాటము (నొసట) పైన తిలకము శోభిల్లుచున్నది. నీ కనుబొమలు మిక్కిలి అందముగా, విశాలమైన నేత్రములు ఎర్రని కమలములవలె నున్నవి. క్రీగంటి చూపులు. ముల్లోకముల దుఃఖమును పోగొట్టగలవాడవు. మన్మథుని శత్రువగు శివుని (హృదయ) మానస సరోవరమున సదా నివసించు హంసవు నీవు. శివుడు సదా రామనామ జపము చేయుచుండును.

మెడశంఖమువలె అందముగా, చిబుకము మిక్కిలి అందముగా, వాణి మిక్కిలి గంభీరమై యుండును. సత్య ప్రతిజ్ఞలు చేసినవాడవు. దేవతల భయమున్ తొలగించిన వాడవు నీ వక్షస్థలముపై రంగురంగుల విభిన్నమైన పుష్పములు తులసీ నవీనపత్రముల హారము వుండును. దాని సుగంధమున మత్తెక్కిన భ్రమరముల సమూహము మధురమైన రాగాలాసన (ధ్వని-రొద) చేయుచుండును. వాటిపైన పరిభ్రమించుచుండును. నీ వక్షస్థలముపై శ్రీవత్సమనెడి అందమైన చిహ్నము చిత్రించబడి ఉండును. భుజములయందు సంది కడియము (కేయూరము) కంకణములు ఉన్నవి. హృదయముపైన హారము, నడుముననున్న మొలత్రాటి శబ్దము మనోహరముగానున్నది. నీవామ భాగమున జనకపుత్రి సీత శోభాయమానమైయున్నది. సువర్ణకాంతివంటి సీత, శ్యామవర్ణమైన రాముని ప్రక్కన తమాల వృక్షము ప్రక్కన కోమలమైన స్వర్ణలత శోభిల్లుచున్నట్లు వున్నది.

రాముని బాహులు, మోకాల్లవరకు పొడవుగా ఉన్నవి. ఎడమ చేతియందు ధనుస్సు, కుడి చేతియందు బాణము ధరించియున్నావు. మునుల సమూహమంతయు, దేవతలు, సిద్ధులు, సుందరముగానున్న గంధర్వులు, నరులు, నాగజాతివారు మరియు అనేక రాజులు మహారాజులు వారికి నమస్కరించుచుందురు. నీవు నిష్పాపుడవు. పూర్ణుడవు. సర్వజ్ఞుడవు. అందరి యజమానివి. మాకు అనేక విధముల కళ్యాణము కల్గించువాడవు. నేను (తులసీదాసు) భక్తజనుల దుఃఖమును తొలగించు కళయందు నిపుణుడవైన రామా! లక్ష్మణుని సమేతముగా నమస్కరించు చున్నాను. నీ రెండు చరణములు ఆనంద నిలయము, లక్ష్మీనివాస స్థానము, వజ్రాది శుభచిహ్నములతో అంకితమైన గొప్ప శోభ (సౌందర్యము)ను కల్గియున్నావు. నీవు హనుమంతుని నిర్మలమైన హృదయమును నీ అందమైన మందిరముగా చేసుకొన్నావు. అనగా హనుమంతుడు సదా రాముని ధ్యానించుచుండును. నేను తులసీదాసుడను - శోకమును తొలగించు రామా! నీ చరణముల శరణు జొచ్చియున్నాడను.

10) ఓ అయోధ్యాపతి! నీవు ఈ జగత్తుకు యజమానివి. జగత్తుకు ఏకైక హితమును చేకూర్చువాడవు. నీ అసంఖ్యాకమైన లీలలను విస్తరింపచేయునట్టి అనగా అనంతమైన లీలను చేయువాడవు. నీ పరమపవిత్రమగు శీలమును, వేదములు, శేషనాగుడు, శివుడు, సనకసనందనాది ఆలోచనాపరమైన ముని గణము సదా నిన్ను గురించేయే గానము చేయుచున్నారు. ఈ పద్యమున తులసీదాసు, భగవంతుని వివిధ అవతారముల వర్ణన చేసెను. అవి క్రమముగా క్రింద పేర్కొనబడినవి :

**1) మత్స్యావతారము** : నీవు మత్స్య రూపమును ధరించి, భక్తుల ఉద్ధరణ కొరకు ప్రలయకాలమున (సమయమున) పృథ్విని నౌకగా చేసితివి. ఇందువలన నీ మహిమ

మిక్కిలి గొప్పది. భావమేమన మత్స్యావతార రూపమున, ప్రలయకాలమున్నంత వరకు భగవంతుడు ప్రలయము నుండి శేషరూపముగా మిగిలిన ప్రజలను అంతము వరకు ధరించి ఉంటివి.

**2) వరాహ అవతారము** : నీవు సంపూర్ణ యజ్ఞరూపుడవు. అనగా యజ్ఞ అంశములతో పూర్ణమయినవాడవు. హిరణ్యాక్షుడను రాక్షసుడు పృథ్విని తొలగించుకొని తీసుకొని పోవునప్పుడు, నీవు మహాభయంకరమైన విశాలమైన శరీరముగల దైత్యరాజును హిరణ్యాక్షుని వధించుటకు వరాహరూపమును ధరించి పృథ్విని ఉద్ధరించితివి.

**3) కూర్మావతారము లేక కచ్ఛప అవతారము** : ఓ మురారీ! నీవు మిక్కిలి భయంకరమైన కూర్మ (తాబేలు) రూపమును ధరించి సముద్రమథనమప్పుడు మందరాచుల రూపముననున్న నీవు చిలుకుటకు ఉపయోగించిన భాండమునకు కుదురుగా అయి (వీపున ఉంచుకొని) అది తిరుగుటవలన కలుగు ఆనందమును పొందితివి. నీ వీపున ఉంచిన మంధరాచలమును దేవదానవులు కలసి మథనము చేయుటకు త్రిప్పు (కవ్వము) సముద్రమథనము చేయుచుండిరి. ఇటుల సముద్రమును మథనము చేయునపుడు మంథరాచల భారమును మోసితివి. ఈ విధముగా చేసి నీవు సముద్రము నుండి అమృతము, కామధేనువు, లక్ష్మి, చంద్రుడు, వీరిని ఉత్పత్తి చేసితివి. ఇందువలన దేవతా సమూహమునకు మిక్కిలి ఆనందము కల్గెను. సముద్రము నుండి లభించిన రత్నములను దేవతలు గ్రహించియుండిరి.

**4) నరసింహావతారము** : నీవు మానవులు, మునులు, సిద్ధులు, సురలు, నాగులు మొదలగు వారికి దుఃఖమును కల్గించు, బ్రాహ్మణుల, ధర్మమర్యాదల నాశనము చేయునట్టి ప్రబల శత్రువగు హిరణ్యాక్షుడి చంపుటకు సాటిలేని నరసింహ రూపమును ధరించి వధ చేసితివి. నీ భక్తుడగు ప్రహ్లాదుని రక్షించితివి.

**5) వామనావతారము** : నీవు బలిచక్రవర్తిని మోసగించుటకు కపటమున వామన (4 అడుగుల 4 అంగుళముల పొడవుగావున్న పొట్టి)రూపమును వహించి మూడు అడుగుల భూమిని అడిగి ముల్లోకములను మాపనము (కొలత) చేసితివి. కొలుచునప్పుడు నీవు పాదముల గోల్లచేత ముల్లోకములను పవిత్రము చేయుటకు పరమ పవిత్రమైన గంగ ప్రవహించెను. నీవు నీ ఈ కార్యము చేత దేవతల తల్లియగు అదితి శోకమును తొలగించితివి. ఇంద్రుని రాజ్యము, బలిద్వారా ఆక్రమించిన రాజ్యమును అతనికి తిరిగి ఇచ్చినందున అదితి సంతసించెను.

**6) పరశురాముని అవతారము** : నీవు సహస్రబాహు మొదలగు క్షత్రియ రాజుల రూపముననున్న ఏనుగులను (సమూహమును) అందముగనున్న సింహసమానుడయి సంహరించియుంటివి. (పరశురాముడు 21 దఫాలు క్షత్రియులను సంహరించితివి) నీవు బాహ్మణ రూపముననున్న వ్యవసాయ భూమిని సస్యశ్యామలము చేయుటకు మేఘరూపమగు పరశురాముని రూపమును ధరించితివి.

7) **రామావతారము :** నీవు, పదితలలు, ఇరుబది హస్తములు గల రావణుని మిక్కిలి భయంకరమైన వేగముగల నీ బాణములతో పోగులవాటిచేత సంహరించితివి. ఇటువంటి రాజగు రాముని నేను (తులసీదాసు) పమస్కరించుచున్నాను.

8) **కృష్ణావతారము :** నీవు పృథ్విపైన, గొప్ప భాగమును ఆక్రమించియున్న తొలగించుటకు పరమాత్మవు. పరబ్రహ్మవు అయినప్పటికి, భక్తులనుద్ధరించుటకు నరరూపమున అవతరించితివి. వృష్టివంశ రూపముననున్న తామరలను ప్రపుల్ల పరచుటకు (సంతోషింప జేయుటకు) చంద్రునివలె రాధారమణుడవగు నీవు, కంసుడు మొదలగు దైత్యుల వనమును భస్మము చేయుటకు అగ్ని సమానుడవు.

9) **బుద్ధావతారము :** మిక్కిలి మోసములు, దుఃఖములతో నిండిపోయిన ఈ లోకమును ఉద్ధరించుటకు, దుఃఖములతో, కుములుతున్న, లోకరక్షణకు, యజ్ఞయాగములను పూర్తిగా ఖండించితివి నీవు. ఇటువంటి నిర్మలమైన, బోధ స్వరూపుడవు, జ్ఞానమేఘుడవు. మేఘమువలె అందరికి జ్ఞానమును వితరణ చేయునట్టి వాడా, సర్వగుణ సంపన్నుడవు. పునర్జన్మలేని కపాలుడవు. భగవంతుడగు బుద్ధునికి నేను (తులసీదాసు) నమస్కరించుచున్నాను.

10) **కల్కి అవతారము :** ఈ కలియుగమున సర్వమానవుల మనస్సులు మలినమగుచున్నవి. ఇందువలన నీవు అజ్ఞానమనెడి రాత్రిలో మ్లేచ్ఛరూపముననున్న దట్టమైన అంధకారమును తొలగించుటకు సూర్యోదయము వలె విష్ణుయశమను పేరుగల బ్రాహ్మణుని ఇంటియందు, పుత్రరూపమున కల్కి అవతారము ధరించుదువు. ఓ నాథా! నీవు తులసీదాసునగు నా దుఃఖమును తొలగించి, నన్ను ఉద్ధరించుము.

(యజ్ఞమనగా కర్మ. భగవంతుడు సర్వయజ్ఞముల భోక్త, సాక్షి)

11) సంపూర్ణమైన సౌభాగ్యములను సంపాదించుకొన్న, అన్ని విధములైన కళ్యాణములకు కేంద్రము. అందరికి ఆనందము కల్గించువాడవు. శివుని హృదయముననున్న కమల మకరందమును పానము చేయుటకు భ్రమర రూపముననున్న, రాజులకు, రాజువు అగు శిరోమణివి నీవు. నీకు నేను నమస్కరించుచున్నాను. ఓ రామా! నీవు సుఖములకు కేంద్రము, సద్గుణములకు మూలము; అందరికి శాంతిని కల్గించువాడవు. నీవు నిర్మలుడవు. శాంతుడవు.పరమ పవిత్రుడవు, పరమ జ్ఞానమునకు నిలయము. క్రోధ, అహంకారములను అణచువాడవు. కరుణానిధివి. నీవు అజేయుడవు. మాయా రహితుడవు. ఇంద్రియ జనన జ్ఞానమునకు వేరుగా, నిర్గుణుడవు. దోషము లేని, జన్మలేని, అద్వితీయుడవు. ఏకమాత్ర సమర్థుడవు. భక్తుల హితము కొరకు బ్రహ్మవు అయికూడ నరరూపమును ధరించినావు. సర్వుల హితమూరువాడవు. ప్రేరణనిచ్చువాడవు. అనంతమైన నిరుపమాన రూపుడగు రామునికి నేను (తులసీదాసు) మనస్కరించుచున్నాను.

నీవు పృధ్విని ధరించినవాడవు. సుందరుడవు. లక్ష్మీపతివి. మన్మధుని రూపసౌందర్యమును అహంకారమును దమనము చేయగల సౌందర్యపు హద్దులు, చాలా మనోహమైర రూపము గలవాడవు. నీవు అతికష్టముగా లభ్యమగువాడవు. తర్కమునకు తెలియువాడవు కావు. నీ పూర్ణజ్ఞానము లభించుట దుర్లభము, మిక్కిలి కష్టము. నీవు ప్రపంచ బంధనములను తొలగించువాడవు. భక్తులకు సహజముగ లభించు ప్రేమ వశమునకు గురియై (కోమలమైన ప్రేమకు) ప్రేమ ద్వారా లభించుచున్నావు.

నీవు సత్యకార్యములను చేయువాడవు. సత్యమును ప్రేమించుదువు. సత్యప్రతిజ్ఞ గలవాడవు. సదా పుష్టిగానుందువు. అనగా అన్నియు చేయుటకు సమర్థుడవు. నిత్య సంతోషివి. పెద్ద పెద్ద కష్టములను తొలగించువాడవు. నీవు ధర్మమునకు కవచము. ధర్మ రక్షకుడవు. బ్రహ్మ విద్యా, కర్మకాండ అనగా వేద, మీమాంసుల వివేక జ్ఞాతవు. సాటిలేని వాడవు. బ్రహ్మణులకు పూజ్యుడవు. బ్రాహ్యణుల ఎడ శ్రద్ధగలవాడవు. భక్త ప్రియుడవు. మురదైత్యుని వధించినవాడవు. నీవు నిత్య స్వరూపుడవు. అనగా అవినాశివి. నాశనము లేనివాడవు. మమతా రహితుడవు. సదా మాయ నుండి ముక్తుడవైయుందువు. మాన సమ్మాన భావనలకు ముక్తుడయినవాడవు. హరివి; జ్ఞాన మేఘము, సచ్చిదానంద స్వరూపుడవు. విశ్వమునకు మూలకారకుడవు. సత్, చిత్, ఆనందములకు మూలకారణము. ఉత్పన్నము చేయువారికి అద్యక్షుడవు. యమునికి యజమానివి. కూటస్థుడవు. అనగా నిర్వికారుడవు. గుప్తతేజస్సుగలవాడవు. వీర భక్తులకు సదా అనుకూలముగానుండువాడవు. నీవే సిద్ధి, సాధకుడు, సాధ్యము. నీవే వాచ్య - వాచకరూపుడవు. శబ్దార్థములు నీవే. నీవే మంత్రము. నీవే ఓంకార మంత్రము జపము చేయువాడవు. భక్తులందరు నిన్ను జపించుచుందురు. నీవే స్వయంగా సృష్టివి; సృష్టి రచయితవు. అందరికి ఆదికారణము నీవే. నీ నాభియందు కమలము ఉత్పత్తి చేసితివి. నీ శరీరము కాంతి మేఘము వలె శ్యామలమై యున్నది. నిర్గుణ - సగుణ రూపుడవు నీవు.

నీవు ఆకాశము వలె అందరిలో వ్యాపించివున్నావు. రజోతమ గుణాదులతో నిర్లిప్తుడవు. శుద్ధ సత్య స్వరూపుడవు. బ్రహ్మ వరదానములనిచ్చు శివుడు, ఆది దేవతలకు స్వామివి. వైకుంఠవాసివి. వామనావతారమును ధరించినవాడవు. విశుద్ధ స్వరూపుడవు. బ్రహ్మాచారివి, సిద్ధులు, దేవతల సమూహములు సదా నీ ఆరాధన చేయుచుందురు. ఆడంబరములు, బాహ్య ఆచారములను ఖండించి, వాటిని సమూలముగా నాశనము చేయగలవాడవు. నీవు సంపూర్ణ ఆనందమునకు రాశివి. గొప్ప వ్యామోహము, అజ్ఞాన జన్యమగు మూడు గుణములు త్రిదోషములనెడి సన్నిహితమును తొలగించు వాడవు. ఈ తులసీదాసు మనసా, వాచా, కర్మణా నీ శరణు జొచ్చితిని. నీవు వాటి ప్రపంచమనెడి సముద్రమును శుష్కింపచేయగల అగస్త్య ఋషివంటి వాడవు. తులసీదాసు దుఃఖమును తోలగించుటకు, సంపూర్ణముగా భవ దుఃఖములను తొలగించువాడవు.

(మాయకు రెండు రూపములున్నవి - (1) ఆవరణ, (2) విక్షేపము. వీటి వలననే

[illegible] నీవు విశ్వవిఖ్యాతుడవు. విశ్వమునకే యజమానివి. విరాట్ రూపుడవు. [illegible] సర్ప శత్రువైన గరుడపైన ప్రయాణము చేయుచుందువు. [illegible] ఇచ్చువాడవు. దేవతలకు అధిపతివి. వాణి (సరస్వతి)కి అధిష్ఠాతవు. [illegible] మహాబలశాలివి. మోక్షమునిచ్చు అధికారివి. నీవు ప్రకృతి అనగా [illegible] మహిమగల పదములు (శబ్ద, రూప, రస, గంధ, స్పర్శ) మూడు [illegible] దేవతలు, ఆకాశము, వాయు, అగ్ని, నిర్మలమైన జలము భూమి [illegible] మనస్సు, బుద్ధి, పది ఇంద్రియములు ప్రాణము, చిత్తము, ఆత్మ [illegible] మహాన్ చైతన్యశక్తివి. ఓ రాజరాజేశ్వరా! ఈ ప్రకట అప్రకటమైన [illegible] నీ రూపమే అభివ్యక్తమవుచున్నది. నీవు అభేద రూపముతో, ఈ [illegible] రమించియున్నావు. ఈ ప్రపంచము నీ అంశమే. శివుడు నీ రెండు [illegible] నమస్కరించుచుండును. నీవు అందరినీ జయించువాడవు. నీ చరణముల [illegible] ఉత్పన్నమయినది.

[illegible] నీవు ఆది, మధ్య, అంతము, అన్నిటి యందు వ్యాపించి వున్నావు. ఓ భగవాన్! [illegible] సర్వవ్యాప్తియైన నిన్ను చూస్తూ వుందురు. వస్త్రమున దారమువలె, కడవలో [illegible] మాట, కర్రతో చేసిన ఏనుగునందు కర్రవలె, కంకణము, [illegible] (కేయూరము)నందు స్వర్ణము చూడబడుచున్నది. ఆ భూషణములలో [illegible] ఏమనగా భ్రమరూపమైన వస్తువు యందు సత్యమను వస్తువును దర్శించుట [illegible] ప్రకారము ఈ మిథ్యా ప్రపంచమున శక్తి ప్రతీతమగుచున్నది; ఆ బ్రహ్మ [illegible] సత్యము యొక్క వస్తువు కారణమే. ఈ విధముగా నీవు మూలమైన చరాచరమున [illegible] వున్నది నీవే. గంభీరమైన నీ అంతఃకరణములు ఎవరికి తెలియదు. [illegible] తొలగించు గూఢార్థవిత అనగా కర్మవచనములందు ఉన్న అర్థమును [illegible] గుప్త రహస్యములను తెలుసుకొనువాడవు. గుప్తరూపుడవు, ఇంద్రియ [illegible] వాడవు. మహా (గొప్ప) జ్ఞానివి. జ్ఞాన స్వరూపుడవు. దానిని తెలుసుకొన్న [illegible] నీవే జ్ఞేయుడవు. (పదార్థము తెలుసుకొనబడును). జ్ఞాన ప్రియుడవు. జ్ఞాన [illegible] మిక్కిలి గరిమాశాలివి. భయంకరమైన ప్రపంచమనెడి వలయందు చిక్కుకొన్న [illegible] ఉద్ధరించువాడవు. నీ సంకల్పము సత్యము అనగా దృఢమైన ప్రతిజ్ఞ చేయువాడవు. [illegible] మహాకావ్యము యొక్క పూర్ణ ఆయువు. బ్రహ్మ యొక్క పూర్తి ఆయువు. కల్పము [illegible] యొక్క ఒక దినము) ఈ రెండింటి యొక్క ప్రలయం చేయగల అనగా అంతము [illegible] కల్పనకు వేరుగా, శేషనాగుని శయ్యపైన వసించువాడవు. నీ నేత్రములు [illegible] అందమునానున్నవి. నీ నాభియందు కమలము ఉదయించినది. నీవు [illegible] వలె కాంతిగల శరీరధారుడవు. మత్స్య ధ్వజము గలవాడవు. కోట్ల మన్మథుల [illegible] సౌందర్యముగల రాశివి. పుంజమువలె నుండువాడవు. సౌందర్యమున కోటి [illegible] సమానముగల వాడవు. నీవు భక్తులకు సులభుడవు. కానీ దుష్టులకు [illegible] నీ ఆరాధన అతికష్టముతో పూర్తి అగును. నీవు దుర్గుణముల వినాశకుడవు.

దుఃఖములను తొలగించువాడవు. నీవు బ్రహ్మకుమారులను సనకాది సనందులను తమ పరా, అపరా విద్యల గర్వముండగా, వారి గర్వమును దమనము చేసితివి. భక్తుల యెడ ప్రసన్నుడవు. జన్మ, మరణాది లోక పీడలను సమూలముగా తొలగించువాడవు. మోక్షదాతవు. నీపేరు పాపరూపముననున్న దూదిని కాల్చుటకు అగ్నివంటిది. నీ పేరు స్మరించిన వెంటనే పాపములు భస్మమగును. నీవు తృష్ణా రూపముననున్న చీకటిని నాశనము చేయు సూర్యునివంటి వాడవు. పృథ్విభారమును మోయు శేష రూపుడవు. శరణాగతుల భయమును తొలగించు వాడవు. కరుణానిధివి. దేవతల అనేక సమూహములు నీ చరణములకు వందనములు చేయుచుందురు. నీవు నీ హృదయమున మందారపుష్పములు హారము కల్గియుందువు. ఓ రావణుని వధించిన రామా! నేను తులసీదాసు సదా దుఃఖములతో వికలమయి నీకు నమస్కరించుచున్నాను. ఓ స్వామీ నన్ను రక్షింపుము.

13. ఓ రామా! నీవు భక్తుల దుఃఖములను తొలగించువాడవు. లోకమున శాంతివి స్థాపించువాడవు. మన్మథుని శత్రువు అగు శివునికి ఆనందము కలిగించువాడవు. శుద్ధ ఆత్మజ్ఞానివి. సత్, చిత్, ఆనందము యొక్క మేఘము. అనగా వీటిని వర్షింపచేయువాడవు. సజ్జనులను ప్రోత్సహించువాడవు. ఖర, రాక్షసులను వధించినవాడవు. హస్తములయందు అందమైన ఖడ్గము, డాలు. బాణము, ధనస్సు, శక్తి, శరీరముపైన కవచము, నడుమునందు అంబులపొదిని ధరించిన వాడవు. నీవు సత్యప్రతిజ్ఞుడవు. ముక్తిదాతవు. సర్వహితకారివి. సర్వదివ్యగుణములు కలవాడవు. సంపన్నుడవు. జ్ఞాన-విజ్ఞాన మూలజ్ఞాతవు. నీపేరు ఈ సఘన అంధకారముతో నిండిన జగత్తు అనే రాత్రిని వినష్టము కల్గించే కిరణములుగల సూర్యునికి సమానమైన వాడవు.

నీ తేజము ప్రఖరమైనది. నీవు ప్రపంచమున నిత్యనూతనుడవు. తాపములను పోగొట్టుదువు. రాజు శరీరమును ధరించిననూ, సాక్షాత్ తపస్సు యొక్క స్వరూపము. అజ్ఞానము నుండి వేరయిన పూర్ణ తపస్వివి. నీవు మానము, మదము, ద్వేషమును, మనోకామన, మోహరూపమనెడి సముద్రమును మథించునట్టి మథరాచలమువలె మరియు మనస్సును ఆలోచనలయందు నుంచువాడవు; వేదములయందు విఖ్యాతుడవు. వరములనిచ్చు దేవతలకు యజమానివి. వామనావతారుడవు. రజోగుణ రహితుడవు. నిర్మలవాణి సరస్వతి అధిష్ఠాతవు. వైకుంఠమునకు యజమానివి. కామ, క్రోధ, మోహ, లోభ, మద, ద్వేషాదులను నాశనము చేయగలవాడవు. క్షమా భావనను పెంపొందించునట్టి వాడవు. శాంతి స్వరూపుడవు. గరుడగామివి. నీవు పరమ పవిత్రుడవు. పాపములనెడి సమూహ రూపముననున్న వనమును భస్మము చేయునట్టి అగ్నిదేవుడవు. బ్రాహ్మణులకు భూషణుడవు. దూషణ రాక్షసులను సంహరించినవాడవు. విశ్వమునకు అధికారివి. పృథ్వీపతివి. వేదముల మస్తకము అనగా వాటిని నిర్వహించుటలో అధికారివి. సర్వలోకముల పాలకుడవు. ఇటువంటి ఓ రామా! నీకు జయమగుగాక.

నీవు పరిశుద్ధుడవు. రజోగుణాదుల నుండి ముక్తుడవు. శుద్ధస్వరూపుడవు. ఒకే రసము కలవాడవు. అనగా స్థిరమైనవాడవు. సంపూర్ణమైన కళల చేత ముక్తుడయినవాడవు. నీకళ చంద్రునివలె పెరుగుట తరుగుట ఉండదు. సదా స్థిరముగా నుండును. సర్వకళలకు కేంద్రము వంటివాడవు. కలియుగము చేత వికలులైన జీవులకు సంతాపమును తొలగించువాడవు. ఆనందరాశివి. సర్పములకు రాజుయైన శేషనాగు సర్పము మీద శయనించియున్నావు. నూతనమైన కమలపుష్పము వికసించినట్లు అందమైన కన్నులు కలవాడవు. క్షీరసాగరమున నివసించువాడవు. ప్రతి ఘటము (దేహములలో) లో నివసించువాడవు. నీ రెండు చరణములు సిద్ధులకు, కవులకు, విద్వాంసులకు ఆనందము కల్గించును. పాపాత్ములకు దుర్లభము. నీ చరణముల యందు పవిత్రమైన జలముగల గంగానది జనించినది. దానిని దర్శించినంత మాత్రముననే సర్వపాపములు తొలగును. నీవు నిత్యముక్తుడవు. అనగా మాయనుండి నిర్లిప్తుడయినవాడవు. దివ్యగుణ సంపన్నుడవు. రజోగుణాది మాయాత్మకమైన గుణము లేనివాడవు. ఆరు గుణములచే (ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సత్యము, శోభ, వైరాగ్యము మొదలగు వాటితో) యుక్తుడవయి వున్నావు. నియములకు విధాతవు అనగా అందరిని నియమముల యందుంచువాడవు. అందరిపైన శాసనముచేయగలవాడవు. లోకపాలకుడవు. లోకమునకు అధికారకుడవు. అనగా దానిని ఉత్పన్నము చేసినవాడవు. శరణాగతిని కల్గించువాడవు. నేను తులసీదాసును భవభయములను తొలగించువాడవు.

(సగుణ - నిర్గుణ సమన్వయము వున్నది)

14. ఓ రామా! నీవు దానవులను సంహరించిన వాడవు. దయాన ముద్రుడవు. దుఃఖమును తొలగించువాడవు. భయంకర పాపములను భస్మము చేయగలవాడవు. దోషములను తొలగించువాడవు. నీవు అనేక ఆభూషణములను ధరించినవాడవు. సూర్యునివలె ప్రకాశించువాడవు. తేజస్వివి. ఐశ్వర్యములతో సంపన్నుడవయి యున్నావు. ప్రపంచము యొక్క భయమును తొలగించువాడవు. అందరికి అభయమునిచ్చు వాడవు. బ్రహ్మ శివ మొదలగు విశ్వనాయకులయందు శిరోమణివి. నీవు భావనాతీతుడవు. అనగా మనస్సు, బుద్ధి, ఆలోచనలకు అందనివాడవు. శివుడు నీకు నమస్కరించును. నీవు శివభక్తులహితకారుడవు. పృథ్విని ఉద్ధరించినవాడవు. వరములనిచ్చు రామా! నీ శరీరము ఛవి (సౌందర్యము) శ్యామఘనము (మేఘము) వలెనున్నది. గోవర్ధన పర్వతమును ఎత్తినవాడవు. నీవు వాణికి (సరస్వతికి) అధిష్టాతవు. విశ్వమునకు ఆత్మవు. విరాట్ స్వరూపుడవు. రజోగుణములు లేనివాడవు. వైకుంఠమందిరమున విహరించువాడవు. ఆకాశము వలె సర్వవ్యాపకుడవు. సర్వులకు వందనీయుడవు. వామన అవతారమును ధరించిన వాడవు. సర్వశక్తి సంపన్నుడవు. బ్రహ్మజ్ఞానివి. బ్రహ్మస్వరూపుడవు. సర్వుల చింతలను (దుఃఖములను) తొలగించు వాడవు.

ఓ రామా! నీవు సహజముగా అందమైన రూపము, సౌందర్యము గలవాడవు. అందమైన ముఖము, మంచి మనస్సు గలవాడవు. సదా శుభములకు, మంగళ స్వరూపుడవయి, శుద్ధ సర్వజ్ఞుడవు. స్వేచ్ఛగా విహరించువాడవు. సర్వకర్మలకు మూలకారకుడవు. సర్వులకు కళ్యాణము కల్గించువాడవు. అందరిని పోషించువాడవు. అందరిపై విజయమును పొందువాడవు. సత్యప్రతిజ్ఞచేసి, ధృఢముగా నుండువాడవు. ప్రళయమును కల్గించువాడవు. నీవు సదానిత్యుడవు. మోహరహితుడవు. నిర్గుణుడవు. నిరంజన (మాయా రహితుడవు) స్వామివి. సర్వవిధాతవు అనగా విశ్వనిర్మాతవు. గొప్ప-గొప్ప కళ్యాణములకు మూలకారకుడవు నీవు. ఆనంద స్వరూపుడవు. మహిమగల స్థానము. మూర్ఖుడగు మధునాయక దైత్యుని సంహరించినవాడవు. అందరికి గౌరవము గల్గించువాడవు. స్వయముగా మానభావన రహితుడవు. కామదేవుని నాశకుడవు. అహంకారము లేని మాయారహితుడవు. అందమైన లక్ష్మికి పతివి. చేతియందు కమలము ధరించియున్నవాడవు.

నీవు కమలము వంటి అందమైన నేత్రములు కలవాడవు. సర్వకళలకు కేంద్రము. ధనుర్ధారివి. అయోధ్యస్వామివి. శుభములకు రాశివి. నీవు రాక్షసులనెడి మదించిన ఏనుగులను దమనము చేయు సింహరూపుడవు. భక్తుల మనస్సును పవిత్రము చేయువాడవు. వనమున నివసించువాడవు. నీవు పాపరహితుడవు. అద్వైతుడవు. నిర్దోషుడవు. నిరాకారుడవు. జన్మరహితుడవు. అపారుడవు (హద్దులేనివాడవు)వికార రహితుడవు. ఆనంద సాగరుడవు. నీకు ఏ నివాస స్థానము లేదు. సర్వవ్యాపకుడవు. విచ్ఛిన్నము చేయలేని పరిపూర్ణుడవు. భవరోగముల నుండి ముక్తుడవు. అనాదివి. మేఘనాథుని వధించిన లక్ష్మణునికి అన్నవు. తులసీదాసునగునేను ఈ భవ దుఃఖములలో పడివున్నాను. శోకము చేత బాధపడుచున్నాను. మిక్కిలి భయ భీతుడనయి వున్నాను. ఓ భక్తులను రక్షించువాడా! పరమ కళ్యాణధాముడా! ఓ పృథీపతి రామా! నాయటువంటి దుర్వినీతి అనగా ఉద్ధృతమైన అహంకారము గల తులసీదాసును రక్షింపుము.

(రామ, కృష్ణ, వామన ఆది సమ్మిలిత స్వరూపమునకు వందనము చేసెను. కృష్ణుడు యోగీశ్వరుడుగా వర్ణించబడిరి.)

15. ఓ శ్రీరంగ అనగా లక్ష్మీపతి! నాకు సత్సంగము నివ్వుము. నిన్ను పొందుటకు ప్రముఖ సాధనము ఇది. ఈ సత్సంగము భవ-భయ జన్మ మరణములను తొలగించును. నీ శరణుజొచ్చిన భక్తుల శోకమును హరించువాడవు. ఓ మురారి! సదా నీ చరణ పల్లవములను ఆశ్రితము చేసుకుని వున్నవారికి సదా నీ భక్తియే యుండును. వారి అజ్ఞానము చేత ఉత్పన్నము అయిన సందేహాలను తొలగించెదవు. దైత్యులు, దేవతలు, నాగులు, మానవులు, యక్షులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు ఇంకనూ ఇతర ప్రాణులన్నియు, సత్సంగ ప్రభావమున, ధర్మ, అర్థ, కామముల నుండి తొలగి పరమ పదమగు మోక్షమును

కలిగియున్నారు. ఈ మోక్షపదవి నిష్పాపమైన గతి అనగా జన్మ ఏదేని సాధన ద్వారా లభించదు. అది కేవలము భగవంతుడైన నీ ప్రసన్నత వలన లభించుచున్నాది.

వృత్రాసురుడు, బలి, బాణాసురుడు, ప్రహ్లాదుడు, మయాసుర వాల్మీకి మొదలగు గజము, గ్రద్ధ (జటాయువు), బ్రాహ్మణులకు బంధువు, స్వయంగా బ్రాహ్మణుడవయి, బ్రాహ్మణోచిత ధర్మకర్మలను త్యజించినట్టి అజామిలుడు, చాండాలుడు యవన ఆది సత్పురుషుల చరణామృతము పానముచేసినందున సమస్త పాపములను తొలగించితివి. మోక్షమునకు అర్హులను చేసితివి. ఈ సత్సంగము ప్రభావమున మానవులు శాంతులై (రాగద్వేష రహితులై) నిరపేక్షులై (కోరికలు లేనివారు) నిర్మమ (మోహ-మమతలేని) సత్వ, రజ, తమో గుణములు లేని, శబ్ద బ్రహ్మ అనగా వేదముల ప్రముఖమైన జ్ఞానులయి, బ్రహ్మవేత్తలయి సర్వశాస్త్రములయందు నేర్పుగలవారై సమదృష్టిగల్గి, తమ స్వరూపమును తెలుసుకొన్నవారై, తరువాత భేదభావనాముక్తులయి, సర్వులయందు భేదమును కల్గియుండకుండ తయారగుదురు. ఓ చక్రపాణి! ఇటువంటివారు వైరాగ్యమును గ్రహించి నీకు పరమ భక్తులయ్యెదరు.

లోకము యొక్క కళ్యాణము కొరకు సదా వ్యాకులపడువాడు, అహంకారమును, క్రోధమును త్యజించి ఎన్నో పుణ్యములు చేసినవారు, సాధువులు భక్తులున్నచోట బ్రహ్మ, శివులతోపాటు విష్ణువు క్షీరసాగరము వదలి వచ్చెదరు వేగముగా. వేదములే క్షీరసాగరము, వివేకము, మంధరాచలము, సర్వమునుల సమూహమే దానిని మథించు దేవదానవులు. వీరు ఈ సాగరమును మథించి, సత్సంగమమను సారమైన అమృతమును వెలికి తీసిరి. ఈ విషయమును రుక్మిణీపతియగు శ్రీకృష్ణుడు చెప్పెను. భావమేమనగా వేదజ్ఞానము సర్వమునులు, సర్వచింతన సారము. సత్సంగమే ఈ భువనము నుండి ముక్తి కల్గించునది. ఒకే ఒక సాధనము ప్రధానమయినది. సాధువుల, భక్తులనుంచి ఉపదేశములే శోకము, భయము, సందేహము, హర్షము, అజ్ఞానము వాసనల సమూహమును రఘునాథుని బాణము రాక్షసులను సంహరించునట్లు చిన్నా-భిన్నము చేసి నష్టము కల్గించును.

ఓ రామా! తన కర్మచేత ప్రపంచమున ఎక్కడైనా జన్మవున్నచో, అనేక మేనుల యందు కష్టమును సహించుచూ దారితప్పి తిరుగుచున్నపుడు, నాకు నీ భక్తియు మరల సత్సంగము లభించుగాక. నాకు దీనివలన విశ్రాంతి అనగా శాంతి కలుగును. మూడు రకములగు (దైహిక, దైవిక, భౌతిక) రోగములను దూరము చేయుటకు నీ భక్తియే ఒకేఒక ఔషదము. ఈ ఔషదము ఇచ్చు వైద్యులు అద్వైతులగు (చరాచరమున సమదృష్టి భావన గలవారు) నీ భక్త జనులే. భక్తుడు, భగవంతునిలో కించిత్ భేదము లేదు. అనగా భక్తుడు, భగవంతుడు సమానమే. ఈ మలిన బుద్ధిగల తులసీదాసునగు నేను ఇదియే చెప్పుచున్నాను. మలినబుద్ధిగల తులసీదాసునగు నేను ఏమి చెప్పగలను ఇది శాశ్వత సత్యము.

(వృత్రాసురుడు పరమ వైష్ణవుడు. ఇతడు ఇంద్రుని వజ్రాయుధమున చంపబడెను. యుద్ధ సమయమున భక్తి జ్ఞానముల సారగర్భితమైన వ్యాఖ్య చేసెను.)

16. ఓ కమలారమణ! నీవు దుఃఖములను హరించువాడవు. గొప్ప సంతాపములను వినాశము చేయుదువు. నేను భవసాగరమున మునిగిపోవుచున్నాను. నీవు నీ కరమలముల ద్వారా సహారా (ఆసరా) ఇచ్చి రక్షించుము. నన్ను ఉద్ధరించుము. దూషణదైత్యుని వధించిన ఓ రామా! నీవు అజ్ఞానమనెడి చంద్రుని మ్రింగుటకు రాహువు సమానము. కామ రూపమునను్న మహా మదించిన ఏనుగులను (అహంకారమును) మర్ధనము చేయుటకు సింహము వంటివాడవు. శరీరమనెడి (రూపమున) బ్రహ్మాండమునందు వున్న ప్రవృత్తియే లంక అనుకోట. లంకకోట నిర్మాణము మయ అను పేరుగల దైత్యుడు చేసెను. ఈ ప్రవృత్తి రచన మనస్సుతో చేసెను. లంకలో అనేక మేడలు సేనానాయకులున్నట్లు ప్రవృత్తి రూపమనెడి లంకకోటలో అనేక కోశములు ఉన్నవి. (శరీరమున ఐదు కోశములున్నట్లు భావించబడినది : (1) అన్నమయ, (2) ప్రాణమయ, (3) మనోమయ, (4) విజ్ఞానమయ, (5) ఆనందమయ) రూపముగల మహల్లు (మేడలు) వున్నవి. సత్యగుణ, రజోగుణ, తమోగుణము అను ముగ్గురు సేనా నాయకులున్నారు. లంకకోట చతుర్ధిక్కుల నుండి లోతైన, భయంకరమైన సముద్రము చుట్టివున్నది. అటులనే ప్రవృత్తి అనెడి లంక కోటను దేహాభిమానము అనురూపమునను్న భయంకరమైన, లోతైన సముద్రము చుట్టివున్నది. ఇందులో రాగద్వేషములు అను పేరుగల మొసల్లు వున్నవి. సంపూర్ణమైన మనసులోని కోరికలు, విషూసక్తి అను సంకల్ప వికల్పములను అలలు ఎగురుచుండును.

ఈ ప్రవృత్తి అను లంకకోటలో మోహరూపమనెడి రావణుడు, అహంకారమనెడి కుంభకర్ణుడు; శాంతిని భంగము చేయునట్టి మేఘనాథుడును కామము స్థిరమైయున్నది. ఇక్కడ లోభమనెడి అతికాయుడు, మత్సర రూపియగు మహోదరుడు (దుష్టుడు) క్రోధ రూపియను మహాపాపి - దేవాంతకుడను రాక్షసుడు, యోధులు నివసించుచున్నారు. మనజూద, మదరూపియగు శూలపాణి, ద్వేషరూపమనెడి ఖరుడు దుర్ముఖి, కపట రూపియగు అకంపనుడు, దర్పరూపమున మనుజూదుడు, మదరూపి శూలపాణి అనుపేరుగల దైత్యుల సమూహమున్నది. చాలా పరాక్రమమైన జయించుటకు కష్టమయినవారు (అజేయులు). వీటితోపాటు మోహాది ఆరుగురు రాక్షసులతోపాటు, ఇంద్రియ రూపమునను్న అనేక స్త్రీ రాక్షసులు వున్నారు. ప్రవృత్తిలో కూడ మోహాది భావనలు నిండివున్నవి. ఇంద్రియములతో రమించుచుండును. ఇందువలన వీటిని జయించుట అసంభవము. ఓనాథా! నీ చరణ కమలముల సేవకుడగు ఈ జీవుడే రాక్షసులతో నిండిన లంక కోటలో ఏకాకిగానున్న విభీషణుడు. ఈ పేదవాడు ఈ దుష్టుల వనమునవుంటూ, చాలా దిగులుతో తనకాలమును గడుపుచున్నాడు. నియమమనెడి దేవతలు, యమ రూపమునను్న లోకపాలకులు, ఇంద్రాదులు కూడ మోహరూపీ రావణుని స్వాధీనములోనున్నారు. మిక్కిలి భయభీతులుగానున్నారు. అనగా యమ నియమాదులను పాటించనందును, జీవుడు చాల వికలుడైవున్నాడు. మోహము అనునది అతనిని సదా పీడించుచున్నది.

ఓ నాథా! నీవు దశరథరాజు ఇంటియందు కౌసల్యగర్భమున భూభారమును పోగొట్టుటకే

జన్మించితివి. సుగుణ రూపమున జన్మించితివి. ఇక్కడ జ్ఞాన రూపమనెడి దశరథుడు, సుందర భక్తిరూపమున కౌసల్య గర్భమునుండి, మోహాదులను నశింపచేయుటకు ప్రకటన అయితివి. ఓ జానకీ వల్లభా! నీవు భక్తుల దుఃఖమును చూచిన వెంటనే, తండ్రి మాట ప్రకారము వనయాత్ర చేసితివి. ఇక్కడ జీవరూపియగు భక్తుని కష్టము చూచి, దశరథుని ప్రేరణతో, హృదయమనెడి వన రూపమునకు వచ్చితివి. జ్ఞానము ద్వారా నీ రూపమును ప్రకటించుము. మోక్షము యొక్క అనేక మార్గములున్నట్లు, (సాధనములు) ఎలుగుబంట్లు, వానరులు మొదలగు సుగ్రీవుడనే వివేకముతో ప్రపంచమనెడి సముద్రమును బంధించుము. (వంతెన నిర్మించుము) ప్రబలమైన వైరాగ్యమనెడి హనుమంతుని విషయ వాసన రూపముననున్న వనమును మేడలకు అగ్నివలె భస్మము చేసెదవు. పూర్ణజ్ఞానరూపుడనగు రఘునాథా రామా! భవ దుఃఖములను హరించు, నీ ఈ రూపమనెడి విభీషణు భక్తుని కొరకు మోహరూపమనెడి దుష్టరావణుని వంశ సహితముగా నాశనము చేయుము. తులసీదాసు హృదయ కమలమునందు. నీ అనుజుడగు లక్ష్మణుడు, పత్ని సీతతో శాశ్వతముగా వుండుము. సమాధి, జప, తప మొదలగు మోక్ష సాధనముల ద్వారా జ్ఞానోదయమైనప్పుడు, మానవుని శరీర అభిమానము నశించును. ఆత్మజ్ఞానము కల్గినప్పుడు హృదయమున శుద్ధజ్ఞానము ప్రకాశించును. జీవునికి పరమ శాంతి కల్గును.

17. రఘుకుల శ్రేష్టుడా! నీవు దీనులను ఉద్ధరించువాడవు. కరుణానిధివి. పాపసమూహములను నశింపచేయువాడవు. నీవు ఆత్మజ్ఞానము యొక్క పరిశుద్ధస్వరూపుడవు. కృపామూర్తివి. రాజులలో సర్వశ్రేష్టుడవు అనగా చక్రవర్తివి. దేవతలకు సుఖము కల్గించువాడవు. ఖర అను పేరుగల దైత్యుని వధించితివి. ఓ మురారి! ఈ ప్రపంచమనెడి వనము మిక్కిలి భయంకరమైనది. చాలా దట్టమైన, దుర్గమమైన, శుభాశుభ కర్మలనెడి వృక్షములతో నిండివున్నది. కర్మ రూపీ వృక్షముల యందు వాసన అనెడి లతలు పెనవేసుకుని వ్రేలాడుచున్నవి. ఆ వాసనలు పూర్తికానందున ఉత్పన్నమయిన వ్యాకులత అనెడి రూపముననున్న అసంఖ్యాకమైన పదునైన కంటకములు వ్యాపించియున్నవి. ఇటువంటి సఘనమైన వృక్షములతో నిండిన అడవి భయంకరముగా నున్నది. ఈ ప్రపంచమనెడి భయంకరమైన అడవిలో మానవుని అనేకరకములైన చిత్తవృత్తాలే. వనమున వున్న మాంసాహారియగు డేగలు, గుడ్లగూబలు, కాకులు, కొంగలు, గ్రద్దలు మొదలగునవి. ఇవి చాలా చెడ్డవి. చెడుపు చేయుటలో నేర్పుగలవి. దోషములు అను బలహీనతలు కనపడిన వెంటనే యాత్రికుల మనస్సునందు సదా దుఃఖమును కల్గించుచుండును. అనగా మానవుని చిత్త ప్రవృత్తులు సదా మానవునికి దుఃఖమునే కల్గించుచున్నవి. అతనిని సుఖముగా నుండనివ్వవు.

ఈ అడవియందు క్రోధమనెడి మదించిన ఏనుగు కామరూపముననున్న సింహము, మదమనే తోడేలు, అహంకారమనెడి ఎలుగుబంటి మొదలగు జంతువులు దయలేనివి. ఇచ్చట మత్సరము (ద్వేషరూపమగు) నిర్దయమగు దున్నపోతు, లోభమనెడి సూకరము

(పంది): మోసము అనెడి నక్క, దంభ రూపమడనెడి అడవిపిల్లి వున్నది. ఇక్కడ కపటరూపమను మిక్కిలి వికటమైన కోతి వున్నది. మోసము అనెడి పెద్దపులి వున్నది. భక్తులనెడి జింకల గుంపులను సదా పీడించుచుండును. ఆపదలను సృష్టించుచుండును. విశ్వమును పాలన చేయు రామా! నా హృదయమునసున్న అసహ్యామైన కష్టములను చూచి, నీ శరణుజొచ్చియున్నాను. నన్ను రక్షించుము. ఈ ప్రపంచమనెడి అడవిలో విశాల అహంకారమనెడి లంఘించుటకు (దాటుటకు) వీలుకాని పర్వతమున్నది. అందులో మహామోహమనెడి సహావున్నది. అందులో చిమ్మచీకటి వ్యాపించియుండును. ఇక్కడ చిత్తరూపి బేతాలుడు మనస్సు రూపి. రాక్షసులు, రోగరూపి ప్రేతగణములు వున్నవి. భోగరూపి వృచ్ఛకముల తీవ్రమైన విషమున్నది.

ఈ ప్రపంచమనెడి వనమున విషయ-సుఖములనెడి తీవ్ర వాంఛ అనెడి ఈగలు, దోమలు; దుష్టరూపమగు కీచురాల్లు వున్నవి. ఓస్వామి! ఇక్కడ రూపము, రసము, గంధము మొదలగు విషయరూపి సర్పములున్నవి. ఓనాథ! నీత్రిగుణాత్మకమయిన మాయ నాయటువంటి మూర్ఖుని కఠినమైన ఈ వనము (అదవి)లోకి తెచ్చి పడదోసినది. ఓ గరుడవాహనా! నేను అంధున్ని అనగా నాకు జ్ఞాన నేత్రములు లేవు. నాకు ఆత్మజ్ఞానము కలుగలేదు. ఇందువలన నేను దీనిని ఎటుల దాటిపోగలను? ఇక్కడ అడవిలో ప్రవృత్తి అనెడి లోతైన నది ఉన్నది. అది పాపరూపమనెడి జలము చేత నిండి నిబిడీకృతమయియున్నది. దీని ప్రక్కకు చూడటమే కష్టము. దీనిని దాటుట మిక్కిలి దుష్కరము. దీనికి ఒడ్డూ అదుపూ లేదు. ఈ నదియందు కామ, క్రోధ, లోభ, మదము, మోహము, మత్సరము అనెడి మొసల్లున్నవి. ఇందులో ఇంద్రియములనెడి చిన్న మొసల్లున్నవి. సుడిగుండములు నిండివున్నవి. శుభము, అశుభము అనెడి రెండు కర్మలు ఈ నది ఒడ్లు (గట్టులు) దుఃఖమనెడి దీని ప్రవాహము మిక్కిలి భయంకరముగానున్నది. ఓ రఘువంశపు భూషణుడా! రామా! ఈ దేష్యముల సమూహములు నన్ను ఈ అడవిలో నిర్బంధించి వుంచినవి. నీ దాసుడనగు తులసీదాసుడనగు నేను, సదా దిగులు చేత మిక్కిలి వ్యాకులడనై యున్నాను. ఓ ప్రభూ! ఈ భయంకరమైన కలియుగము యొక్క భయము నుండి భయభీతుడనయిన నన్ను దయచేసి రక్షించుము.

(శాస్త్రములయందు కర్మలు అనేక రకములుగా భావించబడినవి. (1) కర్మ, అకర్మ, వికర్మ (2) శుభ, అశుభ కర్మ (3) సకామ, నిష్కామ కర్మ, (4) సంచిత, పారబ్ధ, క్రియ మానకర్మలు (5) వైధ (చట్టబద్ధమైన), నిషిద్ధ కర్మలు (6) సుకృత్య, కుకృత్య, కృత్య మరియు అకృత్య కర్మలు.)

18. తులసీదాసునగు నేను ఇట్లు చెప్పుచున్నాను. కరుణాపుంజ నేను ధ్యానములలో నిమగ్నమయి జ్ఞానమునకు మూలమయిన నర నారాయణులకు నమస్కరించుచున్నాను. వారు సమస్తలోకమును (ఉపకారమును) కల్గించువారు. దయకల హృదయము కలవారు. తపము చేయుటలో రతులయినవారు. భక్తులకు సదా అనుకూలురు, వారి శరీరపు

[illegible] నీలప్రకాశము గల వినూత్న కమలము (నల్లకలువ) వలెనున్నది. సౌందర్యము [illegible] మన్మథుల సౌందర్యము కంటె మిన్నయై యున్నది. అసంఖ్యాకములైన కాంతి [illegible]ములవలె నున్నది. వారి నేత్రములు ఇప్పుడే వికసించిన కమలములవలె నున్నవి. [illegible] చంద్రునివలె. హాస్యము వెన్నెల కిరణముల సమూహముల వలె నున్నది. వారు [illegible] సౌందర్యములకు కేంద్రనిధి. సర్వగుణ సంపన్నుడు, బ్రహ్మ, వేదములు, పండితులు, [illegible] ద్వారా ఆరాధించబడు మాన-సమ్మానమను భావనలతో సదా, నిర్లిప్తుడనైయుందువు. [illegible] కమలముల వంటి హరిచరణముల నుండి ఉత్పన్నమైన గంగ యొక్క జలరూపమైన [illegible] రూపమునసనున్న భ్రమరములు సదా పానము చేయుచుండెదరు.

ఇంద్రుని ద్వారా పంపబడిన కామదేవుని భయంకరమైన మదమును భంగము [illegible]వాడవు. క్రోధరహితుడవు. శుద్ధజ్ఞానివి. బ్రహ్మచారివి. ప్రలయ సమయమున [illegible] మునులయందు శ్రేష్టుడగు మార్కండేయ మునికి ప్రలయ దృశ్యమును [illegible] వాడవు ప్రభువు. సామర్థ్యము కలవాడవు. వన, పర్వత, నదులతో పరిపూర్ణమగు [illegible]శ్రమమున సదా పద్మాసనమున నిశ్చలమైన భావముతో కూర్చొని వుందువు. [illegible]. గొప్ప. గొప్ప యోగులకు దేవతలకు ఆనందమునిచ్చువాడవు. సర్వులకు [illegible]మును కల్గించువాడవు. మీ దర్శనము మిక్కిలి సాటిలేనిది. సాటిలేని దర్శనము [illegible]కి ఆనందము, శుభప్రదము.

జగత్తుకే యజమానికి నీవు. నీ బదరికాశ్రమమున, మీనభంగ్ అనుపేరుగల [illegible]మున్నది. దానిని చూచి గొప్ప గొప్ప సాహసవంతులు చలించెదరు. నా మనస్సులో [illegible]మానమను పర్వతమున్నది. మనస్సు చూచుటకు విముఖమగును. అక్కడ చిత్తభంగమను [illegible]మున్నది. దానిని చూచివచ్చి పోవు భావన వుండదు. ఇక్కడ మద రూపమనెడి [illegible]తమున్నది. అక్కడ మిక్కిలి దుర్గమమగు పర్వతములున్నవి. ఈ దర్శనమార్గమున లోభ. క్రోధాది మహాభయంకర పర్వతములున్నవి. అక్కడ సింహ, వ్యాఘ్రములు (పులి), [illegible]కరమైన విఘ్నములున్నవి. ఇక్కడ ద్వేషము మత్సరము రాగరూపమై పెద్ద విఘ్నములున్నవి. వాటిలో ప్రతి యొక్క గొప్ప దయలేని దుష్టులున్నారు.

బదరికాశ్రమము మార్గమున దోపిడి చేయువారు, పదునైన కత్తులతో యాత్రీకులను [illegible]. అక్కడ మదించిన స్త్రీవాలు చూపుల పదునే భయంకరమైన కామరూపముననున్న [illegible]తో నిండిన ఖడ్గము త్రిప్పు స్త్రీ వున్నది. కామిని యొక్క కత్తి, ఖడ్గము ధీర గంభీరమైన మనస్సుగల మానవులకు కష్టము కల్గించును.

[illegible]మేము ఎటుల నిర్మలమైన మనస్సుగల వ్యక్తులలో లెక్కించబడగలము? అనగా [illegible] ప్రభావము నుండి ఎట్లు రక్షించుకొనగలము? ఆత్మ దర్శన మార్గము అత్యంత [illegible]కరము. దుర్గమము. ఇక్కడ కామ, క్రోధాది నీచ మానవుల సాంగత్యమున్నది. వెంట వైరాగ్యమనెడి ఊత కర్ర కూడ లేదు. ఇటువంటి భయంకర స్థితియందు పడియున్న ఈ మీ దాసుడు (తులసీదాసు) నీ దర్శనము కొరకు వికలుడయియున్నాడు. మాయాజాలమున

పడి కష్టములను అనుభవించుచున్నాను. ఇందువలన ఓ నాథా! నన్ను రక్షించుము. ఈ నీ దాసుడగు తులసీదాసు దగ్గర ధర్మరూపమగు దారిబెత్తము లేదు. నడుచుచూ నడుచుచూ అలసిపోయితిని. చాలా దుఃఖముతోనున్నాను. మోహము అతని బుద్ధిని చెడగొట్టినది. ఇందువలన ఓ సుదర్శన చక్రధారీ ఓ తేజస్వీ! బలమునకు, సుఖములకు కేంద్రమయినవాడవు నీవు. త్వరగా రమ్ము. త్వరగా వచ్చి నీ కమలకరములతో నాకు సహాయము చేయుము.

(నారాయణ అనగా జలమును నివాసమున్నవాడు విష్ణువు క్షీరసాగరుడుగా భావించినాడు.)

19. ఓ బిందూమాధవ! నీవు సంపూర్ణ సుఖమనెడి వర్షమును వర్షింపజేయు మేఘము. సంపూర్ణ సుఖములకు మూలకారకుడవు. నీ నివాసము నుండి ఆనంద వనమను కాశిని పవిత్రము చేయుదువు. రాగ ద్వేషములనుండి జనించిన దుఃఖములను తొలగించువాడవు. నీ పాద చరణ కమలముల యందు బ్రహ్మ, శివ, సనక - సనందనాది, శేషనాగుడు, మునిగణము భ్రమ రూపమున సదా నివసించుచున్నారు. అనగా ఎల్లవేళలా నీ చరణ కమలముల యందున ధ్యానము కలిగియుందురు. నీ వర్ణము స్వచ్ఛమైన నీలమణి (మరకతేము) వలెనున్నది. నీ సౌందర్యము కోటి మన్మధుల సౌందర్యమునకు సమానముగా నున్నది. నీవు పీతాంబరమును ధరించినందున నీల మేఘమున విద్యుత్‌కాంతివలె నున్నది. నీ నేత్రములు నూరు పత్రములు గల కమలము వలెనున్నవి. చూపు మనోహరముగానున్నది. నీవు భక్తులకు సుఖము కల్గించువాడవు. స్వాభావికముగా సదా కరుణతో ద్రవించుచుందువు. అనగా సహజ భావముతో సర్వులపైన కరుణ చూపెట్టుచుందువు. రాక్షసులనెడి వనమును భస్మము చేయు అగ్నివంటివాడవు. మోహమనెడి రాత్రిని తొలగించు సూర్యునివంటివాడవు. నీవు నీ నాల్గు భుజములయందు చక్రము, కౌముది అను పేరుగల గద, కమలము, శంఖమును ధరించి వుందువు. నీ కరకమలములయందు, కమలముపై రాజహంసనున్నట్లు శోభాయమానముగానున్నది.

నీ శిరస్సుపైన కిరీటము, కర్ణములయందు కుండలములు, లలాటముపైన తిలకమువున్నది. నీ కౌశములు భ్రమర సమూహమును బోలివున్నది. నీ కనుబొమలు, దంతములు, అధరములు, నాసిక చాలా అందముగానున్నవి. నీ కపోలములు అందముగానున్నవి. కంఠము శంఖమువలె సౌందర్యము గల్గి మృదువుగా, సుఖమునకు హద్దుగానున్నది. నీ చిరునవ్వు చంద్ర కిరణము వలె, కుందపుష్పము వలె నున్నది. ఓ హరి! నీ వక్షస్థలముపైన నవీనమైన తులసీదళములతో కూడిన పూలహారము, శ్రీవత్స చిహ్నము సౌందర్యము శోభిల్లుచున్నవి. నీవు బ్రాహ్మణులను గౌరవించువాడవు. మిక్కిలి ఎక్కువ ధన్యుడవు. క్రోధ రహితుడవు. జన్మ రహితుడవు. అంతులేని బలశాలివి. అనంతమైన మహిమ గలవాడవు. నీ మెడలో హారము, భుజములయందు రత్నచితమైన స్వర్ణ కాయూరము (బంగారు కడియము), కంకణములు. నడుమునందు మణులు తాపిన మొలత్రాడు ధరించియున్నావు. నీ చరణముల రెండింటియందు అందమైన మృదునాదము

చేయు నూపురములున్నవి. నీ అంగములన్నియు అందముగా నున్నవి. నీ వేషమంతయు లావణ్యముగా నున్నది.

నీ దక్షిణ దిశలో అనగా చరణప్రాంతము నందు సంపూర్ణ సౌభాగ్యముల మూర్తి వున్నది. ముల్లోకములకు శోభ నీవే. సముద్రుని కన్యయగు లక్ష్మికి శోభాయమానము చేయుచున్నావు. నీవు గంగానదికి సమీపమున అందముగానున్న దేవాలయమునయున్నావు. నిన్ను దర్శించిన మానవులు మిక్కిలి అదృష్టవంతులు. నీవు సంపూర్ణ కళ్యాణములకు స్థానము. గొప్ప గొప్ప సందేహములను తొలగించువాడవు. పాపరూపమను వనమును జ్వలింపజేసి భస్మము చేయగలవాడవు. కష్టములను తొలగించగల వాడవు. నీవు విశ్వమును ధరించిన వాడవు. లోక కళ్యాణ కారకుడవు. అజేయుడవు. ఇంద్రియ జన్య జ్ఞానమునకు వేరుగా నుండుదువు. శివుడవు అనగా కళ్యాణ మూర్తివి. విశ్వము సృష్టించి, అభివృద్ధి చేసి లయము చేయువాడవు. అనగా నీవు బ్రహ్మ, శివ, విష్ణువు. నీవు జ్ఞానము - ఆత్మ జ్ఞానివి. వైరాగ్యములకు ఐశ్వర్యములకు కేంద్రము, అణిమాది అష్టసిద్ధులను ఇచ్చునట్టి మహాదానివి. తులసీదాసునగు నన్ను. లోకము అనెడి సర్పము మ్రింగుచున్నది. ఇందువలన నేను చాలా భయభీతుడనగుచున్నాను. గరుడపైన కూర్చొనే రామా! నన్ను రక్షించుము. అనగా నీ గరుడ వచ్చి ప్రపంచమనెడి సర్పమును తినును. ఈ విధముగా నేను భవరూపముననున్న జన్మ మరణములనుండి విముక్తుడనయెను.

(తులసీదాసు కేవలము గరుడను పంపమని కోరుచున్నాడు. ప్రపంచమనెడి సర్పమును గరుడ మ్రింగును.)

20. ఈ మానవ జీవితము ప్రాప్తించినందుకు అన్నిటికంటె గొప్పఫలము, గొప్ప మహాత్యము ఏమనగా నా నేత్రములు తృప్తిగా కాలిగోరు నుండి కనురెప్పవరకు మొత్తము రూపమునంతయు, పరమ సుందరమైన బిందుమాధవుని సౌందర్యమును దర్శించుటకు అవకాశమునిమ్ము దేవా! బిందు మాధవుడు నిర్మలమైనవాడు. కిశోర అందమైన, పుష్టికరమైన దేహము. అతని శ్యామవర్ణము, అతని సౌందర్యమును ఇంకనూ ఇనుమడింపజేయుచున్నది. నల్లకలువ, మేఘము, తమాల వృక్షము, నీలమణి ఇతనికి శోభను కల్గించుచున్నవి. (శరీర కాంతిని పెంపొందించినవి) అనగా ఈ వస్తువులన్నియు ఈయన శరీరమునుండి నీలకాంతిని పొందినవి. భావము ఏమనగా ఈ వస్తువుల సౌందర్యము కంటె బిందు మాధవుని శరీరకాంతి మిన్న.

నీ కోమల చరణ కమలములు చిహ్నములు శుభమై (24 చిహ్నములు) వున్నవి. పాదములు వ్రేల్లు, బొటన వ్రేళ్ళ గోరులు ఉపమానము అభూతపూర్వము. (గతములో ఎవరికీ లేకుండెను) వారిని చూచినప్పుడు, ఎఱ్ఱని, నల్లని కలువలలో మణిజటిత పత్రములు ఉత్పన్నమయినవి. కమల పత్రములు మణిజటితములు కాదు. ఇది అభూత పూర్వమయిన ఉపమానము. ఆ చరణములయందు మణిజటితమైన స్వర్ణ సమానమైన

మనస్సును హరించు నూపురము (అందెలు) భక్తులకు ఆనందమును కల్గించును. విష్ణువు, శివుని హృదయమును సుందరమయిన భవనమని భావించి అక్కడ వివిధ రూపములలో నివసించుచున్నట్లు ద్యోతకమగు చున్నది. ఆయన కటి (నడుము) ప్రదేశమున వున్న మొలత్రాడు మధురమైన ధ్వనిని కల్గించుచున్నది. వర్ణించుటకు వీలుకానంత సౌందర్యము గలవాడు. స్వర్ణ కమలముల అందమైన మొగ్గల మధ్య భ్రమరాలు రొద చేయుచున్నవేమో! మొలత్రాడుకు కట్టిన చిన్న చిన్న గంటలు, స్వర్ణము మొగ్గలు వాటి మధ్య కన్పించుచున్న శరీర భాగములు తుమ్మెదలవలెనున్నవి.

ఆయన ప్రశస్తమైన వక్షస్థలము పైన భృగురుషి యొక్క చరణ చిహ్నములు మిగిలి అందముగ అంకితమయి యున్నది. వారి చేతులయందు శోభిల్లు కంకణములు విభిన్నమైన ఆ భూషణములు చాల అందముగ కనపడుచున్నవి. బ్రహ్మయే ఇతనిని సృష్టించినప్పుడు తానే స్వయముగా రూపొందినాడు. మెడలో వున్న గజముక్తముల హారము మధ్య రత్నము శోభిల్లుచున్నది. దాని సౌందర్యము వర్ణించలేము. నీలమేఘము పైన నక్షత్ర హారము మధ్య నవగ్రహములు తాము వుండుటకు స్థానమేర్పరచుకొన్నవి అనునట్లున్నది. (నవగ్రహములు - సూర్య, చంద్ర, మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహువు, కేతువు) ఇక్కడ విష్ణువు శరీరము నీలమేఘము. గజముక్తల హారము, తారాగణమండలి, పతకములో పొడిగించిన అనేక రత్నములు నవగ్రహములవలె నున్నవి.

వారి సర్పసమానమైన శరీరము, ఏనుగు తిండము వలె నల్లగా, చిక్కగా, బలిష్టముగా, హస్తములయందు గద, శంఖము, చక్రము, పద్మము శోభిల్లుచున్నవి. వారి యెడ సౌందర్యము హద్దులేనిది అనగా అద్వితీయము. రూపము అందముగా నున్నది. చిబుకములు, అధరములు, ముఖ సౌందర్యము సాటిలేనిది. వారి దంతముల కాంతిని చూచి వజ్రములు, స్వర్ణము, మొగ్గ, మెరుపు కాంతి సిగ్గుపడుచున్నవి. వారి నాసిక, కపోలములు, అందమైన కుండలముల చేత అలంకరించిన చెవులు, కనుబొమలు, నాకు ఇష్టమయినవి. తలపైన వుంగరముల కేశములున్నవి. వాటిపైన కిరీటము ధరించబడివున్నది. లలాటము పైన తిలకము అలంకరింపబడినది. విద్యుత్తు యొక్క రెండు చిన్న చిన్న రేఖలు తన సహజమైన చంచలత్వమును త్యజించి చంద్రునిలో నివసించుచున్నవేమో! అని ఉపమానము చెప్పవచ్చును. పీతాంబరమును ధరించియున్నాడు. దాని ఉపమానమున నా హృదయము జనించలేకయున్నది. నా రమణుల చేత కూర్చబడిన నీల పర్వత శిఖరమున స్వర్ణవస్త్రము శోభిల్లుచున్నట్లున్నది.

ఇటువంటి బిందుమాధవుని దక్షిణ దిశ అనగా చరణముల దగ్గర కూర్చున్న లక్ష్మి, తమాల వృక్షము సమీపమున నీలవస్త్రమును ధరించి, ఏదో స్వర్ణలత కూర్చుని శోభిల్లుచున్నట్లున్నది. వందలాది సరస్వతులు, శేషనాగుడు, నాల్గువేదములు, అన్ని కలసి శోభను వర్ణించిన, అధిగమించలేరు (వర్ణించ సాధ్యపడదు) సరి మందబుద్ధినగు నేను తులసీదాసును ఏ విధముగా ఈ శోభను వర్ణించుటలో సమర్థుడనయ్యెదను.

(బిందుమాధవుని విగ్రహము కాశిలో వున్నది.)

సూర్య, చంద్ర, భౌమ, బుధ, గురు, శని, రాహువు, కేతువు నవగ్రహములు - (1) సూర్యుని, మంగళ రంగు ఎరుపు. (2) బృహస్పతి రంగు పసుపు పచ్చరంగు. (3) శని రాహు, కేతువుల రంగు నలుపు (4) బుధుని రంగు - ఆకుపచ్చ (5) చంద్రుని, శుక్రుని రంగు - శ్వేతము (తెలుపు)గా భావించబడుచున్నవి.)

21. ఈ మానవ శరీరమును పొందినందుకు; ఫలితము ఏమనగా మన చంచల స్వభావమును వదలి, స్థిరులమయి, ఒక క్షణము సంపూర్ణ సౌందర్య అంగములు గల బిందు మాధవుని దర్శించుటయే. వారి మృదుచరణములు ఇప్పుడే వికసించిన ఎర్రని కమలముల వలెనున్నవి. వారి నఖముల కాంతి హృదయములోని జ్ఞానాంధకారమును తొలగించును. ఈ చరణముల యందు వజ్ర, ధ్వజ, యవలు, కమలము మొదలగు అందమయిన రేఖలు అనస్సు అనెడి ఏనుగును, వశములో ఉంచుకొనుటకు అంకుశ చిహ్నము ప్రజ్వరిల్లి వున్నది. ఈ చరణములయందు రత్న ఖచిత స్వర్ణ అందెలు, నడుమున నున్న మొలత్రాడు నుండి మధుర శబ్దములు అందముగా నున్నవి. విద్యుత్తువలె పొట్టపైన మూడు రేఖలు, నాభిసరోవరము వలె లోతుగానున్నది. అక్కడి నుండియే బ్రహ్మవంటి జ్ఞాని జన్మించెను. వక్ష స్థలముపైన వరమాల వున్నది. మధ్యభాగమున మాణిక్య పతకము శోభాయమానమై యున్నది. అచ్చటనే వక్షస్థలముపైన భృగుమహర్షి చరణ చిహ్నము బలిష్టముగా మనస్సును ఆకర్షింపచేయుచున్నది. వారి శరీరము రంగు నీలకమల పుష్పము వలె నున్నది. దానిపైన పీతాంబరము పచ్చని పట్టు వస్త్రము శోభను వర్షింపచేయుచున్నది.

హస్తములయందు మనోహరమయిన కంకణములు, కేయూరము వున్నవి. అంగుళీకము (ఉంగరము) సాటిలేనిది. ఆనందమును కల్గించుచున్నది. ఏనుగు తొండము వలె నాలుగు హస్తములు అందముగా, బలిష్టముగా నున్నవి. నాల్గు చేతులయందు అందమయిన గద, కమలము, శంఖము, చక్రమును ధరించియున్నావు. నీ కంఠము శంఖమువలెనున్నది. ఎత్తయిన, పైకెగసిన నాసిక (ముక్కు), నూతన కమలముల వంటి నేత్రములు, చిబుకము, దంతములు, అధరము, చంద్రునివంటి ముఖము, నిర్మలమయిన హాస్యము, సేవకులకు, భక్తులకు ఆనందము కల్గించుచున్నది. వారి కపోలములు అందముగానున్నవి. కర్ణములలో కుండలములు, తలపైన కిరీటము, లలాటమున అందమయిన తిలకము వున్నవి. కనుబొమలు అందముగానున్నవి. రూపము మోహింప జేయునదిగానున్నది. వారి కేశముల నల్లదనము చూచి తుమ్మెదలు సిగ్గుపడుచున్నవి. ఆయన గుణము, రూపము, శీలములకు గని వంటివారు. వారి దక్షిణ దిశ అనగా చరణముల వద్ద లక్ష్మీదేవి కూర్చుని వున్నది. చరణ సేవలో నిమగ్నమయియున్నది. (లక్ష్మి సముద్ర పుత్రిక) వారి కృపాదృష్టి ఆకాంక్షయంగు, బ్రహ్మ, శివుడు, మానవులు, మునులు, దైత్యులు, దేవతలు, అందరూనున్నారు. సేవలోనున్నారు. తులసీదాసునగు నేను ఇట్లు చెప్పుచున్నాను. ఈ లోకములోని భయము, మన బుద్ధి భగవంతుడగు రాముని చరణములయందే స్థిరముగనున్నచో, (ప్రేమపూర్వకముగ) తొలగును. తేనాచో జీవుడు,

దీనుడయి, మలినుడయి, సుఖములనుండి వంచిపబడి, కోట్ల జన్మములవరకు భిన్న భిన్న యోనులయందు దారితప్ప పుట్టుచూ చనిపోవుచూ వుండును. జన్మమరణముల వచ్చిపోవు బంధనముల నుండి ముక్తుడు కాలేడు.

(మనస్సు ఏకాగ్రతయే అనన్య భక్తి భావనకు ప్రధాన సాధనము).

22. ఓ కరుణానిధి! రామా! నేను నీకు నమస్కరించుచున్నాను. ఇందువలన లోకజీవితము అనగా నేను, నీవు అను భేదభావము తొలగును. రాముడు రఘువంశ రూపమనెడి నట్లు కమలములకు చంద్రుని వలె సుఖమునిచ్చును. అనగా రఘువంశీయులు రాముని చూచి మహా ఆనందమును పొందుదురు. వారి చరణ సేవ బ్రహ్మ, శివుడు చేయుచుందురు. ఆయన భక్తుల హృదయమున భ్రమరము కమలములయందు వున్నట్లు శోభిల్లును. ఆయన శరీర సౌందర్యము కోటి మన్మథులకంటె అందముగా నుండును. వీరు మిక్కిలి ప్రబలమైన మోహరూపమనెడి చీకటిని తొలగించు సూర్యుని వంటివాడు. అజ్ఞానమనెడి సఘనమయిన (దట్టమగు) వనమును కాల్చు అగ్నివంటిది (దావాగ్ని).

అభిమానమనెడి సముద్రమును శుష్కింపచేయు అగస్త్యుని వంటివాడు ఉదారుడు. దేవతలకు సుఖమునిచ్చువాడవు. పృథ్వీభారమును (రాక్షసులను) తొలగించువాడవు. రాగ ద్వేషము అనేడి సర్పములకు గరుడపక్షివంటి వాడవు. కామరూపమనెడి ఏనుగును చంపు సింహ సమానుడవు. దైత్యులను వధించువాడవు. నీ చరణ కమలములు భవసాగరమును దాటుటకు పడవ వంటిది. ఇటువంటి సీతానథ రామ! ఆనందమునకు మూలము ఆనంద వర్షము కురిపించును. హనుమంతుని హృదయమను భావియందు సదా హంసవలె సమున్నతమయి వుండును. అనగా హనుమంతుడు సదా తన హృదయమున రామనామ స్మరణ చేయుచుండును. రాముడు నిష్కామ భక్తులకు కామధేనువువలె దయగలవాడు. తులసీదాసునగు నేను చెప్పుచున్నాను: ఇటువంటి రాముడు ముల్లోకములకు తిలకము వంటివాడు. అనగా శిరోమణి గుణములకు వనము అనగా సర్వగుణ సంపన్నుడు. విశ్రామము అనగా శాంతికి నికేతనము.

(జానకి - రాముని ఆసక్తికరమయిన శకి)

23. ఓ జిహ్వా! నీవు సదా రామనామము వల్లించుచుందువు. ఓ మనసా! నీవు రామనామమనెడి నవీనమైన, నిర్మలమైన ప్రేమ - మేఘము కొరకు పారము చేయుము. అనగా పూర్తిగా చాకత పక్షివయి వుందుము. అనగా రామనామమును ప్రేమించుము. నీవు అరన్య సాధనములద్వారా యజ్ఞము, యాగము, తపము మొదలగువాటి ద్వారా రాముని పొందవచ్చును అను ఆశ వదలుము. చాతకపక్షి సముద్ర జలము, చెరువు, కుంట, సరోవరము, బావి నీరు స్వీకరించదు. అటులనే చాతకపక్షివలె మనస్సు కల్గి మేఘజలమును చాతక పక్షి త్రాగునట్లు రామామృతమును పొందుము. మేఘము, గర్జించినా, మెరసినా

రామనామమే నీకు ఉద్ధారము కల్గించును. రామనామముచే బుద్ధిని స్థిరపరచుకొనుము. రామనామమునే ప్రేమించుము. రాముని భక్తులు పూర్వము అనేకమంది వున్నారు. ఇప్పుడు వున్నారు. భవిష్యత్తులోనూ వుందురు. ముల్లోకములలో గొప్ప అదృష్టవంతుడుగా రామభక్తునిని భావించెదరు. అనన్య భావనతో రామనామ భక్తి వుండుట అగమ్యము. అద్భుతము. నీవు ఈ మార్గమున ప్రయాణము చేయునప్పుడు అలసిపోయిన, విశ్రాంతి తీసుకొనవద్దు. దారిలోని ఆకర్షణలకు సరికావద్దు. ఆలస్యము చేసిన నీ ఆయుస్సు వ్యయమగును. ఇందువలన తులసీదాసునగు నేను నీ కృప మేలు వుండిన, నేను రామనామమునందు (స్మరణ) నిష్కంటకముగా ప్రేమించుటవలననే భక్తుని కళ్యాణమగును.

(మాయ త్రిగుణాత్మకమై యుండును. తులసీదాసు భక్తి మార్గము, వ్యక్తి యొక్క చరిత్ర ఉత్థానము (శీల ఔన్నత్యము నందు ఎక్కువ నొక్కి చెప్పను.)

(ఇదియే "PLATONIC LOVE" చెప్పబడును.)

24. ఓ పిచ్చిమనసా! రామనామము జపించుము. రామనామము జపించుము. రామనామము జపించుము. భవసాగరమును దాటుటకు రామనామమే ఒక ముఖ్యమైన నౌక. రామనామము మాత్రమే మన ఒకే ఒక ప్రముఖమయిన ఆదారము (సాధనము). ఈ సాధనము ద్వారానే మునులు, సిద్ధులు, ఋషులు, అందరును ముక్తి పొందుదురు. కలకాలము అనెడి రోగము, యోగము, సంయమము, సమాధి మొదలగు వాటిని మ్రింగినది. ఇప్పుడు ముక్తిని పొందుటకు సాధనములన్నియు నిరుపయోగమయినవి. ప్రభావ హీనము అయినవి. ఏ మానవుడైనా మంచివాడు లేక చెడ్డవాడు, సాదాగా నుండని లేక విపరీతంగానుండనీ, మిత్రుడు గాని లేక శత్రువుగానీ అందరికీ చివరలో రామనామమే ఉపయోగపడుచున్నది. చనిపోవునప్పుడు ప్రతిప్రాణి రామ రామ అని పలుకుటకు ప్రయత్నము చేయించెదరు. పట్టుదల చూపెదరు. చనిపోవునప్పుడు రామనామము సత్యము ఉచ్చరించుటకు పట్టుదల చూపెట్టెదరు. చనిపోయిన తరువాత కాల్చివేసెదరు. కావున ఓ మనసా! ఇప్పటినుండియే రామనామ స్మరణ చేయుచుండుము.

ఇక్కడ ప్రపంచమంతయు ఆకాశవాటిక వలెనుండును. ఆకాశములోని రంగు రంగుల మేఘములు ఫలించి విస్తరించి యుండును. ఇందువలన ఇది పూలతోనిండి వున్నట్లు గోచరించును. కాని వాస్తవముగా అది భ్రమ మాత్రమే. అదే మాదిరి ఈ ప్రపంచము సుఖములతో నిండివున్నట్లు, అందముగా కనపడుచుండును. కానీ వాస్తవముగా ఈ సుఖములన్నియు మిధ్య, భ్రమయే. ఆలోచించిన వాటి మిథ్యాతత్వము తెలియవచ్చును. పొగవలెనుండు మేడలు క్షణికమై సారహీనమయి యున్నవి. ఈ మిథ్యాలోకమును చూచి భ్రమపడవద్దు. ఈ లోకమున సుఖములు స్థిరమైన, శాశ్వతమైనవి కావు. నీవు వీటిని

సత్యమని నమ్మి మోసపోవద్దు. ఒక కుక్క తన ఎదుట వడ్డించిన విస్తరను త్రోసిపుచ్చి ప్రతి యింటి వాకిలి వద్ద కవలమును ఆశించుచూ తిరుగు దానివలె కావద్దు. రామనామమును వదలిన వ్యక్తి పరిస్థితి ఇటులనే యుండును. రామనామము అన్నిటికంటె సులభసాధనము. దానిని వదలి ఇతర సాధనముల సహాయము తీసుకొనుట కుక్క బ్రతుకు వంటిదే అగును.

(జగత్తు మిత్య అను వాదము సమర్థింపబడినది. రామనామ మహిమ తెల్పబడినది.)

25. ఓ మనసా! నీవు సదా ప్రేమతో రామనామమును జపించుము. ఎందుకనగా కలియుగమున యోగము, జపము, యజ్ఞములు, త్యాగములు ఏవియు కూడ ముక్తిని కల్గించలేవు. అనగా వీటిని చేయుట వలన ముక్తి లభించదు కలియుగము సదా కష్టములనే కల్గించుచుండును. రామనామమును జపించురు అనునది పైన పేర్కొన్న సాధనముల కంటె శ్రేష్టమయినది రాజువంటిది. రాముని విస్మరించుటయే సర్వదుఃఖములకు మూలము. అనగా శాస్త్రముల యందు రెండు రకములైన కర్మలు చెప్పబడినవి. విధి అనగా ఏవి చేయవలయును. నిషేద అనగా ఏమి చేయకూడద అనునవి. తులసీదాసు చెప్పుచున్నాడు :- నా దృష్టిలో రామ నామ స్మరణే అన్నిటికంటె శ్రేష్టమైన కర్మ. రాముని మరచిపోవుటయే నిషేదము అనగా చేయరాని కర్మ. కేవలము రామనామ స్మరణయే చేయుచుండవలెను. దానిని ఎప్పటికిని మరువరాదు.

రామనామము, మహామాణిక్యము సమానమైనవి. ఇది ప్రపంచబంధనములనెడి సర్పము. ఈ ప్రపంచమనెడి రామనామ మాణిక్యము తీసుకొనిపోయిన సర్పము బాధపడును. దుఃఖములతో జీవించియుండెను. అనగా వీని ఘాతకమైన ప్రభావము వినష్టమగును. రామస్మరణవలన ప్రపంచములోని వికారములు మనకు ఏమియు హాని కల్గించలేవు. రామనామము కల్పవృక్షము వంటిది. ధర్మ, అర్థ, కామ మోక్షములను ఫలంబులను ఇచ్చును. రామనామ స్మరణ వలన ఈ నాల్గు ఫలంబులు లభించును. రామనామము ప్రేమ, భక్తి, పరమార్థము (మోక్షము)ను ఇచ్చును. మూలతత్వము సారము. తులసీదాసునగు నాకు రామనామము, నా ప్రాణములకే ఆధారము. అనగా ఇది (రామనామము) లేకుండ తులసీదాసు జీవించలేడు.

(రామనామ జపములేకుండ ముక్తి అసంభవము.)

26. ఓ మనసా! నీ నాలుకతో రామనామము జపించనంతవరకు, ఎక్కడికి వెళ్ళినను (1) దైహిక (2) దైవిక (3) భౌతిక తాపములు నుండి రక్షింపబడలేవు. వీటి మంటలలో ధగ్ధము అయ్యేదవు. అనగా నీకు శాంతి లభించదు. రామనామము జపించనందున నీకు విషమ పరిస్థితి ఏర్పడును. గంగానది ప్రక్కన వున్ననూ నీకు త్రాగుటకు నీరు ఎవ్వరు ఇవ్వరు. అన్ని కోరికలను పూర్తిచేయు కల్పవృక్షము క్రింద వున్ననూ, నిన్ను పేదరికము బాధించుచుండును. అనగా గంగానది, కల్పవృక్షము నీ దాహమును, నీ దరిద్రమును తొలగించుటలో శక్తిలేనివై యుండును. నీవు మేల్కొని ఇటు అటు తిరుగుతూ సుఖము లేనందున వికలుడవై దారి

తప్పి తిరుగుచుందువు. నీవు స్వప్నములో కూడ సుఖమైన నిద్రపొందలేవు. అనగా నిద్రలో చెడు స్వప్నములు వచ్చి సదా నిన్ను భయపెట్టుచూ వుండును. నీవు జన్మ జన్మల వరకు యుగయుగములవరకు ఈ జగత్తులో బాధపడుచూ వుందువు. అనగా జన్మ మరణ బంధనములలో పడి, ఎప్పటికీ సుఖమును పొందలేవు.

నీవు భవబంధనముల నుండి ముక్తుడగుటకు కొన్ని ఉపాయములు చేసెదవు. అనగా యజ్ఞములు, యాగములు, జపతపములు మొదలగునవి చేసి బంధనముల నుండి విముక్తి పొందుటకు ప్రయత్నము చేయుటకు పూనుకొనుకొలది ఇంకను ఎక్కువగా బంధనములలో చిక్కుకుని పోయెదవు. భావము ఏమనగా యజ్ఞాదులు చేసిన బంధనము నుండి ముక్తి కలుగదు. అమృతము కలిపి భోజనము చేసినను, అది నీకు విషముగా అగును. ఓ తులసీదాసు ముల్లోకములలో మూడు కాలములలో (భూత, భవిష్యత్, వర్తమాన) దీనునికి రామనామమే ఆధారము. చేపకు నీరు ఆధారమయినట్లు రామనామమునే ఆధారముగా చేసుకొనియే ఈ భవసాగరమును దాటుటలో సమర్థుడివి అగుదువు.

(భక్తి మార్గమే, ముఖ్యమైన సాధనము)

27. ఓ మనసా! నీవు రాజుగార్సైన రాముని నామ స్మరణ చేయుము. ఈ రామనామము పధికులకు దినబత్తెము వలె భక్తులకెంతో ఉపయోగపడును. మిత్రునివలె సహాయపడును. అనగా భక్త జనులు రామనామ స్మరణ చేయుచూ యాత్ర చేయుచుండగా పొట్టనింపును. ఈ రామనామము అదృష్ట హీనులకు భాగ్యమును, మూర్ఖులకు గుణములు కల్గించును. విద్వాంసులగుదురు. ఈ రామనామము పేదవానికి కొంగుబంగారము అనగా తన శరణు తీసుకొనును. దీనులకు దయగల దాని నీచకులమున పుట్టినవానికి రామనామము కులముగల వారినిగా చేయును (ఉదాహరణకు వాల్మీకి మహర్షి అయ్యెను). వేదములయందు కూడ ఈ విషయము పేర్కొనవచ్చును. వికలాంగులకు కూడా రామనామము ఆధారము.

ఈ రామనామము ఆకలిగొన్నవారికి తల్లిదండ్రులవలె ఉపయోగపడును. ఆకలిగొన్నవారు రామనామ స్మరణ చేయుచూ భిక్షము అడుగుకొని తమ జీవితమున పొట్టనింపుకొనుచున్నారు. (మకరము నుండి ఏనుగును రక్షించినట్లు) ఈ ప్రపంచమనెడి సముద్రమును దాటుటకు ఉపయోగపడును. ఇది సర్వసుఖముల సారము. దీనిని ఉచ్ఛరించిన వెంటనే సంపూర్ణ సుఖముల సారము (బ్రహ్మానందము) సంపూర్తిగా లభించును. పతితులను ఉద్ధరించుటకు ఉపయోగపడు రామనామము వంటిది వేరొకటి లేదు. పాడు బంజరు భూమి వంటి గుణహీనుడు కూడ జ్ఞాని యగును. దీనికి ప్రత్యక్ష ఉదాహరణము - నేను తులసీదాసు అటువంటి బంజరుభూమి వంటివానిని. గుణహీనుని. రామనామ స్మరణవల్ల అందమైన సారవంతమైన భూమివలె గుణవంతుడయ్యెను. భావము ఏమనగా మొదట తులసీదాసు అను నేను ధర్మ, కర్మ మొదలగునవి చయకుంటిని. కానీ రామనామ

స్మరణ చేయగానే ఆయన హృదయమున భక్తి, జ్ఞానము, వైరాగ్యము మొదలగు పవిత్ర భావమును కల్గించెను. నిండి నిబిడీకృతమగును.

(ఎవరిని కులము అడగకూడదు. హరిని భజించిన హరి అగును)

28. ఓ మనసా! నీవు నేను చెప్పిన ప్రకారము చేసినచో (నడచుకొన్నచో) నీకు అన్ని విధముల మేలు కలుగును. అనగా శుభము అగును. నీవు నిష్కపటముగా రామనామమును ప్రేమించుదువు. రామనామ ప్రభావము చలికాలమున అగ్నివలె ఘాతకముగా నుండును. రామనామస్మరణ చేసిన వెంటనే కలియుగము తన సహాయకులగు కామము, క్రోధము, మద మాత్సర్యము, లోభాది గుణములతో (యోగము) పారిపోవును. దాని ప్రభావమున నీ పాపములన్నియు తొలగిపోవును. అగ్ని ఎదుట చలి తొలగునట్లు అగును. నీకు విరుద్ధమైన విధాత కూడా నీపై కర్మలను రూపొందించలేదు. పాపములు హరింపబడును. రామనామ స్మరణవలన నీవు పాపరహితుడవు అయ్యెదవు.

నీవు రామనామ స్మరణ అనెడి లడ్డును ప్రేమ అనెడి అమృతము మచ్చుపాకులో వేసిన, ప్రేమతో రామనామ మహిమ చేత పూర్ణసంతోషము లభించును. ఇంటిఇంటికి వెళ్ళి అందరినీ యాచించనవసరము లేదు. రామనామము కల్పలతకు సమానమయినది. నీవు కోరిన వస్తువును దానినుండి పొందగలవు. తరువాత నీకు స్వార్థము అనగా ఈ లోకము, పరలోకము యొక్క కోరికలన్నియు నెరవేరును. నీకు ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి సులభముగా లభించును.

(రామనామము కల్పవృక్షము, కోరిన వస్తువు లభించును.)

29. తులసీదాసు తన మనస్సును సంబోధించుచూ చెప్పుచూ వున్నాడు :- ఓ మనసా! నీవు రాముని నామస్మరణ చేయుటకు దొంగవలె ముఖమును చాటుచేసుకొని ఎందుకు తిరుగుచున్నావు? అనగా వారి (రాముని) సేవ ఎందుకు చేయుటలేదు? ఒకటి నీలో స్వయముగా యోచన చేసి తెల్సుకొను జ్ఞానము లేదు. అనగా నీవు వివేక హీనుడవు. నీవు ప్రాణము లేని (జడ) రాయివలె దేనికి ఉపయోగపడవు. (పనికిరావు) రాముడు మునులకు కూడ అగమ్యుడు. అనగా మునులు నిరంతరము ధ్యానము చేసిననూ రాముని పొందలేరు. తల్లిదండ్రులకు తమ సంతాన సంరక్షణ భారము వుండునట్లు రాముడు తన భక్తులను సంరక్షించుచుండును. భావము ఏమనగా రాముడు తల్లిదండ్రులవలెనే స్నేహముతో తన భక్తగణమును పాలించి పోషించుచుండును. కృపాసముద్రుడగు రాముడు మిత్రులవలె సహజముగా తనకు తానే ప్రేమించును.

లోకము వేదములు రెండును శ్రీరాముని కంటే గొప్పవారెవరూ లేరని చెప్పుచున్నవి.

దొంగతనము చేయలేరు. అనగా ఆయన సర్వజ్ఞుడు. స్వామికి తెలియకుండ సేవకుడు ఏమియును దాచివుంచలేడు. రాముని ఆస్థానము పద్ధతియే అది. అనగా షరతు ఏమి అనగా ప్రవేశము పొందుటకు రుజుపత్రము (గుర్తింపు కార్డు) అవసరము. రాముని భక్తి ఎడ ప్రేమగలవాడే రాముని అస్థానమున ప్రవేశము పొందగలడు. వారి సేవ చేయుటకు ఏ విధమయిన కష్టము కలుగదు. ఎందుకనగా రాముడు భక్తుని మనస్సులో ఏమియున్నదీ తెలుసుకొని అస్థానములోనికి ప్రవేశము కల్గించును. భక్తుడు ఎప్పుడు స్మరించినా రాముడు భక్తునికి ఏమి కష్టము సంభవించినదో అది తెలుసుకొనును. వెంటనే ఆ భక్తుని ప్రక్కకు తిరిగి చూచును. రాముడు ప్రసన్నమయిన వారి స్వాధీనమయి వుండును. ఎవరిని కోపముతో చూచునో తన లోకమునకు పంపును. హనుమంతుని వలన సంతసపడి రాముడు ఎల్లపుడూ అతని స్వాధీనములోనే వుండెను. రావణునిపై కోపము కల్గినందున వధించెను. రాముడు ప్రసన్నుడయిన, క్రోధితుడయిన జీవునికి లాభమే కల్గును. రామనామము కల్పవృక్షమునకు సమానము. భక్తుని సకల కోర్కెలను పూర్తిచేయును. నాయటువంటి పనికిరానివానికి కూడా శరణునిచ్చి సంతృప్తి పరచును. రాజగు శ్రీరామచంద్రుడు ఇదే మాదిరి గొప్పవాడు, పరోపకారి.

(నిష్కపటమైన హృదయముతో రాముని ఎడ భక్తి కల్గియుండవలెను.)

30. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు :- రాముడు స్వాభావికముగా మంచివాడు. ఇందువలన ఆయన నాకు మేలుచేసెను. నాకు తృప్తి కల్గించెను. స్వయముగా మంచివాడుగానున్నవారు, వారు సదాపరులకు మేలు చేస్తూ వుంటారు. నేను నా స్వామి అగు రాముని ఎడ ద్రోహమునే చేయుచుందును అయిన ఆయన తన సేవకుల హితమును కల్గించుచుండును. ఈ లోకమున రామునివలె గొప్పవాడు, నాయటువంటి నీచుడు మరొకడు వుండడు. లోకము నన్ను రాముని దాసుడు అని అంటున్నది. కానీ నాలో రామునికి దాసుడుగా వుండుటకు కావలసిన గుణములు లేవు. నేను రాముని దాసునిగా ప్రవర్తించుచున్నాను. నా ద్వారా ఎంతో అపరాధము చేసిన వానిని నేను లోకాన్ని మోసగించితిని. అయినా రాముని మనస్సు నాపైన వ్యతిరేకంగా లేదు. గడ్డిపోచవంటి నీచమైన, తుచ్ఛమైన వస్తువు వంటి వానినైనా జలముపైన తేలియాడుచూ పోవుదును. జలము నన్ను పోషించినది. నన్ను ముంచదు. గడ్డిపోచ దౌష్ట్యమును జలము క్షమించును. భావము ఏమనగా జీవుడు, దేవుని ఎడ చెడ్డగా ప్రవర్తించిననూ (అపరాధము చేసిననూ) ఈశ్వరుడు తన సృష్టి అని భావించి అతనికి (జీవునికి) అపకారము చేయడు.

(తులసీదాసు తన దీనత్వమును, రాముని మహిమనూ వర్ణించిరి. తులసీదాసు వినీతుడేగాని దీనుడు గాడు.)

(కపటము అన్నిటికంటె భయంకరమైన అపరాధము.)

(జన్మదాత శిరస్సుపైనెక్కడం ఘోరమైన నైచ్యం.)

31. తులసీదాసు వివేకములేని జీవుని, చైతన్యశక్తి, జాగ్రత్తలేని మనస్సును గురించి చెప్పుచున్నాడు :-

ఓ మూర్ఖజీవా! మేల్కొనుము. మేల్కొనుము. ఎందుకనగా వివేకము లేనందున నీ హాని, లాభములను తెలుసుకొనలేవు. ఈ ప్రపంచము యొక్క మోహాకర్షణలలోపడి చాలా సేపటినుంచి నిద్రించుచున్నావు. ప్రపంచ మోహములలో పడి అజ్ఞానావస్థలోనున్నావు; ఈ ప్రపంచమనెడి రాత్రిని చూచి అంధకారమయిన వాడివిగా వున్నావు. నీవు జడము. నీలో చైతన్యము కలుగలేదు. నీవు ఇప్పుడు చైతన్యమును పొందుము. ఈ శరీరము, గృహము ఎడ మోహమును కల్గించుకొని, అస్థిరమైన, క్షణభంగురమైనప్పటికీ, మేఘములలో మెరుపు కాంతివలెనున్న ఈ లోకసుఖములు అస్థిరము. నాశనము అగునవి.

నీవు సుప్తావస్థలో విభిన్నమైన రకములగు స్వప్నములను చూస్తూ, ఈ లోకపు కష్టములను అనుభవించుచున్నావు. మిథ్యా ప్రపంచము యొక్క అనేక రకములగు ఆకర్షణలతో నిండిన రూపమనెడి వలలో చిక్కుకొని కష్టపడుచూ వున్నావు. నీ మనస్సులోవున్న ప్రాపంచిక ఆకర్షణ తన రూపమును చూపించి, సదా దుఃఖములను కల్గించుచున్నది. స్వప్నములో కూడ నీకు సుఖ శాంతి లభించుటలేదు. ఒకప్పుడు నీవు మృగతృష్ణలో పడి మునిగి పోవుచున్నావు. మరొకప్పుడు తాడు సర్పమువలె గోచరించుచున్నది. మృగతృష్ణవలె, అస్థిరమైన, అసత్యమైన సుఖములను పొందగోరుచున్నావు. నీ భ్రమ వలెనే, లోకములోని సుఖదుఃఖములు మృగజలమువలె, తాడు సర్పమువలె గోచరించుచున్నది. అసత్యమైనవి అని, భ్రమాత్మకమైనవి. నిద్రలో స్వప్నములు సత్యముగా గోచరించిననూ మేల్కొన్న తరువాత వాటి అస్థిరత్వము నష్టమగుచున్నది. అదేమాదిరి జీవుడు మోహ నిద్రలో వున్నంతవరకు అతనికి ప్రపంచపు సుఖ దుఃఖములు సత్యముగానే గోచరించుచుండును. జ్ఞానదృష్టిన వెంటనే ఈ జగత్తు మిథ్యగా గోచరించును.

నాల్గువేదములు, విద్వాంసులు చెప్పనది ఏమనగా, ఓ మనసా నీవు ఈ విషయమును చక్కగా తెలుసుకొనుము. స్వప్నములో అనుభవించిన సుఖదుఃఖములు దోషములు మేల్కొన్న తరువాత, వాటినుండి వేరగును. జీవుడు చైతన్యము పొందితే, ప్రపంచములోని దుఃఖములనుండి ముక్తిని పొందును. ఇతరత్రా లేదు. తులసీదాసు చెప్పుచున్నాడు :- మేల్కొన్నపుడే జగత్తులోని మూడు తాపములు (1) దైహిక (2) దైవిక (3) భౌతికము అనునవి నష్టమగును. జ్ఞానోదయమైన వెంటనే జీవుడు త్రివిధములగు తాపముల నుండి ముక్తుడగును. ప్రపంచములోని రాగ ద్వేషబంధనములనుండి ముక్తుడగును. పూర్తిగా నిష్కాముడగుచున్నాడు. ఇటుల చేయుటవలన జీవునిలోని నిష్కామ భావన వలన రామనామము ఎడ పవిత్రమైన ప్రేమ జనించును. ప్రపంచములోని మాయా మోహముల ద్వారా బంధింపబడినందున రామభక్తి ప్రేరణ కలుగదు. జీవుడు రాగద్వేషాది గుణమైనప్పుడు, బంధనములనుండి ముక్తుడైనప్పుడే, రామభక్తి జనించును. పూర్తిగా నిష్కామ భావన ఏర్పడును.

(తులసీదాసు వేదాంత దృష్టాంతములగు మృగజలము. రజ్జు సర్పమును తెల్పి ప్రపంచము యొక్క మిథ్యను దృవీకరించును.)

(ఆత్మబోధ కల్గినప్పుడే రామభక్తి జనించును. శరీరము, గృహము మోహములో పడినచో అజ్ఞానమే పెరుగును.)

32. తులసీదాసు తన మనస్సును సంబోధించి చెప్పుచున్నాడు :- జానకీపతి రాముని కృపయే జ్ఞానము మేల్కొలుపుచున్నది. అనగా రాముని కృపచేతనే జ్ఞానుల మోహనిద్ర భంగమగుచున్నది. ఇందువలన మనసా! నీవు నీ జడత్వమును వదిలివేయుము. భగవంతుడగు రాముని ప్రేమించుము. నీవు సత్-అసత్ అనువాని వివేకముతో ఆలోచించి చూడుము. ఉదార హృదయుడగు రామచంద్రుని భజన చేయుము. రాముడు కళ్యాణ కారకుడు సముద్రుడు; దీన బంధు అని వేదములు చెప్పుచున్నవి. నీవు మోహము, మాయ అనెడి అమావాస్య రాతి (దట్టమైన రాత్రి) చాలాకాలమునుండి నిద్రించుచూ వున్నావు. అనగా మోహము, మాయ అనెడి బంధనములో పడివున్నావు. నీవు నిద్రిస్తూ, నిద్రిస్తూ మధురమైన, మత్తు కల్గించు స్వప్నములను చూచుచూ నీ ఆత్మజ్ఞానమనెడి అమూల్య రూపమును పోగొట్టుకొన్నావు. అనగా జగత్తులోని భోగవిలాసములు స్వప్నమువలె అశాశ్వతమైనవి. కల్పనచేసి నీ ఆత్మజ్ఞానమును పోగొట్టుకున్నావు; మరచిపోయినావు. ఇప్పుడు ప్రభాతకాలము అయినది. జ్ఞానరూపమనెడి సూర్యుడు ఉదయించుటవలననే, వాసన, రాగము, ద్వేషము మొదలగు దట్టమైన అంధకారము తొలగినది. అనగా ఆత్మజ్ఞానము కల్గినచో వాసన మోహము కలుషిత భావములు తొలగినవి.

జ్ఞాన రూపమగు సూర్యుడు ఉదయించిన, అహంకారము, సమ్మానము, మొదలగు భావనలు, చోర రూపముననున్న భావనలు తొలగిపోయినవి. కామము, క్రోధము, లోభము మొదలగు రూపముననున్న రాక్షసుల సమూహము స్వయంగా భయపడి పారిపోయినవి. రాముని ప్రచండమైన ప్రతాపమును చూచి, దుఃఖములు, పాపములు సమాప్తమయినవి. జానకీనాథుడు తన కృప చేత మేల్కొలుపును అనునది విని (గంభీరవాణి విని) భక్తులు, సాధువులు మేల్కొన్నారు. సౌందర్యమైన వైరాగ్యము, సంతోషము మొదలగు భావనలను గౌరవింపసాగిరి. అనగా మోహ నిద్రాభంగమయినది. వారు వైరాగ్యము, సంతోషాది భావనలతో నిమగ్నమయిరి. తులసీదాసు ఈ విధముగా చెప్పుచున్నాడు :- కృపగల భగవంతుడగు రాముడు జీవులను, భక్తులను దిగులుగా వుండటము చూచి, ఈ జగత్తు అనెడి మాయాజాలమును త్రుంచుటకు శుభమును కల్గించెను. అనగా రాముడు మాయ అనెడి మోహమును తొలగించి, ఈ లోకమున శుభమనెడి వర్షమును కురిపించెను.

(తులసీదాసు భగవంతుని కృపచేతనే ఆత్మజ్ఞానము కలుగును. పురుషార్థము, జ్ఞానము ద్వారా కలుగదు. అప్రత్యక్ష రూపమున భక్తియే సర్వోపరి అని వివరించారు.)

33. తులసీదాసు శ్రీరామునితో ఇట్లు చెప్పుచున్నాడు :- నేను మంచి వానినో లేక చెడ్డవానినో, కాని నేను నీవానినే. నేను నీతో అసత్యము ఎందుకు చెప్పుదును? నీవు అంతర్యామివి. సర్వుల మనస్సులలోని విషయమును తెలుసుకొనగలవు. నేను ఈ విషయమును కపటముతో చెప్పుట లేదు. త్రికరణ శుద్ధిగా చెప్పుచున్నాను. నేను నీవానిని అగుటకు గట్టి పట్టుదల పట్టియున్నాను. జనుము త్రాడులో ముడి నీరు తగిలిన ఇంకను గట్టి అగును. ఆ ముడి విడిపోదు. అదేమాదిరి నేను నీ సేవనుండి విముఖము కాలేను. నాకు ఇతర దేవదేవతల మీద ఆధారము లేదు. ఇంద్రుడు దేవతలు, మునులు, మానవుల ఉపాసన (ఆరాధన) చేయుకోరిక లేదు నాకు. వీరు అందరూ స్వార్థపరులు. వీరిని పొగడుచున్నంత వరకు సంతసించెదరు. లేనిచో వదలివేసెదరు. ప్రశంసమానినా కోపగించుకొందురు. ఇట్టి పరిస్థితిలో వారితో నాకు ఎట్లు చెలిమి కుదురును? ఏనుగు వంటి ఈ దేవతలను ప్రశంసించిన వారు నాకు కుక్కకు ముక్క వేసినట్లు కొద్దిపాటి మేలు చేయుదురు. ప్రపంచములోని ధన ధాన్యములివ్వవచ్చు కాని నీ భక్తిని పోల్చినచో అవి తుచ్ఛము. ఏమియు లేనట్లే (శూన్యము) పేదల ఎడ నీకున్నంత దయ ఎవరిలోనూ లేదు. ఏనుగు తన శక్తి గర్వముతో కుక్కను తుచ్ఛముగా భావించును. అది మొరిగిన లెక్క చేయదు. సహజంగా రెండింటియందు శతృత్వమే వున్నది. ఇటువంటి సమయమున ఏనుగువంటి గర్వముగల దేవతలకు నన్ను గురించిన శ్రద్ధ వుండదు.

ఈ దివ్య దేవతలందరు, పేదవానిని వుద్ధరించరు. అసత్యులుగా నిరూపితము అయినారు. దేవా రామా! నీవు సర్వజ్ఞుడవు. ఈ నా శరీరమును మీ ఎదుటనే ఎటుల గురికానిచ్చెదరు. పాము మంత్రము తెలియని కపటమంతా తాడు పాముల మధ్య ఇరుక్కొని ఆపదలకు గురిఅగును. నేను సరియైన భక్తునిగా నిరూపితము అగుదును. నేను మీ భక్తుని మీరు స్వీకరించండి. నా తులసీదాసు అటువంటి చాతకపక్షికి స్వాతి జల బిందువును ప్రసాదించినట్లు ఘనశ్యాముని నమ్మి వున్నాను. నీ భక్తి పొందుటకు కంటి రెప్ప ఆర్పకుండ తదేక దృష్టితోనున్నాను.

(రాముని ఎడ భక్తి పెరిగిన కొలది, అతని ఎడ స్నేహము అధికమగుచూ వుండును. కాశీ పండితులు తులసీదాసును కులము నుండి వెలివేసిననూ ఎవరూ (దేవీదేవతలు) సహాయము చేయలేదు.)

34. తులసీదాసు ఆత్మ పరిచయమును తెలుపుచున్నాడు :- నేను రాముని దాసుడను. రాముడు అనగా నరరూపముననున్న రాముడు. రామ్ బోలా రక్షకుడు. నేను రామ అను రెండక్షరములను ఉచ్చరించుచూ వుంటాను. వారు (రాముడు) తిండిబట్ట ఇచ్చుచున్నాడు. బాగుగా రక్షిస్తున్నాడు. ఇది ఈ లోకములోని జీవన లాభము. ఈ పని చేయుటవలన పరలోకమున నాకు ఏమైన లాభము కల్గునా? దీనిని గురించి వేదములయందు నీకు లాభమగునని చెప్పబడినది. భావము ఏమనగా రామనామ స్మరణ వలన ఉభయలోకములలో చక్కబడుదువు. లౌకిక కార్యములయందే నాకృతులకు నేను

పాపజాలము నుండి విడిపించిన పిమ్మట నీవెవరని అడిగెను? ఓ నాథా! నేను తులసీదాసుడను. నేను నీ దాసుని కాగోరుచున్నాను. నాకు ఈ లోకమున ఎవరూ లేరు. నేను నీ శరణు జొచ్చకోరుచున్నాను. ఇదివిని గురువగు రాముడు తన దగ్గరకు పిలిచి వీపును చరచెను. ధైర్యము కల్గించి నన్ను స్వీకరించెను. అప్పటినుండి రామభక్తులకు సుఖము కల్గించు వేషము పూనియున్నాను. సదా పరిభ్రమించుచూ వున్నాను. అప్పటినుండి రాముని యశస్సు కీర్తిగానము చేయుచూ పర్యటించుచూ వున్నాను. రాముడు సదా తన సేవకులను సంరక్షించుచూ వుండెను. ఇప్పుడు కొంతమంది ప్రజలు ఈ నీచుడు (తులసీదాసు) రాముని దాసుడై యున్నాడు. నాకు ఈ విషయమును గురించి దిగులు, చింతలేదు. ఎందుకనగా నాకు ఇప్పుడు ఎవరితోనూ సంబంధము లేదు. జాతి, కులము, ప్రాంతములో కలసిపోవుటకు ఇష్టము లేదు. ఎందుకనగా భవబంధనములన్నియు తెగిపోయినందున రాముని దాసుడనయితిని. ఇప్పుడు నా మేలు, కీడు, సంతోషం, దుఃఖము రాముడే చూచుకొనుచున్నాడు. రాముని చరణములయందే నాకు అమితమైన భక్తి ఒకే రసముననున్నది. చలనము లేక నిశ్చలమైయున్నది.

(తులసీదాసు తన వ్యక్తిగత విషయమును గురించి ప్రకటించెను.)

35. ఓ రామా! నీవు జానకీనాథుడవు. లోకజీవన నాథుడవు కూడ. జీవన దాతవు. హితము చేకూర్చువాడవు. రఘుకుల నాథుడవు. కమల నయమడవు (నేత్రుడవు) నీ ముఖము శరద్ రుతువులోని చంద్రునివలె అందముగా నున్నది. నీవు స్వాభావికముగ అందరికీ సుఖములను సమకూర్చువాడవు. లక్ష్మీకేంద్రుడవు. అనగా లక్ష్మి సదా నీ దగ్గరనే వుంటుంది. నీ శరీరము సహజముగా అందమయినది. ఈ జగత్తుకు మాత, పిత, గురువు హితమును కల్గించు మిత్రుడవు. నీవు సర్వులకు సహాయకారివి. ఎవరికీ శత్రువు కాదు. నీవు దుఃఖములను తొలగించువాడవు. అందరికీ శరణునిచ్చువాడవు. సాటిలేని దాతవు. శరణుజొచ్చిన వారిని రక్షించువాడవు. దయగలవాడవు. నీ నామస్మరణ మాత్రముననే పాపుల పాపములు తొలగిపోవును. పాపులను ఉద్ధరించెదవు.

లోకమంత నీకు నమస్కరించుచున్నది. దేవతలందరు నిన్ను సేవించుచున్నారు. వేదములు, శాస్త్రములు అన్నియు నిన్నే ప్రశంసించుచున్నవి. ఇది తెలిసి తులసీదాసునగు నేను నీకు సేవకుని అయితిని. నీవు స్వీకరించిన పేదవారిలో నేను వుంటానో లేదో నీ ఇష్టము. సూచికలో నుండి తొలగించిన వుంచిన నీ ఇష్టమే. భావనమేమన నీవు నీ సేవకులలో లెక్కించెదవో లేక ధిక్కరించెదవో.

(త్వమేవమాతచ, పితాత్వమేవ, త్వమేమ బంధుశ్చ, సఖాత్వమేవ అనువాదమా అనునట్లు వున్నది.)

సరియైన దీనునిగా భావించుము, ఎవడయితే దీనుడో అతడు ఇతరుల దీనత్వమును నివారించలేడు. దేవతలు, మానవులు, మునులు, అసురులు, నాగ మొదలుగా గలవారు స్వాములు అనేక మంది వున్నారు. నీవు వక్ర చూపుతో చూచిన వారి స్వామిత్వము తొలగిపోవును. వీరందరి స్వామిత్వము నీపైన ఆధారపడియున్నది. భూత, వర్తమానము, భవిష్యత్తు మూడు కాలములయందు పృధ్వి, సర్గము, పాతాలము మూడు లోకములలో అన్నిచోట్ల అన్ని వేదములయందు రాముడే, ఆది, మధ్య, అంతము అని తెల్పుచున్నవి, విదితమైయున్నది. అన్నిచోట్ల రాముని ప్రభుత్వమే యున్నది.

నిన్ను భిక్షమడిగినవాడు ఎవడూ బిచ్చగాడుగా వుండడు. అతనికి మరల అడుగకుండునట్లుగా కావలసినంత ధన సంపదలనిచ్చెదవు. నీ స్వభావము అటువంటిది. శీలము, యశస్సు విని తులసీదాసునగు నేను భిక్షము అడుగుటకు వచ్చియున్నాను. నీవు రాతిని (అహల్యగా) పశువులను (ఎలుగుబంట్లు, కోతులు), వృక్షములు (యమాలార్జున అనుపేరుగల), పక్షి (జటాయువు)లను తనవిగా స్వీకరించితివి. అనగా వాటిని స్వీకరించి వాటికన్నింటికీ ముక్తిని ప్రసాదించినావు. ఓ దశరథరాజ పుత్రా! నీవు నిర్ధనులను రాజులుగా చేసితివి. ఓ కృపానిధి! నీవు నిర్ధనులకు శరణు ఇచ్చువాడవు. రక్షించువాడవు. నేను తులసీదాసును, నీ పేద భక్తుడను. తులసీదాసు నావాడని మాత్రమే చెప్పుము.

37. ఓ దేవా! నీవు దయానిధివి. నేను నిర్ధనుడను, నీవు దానివి, నేను భిక్షకుడను. నేను పాపాత్ముడను. నీవు పాపసమూలను సంహరించువాడవు. ఓ రామా! నీవు అనాధులకు నాథుడవు. నావలె ఈ లోకమున అనాథుడు ఎవరు వున్నారు? నావంటి దుఃఖములను అనుభవించువాడు ఎవడు లేడు. నీవలె దుఃఖములను తొలగించువాడును ఎవరూ లేరు. నీవు బ్రహ్మవు. నేను జీవున్ని. నీవు యజమానివి. నేను సేవకుడను. ఓ రామా! అన్ని విధాలా నీవు నాకు తల్లివి, తండ్రివి, గురువు, సుఖుడవు, కళ్యాణకారుడవు నీవు. నీకు, నాకు అనేక సంబంధములున్నవి. ఇందులో ఏది ఇష్టమయితే దానిని పాటించుము. నేను ఎటులవుంటే భగవంతుడవయిన నీవు అటులనే వుందువు. దయగలవాడా! ఈ తులసీదాసునగు నేను నీ చరణములయందు శరణుకోరియున్నాను. నీవు నన్ను శరణులోనికి తీసుకొనుము.

(ఇందులో తులసీదాసు తన లఘుత్వమును, రాముని గొప్పదనమును వర్ణించెను.)

38. ఓ రామా! నేను ఇంకెవ్వరి వద్దకు భిక్షము అడుగుటకు పోవుదును. నా కోరికను శాశ్వతముగా తీర్చువారెవరు? నాకు కావలసినంత ఇచ్చిన, నేను వేరొకరిని యాచించుటకు వెళ్ళనని భావము. నా కోర్కెలను అన్నింటిని పూర్తి చేయువారెవరున్నారు. నా దరిద్రమును తొలగించు వారెవరున్నారు? నా దుఃఖములను తొలగించువారెవరున్నారు? నీవు ధర్మమునకు కేంద్రము. కోట్లాది మన్మథులకంటె లావణ్యముగానున్నావు. అన్ని విధాల నా స్వామివి.

చతురుడవు. గొప్పదాతవు. పరిస్థితి బాగుంటే రెండు దినములు మంగళవాద్యములు మ్రోగుచుండును. చెడ్డ దినముల యందు ఓ దశరథరామా! వారిని ఉద్ధరించువాడవు. గొప్పదాతవు. నిర్ధనులకు దానము ఇచ్చి వారికి అమితానందము కల్గించుచున్నావు. భావము ఏమనగా దినములు మంచివిగా వుంటే అందరు ఇతరులకు సహాయము చేస్తూ వుంటారు. కేవలము రాముడు ఒకడే తాను కష్టములలో వుండి కూడ కేవట్ (పడవ నడుపువాడు), జటాయువు, శబరి, సుగ్రీవుడు, విభీషణాదులకు దానము ఇచ్చి సంతోష పరవశులను చేసితివి. నీ సేవ చేయని వారికి కూడ వారి దీనత్వము తెలుసుకుని వారికి సహాయము చేసి ఆనంద పరవశులను చేసితివి. గుణహీనుని దీనత్వ నివారణ చేసితివి. వారు ఈనాడు సంతోషముతో సర్వత్రా గంతులు వేయుచూ తిరుగుచున్నారు. అనగా రాముని సేవ చేయకనే నీతో ఉద్ధరించబడిరి. కావున ఓ రామా నీవు తులసీదాసునగు నా భిక్షకత్వమును గురించి యోచించుము. మనసు తెలుసుకొని, కోరినంత దానము ఇచ్చి సంతోషపరచుము. నీవు చంద్రుడవు. నన్ను చకోరమును చేయుము. సదా నన్ను నీ దర్శనము చేసుకొనుటకు అనురక్తుడనయి వుందును.

39. ఓ రఘునాథా! నీవు దీనబంధువు. సుఖసాగరుడవు. కృపానిధి. దైహిక, దైవిక, భౌతిక అను జ్వరము చేత నా మనస్సు కాలిపోవుచున్నది. పిచ్చివారివలె అటు ఇటు తిరుగుచున్నాను. నాకు త్రిదోషములున్నవి. దోషముల వలన సన్నిహిత జ్వరములో పిచ్చివానివలె తిట్టుచూ, వదరుచూ వుండును. ఇదే సంస్థితి నాది. ఒకప్పుడు నా మనస్సు యోగాభ్యాసము చేయుటలో రక్తి కల్గియుండును. మరొకప్పుడు మూర్ఖమై భోగ విలాసముల యందు మునిగి యుండును. మరొకప్పుడు హఠయోగమువలన వియోగముతో బాధపడుచుండును. మరొకప్పుడు మోహము అనెడి వలలో పడి అనేకరకములైన విద్రోహములు తిరుగుచుండును. నా మనస్సు, ఈ నా మనస్సు విద్రోహమును చేయును. మరలా మిక్కిలి దయగలదిగా వుండను. ఒకప్పుడు దీనముగా, ఒకప్పుడు మూర్ఖంగా, మరొకప్పుడు దరిద్రునివలె, మరొకప్పుడు రాజులవలె అహంకారమును పొందును. ఒకప్పుడు మూర్ఖునిగా, పండితునిగా, ధర్మాత్మునిగా, జ్ఞానిగా ప్రవర్తించును.

ఓ దేవా! ఒకప్పుడు ధనాశతో, ఈ ప్రపంచమంతా ధనమువలె కనపడును. దీనికొరకు పోరాటము చేయుట సంభవించుచున్నది. ఈ ప్రపంచమంతయు శత్రువుగా భావించుచుండును. ఒకప్పుడు కామోద్దీపనముగా కనపడును. ఒకప్పుడు ఈ ప్రపంచమంతయు నారీమయముగా గోచరించును. అనగా మనస్సు అనేది అన్ని విధములుగా ఆలోచించుచూ వుండును. అనగా మనస్సు చంచలమైనది. అంతయు మనస్సు యొక్క చంచలత్వముపై ఆధారపడి వున్నది. ఈ ప్రకారము మనస్సు ప్రపంచమనెడి సన్నిపాతము వలన గ్రస్తమయి భయంకరమైన దుఃఖములను అనుభించుచున్నది. భగవానుని కృపలేనిదే మనస్సు యొక్క ఈ పిచ్చి తొలగదు. ఈ సన్నిపాతమును తొలగించుటకు సంయమము, తపము, జపము, నియమము, ధర్మము, వ్రతము మొదలగు ఔష్యధములు వున్నను, ఓ

రామా! తులసీదాసు యొక్క ప్రపంచమనెడి రోగమునుండి ముక్తి పొందవలెనన్న నీ పాదసేవయే ముఖ్యము; ముక్తి కల్గించును.

(మనస్సు చంచలమై స్థిరత్వమును పొందదు. దీనికి మూలకారణము మాయ; దీని రెండు రూపాలు ఆవరణ, విశేషము).

40. మోహమున జనించిన అజ్ఞానమున ఉత్పన్నమయిన అనేక ప్రకారములగు పాపములు ఈ మనస్సున అంటుకొని జీవునికి దుఃఖము కల్గించుచున్నవి. అవి కోటి ప్రయత్నములు చేసిననూ వదలవు. దీనికి కారణము ఏమనగా జన్మజన్మాంతరముల నుండి చిత్తము ఆ పాపములను అభ్యసించుటయందే నిమగ్నుడయినందున, పాపముల దోషము చిత్తమున గాఢముగా అలముకొని వున్నది. భావమేమనగా చిత్తము పాపములను చేయుటలోనే ఆనందమును పొందుచున్నది. ఇందువలన పాపము తొలగుట లేదు. పరస్త్రీని చూచి కన్నుకొట్టుట అనగా కామవాసన చేత నిండియుండుట, మనస్సు ఎల్లప్పుడు విషయవాసనలను అంటుకొని యుండును. అందులో నిమగ్నమయి అంటుకొని యుండును. హృదయమున వాసనయు, మనసున భావన అహంకారమున మునిగి యుండుటవలన, మలినమయినది. ఈ విధముగా జీవుడు తన సహజమైన, సార్వభావికమగు సుఖమును, ఆత్మానందమును అనుభూతిని త్యజించి సదా ప్రాపంచిక విషయ వాసనలయందు నిమగ్నమయి చిక్కుకొని దుఃఖమును పొందుచున్నది.

పరనింద విని చెవులు, పరుల చెడ్డను చెప్పుచూవాణి మలినమయినని తన యజమానియగు రాముని స్మరణ విస్మరించుట వలననే, ఈ పాపమలినము నన్ను అన్ని విధములుగా చుట్టుముట్టినది. తులసీదాసు ఈ విధముగా తెలియజేయుచున్నాడు. ఈ పాపములనుండి శుద్ధి అగుటకు అనగా ముక్తి పొందుటకు వ్రతములు, జ్ఞానము, దానము, తపము మొదలయినవి చేయుట వలననే అగును. కాని వాస్తవముగా రామచరణముల ప్రేమరూపమనెడి జలము చేతనే పాపమనెడి బరువైన మురికి తొలగించలేదు. అనగా రాముని చరణముల ప్రేమ వలననే ఈ పాపముల నుండి విముక్తి అగును.

41. తులసీదాసు, ఈ ప్రపంచములోని విషయ వాసనలయందు అంటుకొనియున్న తన మొదటి ప్రవృత్తికి, పశ్చాత్తాపము నొందుచూ, ఇట్లు చెప్పుచున్నారు :- నేను ఏమియు చేయలేకపోయితిని. నా ఈ జన్మము వ్యర్థముగా గడచిపోవుచున్నది. దేవతలకు కూడ మిక్కిలి దుర్లభమైన ఈ మానవ శరీరము పొంది కూడ, కపటమును వదలి, మనసా వాచా కర్మణా రామనామ స్మరణ చేయలేదు. బాల్యావస్థయందు చిత్తము అజ్ఞానమున మునిగియుండెను. ఆ అజ్ఞాన అవస్థయందే బాల్యము గడచిపోయినది. అప్పుడు బాల్యమున. చిత్తమున, ఇప్పటికంటె నాల్గింతలు చపలత్వము, ప్రసన్నత వ్యాపించియుండెను. తదుపరి యవ్వనము అనెడి జ్వరము వచ్చెను. దానిని తొలగించుకొనుటకు ఏ ఉపాయమును లేక యువతి అను అపథ్యమును చేసితిని అనగా స్త్రీ సంభోగమున లిప్తుడనైయుంటిని.

జ్వరముగల ఈ స్థితిలో చెడు పథ్యమయినందున త్రిదోషమనెడిది (వాత, పిత్త, కఫములు) పెచ్చుపెరిగెను. శరీరమంతట కామరూపమనెడి వాయువు చేరినది. రోగి సన్నిహిత జ్వరమున పిచ్చివాడయి వదరునట్లుగ యౌవనమున స్త్రీ సంభోగము చేత కామవాసన శాంతించుటకు బదులు భయంకర రూపమున ఇంకను ఎక్కువ అయ్యెను.

మధ్య వయస్సు ఏర్పడినప్పుడు, యౌవనము గడచిపోయి, ప్రౌఢావస్థ వచ్చినప్పుడు ధనమును సంపాదించుటలో ఆ కాలమును పోగొట్టుకొంటిని. ధనమును సంపాదించుటకు వ్యాపారము, వ్యవసాయము మొదలగు అనేక ప్రకారములయిన ఉపాయములను చేసితిని. అనగా ప్రౌడావస్థ, ధన సంపాదనలో గడచిపోయెను. రాముని ఎడ విముఖుడనయి వున్నందున, రామభజన చేయనందున సుఖము కలలోకూడ లభించలేదు (కలుగలేదు). రాత్రింబవల్లు, మూడు రకములయిన పాపములను, దైహిక, దైవిక, భౌతికములయందు దగ్ధమగుచుంటిని. రామభక్తుల, సాధువుల, విద్వాంసుల సేవ అందమైన సద్భావము, భక్తితో సేవ చేయలేదు.రోమాంచితుడనయి, ప్రసన్నమయిన మనస్సుతో భగవంతుడగు రాముని ద్వారా చేయబడిన శీలములను వినలేదు. గానము చేయలేదు.

ఇప్పుడు మొత్తం శరీరములోని అన్ని అంగములలోనికి వృద్ధాప్యము పరిగెత్తుకొని చేరినది. మర్దించినది అనగా ముసలితనం చేత శారీరమంతయు శిథిలమయినది. పనికిరాకుండ నిరుపయోగమయినందున మాణిక్యము అపహరించిన తరువాత సర్పము బాధపడునట్లు తల పగులకొట్టుకొనుచున్నాను. ఇప్పుడు చేతులు పిసుకుకొని బాధపడుచున్నాడను. అసహ్యమైన దావాగ్నివలె, భయంకరమైన కష్టములను కల్గించు వృద్ధావస్థ నుండి నిన్ను రక్షించువారు, ఏ మిత్రుడు, హితుడు నా దగ్గరికి రారు. వాటికొరకు నేను పరలోకమును చెడగొట్టుకొంటిని. అనగా, భార్యాపుత్రులు, కుటుంబ సభ్యుల హితము కొరకు రాముని భజన చేయక, అనేక రకములయిన పాపములను చేసితిని. వారు ఇప్పుడు నీ దగ్గర నిలబడి వుండుటకు బిడియపడు (సిగ్గుపడు) చున్నారు. నన్ను గురించి పట్టించుకొనేవారు ఎవరూలేదు. తులసీదాసు చెప్పుచున్నాడు. మనసా! ఇప్పుడైనా నీవు భగవంతుడగు రాముని స్మరణ చేయుము. వారి నామస్మరణ ఒకసారి చేసినందున గజేంద్రుని రక్షించెను.

42. ఓ మనసా! ఒకవేళ నీవు రామభజన చేయులేకపోయినచో, నీవు మిక్కిలి పశ్చాత్తాపపడవలసి వుండును. నీకు అతి సులభంగా ఈ మానవ శరీరము లభించినది. దానిని పొందుట దేవతలకు కూడ దుర్లభము. దేవతలు ఈ మానవ శరీరమును పొందుటకు మిక్కిలి తాపత్రయమును చూపుచుందురు. అయిన పొందలేరు. ఈ విషయమును సరిగా తెలుసుకొనిన మేలు. నీటిని చిలికిన నెయ్యి లభించదు. ఇదే మాదిరి భగవంతునకు విముఖుడనైనచో సుఖములను పొందగోరుట వ్యర్థము. ఆ సుఖ భోగముల యొక్క కళ్యాణకారియగు ఫలము లభించదునీకు. ఈ విషయమును ఆలోచించి అనగా చక్కగా ఈ విషయమును గురించి మననము చేయవలెను. చెడు మార్గము, చెడు స్నేహము

వదలివేయవలయును. మంచి మార్గములో, మంచివారితో కలిసి (సత్సంగము) వెళ్ళుము. సాధువుల భక్తులతోకలిసి భగవంతుని భజన చేయవలెను.

ఓ మనసా! అటులనే చేయుటకు నీవు రామభక్తులతో కలిసి భజన చేయుము. వారిని దర్శించుము. వారినుండి రాముని గాథను వినుము. నీవు నీ హృదయమున భగవంతుడగు రాముని ధనుర్బాణములు హస్తమున ధరించి, మునుల వస్త్రములతో అలంకరించబడిన, నడుమున అంబులపొది బంధించబడివున్న రూపమును ధ్యానించుము. తులసీదాసు చెప్పుచున్నాడు :- ఓ మనసా! నీవు ప్రపంచములోని మోసములను, కపటములను త్యజించుము. రాముని చరణ కమలముల యందు నీ శిరస్సువంచుము. (పాదవందనము చేయుము) ఇటుల చేయుటకు భయభీతుడవుకావద్దు. నాయటువంటి పాపిని భగవంతుడు స్వీకరించడని ఆలోచన చేయవద్దు. ఎందుకనగా జానకీనాథుడగు రాముడు నీయటువంటి అనేక పాపులను స్వీకరించెను. అందువలన ఆయన నిన్ను కూడ స్వీకరించును.

(తులసీదాసు వనమునన్ను రాముని కౌశమును గురించి ధ్యానము చేసెను.)

43. ఓ మనసా! నీవు కొంచెము భగవంతుని ప్రక్కకు తిరిగి చూచిన, అనగా వారిని దర్శించుము. ఓ దుష్ట మనసా వినుము; నిర్ధనుడు తన ధనమును ఎంతో శ్రద్ధగా మాటిమాటికీ రక్షించుకొనునట్లు నీవు కూడ భగవంతుని ఎడ శ్రద్ధ కలిగి సేవచేయుము. భగవంతుడగు ఆయన సౌందర్యము, జ్ఞానము, శీలము సంపూర్ణ గుణములకు కేంద్రము. చాల ఉదారముగల దాత కూడ. వారు భక్తులు ప్రయత్నించి సంపూర్ణ పాపములను నాశనము చేయగలరు. విషయాది వికారములను తొలగించును. నీవు యాగములు, యజ్ఞములు, వ్రతములు, సంయమము మొదలగు విభిన్న ప్రకారములైన సాధనలు చేయకయే భవసాగరమును దాట కోరినచో, తులసీదాసు! నీవు భగవంతుని చరణ కమలములను రాత్రింబవళ్ళు ఒక క్షణము కూడ మరచిపోవద్దు. సదా వీరినే ధ్యానించుచూ వుండుము.

(యోగములు ఎనిమిది విధములుగ విభజింపబడినవి. (1) యమ, (2) నియమ (3) ఆసన (4) ప్రాణాయామ (5) ప్రత్యాహార (6) ధ్యానము (7) ధారణ (8) సమాధి.

వ్రతములు :- చాంద్రాయణ, సోమాయన, కృచ్ఛము, మహాకృచ్ఛ మొదలగునవి.)

44. ఈ పద్యము యొక్క సందర్భము ఈ విధముగా క్రింద పేర్కొనబడినది.

రాజగు ఉత్తానపాదునికి ఇద్దరు రాణులు (భార్యలు) వుండిరి. పెద్ద ఆమె పేరు సునీతి. రెండవ ఆమె పేరు సురుచి. సునీతి కుమారుడు ధృవుడు. సురుచి కుమారుడు వుత్తమ. రాజు ఉత్తముని ఎక్కువ ప్రేమించుచుండెను.

ఒక దినము ఉత్తానపాదుడు సురుచి సహితముగా సింహాసనంపైన కూర్చొని తన ఒడిలో ఉత్తముని ఆడించుచుండెను. అప్పుడే ధృవుడు అక్కడికి వచ్చెను. రాజుగారి ఒడిలో

కూర్చొనుటకు ప్రయత్నించెను. ఇది చూచి సవతి తల్లియగు సురుచి ఇట్లనెను :- ఒకవేళ నీవు పూర్వజన్మమున తపస్సు చేసి యుండినచో, రాజుగారి సింహాసనముపై కూర్చొనుటకు అధికారివి అయ్యేడివాడవు. ఇందువలన వెళ్ళి మొదట తపస్సు చేయుము. ధృవుడు ఈ విషయమును తల్లియగు సునీతి వద్దకు వెళ్ళి చెప్పెను. సునీతి కూడ తపస్స చేయమని ధృవునితో చెప్పెను. ఈ పదమున మాతయగు సునీతి ధృవునికి ఇదే విషయము చెప్పుచున్నది.

ఓ కుమారా! నాల్గు వేదములు కూడ శ్రీ రఘువీరుడగు రాముని చరణముల విస్మరించిన వారికి అన్యత్రా చోటు లభించదు. అనగా ప్రాణికి ఒకే ఒక ఆశ్రయము భగవంతుడగు రాముని చరణములయందు మాత్రమే యున్నది చూడుము. వారి చరణ సేవ చేసియే బ్రహ్మ, శివుడు అష్టసిద్ధులను పొందిరి. శుకదేవుడు, శునకాది ముని గణము జీవన్ముక్తులయి స్వచ్ఛంద రూపముగ విహరించుచున్నారు. నేడుకూడ వారి భజన చేయుచూనే యున్నారు. ఒకవేళ లక్ష్మి సదా చంచలమైనది. ఒక క్షణము కూడా ఒకచోట స్థిరముగా నుండదు. అయిన కూడ భగవంతుని చరణ కమలములను పొంది మనసా వాచా కర్మణా (త్రికరణ శుద్ధిగా) అక్కడనే స్థిరముగా వున్నది. సదా వారి చరణ సేవ చేయుచున్నది.

కరుణాసాగరుడు, భక్తులకు చింతామణివలె అనగా భక్తుల మనస్సులయందలి పూర్తి చేయు భగవంతుని భక్తితో సేవ చేయుటవలననే భక్తునికి శోభ కల్గును. ఇతర దేవతల రాక్షసాది ఐశ్వర్యము గలవారు వున్నారు. వారిని ఆరు సర్పములు కాటు వేయుచున్నవి. అనగా వీరు కామము, క్రోధము, లోభము, మదము, మత్సరము రూపమున నుండెడి సర్పముల ద్వారా సదా పీడించబడుచున్నాడు.. (వీరు నిన్ను ఏవిధంగా రక్షింపగలరు) ఇందువలన ఓ కుమారా! సురుచి నీతో చెప్పిన విషయము సత్యము. ఒకవేళ ఆమె మాటలు కఠినముగా నున్నవి అయిన సత్యము సదా కఠోరముగా నుండును. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు :- సునీతి ధృవునితో భగవంతుడగు రామునితో విముఖుడైన ఆపదలు తొలగిపోవు. అనగా రాముని సేవ చేయుట వలననే అన్ని ఆపదలనుండి ముక్తిని పొందవచ్చును.

45. ఓ మూర్ఖమైన మనసా! నా జ్ఞాన బోధ (విద్య) వినము. నేటివరకు భగవంతుని విముఖుడైనవాడు సుఖమును (ఆనందమును) పొందలేదు. ఓ దుష్టా! ఇంకను సమయము (కాలము) వున్నది. నీవు ఈ విషయమును తెలుసుకొనుము. అనగా ఇంతవరకు ఏమియును చెడపు కాలేదు. ఇందువలన నీవు రాముని చరణసేవ చేయుము. రామునికి విముఖుడయి అనగా రామునికి దూరమయిన వారికి ఎవరికీ సుఖము లభించలేదు. సూర్యచంద్రులు కూడా భగవంతునికి దూరమయినందున వారు దుఃఖపడుచున్నారు. వారు రాత్రింబవళ్ళు దారితప్పి ఆకాశమున తిరుగుచున్నారు. అలసిపోయి అస్తమగుచున్నారు. వారికి ఇంతవరకు ముక్తి లభించలేదు. వారు ఆకాశమున వారి భయంకర శత్రువు రాహువు వుండి వారిని వెంబడించుచున్నాడు. అవకాశము లభించినపుడు వారిని మ్రింగుచున్నాడు.

దేవనది గంగ అత్యంత పవిత్రమైనప్పటికీ ముల్లోకములలో దానియశస్సు వ్యాపించినప్పటికీ, గంగ త్రిపథగా పిలువబడినది. మూడు లోకములయందు వేరువేరు రూపములయందు ప్రవహించుచున్నది. భగవంతుని చరణముల నుండి వేరయినప్పటినుండి, నేటివరకు దాని ప్రవాహము నిలబడలేదు. (గంగ విష్ణువు చరణములనుండి జన్మించినట్లు భావించబడినది.) అది శాంతిని పొందక సదా చలనం కల్గియున్నది. వేదములు ఇట్లు నిర్ణయించినవి. రాముని స్మరణ చేయకయే ఆపదల నుండి ముక్తి లభించదు. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఓ మనసా! నీవు ఇతర ఆధారములు వదలి రాముని సేవకుడవు అగుము. అనగా ఇతర దేవీదేవతల నుండి తన ఉద్ధరణ అగునని రాముని సేవ మాత్రమే చేయుము. ఆయన నుండియే నీ ఆపద తొలగును.

46. ఓ మనసా! నీవు ఎప్పుడూ శాంతముగా వుండలేదు. నీవు నీ సహజమయిన ఆత్మానందమును వదలి (మరచి) రాత్రింబవళ్ళు విషయవాసనల యందు మునిగి దారి తప్పి తిరుగుచున్నావు. నీ ఇంద్రియములు నిన్ను విషయవాసనల ప్రక్కకే లాగుకొనిపోవుచున్నవి. ఆ వాసనలయందు అంటుకొని యున్నందున అసహ్యమైన దుఃఖమును పొందుచున్నావు. దాని కఠినమైన వలలో చిక్కి వున్నావు. అయిన ఓ మూర్ఖా! అయిన నీవు వాటిని వదలకున్నావు. నీవు దాని మోహమునందు వుండి కూడ తెలియజెప్పినను వాటిని వదలకున్నావు. అనగా విషయ వికారములు శాంతిని కలుగచేయవని తెలుసు నీకు. అయిననూ నీ మనస్సులో వాటి ఎడ ప్రబలమయిన మోహమున పడి తెలిసికూడ తెలియని వానివలె ప్రవర్తిస్తున్నావు. నీవు అనేక జన్మములయందు, నానా రకములయిన కర్మలు చేసితివి. ఆ కర్మల బురదలో నీ చిత్తము తగుల్కొని యున్నది. అనగా ఆకర్మలు నీ చిత్తమును వదలక సదా చుట్టుముట్టినవి. నీవు వాటి నుండి ముక్తి పొందలేకున్నావు. ఈ కర్మరూపమనెడి బురద, నిర్మలమైన వివేక జ్ఞాన జలము లేకయే వదలదని, వేదపురాణములు చెప్పుచున్నవి. అనగా జ్ఞానము ద్వారానే కర్మ బంధనము నుండి ముక్తి లభించును.

నీ హితము కొరకు నీవు నీ స్వామి, గురువు, తండ్రివి ప్రేమించినట్లు నీవు మనసారా భగవంతుని ప్రేమించలేదు. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు :- చెరువుని త్రవ్వుటకే జీవితమంతయు వ్యయమయిన ఆ చెరువు నుండి దాహము తీరదు. భావము ఏమనగా విషయ వాసనల యందు, వాస్తవమైన నిజమైన సుఖము అసంభవము.

(కర్మ జన్మ కారణము వలననే జీవుడు మాటిమాటికీ, జన్మించవలసి యున్నది. జీవుడు విషయ వాసనల చక్రములో పడి, విభిన్న యోనులయందు దారితప్పి తిరుగుచున్నాడు.)

47. ఓ హరి! నా మనస్సు తన హఠమును వదలకున్నది. తాను కోరినది చేయుచున్నది. ఓ నాథా! నేను రాత్రింబవళ్ళు దీనికి (మనసుకు) అనేక విధములుగా చెప్పితిని, చెప్పుచున్నాను. కాని అది తన స్వభావము ప్రకారమే ఆచరణ చేయుచున్నది. ప్రసవవేదన కల్గినప్పుడు

యువతి తన భర్త సంగమమును వ్యతిరేకించుకొన్నట్లు (ప్రసూతి వైరాగ్యం) తరువాత బిడి మనిషి అయినపుడు మరలా పతి సంగమము చేయుచుండును.

పేరాశగల కుక్క ఇంటి ఇంటికీ ముమ్మరంగా తిరుగుచుండును. అక్కడ దానికి తిరస్కారములు ఎదురయిననూ నీచత్వమున మూర్ఖమును వదలక ద్వారము, ద్వారము కడకూ పరిగెత్తుకొనిపోవుచున్నది. తన అవమానమునకు సిగ్గుపడదు. నేను అనేక రకములగు ఉపాయములు చేసిననూ మనస్సు మిక్కిలి ప్రబలమై అజేయమైవున్నది. అనగా వశమునకు రాకున్నది. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఈ మనస్సుకు ప్రేరణకర్తయగు ప్రభువు దీనిని ఆపినప్పుడే మనస్సు వశములోనికి వచ్చును. మనస్సును భగవంతుడే అదుపులో వుంచగలడు. ఇతరులతోకాదు.

(మనస్సు చాలా ప్రబలమైనది. దీనిని వశములో వుంచుట అతికష్టము. భగవంతుని కృప చేతనే దీనిని అదుపులో ఉంచగలదు.)

48. ఈ మనస్సు మూర్ఖత్వము ఇటుల వున్నది - రామ భక్తి అను గంగను వదలి, మంచు బిందువులనాశించి అటుపోవుచున్నది. దాహము గొన్న చాతకపక్షి మంచుపొగను, మేఘమని భావించి ఆ మంచు ప్రక్కకు కంటిరెప్ప ఆర్పకుండా తదేక దృష్టితో చూచుచూ వుండును. అక్కడదానికి చల్లదనము గాని, నీరు గాని లభించదు. కన్నుల బాధను పొందవలసి వచ్చును.

మూర్ఖురాలగు డేగ రాతిగోడలో అమర్చిన అద్దములో తన రూపమును చూచి మరొక డేగ అని భ్రాంతిపడి, ఆకలిని తీర్చుకొనుటకు ఆ ప్రతిబింబము పైకి విరుచుకొని ఆక్రమించును. తన ముక్కు పుటములకు హాని కలుగునని భావించదు. అద్దముతో ఘర్షణ పడి ముక్కుకు హాని కల్గును. అదేమాదిరి ఈ మనస్సు భ్రమలో అనేక కష్టములు ఎదుర్కొనుచున్నది. ఓ కృపానిధి! నేను ఈ మనస్సు యొక్క చెడు మార్గములను పయనించుట, చెడు విషయములు ఎన్ని అని చెప్పను. మీకు మీ భక్తుల స్థితిగతులన్నియు తెలియును. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఓ ప్రభూ! నాదారుణమైన అసహ్యమైన దుఃఖమును తొలగించుము. భక్తులను రక్షించువాడను కీర్తిని రక్షించుకొనుము.

49. ఓ హరి! నేను మాటి మాటికీ అనేక జన్మ మరణముల యందు పరిభ్రమించుచున్నాను. బాధపడుచున్నాను. నీవు దీనికి జీవుడు (ప్రాణి) అని పేరుపెట్టినావు. జీవుని యొక్క అనేక వాసనలనెడి వస్త్రములను ధరించియున్నాను. లోభాది విభిన్న రకములగు ఆభరణములను ధరించియున్నాను. జడ చైతన్య రూపమును పొంది, ఆకాశము, జలము, పృథ్వీపైన నేను ఎన్నియో తమాషా ప్రదర్శనలు చేసితిని. అనగా విభిన్న యోనులయందు జన్మమునొందితిని. దేవతలు, దైత్యులు, మునులు, నాగులు, మనుష్యులు మొదలగు ఎందరినో నన్ను వుద్ధరించమని యాచించితిని. కాని ఎవరు నా దరిద్రమును, దుఃఖమును

శిథిలమైయున్నవి. ఓ రఘునాథా! ఇప్పుడు ఈ దాసుడు ప్రపంచ భయముచేత వికలుడనయి, నీ శరణుజొచ్చితిని. ఓ ప్రభూ! ఏ గుణములు చూసి నీవు సంతసించి ఆ భక్తుల ఆధీనముననున్నావో, ఆ గుణములను నేను మరచితిని. అనగా నీవు ఏ గుణములకు సంతసించెదవో నాకు తెలియదు. ఇందువలన ఓ నాథా! తులసీదాసునగు నన్ను నీ ద్వారము దగ్గర వుండనిమ్ము. అనగా ఛీకొట్టి వెడలగొట్టవద్దు.

(జీవుడు పరమాత్మ అంశము. మాయ చేత అతనిలో సత్ చిత్ వుండును. ఆనందమును మరచిపోవును. వారి కృపలేక జ్ఞానము ద్వారా ఆత్మ జ్ఞానము లభించును, ముక్తుడగును.)

50. ఓ మాధవా! నా సమానమైన మూర్ఖుడు ఇతరులెవ్వరు వుండరు. చేపలు మిడతలు చాలా మూర్ఖమైనవి. కాని మూర్ఖత్వమున అవి కూడా నాకుసాటిగా రావు. వాటిలో రూపము, భోజనమునకు వశమయి, అగ్నివి, ఇనుముగాలమును తెలుసుకొనలేవు. అనగా మిడతలు దీపమునకు జ్వాలకు గురి అయి చనిపోవును. చేపలు ఆహారము అనే లాభమున ఇనుప గాలమునకు గురి అయి చనిపోవుచున్నవి. కాని ఇది తెలిసికూడ విషయ వాసనల యందు పడి బాధలు పొందుచున్నారు. నేను, మిడతలు, చేపలు కంటె మూర్ఖున్ని. ఎందుకు అనగా తెలిసి కూడ చిక్కులలోపడి వున్నాను. మాయా మోహము అను వలలో చిక్కుకొన్నాను. ఈ భవసాగరమును దాటుటకు దేవుని చరణములే ఒకే ఒక నౌక. ఆ నౌకను వదలి మాటిమాటికీ సమానమైన తత్వహీనమైన ప్రాపంచిక విషయ వాసనలను పట్టుకొన్నాను.

బాగా ఆకలిగొన్న కుక్క పాత ఎముకను నోటితో పట్టుకొని కొరుకుచూవుండును. ఇటుల చేయుటవలన నాలుక తెగి రక్తము కారుచూ వుండగా దానినే నాకి తృప్తి పడును. నేను ఈ ప్రపంచమనెడి భయంకరమైన సర్పము యొక్క నోటివద్దనున్నాను. ఈ ప్రపంచమనెడి సర్పము నుండి విముక్తి గోరుచున్నాను. దీనికి సర్ప భక్షకుడగు గరుడవాహనుడగు విష్ణువు (రాముని) వదలి ఇతర దేవీదేవతలను ప్రార్థించుచున్నాను. ఇతర దేవతలు మండూక సమానము. ఇంతకంటె మూర్ఖత్వము మరియొకటి యుండదు. నా రక్షణ ఎట్లు అగును?

నీటియందున్న జీవులు - చేపలు, మొసళ్ళు మొదలగునవి. వలలో చిక్కుకొని ఐక్యతను కల్గించుకొనుచున్నవి. అప్పుడు అవి తమ నాశనము తెలియక ఒకదానిని మరియొకటి తినుచున్నవి. చేపలు పట్టువాడు అన్నింటినీ చంపునని వాటికి తెలియదు. కాలము అనెడి వలలో చిక్కిన జీవులు, పరస్పరము ఒకదానిని మరొకటి చంపుచున్నవి. తమకు ఆసన్నమైన వినాశనమును తెలుసుకొనలేకున్నవి. నేను అసంఖ్యాకమైన పాపములను చేసితిని. ఇటువంటి సమయమున తులసీదాసు మనస్సునందు ఒకేఒక నమ్మకమైన భరోసా వున్నది. భగవంతుడు పతిత పావనుడు. నన్ను కూడ తప్పక వుద్ధరించును.

51. ఓ రామా! నీవు సర్వులను దయగా చూచే గుణమును మరచిపోయితివా? దీనుల దుఃఖము వినిన వెంటనే కరుణతో ద్రవించుచూ వైకుంఠమును వదలి వెంటనే వచ్చేవాడవు. మొసలికి చిక్కిన గజేంద్రము వేడిన వెంటనే వచ్చి రక్షించితివి కదా! దితి పుత్రుడైన హిరణ్యకశిపుని భయము చేత భీతుడైన ప్రహ్లాదుని రక్షించితివి. నీవు నరసింహరూపమున అవతరించలేదా? దైత్యుని వధించితివి. వేదములయందు కూడ ఈ విషయము వర్ణించబడి వున్నఇ.

ధృతరాష్ట్ర రాజు సభలో ద్రౌపదీ మాన సంరక్షణ చేయలేదా? అక్కడ వున్న రాజులు రక్షింపలేకపోయిరి. నిను ద్రౌపది వేడిన వెంటనే వస్త్రదానము చేసి రక్షించితివి. శత్రు దుశ్శాసనుడు వస్త్రములొలుచుచూ అలసిపోయెను. రఘువీరా! ఒకే శత్రువు ద్వారా బాధపడువారిని కాపాడితివి. నాకిపుడు కామము, క్రోధము, మదము, లోభము, ఈర్ష్యా ద్వేషములు అను అనేక శత్రువులు బాధించుచున్నారు. అసహ్యమైన దుఃఖములను కల్గించుచున్నారు. నాకు ఈ భవసాగరము నుండి తరించుటకు ఎందుకు సహాయము చేయకున్నావు? లోభమనెడి మొసలి, దైత్యరాజైన హిరణ్యకశిపుడు, కామమనెడి కౌరవ నరేశుడు దుర్యోధనుని తమ్ముడు దుశ్శాసనుడు బాధించుచున్నారు. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు - ఓ ప్రభూ! పరమ ఉదారుడనగు రామా! నా భయంకరమైన దుఃకమును తొలగించుము.

52. ఓ రామా! నీవు నన్ను ఎందుకు మరచితివి? ఓ నాథా! నీవు నీ మహిమ దీనులను ఉద్ధరించిన మహిమ నా పాపము తెలియును. అయినా నీవు నన్ను కాపాడలేదు. పతితులను పావనము చేయువాడవని వేదములు చెప్పుచున్నవి. దీనులకు హితము చేయువాడవు. ఇతరులు ఎవ్వరును శరణు ఇవ్వని వారికి శరణు ఇచ్చేదవు. ఓ నాథా! నీచుడను, దీనుడను, భయభీతుడను నేను. నీవు నన్ను రక్షించలేదు. వేదములు నీ విషయమున అసత్యము తెల్పినాయా? పక్షి జటాయువు, పింగళ అను పేరుగల గణిక (వేశ్య), గజేంద్రుడు, వాల్మీకి, వ్యాధుడు మొదలగు వారిని నీవు ఉద్ధరించితివి. ఆపంక్తిలోనే నేను కూర్చొన్నాను. ఆ శ్రేణిలోనే వున్నాను. అనగా నేను కూడ నీచుడను. అయినా ఓ కృపానిధి! నన్ను ఉద్ధరించుటకు ఎందుకు సందేహిస్తున్నావు? నా ఎదుట వడ్డించిన విస్తరను నీవు చింపుచున్నావు. అనగా నన్ను పంక్తినుండి వేరు చేయుచున్నావు. నన్ను ఉద్ధరించుట లేదు.

ఒకవేళ కలియుగము మిక్కిలి భయంకరము అయినది అయిన నీ ఆదేశమును వినకపోయిన నా యటువంటి నీ ఆశను వదలి వుండేవాన్ని. నీ గుణగానము చేయను. కలియుగ దోషములను లెక్కించక, దాని ఎడ క్రోధమును ప్రకటించము. నీ భక్తిని వదలి, అన్ని జగములు దానినే కీర్తించెడి వారము. దానినే నమ్మి ఆధారపడి వుండేవారము. ఓ ప్రభు! నీ ప్రతాపము గొప్పది. అయిన నన్ను వదలివేయుచున్నావు. నీవు దోమను బ్రహ్మగా,

బ్రహ్మను దోమగా చేయగలవు. ఇంతటి శక్తి, సామర్థ్యమున్ననూ, ఓ నాథా! నీవు నన్ను వదలి వేయుచున్నావు. అనగా నన్ను రక్షించకవున్నావు. ఇప్పుడు నాకు ఏది మార్గము? నేను ఏమి చేయగలను? నీ ఇష్టమున్నట్లు చేయుము. నేను ఈ కలియుగముతో పోరాడుచూ పోరాడుచూ అలసిపోయితిని. నరకమునకు పోవుటకు దూడ సిద్ధముగా నున్నాను. కానీ నీపేరు కూడ దుఃఖమును తొలగించలేకపోయెనే అని నాకు దుఃఖముగా నున్నది. భావమేమనగా వేదములు చెప్పిన ప్రకారము నామస్మరణ చేసినను అన్ని అసత్యమైనవి. ఇందులో నీ చెడ్డపేరు ఎక్కువగా నుండును. నాకేమి, నేను నరకమును కూడ అనుభవించుదును.

53. భగవంతుడు ఎంత ప్రార్థన చేసినను, బ్రతిమాలిననూ, నామాట విననప్పుడు అతడు (తులసీదాసు) ఒక ఉపాయమును చేసెను. ఆయన భగవంతునితో ఇట్లు చెప్పెను :- ఒకవేళ యముడు తన ఇతర కార్యములన్నియు వదలి కేవలము తులసీదాసు పాపములను లెక్కించుటకు వచ్చినచో నా అనంత పాపములను గణించలేడు. అవి అనంతము, నా పాపముల సంఖ్య లెక్కించుటలో యముడు నిమగ్నమయినచో అప్పుడు యముని లోకమునుండి పాపాత్ములందరు గుంపులు గుంపులుగా తప్పించుకొని పారిపోయెదరు. ఇది చూచి యముడు గొప్ప సందేహములో పడిపోవును. తన పదవికి ప్రమాదమని భావించి నా పీడ నుండి వేరగుటకు, భగవంతునితో నను గురించి ప్రశంస చేయును. తులసీదాసు చాలా ధర్మాత్ముడు. ఇది విని భగవంతుడు నవ్వి తులసీదాసు నా భక్తుడని విశ్వసించును. భక్త శిరోమణి అను పదవినిచ్చును. ఓ కోసల పతి! చివరకు దేవుడు వినశుడయి నన్ను స్వీకరింపవలసి వచ్చును. చివరకు ఎటులనో స్వీకరించితివి.

53. ఓ రామా! ఒకవేళ నీ దాసుడగు తులసీదాసు అవగుణములను, నీ మనస్సు అనుకొనినచో, అనగా వానికి ఉన్నత స్థానము ఇచ్చినచో, నన్ను నీ పుణ్యమనెడి గోళ్ళతో, నా పాపములనన్నింటిని వినాశనము చేయగలనన్నచో అసంఖ్యాకమైనవి వున్నవి. పుణ్యములు గోళ్ళవలె పెరిగియున్నవి కొద్దిగా వున్నవి. పాపములు అనేకములై అసంఖ్యాకములయి భయంకరముగానున్నవి. నా పుణ్యములు, నా పాపములను ఎట్లు తొలగించగలవు? నేను మనసా, వాచా, కర్మణా అనేక పాపములను చేసితిని. దానిని వర్ణించలేము. అసంఖ్యాకమైన శేషనాగులు, కోట్లకొలది శారదలు, వేదములు ఒక కక్షము చేసిన పాపములను లెక్కించినట్లయితే వారు పరాజితులయ్యెదరు. కానీ నీ మనస్సులో నీనామస్మరణ చేసినట్లయితే, పాపుల ఉద్ధరణ జరుగును. పాపులను పవిత్రము చేయు విషయమున నీ గుణములను చరితార్థము కానినచో చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకము వచ్చును. నీవు అజ్ఞామిలుడగు బ్రాహ్మణునివలె యముని దూతలను ఓడించి ఈ తులసీదాసును ఉద్ధరింతువు.

54. ఒకవేళ భగవంతుడు భక్తుల అవగుణములను మనస్సున భావించినచో అనగా ఆ అవగుణముల గురించి ధ్యానము కల్గించుకొనిన, ఇంద్రుడు, దుర్యోధనుడు, బలితో

హఠపూర్వకముగా వైరము పూనెడివారు. ఒకవేళ భగవంతుడు, జపము, యజ్ఞము, యోగము, వ్రతమును వదలివేసి అనగా వీటిని చేయక కేవలము ప్రేమయే కోరినచో, దేవతలను శ్రేష్ఠమైన మునులను వదలి (త్యజించి) వ్రజప్రాంతములో గోపుల ఇంటియందు నందగోపుని ఇంటిలో ఎందుకు వుండును? భావము ఏమనగా భగవంతుడు ప్రేమ వశమున వ్రజప్రాంతమున అవతరించెను. ఒకవేళ భగవంతుడు ఎక్కడో ఒకచోట విభిన్న ప్రాంతముల విభిన్న సందర్భముల భక్తుల ప్రతిజ్ఞను రక్షించకపోయిన ఈ కలియుగమున కఠినమైన కర్మ మార్గమున భగవంతుని భజన చేయనిచో మేము మూర్ఖులము ఎట్లు నడచేవారము. మా నిర్వహణ అయ్యేది కాదు. భావము ఏమన కలియుగమున కర్మ మార్గమును అనుసరించుటయే దుష్కరమగును. ఎందుకనగా కలిసాధనా మార్గముల బాధలను కల్గించును. ఇందువలన మాయటువంటి మూర్ఖుల నిర్వహణ కష్టము. కేవలము భజనయే ఈ యుగమున ముక్తికి సాధనము.

ఒకవేళ భగవంతుడు అజామిలుని తన కుమారుడైన నారాయణను పిలుచుటకు భగవంతుని నామ ఉచ్చారణ చేసెను. అసంఖ్యాకమైన పాపములను సంహరించకపోయిన మేము యముని గణము మా మూర్ఖులను యాతన అనెడి నాగలికి కట్టి ఎద్దులవలె చేయించెడివారు. (ఎద్దులు మూర్ఖత్వమునకు ప్రతీకగా భావించబడినవి) ఒకవేళ భగవంతుని యొక్క మిక్కిలి సాటిలేని మేటి యశస్సు ప్రపంచమున ప్రసిద్ధిగానిచో, వారు పాపులను ఉద్ధరించేవారయిన అనేక ల్పములకు తులసీదాసువంటి దుష్టుని స్వప్నమున ముక్తికి అధికారి కాలేడు కదా!

55. రాముడు పేదవారికి శరణు ఇచ్చును. ఆయన ఈ కీర్తి విశ్వమంతటా వ్యాపించినది. రామనామ ప్రభావము అందరికి తెలియును. రామనామ స్మరణ వలన ముక్తి లభించును. ఈ విషయమును వేదములు, పురాణములు, శివుడు, శుకదేవుడు అందరు చెప్పుచున్నవి. ధృవుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు, వానర రాజైన సుగ్రీవుడు, యమలార్జునులు, పాషాణముననున్న అహల్య, జడ పదార్థములు, జటాయువు, పాండవులు, కుచేలుడు, ఈ లోకమున యశమును, పరలోకమున ముక్తికి కల్గించెను. సరి, వీరిలో రామునికి ఉపయోగపడిన వారున్నారా? వేశ్యపింగళ, అడవిజాతివానిని మొదలగు అడవి జాతివారిని - వీరందరు నీచజాతివారు. అజామిలుడు అశ్వమేథయాగము ఎప్పుడు చేసెను? గజేంద్రము సామ వేదమును ఎప్పుడు గానము చేసినది? భావము ఏమనగా వీరిలో ఎవరు కూడ అశ్వమేథము వంటి యజ్ఞము చేయలేదు. సామవేదము యొక్క ఋుక్కులను గానంచేయలేదు. అయిన భగవంతుడు వీరందరికీ ముక్తి కల్గించెను. ముక్తికొరకు ఈ కార్యములు చేయనవసరము లేదు. కేవలము రామనామము స్మరించిన ముక్తి లభించును.

తులసీదాసువంటి కపటము గలవాడు, అన్ని విషయముల యందు హీనమై బలహీనమైన వారు ఎవరును వుండరు. కాని ఈ లోకమున రాజు ప్రతాపము చేత చర్మపు నాణెములు కూడ చెల్లనవి. మహిమ నాణెములదికాక రాజు ప్రతాపముదై వున్నది. ఇదే విధముగా నేను రామనామస్మరణతో తరించెదను.త

56. సీతాపతి రాముని శీలపూర్ణమైన స్వభావ వర్ణన విని ఆనందముచేత పులకాయమానుడు కానివాడు దుమ్ముదులిపే వానితో సమానము. నేత్రములయందు ఆనందభాష్పములు పుట్టనివాడు నీచుడు, అధముడు. వాని జీవితము సారహీనము. మానవజన్మ పొందినందుకు మహత్యము లేదు. రాముడు బాల్యము నుండి, తల్లితండ్రుల, బంధువుల గురువుల, సేవకులు, మంత్రులు (సలహాదారులు) మిత్రులు, ఈ విషయమునే భావించిరి. రాముని యొక్క చంద్రునివంటి ముఖముపైన క్రోధ భావము స్వప్నములో కూడ కనపడలేదు. భావము ఏమనగా రాముడు ఎప్పుడును క్రోధమును పొందలేదు. రాముడు తన తమ్ముండ్లతోపాటు ఇతర బాలురతో ఆడునప్పుడు వారి అల్లరిని చూచు చుండెను. తాను స్వయముగా గెలుపు పొందినను ఓటమిని స్వీకరించి వారిని ప్రేమతో పిలుచుచుండెను. జయాపజయములకు ఎవరును చింత చేయకుండిరి. రెండు దశలయందును స్నేహితులగు బాలురను ఓదార్పు చేయుచుండెను. ప్రసన్నమగు మనస్సుతో ఆట ఆడుకొనుచుండిరి.

రాముని పవిత్ర చరణ స్పర్శ చేతనే శిల అహల్యగా మారెను. అహల్య తన భర్త శాపముచేత శిలగామారి యుండెను. ఆ దుఃఖము నుండి విముక్తురాలయ్యెను. ఆమెను ఉద్ధరించితినని రాముడు ఉత్సాహముతో నుప్పొంగలేదు. బ్రాహ్మణ స్త్రీని చరణములతో స్పర్శ అయినందుకు పశ్చాత్తాపపడెను. శివధనుస్సు విరిచి రాముడు సమస్త రాజుల దర్పమును అణచెను. పరశురాముని కోపమును, లక్ష్మణుని మాటలను శాంతింప చేయుటకు పరశురాముని పాదముల నమస్కరించెను. ఇట్లు సహన శీలత ఎవరిలో నుండగలదు? రాముడు సాధారణముగా సహనశీలుడు, క్షమాశీలుడు.

దశరథరాజు, రామునికి పట్టాభిషేక విషయము చెప్పి తదుపరి కైక వలలోపడి రామునికి వనవాసము కల్గించెను. ఈగ్లాని చేతనే, దశరథుడు చనిపోయెను. రాముడు తన విమాతయగు కైక విషయమున జాగ్రత్తగా ప్రవర్తించెను. తన మర్మ స్థలమును గాయపడిన మానవుడివలె శ్రద్ధగాకైక మనస్సుకు బాధకలుగకుండ రాముడు ప్రవర్తించెను. హనుమంతుని సేవకు సంతసించి రాముడు, హనుమంతుని తన దగ్గరకు ఆహ్వానించెను. నీకు ఇచ్చుటకు నా దగ్గర ఏమియు లేదు. అయినా నేను నీకు ఋణపడియున్నాను. నీవు నా ధనవంతుడవు. నీవు నాతో ప్రాంసరీనోటు వ్రాయుంచుకొనుము. అవసరము ఏర్పడినప్పుడు వసూలు చేసుకొనుము.

సుగ్రీవ, విభీషణులు మోసము, కుట్రలతో, కపటముతో వ్యవహరించే పద్ధతి వదలలేదు. సుగ్రీవుడు రాజ్యమును పొందిన తరువాత సీతాన్వేష విషయమున ప్రతిజ్ఞను విస్మరించెను. విభీషణుడు రాజ్యమును పొంది మాతకు సమానమైన వదిన అగు మండోదరిని భార్యగా చేసుకొని భోగ విలాసమున మునిగిపోయెను. అయినా రాముడు ఇద్దరిని స్వీకరించెను. భరతునివలన రాముడు అడవికి పోవలసి వచ్చియుండినను అదే భరతుని ద్వారా రాముని పట్టాభిషేకము నిర్వహింపబడెను. రాముడు భరతుని నిండు సభలో మిక్కుటముగా ప్రశంసించెను. నిండు సభలో సుగ్రీవ విభీషణులను సత్కరించెను రాముడు.

భక్తుల ఎడ రాముడు చేసిన అనుగ్రహములను పొగడినచో రాముడు మిక్కిలి అయిష్టుడగు చుండెను. రాముడు చాలా వినయశీలుడు. తన ప్రశంస ఆయనకు ఇష్టము లేదు. ఎవరైనా ఒకసారి రాముని శరణు కోరినచో రాముడు వారి ఎడ సదా దయ కల్గియుండెను. భక్తుల చర్చలను మాటిమాటికి వినుచుండెను. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఇటువంటి రాముని చరణముల ప్రేమ ప్రసాదము సులభముగా లభించుచున్నది. రాముని గుణములు తెలుసుకొని రాముని ఎడ అనురాగము పెంపొందును. (రాముని శక్తి, శీలము, సౌందర్యమును గురించి సంకేతము చేయబడినది).

57. ఓనాథా! నీ చరణములు వదలి నేను వేరొక చోటికి ఎట్లుపోగలను? ఈ లోకమున "పతితపావను"డను పేరు ఎవరికి వున్నది? ఇతరులకు లేదు. దీనజనులకు ఇంత ప్రియమయినవారు ఎవరున్నారు? తన యశోరక్షణకు దీనులను ఎన్నుకొని ఉద్ధరించిన వారు, దేవతలు ఎవరు లేరు. జటాయువు పక్షి, మృగరూపమున నున్న మారీచుడు శిల (అహల్య) జడవృక్షములు (యమలార్జునులు); మేచ్ఛులను ఏ దేవుడు రక్షించి తరింప చేసినాడు. దేవతలు, మునులు, దైత్యులు, నాగులు, మానవులు మొదలగువారు మాయావశవర్తనులయి దీనస్థితిలోనున్నారు. ఓ ప్రభు! తులసీదాసు తనను వారి చేతులకు ఎందుకు అప్పచెప్పుట లేదు? వారి శరణు ఎందుకు స్వీకరించి వెళ్ళాలి? వారందరు మాయావశ వర్తనులై యున్నారు. నాకు ఏమి సహాయము చేయగలరు?

(ఒక ముస్లిముడు ఒక పంది ఆ ఘాతమునకు చనిపోవుముందు దానిని హరామ్" అన్నాడు. హరామ్" అను పదములో రామ శబ్దము వున్నందున అతనికి ముక్తి లభించెను).

58. ఓ హరి! నీవు నా ఎడ చాలా అనుగ్రహమును చూపెట్టితివి. దయతో ఈ మానవ యోనియందు మానవునిగా జన్మింప చేసితివి. అనేక సాధనములకు మందిరము ఈ మానవ జన్మ. దేవతలకు కూడ అసంభవమైనది. ఈ మానవ జన్మ. ఓ ప్రభూ! నీ ద్వారా జరిగిన ఈ ఉపకారములు ఒక్కొక్కటి వర్ణించుచూ పోయిన కోట్ల జిహ్వలతోను వర్ణించలేము. నేను ఇంకను కొన్నిటి కొరకు యాచించుచున్నాను. నీవు మహాదాతవు (గొప్పదానకర్తవు) నీవు దయచేసి నా కోరికను నెరవేర్చుము.

**నా కోరిక ఇది :** మనస్సు అనే మీనము/మత్స్యము (చేప) నీటినుండి ఒక క్షణము కూడ వేరుగా వుండలేదు. అనగా నా మనస్సు ఎల్లప్పుడు విషయ వాసనలనెడి నీటియందు లిప్తమయి (అంటుకొని) వున్నది. ఇందువలన నేను అనేక యోనుల యందు జన్మించుచూ ఎక్కువ దుఃఖమును పొందు చున్నాను. నీవు దయచేసి నీ కృప అనెడి తాడుతో, మీ చరణములతో నిర్మించబడిన అంకుశమును ఇనుపముల్లుగా, నీ పరమ ప్రేమను తియ్యని ఆహారముగా చేసి, నా మనసనెడి మీనము (చేప)ను, చిక్కించుకొని నా దుఃఖమును, తొలగించుము. ఇట్లు చేయుట నీకు అవలీల, శ్రమలేదు. భావము ఏమనగా నీవు దయతో నాఎడ మిక్కిలి ప్రేమను ఉత్పన్నము చేసి నా మనస్సును నీ చరణములయందే బంధించి

యుంచుము. అనగా నేను ఎల్లవేళలా నీ పాదములయందే ధ్యానము కల్గియుండ గోరుచున్నాను. వేదముల యందు జపము, తపము, యజ్ఞము, వైరాగ్యము మొదలగునవి అనేక రకములైన ఉపాయములు తెలుపబడినవి. దేవతల ఉపాసన చేసినచో ముక్తి లభించునని వేదముల యందు వర్ణించబడివున్నది. ఈ ఉపాయముల ద్వారా అన్య దేవతల ఉపాసన మొదలగునవి వేదములయందు వున్నది. అయినప్పటికి నేను పేదవానిని, ఏ ఏ దేవతలను ప్రశంసించుకుంటూ తిరుగగలను? తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఏ దేవుడు ఈ జీవుని మాయ అనెడి పగ్గముతో బంధించినాడు. అతడేవచ్చి ఆ పగ్గమును విప్పవలెను. భావము ఏమనగా మాయకు పతి అగు దేవుడు (రాముడు) జీవుని మాయలో బంధించి వుంచినాడు. ఆ బంధనమును తొలగించి జీవున్ని ముక్తిని చేయును. ఇతర ఏ దేవత ఈ కార్యమును చేయలేడు. (మనస్సును వశములో వుంచుటకు తులసీదాసు రామునిచే శక్తి ప్రసాదించకోరినాడు. శాస్త్రముల ప్రకారము మానవ జన్మ శ్రేష్ఠము. ఈ మానవజన్మ హరి అనుగ్రహమువలననే లభించును).

59. ఓ రఘువీర! నేను నిన్ను ప్రార్థించునది ఏమనగా ఈ జీవుడు ఇతరులను అనగా జపతపములు, ఇతర దేవీదేవతలను ఆశ్రయించి, ఇతర సాధనముల ద్వారా, ఆశావిశ్వాసములను, భరోసా కల్గియున్నాడు. ఇతని ఈ మూర్ఖత్వమును తొలగించుము. నేను మోక్షము, మంచి అందమైన బుద్ధి, వృద్ధి, సిద్ధి, గొప్ప యశస్సు కోరుటలేదు. రాముని చరణములయందు నిష్కామమైన ప్రేమ దినదినమునకు మూడుపూవులు ఆరుకాయలుగా వృద్ధి కావలెనని కోరుచున్నాను. నాచెడు కర్మలు నన్ను అటు - ఇటు లాగుకొని పోవుచున్నవి. అనగా నా చెడు కర్మల వలన అనేక యోనుల యందు జన్మించవలసి వచ్చెను. అక్కడ నీవు ఒక క్షణము కూడ ఆలస్యము లేక కృప చూపుచూ వుండుము. దయవదలకు. కూర్మము (తాబేలు) గ్రుడ్లుపెట్టిన తరువాత వాటి రక్షణయందు క్షణము కూడ వదలక యుండును. భావము ఏమన నీవు సదా నాపై కృప చూపుచూ వుండుము. ఈ ప్రపంచమున, భార్య బిడ్డలు ధనము మొదలగువాటి ఎడ ప్రీతి మోహము, ఈ శరీరముపైన ప్రేమ, సంబంధము వుండును. ఇది యంతయు సంకోచమయి, ఏకాగ్ర బుద్ధితో నీఎడ ప్రేమ - భక్తి కల్గి యుండుగాక. అనగా ప్రాపంచిక విషయ వాసనలు వదలి భగవంతుని ఎడ శ్రద్ధా భక్తి వుండవలెను. నీపై కేంద్రీకృతమయివుండుగాక.

60. నేను మాత్రము జానకి ప్రాణమగు రామునికి సమర్పించుకొందును. అనగా ఆయనకు నా సర్వస్వము సమర్పించుకొందును. రాముని సీతా - చరణములు వదలి ఎక్కడికి పోవద్దని నా మనస్సు చెప్పుచున్నది. భగవంతునికి విముఖుడనైన స్వప్నములో కూడ సుఖమును పొందలేనని మనస్సున నమ్మకము ఏర్పడినది. నేను నా మనస్సుతోపాటు శరీరములోని అన్ని ఇంద్రియములకు అదే శిక్షణ, సలహా ఇచ్చెదను. సర్వ విషయ వాసనలను వదలి భగవంతుని చరణములయందు అంటుకొని వుండుము. నేను నా

చెవులతో ఇతర ఏ కథలను వినను. నాలుకతో గానము చేయను. నా కన్నులు ఇతరులను చూచుటకు అవకాశము ఇవ్వను. కేవలము భగవంతుని ఎదుట మాత్రమే తలవంచెదను. నాలుక స్మరించెదను. నా స్వామియగు రామునితోనే ప్రేమ సంబంధములు కల్గియుండును. ఇతరులతో ఎలాటి ప్రేమ సంబంధములు కల్గి యుండను. అనగా రామునినే ప్రేమించెదను. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు : నేను మాత్రము నా పనుల బాధ్యత నెరవేర్చే బాధ్యత ఆ దేవునిపైననే వదలివేయుచున్నాను. నేను దాసుడనని భావించుకొందును. అనగా నా కార్యములన్నియు భగవంతుడే చేయును. నేను రాత్రింబవల్లు భగవంత సేవయందు నిమగ్నమయి వుండెదను. ప్రాపంచిక బాధ్యతలనుండి విముక్తుడనయ్యెదను.

(భగవంతుడు భక్తుని యొక్క బాధ్యత అంతయు తీసుకొని నిర్వర్తించును. పూర్తిగా ఏకాగ్ర బుద్ధితో రాముని చరణముల యందు అంటుకొనియుండును.)

5: తులసీదాసు తన గత జీవితమును గురించి, పశ్చాత్తాపము పొందుచూ ఇట్లు చెప్పుచున్నారు :- నేను నా జీవితములోని ఇంత ఆయుస్సు దేవుని భజన చేయకయే, నాశనము చేసుకొన్నాను. ఇప్పుడైనా జీవితమును చక్కదిద్దు కొందునుగాక. రాముని కృప చేత నా ప్రాపంచికమను రాత్రి గడచి పోయినది. అనగా ప్రాపంచిక విషయ వాసనలనెడి రాత్రి ఎడ నా ఆసక్తి సమాప్తమయినది. నేను ఇప్పుడు జాగ్రత్తపడితిని. ఇప్పుడు మరల పున్నుపరచి పండుకొని నిద్రించుటకు ప్రయత్నించను. ఇప్పుడు మరచిపోయి పొరపాటున తిరిగి మాయా మోహమున లిప్తుడనుకాను. ఎప్పటికిని ప్రవృత్తిని మేల్కొననివ్వను. నేను ఇప్పుడు రామనామమనెడి అందమయిన చింతామణి (మనోవాంఛలను తీర్చుమణి) సంపాదించుకొన్నాను. దానిని నా హృదయమనెడి హస్తమున పట్టుకొని పడి పోకుండ వుంచుకొందును. అనగా పిడికిటిలో పట్టివుంచిన వస్తువు సురక్షితముగా వుండును. అదేమాదిరి, నేను నా హృదయమున రామనామము సురక్షితముగా వుంచుకొందును. సదా దానినే జపించుచూ వుందును. హృదయము నుండి వేరు కానివ్వను. నేను భగవంతుని సుందరమైన శ్యామ రూపమును నికపోపలము (వరిపిడిరాయి) చేసుకొని నా చిత్తమనెడి స్వర్ణమును, దానిపైన వరిపిడి చేసెదను. భావము ఏమనగా స్వర్ణమును వరపిడి రాయిపైన పరీక్ష చేసి, ఉత్తమమైనదిగా నిరూపించునట్లు నేను నా మనస్సును పరీక్షించుకొందును. అది రామనామ స్మరణయందు ఖరాగా నిలుచునో లేదో చూచెదను.

అప్పుడు నేను నా ఇంద్రియముల వశములో వుంటిని. అప్పుడు పరవశుడనయినందున ఇంద్రియములు పరిహాసము చేయుచుండెను. నన్ను ఆడించుచుండెను. కాని ఇప్పుడు నేను ఇంద్రియములను నా వశములో వుంచుకొని, నన్ను పరిహాసము చేయనివ్వను. అనగా పూర్తిగా సంయమనము కల్గియుందును. ఇప్పుడునేను ప్రతినబూని నా మనస్సు అనెడి భ్రమరము (తుమ్మెద)ను రాముని చరణ పద్మముల యందు లగ్నమై యున్నట్లు చేసెదను. అనగా మనస్సును విషయ వాసనల ప్రక్కకు మరలించక దారి తప్పి తిరగనివ్వక

భ్రమర ప్రవృత్తిని తొలగించి, ఏకాగ్రబుద్ధితో రాముని చరణముల యందే నిమగ్నుడనై వుందును.

(ఆత్మ నివేదన, ఏకనిష్ట, విరక్తి భావము. అను పమము (సాటిలేనిది) నమ్మకముగా వున్నది. ఇష్ట దేవునిపైన పరిపూర్ణమయిన భరోసా వున్నది).

62. మహారాజైన రాముడు ఆదరించిన వాని జీవితము ధన్యము. అతనికి సమానముగా సర్వగుణ సంపన్నుడు, సర్వజ్ఞాని, పుణ్యాత్ముడు, శీల సంపన్నుడు (సాగరమువంటి శీలముగల) సాధువు ఇతరులు ఎవరునులేరు. శిల (అహల్య) నావికుడు (నిషాదుడు) వానరుడు (హనుమంతుడు), ఎలుగుబంటి (జాంబవంతుడు), రాక్షసులు (రావణ విభీషణులు) శబరి గ్రద్ధ (జటాయువు) అటువంటి సంయమము, నియమము, దయ, దానముల చేత జడచేతనములన్నియు రామనామమును స్మరించుచున్నవి. పరమ పవిత్రమైనవి. వారి గుణములను గానము చేయుటవలన మానవుల ఉద్ధరణ అగును. గుణ హీనులైన వారు కూడ గొప్పవారు అయిరి. గుణగానములను చేయుటవలన మానవులు మోక్షమును పొందెదరు.

వాల్మీకి మొదట బోయవాడుగా వుండి ఏ నేరమును చేయలేదు? పింగళ అను వేశ్య తనమనస్సును, బుద్ధిని రాముని భక్తి అనెడి జలముతో నింపి వుండెను? (తడిపెను). నీచుడగు అజామిలుడు తన బుద్ధిని రాముని భక్తి అనెడి సోమయజ్ఞము చేసెను? గజేంద్రుడు ఏ అశ్వమేధ యాగము చేసెను? భావము ఏమనగా వీరందరు మహాపాపాత్ములే - యుధిష్టరుడు (పంచపాండవులు), జాదరులు, ఐదుగురి తండ్రుల సంతానము. అయిదుమందికి ఒకే భార్య, గోపికలు భర్తలను వదలి పరకీయనాయికలయి విదురుడు దాసీపుత్రుడర, కుబ్జ (దాసి) మొదలగు వారు నీచులు, పాపాత్ములు వారిలో పరిశుద్ధత, పవిత్రత లేశమాత్రము కూడా లేకుండెను. భగవంతుడు వారిని పవిత్రులను చేసెను. వీరి అందరు తమ ఎడప్రేమను చూచి కృష్ణుడు వీరిని స్వీకరించెను. వీరి అందమయిన యశస్సు, లోకమున గొప్పగా వ్యాపించినది. రాముడు శివుడు గొప్పగా వ్యాపించినట్లు వీరు వ్యాపించిరి.

అడవి జాతులు, యవన మొదలగు వారు దుష్టులు నీచులయినను, రాముని పేరు స్మరించుటవలన భక్తులు ఉన్నత పదవిని పొందిరి. దీనుల దుఃఖమును తొలగించునట్టి లక్ష్మీపతి, కరుణాసాగరుడు, పతిత పావనుడగు భగవంతుడగు రాముని యశస్సును వేదములు గానము చేసినవి. ముల్లోకములందు, మూడు కాలములయందు తులసీదాసుకు సమానమగు దుష్టుడు, మూర్ఖుడగు శిరోమణి మరి ఒకడుండడు అతనిని కూడ రాముడు

63. కోసలపతి రాముడు. నా మంచి దేవుడు. వారి నేత్రములు కమలములవలె - ఉల్లాసముగానున్నవి. శరీరము మిక్కిలి అందము శ్యామలమైయున్నది. వారు సదా సీతా సహితులయి యుండుట. వారి సౌందర్యము అసంఖ్యాకమై మన్మథులకంటె ఉల్లాసముగానున్నది. వారు తన విశాలమైన భుజములయందు ధనుర్బాణములు, నడుమునందు అంబులపొది ధరించియుండెదరు. వారు బలికోరరు. పూజకోరరు. వారు కేవలము ఒక ప్రేమ ఆకలిగొన్నారు. వారి నామస్మరణ చేసినచో బ్రహ్మ సంతోషించును. వారి పద్ధతి అంతయు అనగా కర్మ మిక్కిలి పవిత్రము అనగా ఆయన బలి, పూజ కోరరు. కేవలము భక్తి భావనయే పవిత్రమైన రీతిగా భావించెదరు.

వారు అన్ని సుఖములను ఇచ్చెదరు. దుఃఖములను తొలగించెదరు. దుఃఖములతోనున్నవారికి బంధువు (సహాయకుడు) ఇటువంటి రాముడు కరుణాసాగరుడు. వేదములు. పురాణములు ఇట్లు చెప్పుచున్నవి. వారున అన్ని దేశములలో, అన్ని కాలములలోనుందురు. ఇందువలన దేవుని వదలి అన్యదేవీ, దేవతలను కోట్లకొలది వారిని. కోరికలతో పూజలు చేయుదును? శివుడు పూజించు దేవుడు (రాముని) సేవ చేయుము.

(ఈ గేయమునందు రాముని మాధుర్యము, ఐశ్వర్యము, శీలము సమన్వయము చేయబడినది).

64. మహావీరుడగు రాముని ఆరాధించుము. వారిని తోడుగా తీసుకొన్నట్లయితే మన కోరికలన్నియు స్వయముగా సిద్ధించును. ఈ విషయము అందరికి తెలియును. ఇందువలన వెంటనే ఒక సద్గురువు యొక్క ఉపదేశమును స్వీకరించుము. ఈ పనియందు కొద్దిపాటి ఆలస్యము చేయవద్దు. ఉపదేశమును స్వీకరించి మూలమంత్రమగు రామ నామమును జపించుము. దీనిని శివుడు జపించుచున్నాడు. పద్ధతి ఏమనగా జపము అయిన పిమ్మట తర్పణము. హవనము. బలిదానము చేయబడును. దాని విధి ఇది. ప్రేమ అనెడి జలముతో తర్పణము చేయుట మంచిది. సహజ, స్వాభావిక రూపమున ఘృతమును (నెయ్యి) మన సంశయములనన్నింటిని హవనమున కాల్చు కర్రలుగా చేసి వాటి క్షమ అనే అగ్ని ద్వారా భస్మము చేయవలెను. మమత అనెడి బలి ఇవ్వవలెను. భావము ఏమనగా రాముని ఎడ సంపూర్ణమైన భక్తి, ప్రేమ భావన కల్గియుండి వారి ఎడ స్నేహముతో మన మనస్సు తరలము (స్నిగ్ధము) చేసుకొనవలెను. క్షమా భావనను ఉధృతము చేసుకొని, మన సందేహములను భస్మం చేసుకొనవలెను. మమత మొదలగువాటిని శాశ్వతముగా దూరముగా ఉంచవలెను.

ఈ యజ్ఞము చేయుటవలన పాపముల జోలికి మనస్సు మరలదు. మనస్సుమన వశములో నుండును. అహంకారము, కామ భావన తొలగి పోవును. సుఖము, సంపద, సంతోషము. శుభమగు ఆలోచనలను ఆకర్షింప చేయును. అనగా అవి లభించును. శత్రువు వినాశనము, వశీకరణము, మారణము, ఆకర్షణ కల్గును. అనగా విభిన్నమైన

తాంత్రిక క్రియలు పేర్కొనబడినవి. అవి తాంత్రిక క్రియలకు అవసరమని భావించబడినది. ఇవి చేయుటవలన మనోవాంఛలు సిద్ధించును. ఎవరైనా ఇటుల భజన చేసిన వారికి భగవంతుడగు రాముడు లభించును. ఇప్పుడు తులసీదాసు కూడ, ఈ మార్గముననే పయనించుచున్నాడు. ఒకవేళ భగవంతుడు అనుగ్రహించినవారికి కూడ రాముడు లభించును.

(తులసీదాసు భవసాగరమును దాటుటకు గురువు అవసరమని భావించెను. రామ భజన అవసరమున్నది. తరువాత ఆయనను సంతోష పరచుటకు ప్రేమించుము. నెమ్మది, నెమ్మదిగా భార్యాపుత్రులు, మాతాపితల యొక్క వ్యామోహము అస్థిరమైన ప్రపంచ సత్యమును సంశయములను త్యజించెదవు. క్షమాగుణము గ్రహించుము. మమతను వదలి భగవంతుని చరణముల యందే నిమగ్నుడవయి యుండుము. పాపములు నష్టమయి, మనస్సు వశమున నుండును. అహంకారము, కామము దగ్ధమగును. తరువాత రాముని దర్శనము అగును).

65. ఓ మురారి! నీవు అందరి దుఃఖములను తొలగించెదవు. నాపైన ఎందుకు దయచూపకున్నావు. నీవు మూడు విధములైన తాపములను (1. దైహిక, 2. దైవిక, 3. భౌతిక) అజ్ఞానము, శోకము, సంశయము, మదమును తొలగించువాడవు. నేను కలియుగమున పుట్టిన వానిని, పాపములవలన మందబుద్ధి (మూర్ఖుడనయి) మలినమైన మనస్సుగల వాడయియున్నాను. ఆపైన ఓ ప్రభు! నీవు నన్ను రక్షించుటలేదు. నన్ను రక్షింపక పోయినచో నీపేరు ఎట్లు వుండును? ఓ ప్రభూ! నీవు అన్ని విధముల సమర్థుడవు. నేను అన్ని విధముల దీనున్ని. ఇది తెలిసి కూడ నీవు నాపైన దయ చూపెట్టలేదు. కరుణ లేదు. ఎందుకనగా నేను దురదృష్టము గలవాడను. నీ కృప పొందునట్టి పనులు నేను చేయలేదు.

ఓ రఘుపతి! అనేక యోనులయందు జన్మించుచూ, చనిపోవుచూ దారి తప్పి తిరుగుచున్నాను. నాకు ఇతర ఏ రక్షకుడు లేడు. నేను దుఃఖములను ఓర్చుకొనగలను కాని సదా నీ శరణులోనే యున్నాను. నీకు సమానమైన దయగల దేవుడు ఎవరులేరని భావించుచున్నాను. నిన్ను సంతోష పరచు సాధనములు నా దగ్గరలేవు.

66. ఓ కృపానిధి! నేను ప్రపంచమున ఉత్పన్నమయితిని. ఈ ప్రపంచములోని భయంకరమగు ఆపదలను ఎవరికి చెప్పవలెను? నా ఇంద్రియములన్నియు తమ తమ అనురాగము మేరకు అనురక్తమయి యున్నందున వ్యాకులమయియున్నవి. అనగా ఇంద్రియములు తాము కోరుకున్న ప్రియవస్తువులను పొందుటకు సదా వ్యాకులము చెందుచున్నవి. ఇందువలన ఈ ఇంద్రియములు తృప్తి చెందుటకు అనగా నరకమును గురించి నిరంతరము యోచించుచున్నవి. ఇంద్రియములు ఎల్లప్పుడు సుఖము, సంపద, స్వర్ణము, స్వర్గ-నరకముల చింతనయందే నిరంతరము నిమగ్నమై యుండును. ఓ హరి! నాదురదృష్టమైన మనస్సుకూడ నిన్ను వదలి, ఇంద్రియములకు సంతృప్తి కల్గుదిశకే

మొహపడుచున్నది. అనగా ఇంద్రియముల శాసనమును మనస్సుకూడ వాటిని ప్రోత్సహించుట యందే అంటుకొని వున్నది.

ఓ దేవా! నేను మిక్కిలి దీనుడను. నీవు దయగలవాడవని నేను విన్నప్పుడు, నా మనస్సు నీ యందు అనురక్తి కల్గించు కొన్నది. అనగా నిన్ను ప్రేమించునది. అయినప్పటికి ఓ యదు వీరా! ఓ ధైర్యధనుడా! నీవు నాపైన కరుణ చూపలేదు. ఇది చూచి నాకు దుఃఖము కల్గలేదు. ఒకవేళ అపరాధముల కేంద్రము అయిన (భయంకరమైన) అపరాధినై యున్నాను. ఓ మురారీ! నీవు అందరి దుఃఖములను తొలగించు వాడవు. నీవు అనేకమంది పాపులను ఉద్ధరించితివి. నన్నుకూడ ఉద్ధరించగలవని నమ్ముచున్నాను. తప్పక రక్షించెదవు.

67. ఓ కేశవా! ఏమియును చెప్పవీలుకాదు. ఏమి చెప్పను? నీ ఈ మిక్కిలి విచిత్రమైన ఈ రచనను చూసి మనస్సునందే యోచించుచూ దీనిని వర్ణించుటకు నన్ను నేను అసమర్థుడుగా భావించుచున్నాను. ఎందుకనగా ఇది నిర్వచించలేనిది ఈ రచన సృష్టి విచిత్రమైనది. ఎవరో నిరాకారుడు (శరీరములేని) చిత్రకారుడు రంగులు లేకయే వాటి ఆధారమున శూన్యమనెడి గోడపైన చిత్రమును చిత్రించెను. కాని అక్కడ విచిత్రము ఏమంటే సాధారణముగా సశరీరుడై చిత్రకారుడు గోడ, కాగితము బట్టమొదలగు వాటిపైన చిత్రమును చిత్రించును. కాని చిత్రమేమనగా చిత్రకారుడు కనపడడు. రంగులులేవు. ఆధారములు లేవు. భావమేమనగా నిరాకారుడగు చిత్రకారుడగు బ్రహ్మ, మాయ అను ఆకాశమను గోడపైన - అవి కేవలము భాసమానములు ప్రతీతముగ నున్నవి. ఆకాశము శూన్యము మాయ ఆకాశము అస్తిత్వము లేదు. ఇటువంటి సృష్టి అనెడి చిత్రమును నిర్మించెను. రంగులు, ప్రత్యక్షమైన ఉపకరణములు లేవు. అయినా పలు రంగులు మనోహరమైన విచిత్రమగు చిత్రము నిర్మింపబడినది. అనగా నిరాకార బ్రహ్మ శూన్యమనెడి చిత్ర ఫలకముపైన అసత్ (మాయా మిథ్య) ద్వారా ఈ పాంచ భౌతికమైన సృష్టిని సృష్టించెను. ఈ రచన యందు ప్రయుక్తులయి అన్ని ఉపకరణములు క్షితి. జల, పావక (అగ్ని) గగనము, సమర (గాలి) సూక్ష్మమై రంగులేనివి అయివున్నవి. కేవలము భాసమానమై యుండును. మామూలు చిత్రములు కడిగిన తుడిచిపోవును. కాని ఈ చిత్రములు చాలా విచిత్రమైనవి. కర్మ రూపమనెడి జలముతో ఈ ప్రపంచమున శరీరములనెడి చిత్రములు నశింపవు. జీవులు కర్మ బంధనమున చిక్కి విభిన్నమయిన యోనులయందు జన్మించుచుండును. భావమేమనగా కర్మ చేయుట వలన ఈ పాంచ భౌతిక రచన నష్టముకాదు. మిక్కిలి ఎక్కువ బలిష్టమగుచున్నవి. సాధారణముగా చిత్రములు జడమే అయివుండును. ఇందువలన వాటికి మృత్యు భయము వుండదు. జడము అనుభూతి హీనమై యుండును. కాని ఈ చిత్రములకు ప్రపంచములోని ప్రాణులకు మృత్యువు భయము బాధించుచుండును. వీటి విశేషత మరియొకటి వున్నది. సాధారణ చిత్రములను చూచినప్పుడు ఆనందము కల్గును. కానీ ఈ చిత్రములను చూచిన వెంటనే దుఃఖము కల్గును. అనగా ధ్యానముతో చూచినచో లేక గంభీరముగా చింతన చేసినచో ఈ ప్రపంచము అసత్యముగా గోచరించును. మనము దీనిని సత్యమైనది భావించుచుంటిమి.

అంటుకొని వుంటిమి. కాని అశాశ్వతమైనది. ఇది వాస్తవముగా మన భ్రమ. ఇది యోచించిన దుఃఖము కల్గుచున్నది. భావము ఏమనగా ఈ సృష్టిలో మోహము మమత మొదలగు భావనలు భయము దృష్టిని కల్గించుచున్నవి. ఈ కారణముననే ప్రాణి చనిపోవుటకు భయపడుచున్నది. జ్ఞానము కలిగినప్పుడు ఇది అంతయు మిథ్య ఎక్కువ దుఃఖము కల్గును. వీటిని ఇంతవరకు సత్యమని భ్రమలో పడి యుంటిమి.

ఈ చిత్రమును చూచినచో దుఃఖము కల్గును. దీనినుండి మనము ఎట్లు బయట పడవలయును? ఈ జిజ్ఞాస సహజముగా కల్గును. తులసీదాసు దీనిని వివరించుచూ ఇట్లు చెప్పుచున్నాడు. సూర్యుని కిరణముల ద్వారా జనించిన ఎండమావులలో ఒక భయంకరమైన మకరము వుండును. ఈ మకరము ముఖము వుండదు (నోరువుండదు) అయిన సంపూర్ణమైన జడ చేతనములను - నీరు త్రాగుటకు వచ్చినవాటినన్నింటిని తినును. భావము ఏమనగా ఏ విధముగా అయితే మృగతృష్ణలో పడి జలముగా భావించి వాటిని త్రాగుటకు ఉబలాటపడును, ఇసుక ఎడారిలో పరుగెత్తి పరుగెత్తి అలసిపోయి జింకలు చచ్చిపోవుచున్నవి. అదేమాదిరి మనుష్యులు ప్రాపంచిక మాయా మోహమునపడి చిక్కుకొని సుఖము, తృప్తి పొందవలెనను ప్రయత్నమున దారి తప్పి తిరిగి తిరిగి అలసిపోవుదురు. కాలమనెడి మొసలి అతనిని పట్టుకొని తినుచున్నది. కాలము అవ్యక్తము. ఇందువలన ఇక్కడ మకరమును నోరులేని దానిగా అదృశ్యమైనదిగా చెప్పెను. ఈ ప్రపంచము మిథ్య; ఇందువలన దీని భోగ విలాసమున సరిఅయిన తృప్తిలేదు. ఆత్మానందము లేదు. ప్రాప్తించదు. కొంతమంది ఈ సృష్టిని సత్యమని మరికొందరు మిథ్యయని చెప్పుచున్నారు. అయిన కొంతమంది అభిప్రాయము ఇది. ఇది సత్యము, మిథ్య రెండును. భావము ఏమనగా పూర్వమీమాంసకులు అనగా ద్వైతవాదులు, విశిష్టాద్వైతవాదులు, కర్మ ప్రధానమయినందున జగత్తును సత్యమైనదిగా భావింతురు. దీనికి విరుద్ధముగా అద్వైత వేదాంతులు (శంకరమతమును స్వీకరించినవారు) ఈ జగత్తును మిథ్య అని చెప్పుచున్నారు. ఇది కేవలము బ్రహ్మ యొక్క శక్తిని స్వీకరించి ఈ జగత్తును ఆయనగారి భాసము అని భావింతురు. రజ్జుసర్ప భ్రాంతిని కల్గి యున్నారు. ఈ రెండు మతములేకాక మూడవ మతము ఒకటి వున్నది. ప్రపంచము సత్యము - మిథ్య రెండునూ అయివున్నది. పతంజలి మొదలగు న్యాయదార్శనుకులు, సాంఖ్యమతవాదుల అభిప్రాయము ఇది నింబా చార్యుడు దానిని విశ్వసించి యుండెను. కాని తులసీదాసు ఈ మూడు అభిప్రాయములు భ్రమపైన ఆధారపడివున్నవని చెప్పెను. ఎవరైన మూడు అభిప్రాయములు, లేక భేదాభిప్రాయముల ప్రభావము నుండి ముక్తుడు కావలెను. అనగా వీటిపైన నమ్మకమును కల్గియుండినవారే తన ఆత్మస్వరూపమును తెలుసుకొనగలరు. భావము ఏమనగా పైన తెల్పిన దార్శనిక అభిప్రాయములు, అభిప్రాయభేదములవలన ఏమి లాభము సిద్ధించదు. ఆత్మజ్ఞానము కేవలము రామభక్తివలననే కల్గును.

(శంకరుని అద్వైతవాదము, రామానుజాచార్యుని విశిష్టాద్వైతవాదము, మధ్వాచార్యుని ద్వైతవాదము, నింబకాచార్యుని ద్వైతా అద్వైతవాదములు వ్యక్తికి సరిఅయిన మార్గమును

...పెట్టలేవు. తులసీదాసు భక్తి, జ్ఞానము కర్మల పునాదిపైన తన అభిప్రాయములను తెలిపెను. భగవంతుని శరణులోనికి వెళ్ళుటయే మానవ జీవితము యొక్క చరము (చివరి) సార్థకత ఇది ముఖ్యమైన పద్యం.)

68. ఓ కేశవా! ఓ స్వామీ! నా ఏ అపరాధమున, నన్ను నీవు దుష్టుడుగా భావించి ఉపయోగము లేనివారివలె త్యజించివున్నావు. నాకు దీని కారణము తెల్పుము. మిక్కిలి మృదు కోమలమైన చిత్తముగలవారు, భక్తులు, సత్‌సాధువులనే స్వీకరించుట జరిగిన ఉదాహరణలు. వాల్మీకి, పింగళవేశ్య, వీరిని ఎందుకుగాను ఉద్ధరించితివి? వారితో నీకు సంబంధత్వము వున్నదా? అనగా వారంతా నీచులు, వీరిని తరింపచేసినప్పుడు నన్ను ఎందుకు ఆలస్యము చేయుదు? ఓ హరి! జీవుని కాలము, కర్మము సుగతి, కుగతి మొదలగువన్నియు నీ చేతియందే వున్నవి. కావున ఇప్పుడు ఈ ఉపాయమును చేయుము. నా యొక్క ఈ ప్రపంచము ఎడ మమత వైదొలగునట్లు చేయుము. నేను నిన్ను మరచి అటు ఇటు చెడ తిరుగక నుందునట్లు చేయుము.

నీవు నన్ను వదలినను, ఇతర ఏ దేవతను స్వీకరించను. కేవలము నీపేరే స్మరించుచూ వుందును. ఇది నా స్థిరమైన ప్రతిజ్ఞ. నన్ను నరకమార్గమున పంపినను, నేను అక్కడనే మనసా. వాచా. కర్మణా (త్రికరణశుద్ధిగా) ప్రార్థన చేయుచూ వుందును. ఓ నాథ! ప్రభువగు నీతోనేను నిర్లక్ష్యవైఖరి కల్గియుండుట మంచిదికాదు. కాని ఈ తులసీదాసు రాత్రిబగల్లు నీ నిష్ఠురత్వమును - నీవు నన్ను త్యజించితివి అనునది, చూచి చూచి దుఃఖమును పొందుదును. భావము ఏమనగా ఈ కారణమున చెప్పదగిన చెప్పదగని అనేకమైన మాటలను చెప్పితిని.

(కొంచెము వ్యంగ్యము - ఉపాలంభనమైన భావమువున్నది) (ఎత్తి పొడుపు వాదమున్నది).

69. ఓ మాధవా! ఇప్పుడు ఏ కారణము చేత నీవు నా ఎడ కరుణ గల్గి యుండలేదు? అనగా కృప కలుగలేదు. నీవు భక్తులపైన సదా కృపకల్గి యుందువు అని నీ ప్రతిజ్ఞ. మరినా ప్రతిజ్ఞ ఏమనగా నేను నీకమల చరణములను దర్శించుకొంటూ జీవించి యుందును. నేను దీనుడను. నీవు దయగల వాడవు. నేను దాసున్ని, నీవు యజమానివి, కానప్పుడు నేను ఎన్నో దుఃఖములను సహించితిని. నీవు అంతర్యామివి. ప్రతి ప్రాణి శరీరమున వుండి తెలుసుకొనువాడవు. నీవు ఉదారుడవు. నేను పిసినారివి. నీవు పవిత్రుడవు. నేను నీచుడను వేదములు ఈ విషయమునే గానము చేయుచున్నవి. ఇందువలన ఓ రఘునాథా! ఇప్పుడు నీవు. నాకు మధ్య ఎన్నో సంబంధములు ఏర్పడినవి. ఇందువలన నీవు ఇప్పుడు నన్ను వదలలేవు. అనగా ఇప్పుడు నీవు నన్ను ఉద్ధరించవలసియున్నది.

నీవు నాకు తల్లి, దండ్రి (గురువు, మిత్రుడవు) స్వామివి అన్ని విధములుగా నా

హితమును కోరువాడవు. నేను భేదబుద్ధి అను అవిద్య అను బావిలో పడకుండ వుండుటకు ప్రయత్నించుము. ఈ జగత్తులోని మాయామోహమున మరలా చిక్కుకొనక వుండునట్లు చేయుము. ఓ మహాకరుణాకరుడా! ఓ కమలనయన, గొప్ప భయమును తొలగించువాడా! నామాట వినుము. నీ ప్రకాశము లేకయే తులసీదాసు ఈ సంశయము తొలగదు. నీ కృప అవసరము. అనగా ప్రపంచమును గురించి నాకు కల్గు సంశయములను నీవు మాత్రమే తొలగించగలవు.

70. ఓ మాధవా! ఈ ప్రపంచమున నావంటి అన్ని విధములుగా అసహ్యము గలవాడను. మలినుడను. మిక్కిలి దీనుడను. విషయవాసనల యందు లీనమై యున్నవాడను. ఇటువంటి ప్రాణి మరెవ్వరు వుండరు. నీవలె దుఃఖితులకు, దీనులకు నిస్వార్థమైన నిష్కారమైన మేలు చేయగల కృప - దయగలవాడు యజమాని మరొకరు లేరు. ఓ దయగలవాడా! నేను దుఃఖము శోకముతో వ్యాకులడనై యున్నాను. అయినా ఏ కారణము చేతనో నాఎడ నీకు దయ కలుగలేదు. ఇందులో కొంచెము కూడ నీ దోషము లేదని భావించుచున్నాను. దోషమంతయూ నాదే. ఓ నాథ! నీవు నాకు జ్ఞానమును మిక్కుటముగా ఇచ్చి మానవ శరీరమును కల్పించితివి. ఇది పొందియుండి నేను నిన్ను తెలుసుకోలేక పోయితిని. భావము ఏమనగా మానవ శరీరము కల్గియుండి కూడ నీ వాస్తవ స్వరూపమును తెలుసుకొనలేక యున్నాను. నీ భజన చేయలేకపోయితిని. అందువలన నీ కృపకు పాత్రుడనయి వుండుదును.

వెదురుచెట్టు శ్రీగంధము ప్రక్కకు, వెణుతురు చెట్టు వసంత ఋతువును వ్యర్థముగా అసత్యమైన నిందారోపణ చేయుచుండును. శ్రీగంధపు చెట్టు, వెదురు వృక్షములకు తన సువాసన ఇవ్వదు. వసంత ఋతువు వెణుతురు చెట్టుకు క్రొత్త ఆకులను సృష్టించదు. వాస్తవము ఏమనగా వెదురు సారములేని అనగా టొల్ల వుండును. అందులో కండలేదు. శ్రీగంధము వాసన ఎక్కడ వుండాలి. శ్రీగంధము చెట్ల ప్రక్కన వున్న చెట్లకు గంధము వాసన వుంటుంది. వెణుతురు చెట్టు దురదృష్టము గలది. సృష్టి కర్త దాని అదృష్టములో ఆకులు పుట్టుట చేయలేదు. వసంతము ఎక్కడ నుండి ఆకులను ఉత్పన్నము చేయగలదు? (వెణుతురు చెట్ల గుంపునకు ఆకులు వుండవు. కేవలము చిన్న చిన్న చేదైన ఫలములు కాయును). భావము ఏమనగా మహాపాపాత్ముడైన వ్యక్తిపైన దేవుడు ఎట్లు కృప చూపెట్టును.

ఓ హరి! నేను అన్ని విధములుగా కఠోరముగా నున్నాను. నీవు మాత్రము కోమలమైన హృదయము గలవాడవు. ఓ ప్రభు! తులసీదాసు యొక్క మోహ రూపమున నున్న ఇనుప గొలుసులు (సంకెళ్ళు) అవిద్యతో కూడినవి. నేను వదలించినచో వదలునని నేను విశ్వసించుచూవున్నాను. అనగా నీ కృపతో తులసీదాసు మాయామోహము అనెడి బంధనములనుండి ముక్తి పొందగలడు.

(మానవ శరీరము జ్ఞానకేంద్రముగా భావింపబడుచున్నది. దేవతలు కూడా మానవ జన్మ కొరకు మిక్కిలి తాపత్రయము చెందుచుందురు).

71. ఓ మాధవా! ఈ నా మోహ బంధనములు ఎట్లు తెంచబడును? ఎట్లు తొలగును? కోట్లకొలది బాహ్యమైన స్నానము, పూజ, పఠనములు మొదలగునవి ఉపాయములు చేసినప్పటికి అంతఃకరణములోపల నిండివున్న అవిద్య, మాయా మోహము నుండి తొలగుటలేదు. అంతఃకరణము పరిశుద్ధము కానంతవరకు, కర్మకాండ మొదలగు అసంఖ్యాకమైన బాహ్యాచారములు అవిద్యను (మాయా మోహములు) తొలగించుటలో విఫలమయ్యెను. భావము ఏమనగా మోహబంధనము మనస్సున వుండును. మనస్సును పరిశుద్ధము చేయక కేవలము శరీరసాధనములద్వారా ఈ బంధనము తెంచబడదు ఘృతము చేత నిండిన కుళాయిలో చంద్రుని ప్రతిబింబము కనపడుతుంది. దాని క్రింద వంట చెరుకుపెట్టి ఉడికించినచో (కాంచినచో) ఆ ప్రతిబింబము స్పష్టముగా కనపడదు. రెండవ దృష్టాంతము ఏమనగా వృక్షము తొర్రలో నున్న పక్షి, వృక్షమును నరికివేసిన పక్షి చావదు. (మరణించదు). అదే మాదిరి ఆలోచనలేని (అవివేకి) మనస్సు అనేక సాధనములు (పంచాగ్ని - యోగ - కర్మల) సాధన చేసిన పిమ్మట కూడ పరిశుద్ధము అనగా వివేకమును పొందలేడు. భావము ఏమనగా - ఈ శరీరమనెడి కుటీరములోనున్న (తొర్రలోనున్న) మనస్సు అనెడి పక్షి శరీరమును కోసిన, నరకిన చనిపోదు. వశమునకు రాదు. ఈ బాహ్య సాధనములన్నియు వ్యర్థము.

మనస్సు విషయ వాసనలయందు నిమగ్నమై యున్నందున లోపలభాగము చాలామలినమై యుండును. శరీరమును పరిశుభ్రము చేసి కడిగి (స్నానము చేసి) మనస్సును పవిత్రము చేయుటకు ప్రయత్నము చేయుట ఎట్లున్నదనగా పుట్టను పై భాగము త్రవ్వినను లోపల పామువుండును. చావదుగదా! అనగా మనస్సు సర్పమువలె దానిని వాస స్థానమగు శరీరమును అనేక విధములైన బాహ్యాచారముల ద్వారా స్వచ్ఛముగా చేయుటకు లేక కష్టము కల్గించినందుకు మనస్సును పవిత్రము చేయలేము. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నారు. గురువు లేక భగవంతుని కృపలేనిదే నిర్మలమైన జ్ఞానము వివేకము లభించదు. వివేకము లేకయే ఎవరు కూడ సంసారమనెడి భగసాగరము దాటలేరు. భావము ఏమనగా గురువు ద్వారా ప్రాప్తించిన వివేకము (జ్ఞానము) ద్వారానే భవబంధనములనుండి ముక్తి లభిస్తుంది.

(తులసీదాసు భక్తి మహిమను ప్రతిపాదించెను. బాహ్య అచారములను ఖండించెను. తులసీదాసు మానసిక పరిశుద్ధతపైన ప్రచారము చేసెను. భగవంతుని కృపలేక ఏమియునుకాదు. రాముని కృపలేనిదే వివేకము లభించుట అసంభవము. సత్సంగము అవసరమే).

72. ఓ మాధవా! మానవులమైన మేమెంత ఉపాయములుచేసినను మాయతొలగదు. ఎంత తల పగులకొట్టినను అది తొలగదు. నీ కృప లేనిదే అది తొలగదు. మాయ అటువంటిది. నీ కృప చేత మాయా బంధనము తొలగును అనగా భగవంతుని కృప లేకయే అసంఖ్యాకమైన సాధనలు చేసినను మాయతొలగదు. నేను ఈ విషయమును గురించి

వినుచున్నాను. ఆలోచించుచున్నాను. తెలుసుకొను చున్నాను. ఇతరులకు చెప్పుచున్నాను. అయిన మాయ గురించి హృదయమున స్పష్టముగా అవగాహనలేదు. ఇది ఈ విధముగా అనిర్వచనీయము అయినది. తర్కము ద్వారా తెలుసుకొన్ననూ దానిననుసరించి ఆచరణ చేయలేము. ఇందువలన ఈ మాయ యొక్క వాస్తవికము అయిన అనుభవము లేక, మోహమున ఉత్పన్నమయిన ఈ ప్రపంచము, దీని భయంకరమైన ఆపదలు సదాపీడించుచూ వుండును. ఇక్కడ ప్రపంచమును మోహ జనితము అని ఇందువలన చెప్పబడినది. మాయ మోహమును ఉత్పన్నము చేయుచున్నది. ఆకారణముననే ఈ ప్రపంచము మిథ్య అయినప్పటికి సత్యముగానే గోచరించుచున్నది. (ప్రతీతమగుచున్నది) మోహమే ఈ ప్రపంచమును సత్యమని భ్రమాత్మకమైన రూపమున ఉత్పన్నము చేయునది.

ఈ మనస్సుకు బాహ్యాచారములు మధురము, శీతలము, అమృతము లభించుగాక. అది ఈ ఆనందరసమును ప్రాప్తించుకొన్నచో, పిమ్మట ఇది మృగతృష్ణలో జలము వలె మిథ్య. ప్రపంచము అనగా విషయవాసనల వెనుక రాత్రింబవల్లు ఎందుకు పరుగెత్తుకొని తిరుగును? అనగా బాహ్యాచారముల ద్వారా అసత్యమైన ఆకర్షణలకు మాయ తొలగదు. ఎవరి ఇంటి యందు నిర్మలమైన చింతామణి యుండునో (మన కోరికలను తీర్చుమణి) ఈ గాజుముక్కను ఎందుకోసం గ్రహించవలెను? బ్రహ్మానందము లభించినవారికి తుచ్ఛమైన విషయ వాసనల వెనుక తిరగరు. స్వప్నములో ఇతరుల వశమైనపుడు, ముక్తికొరకు బ్రతిమాలుచూ వుండుట; కన్నులు తెరచిన వెంటనే ఎవరి ఎదుట బ్రతిమాలు చుండును? అనగా జీవుడు మాయావశమున నున్నంతవరకు మోహనిద్రలో నిద్రించుచుండును. దాని ప్రభావమున స్వప్నమువలె మిథ్యా జగత్తును నిజమయినదని భావించి దాని ఎదుట బ్రతిమాలుచూవుండును. మోహనిద్ర తొలగినప్పుడు, జ్ఞానప్రకాశము కల్గినప్పుడు అప్పుడు ఈ ప్రపంచము స్వప్నమువలె అసత్యమైనదిగా కనపడును. ఆత్మానందమున మునిగి ఆత్మ ఆనందమున తన్మయుడగును. అతనికి ఎవరి ఎదుట బ్రతిమాలవలసిన పనిలేదు.

అదేమాదిరి జ్ఞానము, భక్తి మొదలగు సాధనములు ప్రపంచముల బంధనముల నుండి ముక్తి చెందుటకు చెప్పుబడినవి. ఈ సాధనములు సత్యమైనవి. వీటిలో అసత్యమైనది ఒక్కటియును లేదు. అయిన జీవునికి జగత్తు భ్రమ; భగవంతుని వలననే అయన కృప చేతనే తొలగును. నా మనస్సులో భరోసావున్నది. అనగా జ్ఞానము, భక్తి మొదలగు సాధనములు మిక్కిలి కఠినమైనవి. రెండవ విషయము ఏమనగా భగవంతుని కృపలేకయే జీవునికి ఆత్మ బోధ, జ్ఞానోదయము కలుగదు. భగవంతుని కృపయే అవిద్య నుండి ముక్తి లభించును. ఇదియే ఏకైక సాధనము.

(మానసిక సాధన సర్వశ్రేష్ఠము. మాయ మిథ్య బ్రహ్మ సత్యము. మాయా జగత్తు మిథ్యయే. మాయ వినాశనమునకు ముఖ్య సాధనము భగవంతుని కృపయే).

73. ఓ హరి! నేను నీపైన ఏమని దోషమును ఆపాదించను? అనగా దోషమంతయు నాదే. ఏ ఉపాయముల చేత - మోక్షమును పొందుట స్వప్నములో అసంభం. అటువంటి పనియే

నేను రాత్రింబగల్లు చేయుచున్నాను. ఇంద్రియముల విషయము అనర్థ యోగమైన అగును. సదా దుఃఖమును కల్గించునని నాకు తెలియును. అయినా నేను వీటియందే ఆసక్తుడనయి చీకటి కూపములో పడిపోవుచున్నాను. విషయములయందు అనురక్తి కల్గియుండుట చీకటి బావిలోనికి పడిపోవుటన్న మాట. ఇది తెలిసి కూడ నేను వీటిని వదలలేకవున్నాను. దానిలో మునిగివున్నాను. కుక్కలు, గార్దభములు, మేకలు, విషయ వాసనలయందు నిమగ్నమయి దారితప్పి తిరుగుచున్నవి. ఈ విషయ వాసనల చక్రములో పడి ఇతర ప్రాణులతో శత్రుత్వమును తెచ్చుకొన్నాను. మోహమున పడి నా హితమును తెలుసుకొనలేక పోయితిని. వీటి చేతనే అందరితో కలహించుచూ కొట్లాడుచూవుంటిని. అహంకారము, దేహము, గర్వము - జ్ఞాన శత్రువులు. ఇది తెలిసి కూడ నేను వీటి ప్రక్కకే మిక్కిలి అనురక్తుడనయి వుంటిని.

వేదపురాణములను విని నేను ఇది తెలుసుకొంటిని. రాముడు విశ్వమంతటా వ్యాపించియున్నాడు. అయినా నాయటువంటి సారములేని (జ్ఞానములేని) మనస్సున ఆ విషయము చేరుకొని వుండలేకున్నది. శ్రీ గంధము చెట్టు సువాసన వెదురు కర్రలో చేరివుండదు. వెదురు కర్రల మధ్య లొట్ట వున్నందున శ్రీగంధము చేరదు. ఓ కరుణాసాగరా! నేను అపరాధముల సముద్రుడనని నీకు తెలియును. అనగా భయంకరమైన అపరాధిని. నీవు అంతర్యామివి. అందువలన నీకు తెలియకుండా ఏ విషయమును దాచుటకు వీలులేదు. తులసీదాసునగు నన్ను ఈ ప్రపంచమనెడి సర్పము మ్రింగుచున్నది. ఓ సర్పముల శత్రువగు గరుడపైన పయనించువాడా! నేను నీ శరణు జొచ్చినాను. అనగా నీవు నీ గరుడును పంపి ఈ ప్రపంచమనెడి సర్పమునుండి నన్ను రక్షింపుము. అనగా ఈ జగత్తులోని వచ్చిపోవుట నుండి ముక్తి ఇప్పించుము.

(మాయా ఆవరణము జ్ఞానము చేతనే తొలగును).

74. ఓ హరి నేను ఏ విధముగ సుఖమును పొందగలను? ఏనుగు దంతములు చూపుటకు మాత్రమే వున్నవి. అదే మాదిరి నా కృత్యము, నా వేషము కేవలము ఆచార వ్యవహారముల దర్శనమునకు మాత్రమే వున్నది. కృత్రిమము. ఈ విషయము నీకు బాగుగా తెలియును. నేను చెప్పినది. నేను చేయునది అనునవి ఆకాశము - పాతాలమునకున్నంత వ్యత్యాసమున్నది. నేను చెప్పినట్లుగా ఆచరణ చేయుటలో (చెప్పినది - చేయుటలో) విరోధము లేనిచో ఈ ప్రపంచమను సముద్రమును (భవసాగరమును) ఆవుదూడ గిట్టలవలె సులభముగా దాటిపోగలను. భావము ఏమనగా ఉపదేశములు గొప్ప గొప్పగా చెప్పుదును. కాని నేను ఆ ప్రకారము ప్రవర్తనలో చూపను. నా ఆచారవ్యవహారములు మరోమాదిరి వున్నవి. నేను నోటితో ఎల్లప్పుడూ చెప్పుచూ వుందును. అవి విరుద్ధముగా నున్నవి. కావున భగవంతుని చరణముల సుఖము ఎట్లు కల్గును?

నెమలి చూచుటకు అందముగా, దాని స్వరము మృదువుగా మధురముగా అమృతమున

తడసినట్లుండును. కాని చాలా నిష్ఠురమైనది. విషముతో కూడిన సర్పములను తినును. దాని కృత్యము కఠినముగా, స్వరము మధురముగా నుండును. ఇదే పరిస్థితి నాది. నేను చెప్పుటలో చేయుటలో సామ్యము లేదు. ఓ రఘువీరా! ఓ ధీరమతి! జగత్తులోని సర్వ జీవులను ప్రేమించువారే నీకు ప్రియులు. ఈర్ష్యా రహితులై, నీ కమల చరణములయందు అనురాగము కల్గియుండుదురు. తన, ఇతర అను భేదబుద్ధి నుండి విముక్తి చెందినవారు. నాలో ఈ గుణములయందు ఒక గుణము కూడలేదు. అటువంటి అప్పుడు నీకు నేను ఎట్లు ప్రియుడనయ్యెదను? ఓ రఘునాథా! నా అవగుణములు అంతులేకున్నను, నేను ఈ జగత్తులోనే నుండతగినవానిని. ఓ కరుణానిధి! నీవు నీ గుణములగురించి ఆలోచించు. పతిత పావనుడవు నాయందు దయ చూపెట్టుము.

(తనవారు - పరాయివారు అనుభావము నుండి ముక్తుడు కావలెను. మనము చెప్పుట - చేయుటలో సామ్యము వుండవలెను.)

75. ఓ హరి! నా అవిద్య తొలగుటకు ఏ ప్రయత్నము చేయవలయును? నా సందేహము నివారణ కావలెను. ఈ శరీరము క్షణ భంగురము. మహామహాబలశాలురు (బలిష్టులు) నశించిరి. ఒకానొక దినము నేను కూడ నశించుదును. (చనిపోయెదను). అయిన విషయ వాసనలయందు రతుడనయివుండుట వదలలేక వున్నాను. భక్తి, వైరాగ్యములు, ఈ మనస్సును వశపరచుకొనుటకు చెప్పబడినవి అయినా నా మనస్సునుండి కోరిక తొలగుట లేదు. ఎవరైనా నాకు మంచి చెప్పిన, తులసీదాసు గొప్పవాడు. మంచివాడు లేదా ఏదైనా ఇచ్చినచో మోహమనెడి రాత్రియందు ప్రాణులన్నియు నిద్రించుచున్నట్లు ఆ రాత్రియందే నీ కృపాపాత్రులైన భక్తులు అనగా జ్ఞానులు మేల్కొని యుందురు. సాధారణమైన జీవులు జగత్తు యొక్క మాయా మోహమున లిప్తులై యుండెదరు. చైతన్యము కోల్పోయి యుందురు. జ్ఞానులు సదా మాయా మోహము నుండి ముక్తులయి జ్ఞాన సాధన యందులీనమై యుందురు. కాని నేను చెప్పునది ఈ జ్ఞానుల కంటే భిన్నముగానున్నది. అనగానేను ప్రపంచము అనెడి మాయా మోహమున పడి అజ్ఞానమనెడి అంధకారమున చైతన్య రహితుడనై యున్నాను. ఇది చూసి నా ఉద్ధారము ఎట్లు అగునని భయము కల్గుచున్నది. ఒకవేళ విధాత వశములో నున్నందున అనగా విధాతకు ప్రతికూలముగా నేనున్నందున నా కోరికలు అన్నియు నాశనమయినవి. అనగా నా ఒక కోరిక కూడ నెరవేరలేదు. అయినా నేను మాటి మాటికి కొత్త కొత్త కోరికలు మనస్సునందు (మనస్సున) కల్పించుకొనివున్నాను. అవి పూర్తికానందున దుఃఖించుచున్నాను. ఒక చిత్రకారుడు చిత్రమును వేయక మనస్సులోనే చిత్రమును గురించి కల్పనచేసుకొన్నట్లు వున్నది నా పరిస్థితి. స్వార్థమును నిరూపించుటకు ప్రయత్నించినట్లు వున్నది. చిత్రమును చిత్రించుటకు ప్రయత్నము చేయడు. కాని చిత్రములతో లాభమును పొందకోరును. భావము ఏమనగా నేను ఏ ఒక్క మంచి పనుల ద్వారా లభించు సుఖమును కోరుచున్నాను.

కాని నీ పేరు హృషీకేశుడు (ఇంద్రియముల స్వామివి). ఇది విని నేను నీకు సమర్పించకోరుచున్నాను. నీవు నా ఇంద్రియములను ఆజ్ఞాపించి వాటిని విషయ వాసనల నుండి వేరు పరచగలవు. ఇందువలన ఓ ప్రభు! ఇప్పుడు నీవు తులసీదాసు యొక్క ఇంద్రియజన్యమైన దుఃఖమును తొలగించవలెను. అనగా తప్పక తొలగించవలెను. ఒకవేళ చేయనిచో హృషీకేశ అను పేరు ఎట్లు సార్థకమగును?

76. ఓ హరి! నీవు నా ఈ గొప్ప భ్రమ (అవిద్యతో జనించిన సంశయము)ను ఎందుకు తొలగించకయున్నావు? ఒకవేళ ఈ ప్రపంచము నీ కృప లేనంతవరకు మిథ్య అయినప్పటికి సత్యముగానే భాసిల్లుచున్నది. అనగా నీ కృప కల్గినచో ప్రపంచము యొక్క మాయాతత్త్వము స్పష్టమగును. ఇంద్రియముల విషయములన్నియు నాశనమగునని, క్షణభంగురమని నాకు తెలియును. అయినా ఓ స్వామి! ఈ ప్రపంచము నన్ను వదలదు. అనగా నేను ఈ ప్రపంచము యొక్క మాయా మోహము నుండి ముక్తున్ని కాలేకవున్నాను. నన్ను విషయ బంధనములు బంధించక పోయినను, నేను మూర్ఖునిని. ఇందువలన నా హఠమువలన అదే మాదిరి పరులవశమున (మాయావశమున) పడివున్నాను. చిలుక ధాన్యము యొక్క దురాశకు గురియై పిట్టలను పట్టువలలో చిక్కుకొనును.

స్వప్నములో అనేక భయంకరమైన వ్యాధులు చుట్టుముట్టినట్లు వచ్చును. అప్పుడు మృత్యువు వచ్చినట్లు ప్రాణి భావించును. ఇటువంటి స్థితిలో వైద్యుడు ఎన్నిమందులు ఇచ్చిననూ నయముగాదు. స్వప్నరోగములు - మేల్కొన్న వెంటనే తొలగిపోవును. అనగా ఈ లోకము స్వప్నమువలె మాయాత్మకమై (మిథ్య) యున్నది. ఇతర ఎన్ని ప్రయత్నములు చేసిన శ్రమపడినా తొలగదు. జ్ఞానము ప్రాప్తించినప్పుడే మాయ నాశనము అగును; జీవుడు ముక్తుడగును. వేదములు, గురువులు, సాధువులు, స్మృతి గ్రంథములు మొదలగువన్నియు ఇదియే చెప్పుచున్నవి. ఈ కనపడే జగత్తు ఎల్లప్పుడు దుఃఖమును కల్గించును. దీని ఎడ వున్న మోహమును వదలక, రాముని భక్తిలేక, ప్రపంచమనెడి దీని ఆపదనుండి ఎవరును దూరము కాలేరు. వేదములు తమ నిర్మలమైన వాణిద్వారా ఈ విషయమును తెల్పుచున్నవి. ప్రపంచము నుండి దాటిపోవుటకు యజ్ఞములు, వ్రతములు, జపములు అనేక ఉపాయములున్నవి. కాని వాస్తవము ఏమనగా నేను, నాది అనే (అహంకార భావము) భావన నుండి దూరమయినవారు దుఃఖమును పొందరు. భావము ఏమనగా జీవుడు అహంకారమున మునిగి తనను కర్తగా, యజమానిగా భావించువరకు నిరంతరము దుఃఖమును పొందుచుండును. ఈ మోహము నుండి ముక్తుడైననే ప్రపంచము బంధనముల నుండి ముక్తి సంభవించును.

77. ఓ హరి! ఈ భ్రమ అజ్ఞానము యొక్క ఆధిక్యతయే చూచుట, వినుట, చెప్పుట, తెలుసుకొనుటవలన కూడ అసత్యమైన ప్రపంచమును సత్యమైనదిగా భావించుట. ప్రపంచము సత్యము అసత్యము అను సందేహము (తర్క - వితర్కమున) తొలగుట లేదు.

భావము ఏమనగా తర్కము. వితర్కము జరుగుతూ వుంటుంది. ప్రపంచము సత్యము లేక అసత్యము అని, అసత్యమైన ప్రపంచమును సత్యముగా భావించి యున్నాను. ఒకవేళ ప్రపంచము అసత్యమైన చెప్పుము. ప్రపంచములోని మూడు తాపములు (దైహిక, దైవిక, భౌతిక) వీటి అనుభవము జీవుడు ఏ కారణమున పొందుచున్నాడు? ఈ మూడింటి తాపములను అనుభవించునప్పుడు లోకమును సత్యముగా భావించవలెను. రెండవ స్థితి ఇది. ఎండమావులు (మృగతృష్ణ) సత్యమైనవిగా భావించుట లేదు. ఎందుకనగా దానికి ఏ అస్తిత్వము లేక భ్రమ చేతనే సత్యముగా గోచరించుచున్నది. ఆ భ్రమను సత్యముగా భావించి మృగము (జింక) ఎక్కువ దుఃఖమును పొందుచున్నది. ఇదే మాదిరి, ఈ ప్రపంచమును, సత్యమని భావించుట కేవలము మానసికమైన భ్రమ మాత్రమే. ఈ భ్రమ చేతనే జీవుడు ఎక్కువ దుఃఖమును పొందుచున్నాడు. భావము ఏమనగా మన భ్రమ అనగా అజ్ఞానమే, మన దుఃఖములకు మూలకారణము.

ఈ ప్రపంచము అసత్యమైనది అనుటకు మరొక ఉదాహరణ ఓ మంచి శయ్యపైన పండుకొని స్వప్నమును చూచును. అతడు సముద్రమున మునుగుచూ వున్నాడు. ఇది చూచి భయభీతుడగును. ఇటువంటి స్థితిలో కోట్ల పడవలు (నావలు) లభించకపోయిన అతనికి భయమునుండి ముక్తి లభించదు. అతడు నిద్రనుండి మేల్కొనలేదు. అనగా నిద్ర తేలిపోయిన పిమ్మట స్వప్నము సమాప్తమగును. అతని భయము తొలగును. అదే మాదిరి ఈ జీవుడు - అజ్ఞానావస్థలో పడివున్నంతవరకు నానా విధములను అనుభవించుచూ వుండును. ఈ దుఃఖముల నుండి అతనికి ముక్తి లభించవలెనన్న అతని హృదయమున జ్ఞానము (వివేకము) జాగృతము కావలసి యుండును. అప్పుడు ఈ ప్రపంచము అసత్యమని గుర్తెరుగును. ఇందువలన దీని మోహమున పడరాదు. ఆత్మ జ్ఞానము కల్గుటవలన అతనిలో వివేకము ఉత్పన్నమగును.

అజ్ఞానము చేతనే ఈ ప్రపంచము సదా రమణీయము సుందరముగా, ఆకర్షణీయముగా కనపడును. అనగా అజ్ఞానికి ఈ ప్రపంచము భయంకరముగా నిరూపణ అగుచున్నది. అది సమము, సంతోషము, దయ, వివేకములతోపాటు వ్యవహరించెదరు. వారికి ఈ ప్రపంచము సుఖమయముగా గోచరించును. ఎందుకనగా శుభమైన కర్మలద్వారా, ప్రపంచము ఎడ వారి మనస్సునందు ఏ విధమయిన ఆకర్షణ వుండదు. వారు పనులన్నియు నిష్కామ భావముతో చేసెదరు. నిష్కామ భావముతో కర్మలు చేయుటవలన ఎప్పటికిని వారిని దుఃఖము బాధించదు. ఇందువలన ప్రపంచము సుఖమయముగా కనిపించును. ఎందుకనగా జీవుని కోరిక నెరవేరనందున దుఃఖము కల్గును.

తులసీదాసు చెప్పుచున్నాడు - ఒకవేళ వేదములు - ప్రపంచము అన్ని విధములుగా దుఃఖమైననదని చెప్పుచున్నవి. దీనినుండి ముక్తి పొందుటకు వేదములు జపము, తపము మొదలగు సాధనలు అనేకము సిద్ధముగా నుంచినవి. అయినా రాముని భక్తి, భక్తుల సత్సంగము - ఈ రెండు లేకయే - ఏ సాధనము ప్రపంచము యొక్క దుఃఖమును

తొలగించలేవు. అనగా ఈ రెండింటి ద్వారానే ప్రపంచము యొక్క సాధనముల ద్వారా ముక్తి లభిస్తుంది.

(అజ్ఞానము వలన జగత్తు రమణీయముగానున్నను, ఆనందము క్షణికము. ఆత్మ బోధన ద్వారా వాస్తవ సౌందర్యము అవగతమగును. మనస్సున వున్న శంకను తొలగించుట ముఖ్యము. రామ భక్తి, సత్సంగము వలననే జ్ఞానము లభించును.)

78. ఓ హరి! ఈ ప్రపంచమునుండి ముక్తి పొందుటకు తగిన సాధన చేయుట నేర్చుకొనలేదు. సాధన ద్వారా ప్రపంచము నుండి ముక్తిపొంద వచ్చునని నేను తెలుసుకొనలేక పోయితిని. ఏ విధమయిన వ్యాధి వున్నదో, ఆ వ్యాధి నయమగు మందు ఇప్పించక వేరొక రకమైన చికిత్స చేయించిన రోగము తొలగదు. వైద్యుని నిందించి లాభము లేదు. అనగా నేను ప్రపంచము నుండి ముక్తి పొందుటకు జపతపాదులగు సాధనములను స్వీకరించితిని. కాని అసలు (వాస్తవ) సాధనము ఆత్మ జ్ఞానము ద్వారా మానసిక శుద్ధిని స్వీకరించలేదు. నాకు ముక్తి కలుగకపోయిన, అందుకు దేవునిని ఎందుకు దోషిగా భావించవలెను? ఇది నా అజ్ఞానము యొక్క దోషమే. స్వప్నములో ఒక రాజుకు బ్రాహ్మణవధ దోషము కల్గిన అనగా అతడు స్వప్నములో ఒక బ్రాహ్మణుని చంపును. ఆ పాపము చేత వికలుడు అగుచూ వుండును. వందకోట్ల అశ్వమేధములు చేసినను అతనికి బ్రహ్మ హత్య దోషమునుండి ముక్తి లభించదు. కాని అతడు నిద్రనుండి మేల్కొనక పోయిన దుఃఖము తొలగదు. ఇదే మాదిరి ఆత్మ జ్ఞానము లేకయే అంతఃకరణము శుద్ధి అగుట అసంభవము.

అజ్ఞానము చేతనే తాడు (పగ్గము) నందు భయమును ఉత్పన్నము చేయు సర్ప భ్రాంతిని ప్రకటించును. అనగా భ్రమ చేత పగ్గమును పాందగా భావించి భయము చేత వ్యాకులురమగు చున్నాము. ఆ సర్పములను అనేక ఆయుధముల ద్వారా, మిక్కిలి బలమును ప్రయోగించి ఓడిపోయిన చంపలేము. ఇదే మాదిరి భ్రమ చేత సత్యముగా భాసిల్లు అసత్యమగు ప్రపంచమును భయమును రామభక్తి లేకయే అన్యసాధనముల ద్వారా ముక్తి లభించదు. మన భ్రమవలెనే సూర్యకిరణముల ద్వారా ఉత్పన్నమయిన మృగజలము (మృగతృష్ణ) (ఎండమావులు) చూచి భయమును పొందుదుము. ఇసుక ఎడారిలో దూరమున సముద్రము అలలు కొట్టు చున్నట్లు ప్రతీతమగును. దీనినే మృగతృష్ణ అందుము. అందులో మునుగుచూ మనము ఓడలేక పడవపైన ఎక్కి కూడ దానిని దాటలేము. ఎందుకనగా అది వాస్తముగాక మృగతృష్ణ భ్రమజలము అగును. ఇదే మాదిరి మృగతృష్ణ వలె సమానముగా ఈ అసత్యమైన ఈ ప్రపంచును సత్యమని భావించి అందులో మునుగుచూ దుఃఖమును పొందుచున్నాము.

తులసీదాసు చెప్పుచున్నాడు - అహంకారపూరితమైన ఈ ప్రపంచము పూర్తిగా నాశనము కానంతవరకు కోట్ల ఉపాయములు చేసినను, చేయుచూ చనిపోయిన కూడ ఈ భవసాగరమును తరించలేము. భావము ఏమనగా ఆత్మ జ్ఞానము కల్గినప్పుడే ఈ జగత్తు యొక్క మిథ్యాతత్త్వము రుజువు అగును. అప్పుడే దాని నుండి ముక్తి కూడ సంభవమగును.

(విభిన్న దృష్టాంతములనిచ్చి జ్ఞానము ద్వారానే ప్రపంచము యొక్క బంధనములనుండి ముక్తి పొందుటకు చెప్పబడినది).

79. ఓ రఘునాథా! ఓ దయానిధి! భక్తవత్సల! నీ కృపలేనిదే మోహము తొలగిపోదు. మాయతొలగదు. అని నాకు తెలియుచున్నది. ఎవరైనా వ్యక్తి శాస్త్రీయజ్ఞానం ఎంతైనా వుండవచ్చు. పారంగతుడగుగాక, ఈ ప్రపంచమునుండి ముక్తుడు కాలేడు. కేవలము శాస్త్రీయ జ్ఞానమున్నను ఆత్మజ్ఞానములేకయే ప్రపంచమునుండి ముక్తి ఇప్పించలేరు. రాత్రివేళ ఇంటియందు దీపము వెలిగించక, కేవలము మాటలతో దీపము వెలిగించినట్లున్న చీకటి తొలగదు. కేవలము శాస్త్రీయ జ్ఞానము చేతవట్టి మాటలు చెప్పుట వలన అజ్ఞానము తొలగదు. ఒక దీనుడయిన దుఃఖితుడు ఆకలిగొని వున్నాడు. బాధ పడుచున్నాడు. అతని దుఃఖము తొలగుటకు అతని ఇంటియందు కల్పవృక్షము, కామధేనువు చిత్రములను వేయుటవలన అతని ఆకలి బాధ తొలగదు కదా! అనగా కల్పవృక్షము, కామధేనువు అతని ఎదుటికి రావలెను. లేనిచో చిత్రముల ద్వారా అతడు ఆకలి దుఃఖమును, దరిద్రమును పోగొట్టుకొనలేడు. భావము ఏమనగా కేవలము శాస్త్రీయ జ్ఞానము (ప్రాచ్యజ్ఞానము) వలన ప్రపంచములోని దుఃఖములు తొలగవు.

ఒక వ్యక్తి రాత్రింబగల్లు షడ్రసోపేతమైన భోజనము విషయము చెప్పుచుండును. ఇందువలన అతని ఆకలిబాధ తొలగునా? ఏ వ్యక్తి అయితే ఈ వ్యంజనముల పేర్లు వచించక భోజనము చేయునో, అతడే సంతోషముతో తృప్తి అను ఆనందమును పొందుచున్నాడు. అనగా కేవలము జ్ఞాన చర్చ చేయక భావనతో కూడిన మానసిక చింతన (భజన) చేసిన అతనికి లభించు తృప్తి ఆనందము అతనికే తెలియును. హృదయమున జ్ఞాన ప్రకాశము కల్గనంతవరకు, మనస్సునందు విషయ వాసనలు అను ఆశ నిండి వుండును. అంతవరకు జీవుడు జగత్తులోని విభిన్న యోనుల యందు జన్మించుచూ దారి తప్పి తిరుగుచుండును. అతనికి స్వప్నమున కూడ సుఖము లభించదు.

(చెప్పుట, చేయుటలో భేదమున్నందున సదా దుఃకమును పొందును. కేవలము శాస్త్రీయ జ్ఞానము తర్కవితర్కముల ద్వారా సంతోషము లభించదు. ఆత్మ జ్ఞానము వలననే భవలోకమున తరింపవచ్చును. భగవంతుని కృపవలననే మాయా మోహము తొలగును. మాయా మోహము తొలగిననే జ్ఞానము లభించును. భగవంతుని కృప మూలాధారము. మానసిక సాధననే శ్రేష్ఠమని తులసీదాసు భావించెను.)

80. ఒకవేళ మనస్సు తనవికారములను (విషయాదికోరికలను) విడిచిపెట్టిన, రాగ - ద్వేషాది పరస్పరము వైరుధ్యముల భావముల ద్వారా ఉత్పన్నమయిన అపారమైన ప్రాపంచిక దుఃఖములు, క్లేశములు, శోకము ఎందుకు పీడించును? భావము ఏమనగా ఒకవేళ మనోవికారములను వదలివేసిన అతనికి ఆత్మజ్ఞానము లభించును. అతడు ప్రపంచములోని దుఃఖములు, శోకము, సంశయము మొదలగు వాటి నుండి ముక్తుడగును.

వికారములే మనస్సున భేదబుద్ధి. రాగద్వేషములను ఉత్పన్నము చేయుచున్నవి. అవి తొలగినచో మనస్సు సమరసము ఏర్పడును. ఆత్మానందమున నిమగ్నుడగును. ఇదియే ముక్తి). మనస్సే బలిష్టమైన, వ్యక్తుల శత్రువు, మిత్రుడు, ఔదాసీన్యముగలది అయివుండును. అది శత్రువను సర్పమువలె త్యజింపదగినది. దాని నుండి రక్షించుకొని బయలుదేరి వెళ్ళును. మిత్రుని స్వర్ణమువలె గ్రహించును. ఔదాసీన్యమును గడ్డిపోచవలె, నిర్లక్ష్యముతో ముందుకు సాగును. ఇదంతయును మనస్సు యొక్క కల్పనల పరిణామము వల్ల కల్గును.

ఒక మణి లోపల భోజనము, వస్త్రములు, పశువులు మొదలగు వేరు వేరు వస్తువులు - వుండునో అనగా మణిని అమ్మి వీటిని (వస్తువులను) కొనవచ్చును. ఇదే మాదిరి స్వర్గ నరకములు, చర - అచరములు మొదలగునని ఈ మనస్సునందే తయారగును. మనస్సు మాణిక్యము వలే విలువగలది. శుభమగు కర్మలను చేసిన స్వర్గము, చెడు పనులు చేయుటవలన నరకము, విభిన్నమైన యోనులయందు జన్మించుట మొదలగునవి. ఈ మనస్సువలన జరుగును. అనగా శుభాశుభముల ప్రాప్తికి మూల కారణము ఈ మనస్సే. చేయకనే చెట్టు కర్రలో చిలుకబొమ్మ, దారమున వస్త్రము దాగి వున్నవి. అదే మాదిరి ఈ మనస్సులోపల కూడ సురులు, నరులు, కీటకములు, మిడతలు మొదలగువాని శరీరములు దాగి వున్నవి. అవి సందర్భమును పొంది, దారము చేత వస్త్రము అగునట్లు ఈ మనస్సు తన శుభము అశుభము అగు కర్మల ద్వారా దేవతలు, మానవులు, కీటకములు, మిడుతలు మొదలగువాని యోనిని పొందును.

మనస్సు యొక్క వికారములను తొలగించుటకు ఒకే ఉపాయమున్నది. రాముని భక్తి అనెడి జలముతో దీనిని పరిశుభ్రము చేయవలెను. ఇట్లు అగుటవలన మనస్సు పవిత్రమగును. తదుపరి ప్రయత్నము లేకయే, సత్యజ్ఞానము లభించును. అనగా ఆలోచన చేయ మొదలు పెట్టును. సత్యమేది? అసత్యమేది? కాని అప్రయత్నముగా, శ్రమ లేకయే అకస్మాత్తుగా జరగదు. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. చైతన్యమైన అఖండమగు ఆత్మానందము ఈ మనస్సు తెలుసుకొని తెలుసుకొని గుర్తెరుగును. అనగా, అకస్మాత్తుగా ఒకేసారి తెలుసుకొనక విషయవాసనల నుండి మనస్సు ముక్తి చెందిన, రామభక్తి యందు లీనమయిన నెమ్మది నెమ్మదిగా (నిదానముగా) ఆత్మానందము ప్రాప్తించును.

(మనస్సునుబట్టి కర్మలన్నియు అగును. కర్మలనుబట్టి మనకు ఫలితము లభించును. మనస్సు వికారములను వదలిన ఆత్మానందము లభించును. విభిన్న సాధనములద్వారా క్రమముగ, శరీరము, మనస్సు యొక్క పరిశుద్ధత అయిన పిమ్మట అంతమున పరమ జ్ఞానము అనగా భక్తి భావము ఉదయించును).

81. ఓ రఘువీరా! నా గొప్ప ఆపద విషయము ఎవరికి చెప్పవలెను? నీవే భక్తుల కళ్యాణ కారకుడవు. వారికి ధైర్యము కల్గించువాడవు. ఓ ప్రభూ! నా మనస్సు (హృదయము) నీ నివాస స్థానము (అందు)లోనికి వచ్చి అనేక మంది దొంగలు చేరివున్నారు. వారు జబర్

దస్తిగా (బలవంతముగా) నా పైన దయా రహితులయి, అన్యాయములు చేయుచున్నారు. ప్రార్థన చేయుట, బ్రతిమాలినను కూడ వినుటలేదు. ఓ నాథ! అజ్ఞానము, లోభము, మోహము, అహంకారము, మదము, క్రోధము, కామము మొదలగు జ్ఞానశత్రువులు (వీటివలన జ్ఞానము నష్టమగుచున్నది). నా హృదయమున మిక్కిలి ఆందోళన కల్గించుచున్నారు. నన్ను దిక్కులేని వానిగా భావించి మిక్కిలి ఎక్కవగా పీడించుచున్నారు. నేను ఒంటరిగా వున్నాను. ఈ దోపిడి దొంగలు ఎక్కువమంది వున్నారు. సహాయము కొరకు అభ్యర్థిస్తున్నాను. ఎవరును నా మనవి వినుటలేదు. అనగా అందరును వీరికి భయపడుచున్నారు. ఓ నాథా! వీరిని దూరముగా పారదోలినను నాకు రక్షణ కలుగదు. ఇందువలన ఓ రఘునాథా! ఇప్పుడు నీవే వచ్చి నన్ను రక్షింపుము. తులసీదాసు చెప్పుచున్నాడు. ఓ రామా! వీరు నీ ఇంటిని లూటీ చేసి తీసుకొని పోవుచున్నారు. (ఎందుకనగా నా హృదయము నీ ఇల్లు). ఇది చూచినాకు ఎక్కువ దిగులు కలుగుచున్నది. నీకు చెడ్డ పేరు వచ్చినచో బాగుండదు. దొంగలు భగవంతుని ఇల్లునే దోపిడి చేసిరి. నీవు నన్ను రక్షించి, నీ కీర్తిని రక్షించుకొనుము.

(శంకరాచార్యులు కూడ మానవీయ దుర్వృత్తులను బందిపోటు దొంగలతో సమానముగా చెప్పెను. దొంగలనుండి రక్షించుకొనవలెను).

82. ఓ నా మనసా! ఒకవేళ నీవు నీ హృదయమున భగవంతుని భక్తి కోరినచో నా యొక్క ఈ శిక్షణను పాటించుము. మొదట నీవు ఈ పని చేయుము. భగవంతుడు నీకు ఎన్నియో ఉపకారములు చేసెను. శరీరమునిచ్చెను. పెంచి పెద్ద చేసెను. వారిని నీ హృదయమున స్మరింపుము తరువాత నీ అహంకారమునంతయును వదలి వేసి చైతన్యుడవయి భగవంతుని సేవ చేయుము. రెండవ విషయము సుఖ, దుఃఖములు, అవమానములు, పొగడ్తలు వీటిని సమానముగా భావించుము. అనగా దుఃఖము, అవమానములతో దుఃఖపడవద్దు. సుఖము, పొగడ్తలు విని చూచి, గర్వపడవద్దు. అనగా సదా సమరసుడవయి వుండుము. ఇట్లు వున్నందున నీ ఆపదలన్నియు తొలగును.

ఓ దుష్టుడా! వినుము. ఈ నీ శరీరము యముని (మృత్యువు) ఆహారము. ఒకానొక దినము నశించును. ఇందువలన నీవు దీని కారణమున ఎవరిని నిందించవద్దు. తులసీదాసు చెప్పుచున్నాడు. ఓ మనసా! నీలో ఇటువంటి బుద్ధి కలగనంతవరకు కపటము (అగ్నిజ్వాల) వున్నందున రాముడు లభించడు. కపటము, సాధన ద్వారా రాముడు లభించుట అసంభవము. వారు సరిఅయిన ప్రేమ ద్వారానే ప్రాప్తించెదరు.

83. తులసీదాసు చెప్పుచున్నాడు. భగవంతుని చరణములయందు ప్రీతిలేదని నేను తెలుసుకొన్నాను. స్వప్నములో కూడ నా హృదయమున వైరాగ్య భావము ఉత్పన్నము కాలేదు. అనగా నా మనస్సుయందు, విరక్తి ఉత్పన్నము కాలేదు. భగవంతుని పైన ప్రేమ ఎట్లుండును. రాముని చరణముల యందు భక్తిగల వానికి, భోగవిలాపములు రోగ సమానముగా భావించి త్యజించబడును. కామ రూపమనెడి సర్పము కాటువేసిన విషయ

రూపమనెడి చేదైన పదార్థము హాని కల్గించదు. భావము ఏమనగా కామము జనించినప్పుడు విషయవాసన అటువంటి చెడ్డది కూడ కామునికి చెడ్డగా కనపడదు. (సర్పము కాటు చేత విషము ఎక్కిన వారికి వేపాకు చేదుగా - తిన్నప్పుడు కనపడదు) ఇది ఆలోచించిన నా మనస్సులో, ఏమి చేయవలెను? ఏమి చేయకూడదు? అను ద్వంద్వమైన సందేహము కల్గును. ఈ సందేహము వలన నిత్యము క్రొత్త క్రొత్త చింతలు, ఆలోచనలు కల్గుచున్నవి. ఇప్పుడు కేవలము ఈ ఆలోచన వున్నది. రాముడు కృప చూపిన వెంటనే నా దుఃఖము తొలగును. ఇది తప్పమరి ఏ ఒక ఉపాయమును నా దుఃఖ నివారణ చేయలేదు. భావము ఏమనగా కామవాసనయందు లిప్తుడైవుందునా? లేక రామ భజన చేయనా? ఈ నా సందేహము రాముడు దయయుంచి తన శరణులోనికి నన్ను తీసుకొన్నప్పుడే తొలగును.

(రాముని కృపయే సర్వదుఃఖముల నివారిణిగా చెప్పబడినది).

84. ఓ మనసా! ప్రేమతో సీతాపతి రాముని స్మరించుము. రాముని చరణములు తప్ప జీవితమునకు వేరొక గతిలేదు. అనగా అన్యమగు ఏ సాధన ద్వారా తప్ప, ఏ ఇతర (సాధనములు) మార్గముల ద్వారా ఈ జీవుడు భవసాగరమును దాటి పోలేరు. ముక్తి లభించదు. జపము - తపము, తీర్థయాత్రలు, యోగము, సమాధి మొదలగు వాటిలో ఏ సాధనము కలియుగమున ఘాతకమగు ప్రభావము చేత బుద్ధి స్థిరముగా వుండనందున స్వీకరించలేకున్నాను. వీటిలో ఏ ఒక్క సాధనము కూడ బాధను అరికట్ట లేకున్నది. పుణ్యకర్మలు చేయుచున్నను పాపములు శాంతింపవు. అవి రక్త బీజునివలె నిరంతరము పెంపొందుచున్నవి. వాటినినష్టము చేయుటకు ప్రయత్నించుకొలది రక్త బీజునివలె ఇంకను ఎక్కువగా వృద్ధినొందుచున్నవి. ఈ పాప రూపమను రాక్షస సమూహమును తొలగించునది. కేవలము ఒకే ఒక భగవంతుని కృప అనెడి కాలికా దేవి మాత్రమే. అనగా కాలికాదేవి రాక్షసులను సంహరించునట్లు రాముని కృప పాపములను వినాశనము చేయును.

(రాముని కృపను, పాపనాశనమునకు ఒకే ఒక సాధనముగా భావించబడినది. రక్త బీజుడను రాక్షసుడు వుండెను. అతనికి ఒక వరము ప్రకారము అతని రక్త బిందువు నేలపైపడిన బిందువునుండి రక్తబీజుడను రాక్షసుడు పుట్టుచుండును. ఇతనిని చంపుటకు అందరు అసమర్థులైరి కాలికాదేవితో అతనికి యుద్ధము చేయవలసివచ్చెను. కాలికా గొప్ప రూపమును పొంది నాలుక చాచి వాని రక్తము క్రిందపడకుండ మ్రింగెను. చివరకు కాలికాదేవి అతనిని చంపుటలో సమర్థురాలైయ్యెను.)

85. ఓ అందమయిన జిహ్వా! నీవు రామ నామమును ఎందుకుగాను స్మరించక యున్నావు? రాముని స్మరణవలన సుఖములు పెరుగును. పుణ్యములు పెరుగును. పాపములు - దుఃఖములు తగ్గిపోవును. రామనామ స్మరణ వలన కలియుగముననున్న పాపములను, చేదును, భయంకరమనువల అదే మాదిరి పరిశ్రమ లేకయే వినష్టమగును - సూర్యుడు ఉదయించిన చీకటి సమూహము పటాపంచలగును. నష్టమగును, తొలగును. యోగములు,

యజ్ఞములు, జపములు, వైరాగ్యము, తపస్సు, తీర్థయాత్రలు, తిరుగుటవలన ఈ ప్రపంచమనెడి ఏనుగును వశములో ఉంచుకొనుటకు నిస్సారమయిన పగ్గములతో ఏనుగును బంధించలేము. అనగా ఈ సాధనములద్వారా ప్రపంచమనెడి ఏనుగును వశములో వుంచుకొనలేము.

నీ పరిస్థితి ఇది - రామనామమను చింతామణిని వదలి గురిగింజను చూచి పేరాశ పడుచున్నావు. అనగా రామ నామము చింతామణివలె మనోవాంఛలనన్నింటిని పూర్తిగా నెరవేర్చగలదు, దానిని వదలి గురిగింజవంటి ప్రాపంచిక విషయ వాసనల ప్రక్క ఆకర్షింప బడుచున్నావు. తులసీదాసు, నీ ఈ లోభమును చూచి నీవు అటుల చేయుటయును వ్యతిరేకించి ఆటంకము కల్గించి నిలుపుదల చేయించుచున్నాడు.

86. రామ నామము జపించుచూ వున్నందున ఆనందము - శుభము ఉత్పన్నమగును. కలియుగములోని పాపములు తొలగును. వినష్టమగును. ఇంతవరకు ఎవరైన తుమ్మచెట్టు విత్తనములు వేసి తద్వారా ఫలములను పొందినవారెవరున్నారో చెప్పుము. అనగా దుష్కర్మలు (చెడ్డపనులు) చేసి ఎవడు సుఖమును పొందినాడు. వ్యర్థముగ అనర్గలమైన ప్రలాపములు చేయుచు, పనికి రానిమాటలు (గప్పాలు) చెప్పుచు, నిరుపయోగముగా జీవితమును కష్టముల పాలు చేసుకోవద్దు. కాలము, కర్మములు, గుణములు, స్వభావము అందరి మస్తకములను జ్వలింప చేయుచుండును. దీనివలన అందరు సదా దుఃఖమును పొందుచున్నారు. కాలము నష్టమగుచున్నది. మంచ, చెడ్డ అను కర్మ జాలమునందు బంధించి వుంచుచున్నవి. రాజసిక, తామసిక గుణములు ఈ ప్రపంచమునపట్టి వుంచుచున్నవి. స్వభావము విషయముల ప్రక్కకు ఆకర్షణ కల్గించుచున్నది. కాని రామనామ మహిమ చర్చ చర్చించినప్పుడు అవి అన్నియు అణగిపోవుచున్నవి. అనగా వాటి ప్రభావము నశించుచున్నది.

ప్రజలందరు సాధనలేకయే సిద్ధిని పొందుటకు వ్యాకులపడుచున్నారు. దురాశపడుచున్నారు. అనగా సాధన చేయరు. సిద్ధిని పొందుటకు ఆకాంక్ష కల్గియున్నారు. రామనామ నగరమున కలియుగము యొక్క అపారమైన మంచి వ్యాపారము నిలబడి పోవును. అమ్మబడుచున్నవి. అనగా రామనామ స్మరణ చేత కలియుగములోని పాపములు నశించును. ముక్తి కల్గును. రామనామమునందు, విశ్వాసము, ప్రేమ కలిగియున్నచో మన చంచలత్వమును త్యజించి, స్థిరుడు అగును. రావణుని శత్రువగు రాముడు - ఈయన ప్రభావము ఇట్లున్నది. తులసీదాసువంటి హీనుడు, నీచుడగు ప్రాణికూడ పవిత్రము గావించెను.

(రామనామము పదము (శబ్దము) రూపము, రసము, గంధము, స్పర్శ, మైథునము ఈ ఆరింటిని నాశనము చేయును. కామము, క్రోధము, మదము, లోభము, మోహము, మత్సరములను ఈ ఆరుమంది శత్రువులపైన విజయమును పొందుటకు ఆరు దఫాలు

87. ఈ మానవ జీవితమును పొందినందుకు మిక్కిలి ఎక్కువ లాభము (చరమ ఉపలబ్ది) రాముని చరణ కమలముల యందు పవిత్రమైన ప్రేమతో ప్రేమించుటయే. రామనామము - స్మరణవలన అన్ని ధర్మములు తెలియును. అనగా రామనామ స్మరణ వలన అన్ని ధర్మముల ఫలము సహజముగా తెలియవచ్చును. వేదములయందు యోగములు, యజ్ఞములు, జ్ఞానము, వైరాగ్యము, మొదలగు కర్మలవర్ణన చేయబడినది - వినుటకు చాలా మధురముగా, సరలముగా వర్ణించబడి వుండెను. కాని ఆచరణలో పెట్టవలసినప్పుడు చేదుగా, కఠినముగా నుండును. అనగా పనులు చేయుట చాలా కష్ట సాధ్యముగా నుండును. కఠినముగా నుండును. ఇందువలన తులసీదాసు చెప్పుచున్నారు. తెలిసి భ్రమలోపడి వుండుట దారి తప్పి తిరుగుట వుండకూడదు. ఓ మనసా! నీవు ఇప్పుడు ఆ ప్రభువు శరణులోనికి వెళ్ళుము. అతని చేతియందు అందరి గౌరవమున్నది. అనగా అందరి లజ్జను (మర్యాదను) రక్షించువాడు.

88. రాముని వంటి ప్రియున్ని ప్రేమించక ఈ జీవుడు వృధాగా (వ్యర్థముగా) జీవనయాపన చేయుచున్నాడు. అనగా అతడు జీవించడము వ్యర్థము. ఈ జీవుడు ఏ సుఖమును భావించుచున్నాడో - ఆ సుఖము ఎంత? అనునది సరిగా తెలుసుకొనవలెను. అనగా విషయ - ఆనందము క్షణికము. కాని ఫలితము - జీవుడు విభిన్న యోనులయందు పడి కష్టమును పొందును. అనగా ఈ సుఖము - సుఖము కాదు దుఃఖమును కల్గించుచున్నది. భూమి, పాతాలము, ఆకాశములో ఏ ఏ యోనులయందు నీవు జన్మించవలసియున్నది. అక్కడ సదా అక్కడి విషయ వాసనల ఆనందమునే పొందుటకు కోరిక వుండును. భాగ్యమున వ్రాయుటవలన అవియే ప్రాప్తించును. అనగా నీరాకపోకలు అనుచక్రము నుండి విడుదలలేదు. ఇందువలన నీవు విషయ వాసనల యందు అలసిపోయి ఆనందమున మునిగి చినిగిపోయిన ఆకాశమును కుట్టుచూ వుండెదవు. భావము ఏమనగా ఇటుల చేయుటవలన నీకు ముక్తి లభించదు. అందువలన నీవు భగవంతుని అందమైన మనస్సును గురించి గానము చేయుము. అమృత పానము ఎందుకు పొందవు? అందువలన అమరుడవు అయ్యెదవు.

(అసంభవమయిన పనిచేయ కూడదు, భగవంతుని నామకీర్తనము అమృతముతో సమానము.)

89. ఓ మనసా! నీకు మాటిమాటికి హితము, మధురమును, పవిత్రమునగు సత్యవచనములు చెప్పుచున్నాను. నీవు ఈ మాటలను వినుము. మనస్సునందు ఆలోచించుము. తెలుసుకొని, సరలమగు, చక్కని మార్గమును ఎందుకు స్వీకరించవు? పిల్లలు - పెద్దలు - మంచి - చెడ్డ ప్రపంచములో ఎక్కడ వుండినా వుండును. తనమేలుకోరనివాడు ఎవడు వుండునో చెప్పుడు. అనగా ప్రతి ఒక్కరూ తన మేలు కోరుకొనును. బ్రహ్మనుండి చిన్న కీటకము పురుగువరకు అన్ని సుఖము - దుఃఖములయందు

వ్యాకులము చెందుచున్నవి. అనగా సుఖ - దుఃఖముల ప్రభావము అందరిపై పడుచున్నది. ఎందుకనగా గొల్లవాడు పశువులను బంధించును, వదులుచూ కట్టుచూ వుండును. అదేమాదిరి పరమాత్మ (దేవుడు) ప్రతిజీవున్ని ప్రవృత్తి అను పగ్గము చేత కట్టివుంచును. అనగా జీవుడు ఈశ్వరుని ప్రేరణ వలననే అజ్ఞానమను మోహమున, బంధింపబడి వైరాగ్యమును పొందును. కర్మకాండయందు లిప్తుడయివుండును. అతని జీవితమును నడిపించువాడు ఈశ్వరుడే.

విషయ వాసనల యందు లభించు సుఖమును కొంచెము చూడుము. ఎట్లున్నవో? ఆ సుఖములు క్షణికమే. తలపైన బరువు చేత అలసి ఆ బరువును భుజముపైన పెట్టుకొందురు. కొద్దిగా విశ్రాంతి లభించిన మరల తలపైన ఆ బరువును పెట్టుకొందురు. ఈ క్రియవలన క్షణము విశ్రాంతి సుఖము కల్గును. అదే మాదిరి జీవునికి ఒక పనినుండి అలసట అయిన మరొక పని (విషయము - వాసన) యందు నిమగ్నుడగును. అనగా విషయ వాసనల ఆనందము స్థిరముగా నుండక క్షణికమై యుండును. ఓ మూర్ఖమైన మనసా! నీవు ఈ విషయమును మనస్సునందు సరిగా తెలుసుకొనుము. ఎందుకు వృథాగా దుఃఖమును అనుభవించెదవు?

నేటివరకు ఎవరైన మృగతృష్ణలోని జలమును మథించి నెయ్యిని పొందవచ్చునా? ఎవరును పొందలేదు. ఇదే మాదిరి మృగతృష్ణవలె అసత్యమైన ఈ ప్రపంచము యొక్క విషయ వాసనల ఆనందమును స్థిరముగా నుండు ఆనందమును ఇవ్వలేవు. ఇందువలన ఇవి అన్నియు వ్యర్థము. తులసీదాసు చెప్పుచున్నారు. ఓ మనసా నీవు ఆ ప్రభువు శరణు పొందుము. అక్కడికి వెళ్ళుటవలన అనేక లాభములు కల్గును. పరమానందనమును కల్గించునట్టి ముక్తి లభించును.

90. ఓ దేవా! నేను నీ ద్వారము దగ్గర నిలబడి మాటి మాటికి నిన్నే పిలుచుచున్నాను. ఓ ప్రభూ! ఈ దుఃఖితుల ద్వారా వినమ్రులై తమ దుఃఖములను చెప్పుకొనగా, వారి ఆపదలను తొలగించు చున్నావు. దీనికి రుజువు నాకు లభించినది. ఇంద్రుడు, కుబేరుడు మొదలగు లోక పాలకులు రావణుని భయముతో భయపడి వికలురుగానుండినప్పుడు (బాధలతోనున్నప్పుడు) అప్పుడు నీవు, నర శరీరము వహించినప్పుడు ఏ విధమయిన సంకోచమును పొందలేదు. అనగా వారి కరుణతో కూడిన కేక (పిలుపు) విని నీవు అవతారమును స్వీకరించితివి. ఋషి విశ్వామిత్రుని యజ్ఞమును రక్షించితివి. గౌతము ముని భార్య (అహల్య) (పతి ద్వారా శాపమును పొందిన) రాజగు జనకుని చింత అను అగ్ని నుండి రక్షించుటకు సీతను వివాహము చేసుకొనెను. చింతాగ్ని ఏ శీతలమున చల్లబడినది? అనగా నీవు ఆయన పరిస్థితి తెలుసుకొని నీవు స్వయముగా వారి చింతలను తొలగించితివి. (వీరిలో ఎవరు కూడ బహిరంగంగా స్పష్టముగా చెప్పలేదు. మనస్సులోనే నిన్ను స్మరించిరి).

పడవ నడుపువాడు నిషాదరాజగు గుహుడు, పక్షి జటాయువు, శబరి (కొండజాతి

చెంచు స్త్రీ) వీరిలో ఎవరికి నీ పాదకమల మాలయందు సహజ అనురక్తి లేకుండెను. అనగా పూర్వము నుండి నిన్ను ప్రేమించలేదు. అయినా ఓ నాథా! నీ ప్రభావము ఇటువంటిది. నీవు ఎదుటవచ్చినట్లయితే చెడ్డ వృక్షములపైన మంచి మధురమైన ఫలములు వుండును. (నిర్మితమగును) ఏ విధముగా నావికుడు, జటాయు, శబరి అటువంటి నీచ ప్రాణులు కూడ నీ ఎదుటకు రాగానే భక్త శిరోమణుల అయిరి తన సోదరుల వైరము చేత సుగ్రీవుడు విభీషణుడు గ్లాని (ఎందుకు దుఃఖము, చింత)లో కరగి (చిక్కి) పోవు చుండిరి. అనగా మిక్కిలి అవమానకరమైన జీవితమును అనుభవించుచుండిరి. రామా! చివరకు ఇది చెప్పుము. వారి ఏ సేవకు సంతోషించి, వారిని భరతునివలె సోదరులను చేసుకొంటివి. అనగా వారు మొదట నీకు ఏమియు సేవ చేయలేదు. భావము ఏమనగా నీ శరణుజొచ్చిన వారికి ఈ పదవి లభించెను.

సుగ్రీవుడు - విభీషణుడు స్వార్థము చేత నీ శరణుజొచ్చిరి. పవనపుత్రుడగు హనుమంతుడు నీ సేవకుడయి నీవలెనే గొప్పవాడు అయ్యెను. అనగా ఎల్లవేళలా నిస్వార్థ భావముతో నీ సేవ చేసెను. ఈ కారణమున నీవు. అతనకి గొప్ప గౌరవమును ఇచ్చితివి. వారిపేరు స్మరించినంత మాత్రముననే నీవు అందరిపైన కృప చూపెట్టుదువు. ఓ రామా! నీ పద్ధతి తెలియక ప్రపంచమంత ప్రయత్నించి - ప్రయత్నించి చనిపోవుచున్నది. అనగా ప్రపంచమునకు ఈ విషయము తెలియదు. నీవు ఎంత దీనవత్సలుడవో? ఈ కారణమున దారితప్పి తిరుగుచూ వున్నది. నీ మహిమ చాలా గొప్పది. కపటమును వదలి శరణుజొచ్చిన తులసీదాసు అటువంటి అధములు కూడ తరింతురు.

(రాముని భక్తులలో హనుమంతునికి మాత్రమే పూజలు చేయబడుచున్నవి. హనుమంతుడు శివుని అవతారముగా పదకొండవ రుద్రునిగా భావించబడుచున్నాడు. మారుతికి మందిరములున్నవి. తాత్వికముగా రాముడు, శివుని యందు భేదము లేదు. శివుని అవతారమగు హనుమ - రాముని మధ్య భేదము లేదు. హనుమంతునికి ఈ మహాత్యము ఇందువలన లభించినది - ఎందుకనగా ఆయన (హనుమ)ని స్వార్థభావముతో రాముని సేవ చేసి యుండెను.)

91. ఓ మనసా! రాముని అటువంటి స్నేహపరునితో నీవు స్నేహము చేయలేదు. ఆయన నీకు దుర్లభమైన మానవ శరీరమును ఇచ్చెను. (దేవతలు మానవ శరీరమును పొందుకు మిక్కిలి ఆశించుచూ వుందురు). ఆ రాముడు ఉన్నత కులములో నిన్ను జన్మింపచేసెను. అందమైన శరీరమును ఇచ్చెను. దాన్ని పొందినందు వలన నాల్గు ఫలములను అనగా (ధర్మము, కామము, అర్థము, మోక్షము) పొందితివి. ఈ మానవ శరీరమును పొంది జ్ఞానులకు విష్ణువు, శివుడు, పరమ పదము అనగా వైకుంఠము, కైలాసమును పొందిరి. ఈ భరత ఖండము అందమైన దేశము. దగ్గరలోనే దేవనది గంగానది ప్రవహించుచున్నది. స్థానము కూడ బాగున్నది. ఇక్కడ సాంగత్యము కూడ మంచివారితోనే జరుగును. అయినా

ఓ పిరికివాడా! నీ దుర్బుద్ధి అనెడి కల్పలత విషఫలములను ఉత్పన్నము చేయకోరినది. అనగా నీ బుద్ధి చాలా చెడ్డది అయినది. తన సహజమైన శుభస్వభావమును (శోభ) త్యజించి ప్రపంచములోని విషయవాసనల చేత విష ఫలములను ఉత్పన్నము చేయకోరుచున్నది. ఇందులోనే చిక్కుకొని వున్నది. (కల్పలత యందు అభూతమైన ఫలములు కాయును) భావము ఏమనగా నీవు ఈ బుద్ధి ద్వారా ముక్తి పొందుదువు. కాని పదభ్రష్టుడవయి పాపములను చేయుంచుచూ తిరుగుచున్నావు.

ఓ మనసా! చూడుము. ఇప్పటికైనా ఏమియు చెడిపోలేదు. నీవు ఈ దినముననైనా మనసు వుంచి, పరమ కళ్యాణమును గురించిన విషయము. ఈ విషయమే ఈ లోకమున కళ్యాణమును కల్గించినది. దీనినుండియే నీ స్వార్థము సిద్ధించును. అనగా ముక్తి కలిగించును. ఒకవేళ నీకు స్వార్థమే ప్రియమైతే, నీ స్వార్థము ఏమిటి? వేదములలో స్వర్గమును గురించిన వర్ణన వున్నది. వేదములు ముక్తినే పరమమగు స్వార్థముగా వర్ణించెను. ఓ దుష్టా నీవు సర్పముతో ఆడుట త్యజించి (విడిచిపెట్టి) ఆ ప్రభువును తెలుసుకొనుము. (ఆయన స్వార్థమును సిద్ధింపచేయించును). అనగా విషయ వాసనలను వదలి భగవంతుని గుర్తెరుగుము. అప్పుడే నీ స్వార్థము పూర్తి అగును. భోగవంతుడు ముక్తిదాత. అతని ప్రేమవలన మతాపితలు, గురువు, స్వామి, తన ఆత్మ స్వరూపమును భార్యపుత్రులు, సేవకులు మిత్రులు అందరు ఎంతో ప్రియముగా కనపడెదరు. కారణము లేకయే అందరికి మేలు చేయునటువంటి రాముని నీవు చూడలేదు.

నీ హితైషి నీకు దూరము కాలేదు. నీ హృధయములోనే వున్నాడు. (విరాజిల్లుచున్నాడు). కపటమును వదలి అతనిని ధ్యానించినచో అతడు తప్పక నీపైన కృప చూపును. అతడు తన భక్తులపైన ఎల్లప్పుడు తన కరకమలములను నీడ (ఛాయ)ను కల్గించి కృపను కల్గించును. అతని భజన చేయువారికి తన భక్తుని భజన ఆయన చేయును. అతడు జగత్తుకే స్వామి (యజమాని). జీవులకు జీవితము నిచ్చి అందరికి అన్ని విధములైన సామాగ్రి, భోజనము, వస్త్రములు మొదలగు సంగ్రహించి ఇచ్చును. (జతపరచి ఇచ్చును) అతడు విష్ణువుకు విష్ణుత్వము అనగా పాలన చేయు శక్తిని, బ్రహ్మకు సృష్టి చేయు శక్తిని శివునికి శివత్వము (సంహారము చేయు) శక్తిని ఇచ్చెను. ఆ సీతాపతి రాముడు ఆనందము నిండిన మంగళమయుడు. పరిపూర్ణమైన మధురమూర్తి.

అతడు చాలా శక్తిగల దేవుడు. ఆయిన మిక్కిలి శీలవంతుడు. సరలుడు కృపగలవాడు. అతనిని ధ్యానములోనికి తెచ్చుకొనుట శివునికి కూడ అగమ్యమే. అనగా ఎవరు శివుని ధ్యానించరో అతడు లేచి నావికునికి దర్శనమిచ్చెను. అతడు అతనిని ఆలింగనము చేసుకొనెను. స్నేహము చేత అతని నేత్రములయందు అనందభాష్పములు నిండెను.

శబరి (కొండజాతి స్త్రీ) విభీషణుడు (రాక్షసుడు) ఎలుగుబంట్లు, వానరులను కూడ ఎక్కువ వందనీయముగా చేసెను. అయినా ఆయన శీలము గొప్పది. ఎప్పుడైనా వీరి ద్వారా తనకు సేవచేసిన విషయము స్మరించిన సంకోచముతో నేలప్రక్కకు చూచును. తనను వీరికి శాశ్వతముగా ఋణముగలవానిగా భావించును.

స్వామియగు రాముని గురించి నేను వర్ణించిన విషయము నీవు నీ హృదయము చొప్పించుకొనినచో అనగా రాముని యందు పూర్తి విశ్వాసము, ఆధారము పడివున్నచో నీ చింతలన్నియు తొలగి పోవును. రాముడు కూడ నీపైన ప్రసన్నుడగును. వెంటనే నీకు ఈ జీవితములో ముక్తి అను ఫలము లభించును. ఒక వేళ నీవు చేతులు జోడించి అతని ఎదుట శిరస్సు వంచిన ప్రసన్నుడగును. నీ జీవితము సార్థకము అగును. నీవు రామ నామస్మరణ చేయుచూ వుండుము. నీవు ఈ ధరణి అధిపతి యగు రాముని చరణకమలముల యందు నీ మనస్సును భ్రమరము (తుమ్మెద)ను సమానముగా వుండనిమ్ము. అనగా రాత్రింబవల్లు రామునినే స్మరించుచూ వుండి నిర్భయముగా భూమి యంతటను తిరుగుచుండుము. ఎవరును నీకు హాని కల్గించలేరు. ప్రపంచములోని విషయవాసనలు అను భయము తొలగిపోవును. నీవు జీవన్ముక్తుడవు కాగలవు.

(సాధనావస్థ సమాప్తమయి, పరిపక్వమగు దృష్టివలన నిర్వేదమను చరమసీమ ఏర్పడును.)

92. 1) ఈ జీవుడు భగవంతుని నుండి ఎప్పుడయితే వేరు అయ్యెనో అప్పటినుండి మానవుడు ఈ శరీరమును తన గృహముగా భావించడమైయ్యెను. మాయా బంధనములోపడి, అతడు తన ఆత్మ స్వరూపమైన దానిని మరచి పోయెను. ఈ భ్రమ చేతనే అతడు (మానవుడు) అవ్యక్తమైన భయంకరమగు దుఃఖమును అనుభవించుచున్నాడు. సుఖము స్వప్నములో కూడ కొంచెము అయినను లభించలేదు. అనగా నిద్రించుచూ, మేల్కొనుచూ ఎడతెరపిలేక దుఃఖమును పొందును. ఈ జీవుడు ఆ మార్గమున అనగా విషయ వాసనల మార్గమునందు మాటిమాటికి హఠముతో పోవుచుండును. అందులో ప్రాపంచిక దుఃఖములు శోకములు మిక్కుటముగా నుండును. ఫలితముగా అతనికి అనేక యోనుల యందు జన్మించవలసియుండును. ముసలితనమున చాలా ఇబ్బంది పడవలసి వచ్చును. అయినా ఈ మూర్ఖుడు భగవంతుని తెలుసుకొనలేడు. ఈ దుఃఖమును పొందినందున భగవంతుని స్వరూపమును గుర్తుపట్టలేక పోయెను. ఓ మూర్ఖా కొంచెము చూడుము. శ్రీరామునిని వదలి, నీవు వేరొకచోట శాంతిని పొందగలవా? అనగా రాముని వదలిన జీవునికి శాంతి లభించదు.

2) ఓ జీవా! ఆనంద సముద్రమున మధ్యలో నీ నివాస స్థానమున్నది. అనగా నీవు ఆనంద స్వరూపుడగు బ్రహ్మ యొక్క అంశము అయినందున ఆనందమును పొందుటకు పూర్తిగా అధికారము వున్నది. అయినా నీవు ఆనంద స్వరూపుడగు బ్రహ్మ రూపమును

తెలియక దాహముతో చనిపోవుచున్నావు. అనగా ఆత్మ స్వరూపమును మరచి ప్రపంచము యొక్క విషయ వాసనల యందు లిప్తుడవయి. అసంతృప్తితో ఎందుకు వ్యాకుల పడుచున్నావు. నీవు మృగతృష్ణ జలమును నీ మనస్సున సరిఅయినవిగా భావించి అందులో సుఖమున్నదని నిమగ్నమయి వున్నావు. అనగా విషయ వాసనలనే సరియగు సుఖములుగా భావించి మత్తుకలిగి యున్నావు. నీవు అక్కడనే నిమగ్నుడవయి ఆజలమున స్నానము చేయుచున్నావు. దానినే త్రాగుచున్నావు. అక్కడ మూడు కాలములయందు జలము వంటి పదార్థము లేదు. మృగతృష్ణ జలము భ్రమ, నీవు నీ సహజ స్వాభావికమగు అనుభవ గమ్యమైన సచ్చిదానంద స్వరూపమును మరచి అక్కడకు వెళ్ళిపడివున్నావు. అనగా ప్రపంచములోని విషయ వాసనలయందు చిక్కుకొని వున్నావు. నీవు ఈ భ్రమ అనుజాలమున పడి, ఆవిశుద్ధమగు, అవినాశి, నిర్వికార, ఆనందమును త్యజించితివి. ఈ విధముగా వ్యర్థముగా రాజువలె తన రాజ్యమును త్యజించి స్వప్నమనెడి జైలులోపడివున్నావు. ఆనంద స్వరూపుని మరచిపోయి స్వప్నమునకు సమానమైన అసత్యమైన ప్రపంచ విషయ వాసనల యనెడి కారాగారమున (వలలో) పడివున్నావు. అనగా నీ అజ్ఞానము చేత ఆత్మానందమును వదలి విషయ వాసనలయందు సుఖమును వెతకుచూ తిరుగుచూ వున్నావు.

3) నీవు స్వయముగా కర్మ అనెడి పగ్గమును బలమైనదిగా కావించి చేతులలో బిగించి ముడి వేసితివి. అనగా నీవు కర్మ బంధనమున పూర్తిగా బంధింపబడివున్నావు. ఈ కారణముననే ఓ దౌర్భాగ్యుడా! నీవు మాయా వశుడవయివున్నావు. అనగా మాటి మాటికి జన్మ కలిగి వుండుట జరుగుచున్నది. నీవు భవిష్యత్తులో ఏ గర్భమున నుందువో అను దుఃఖమును పొందుచున్నావు. ప్రపంచమున దుఃఖ సమూహములు అసంఖ్యామైన దుఃఖములను పొందవలసివచ్చును. తల్లి గర్భమున దుఃఖములు అనుభవించితివి. గర్భమున శిరస్సు క్రిందికి కాళ్ళుపైకి వుండును. ఆ సంకట సమయమున అతనిని మాట్లాడించువారు సహాయము చేయువారుండరు. అతడు రక్తము, మలము, మూత్రము, పెంట, కీటకములు, మురికిలో కూడిన చోటనే పండుకొని నిద్రించవలసివున్నది. అతని శరీరము కోమలముగా నుండును. అందువలన అతని వేదన భయంకరముగా నుండును. ఆవేదన చేత వికలుడయి తలబాదుకొనుచూ వుండును. రోదించుచుండును. భావము ఏమనగా జీవునికి భయంకరమగు దుఃఖములను అనుభవించవలసియుండును.

4) నీ కర్మ రూపమనెడి వల నిన్ను చుట్టిన చోటువరకు దేవుడు నీతోడు వదలలేదు. భగవంతుడు అనేక విధములుగ నిన్ను పోషించెను. ఆ పరమ కృపాలుడు నీకు జ్ఞానమును కూడ ఇచ్చెను. నీకు జ్ఞానము, వివేకము (సత్ అసత్ జ్ఞానము) లభించెను. అనేక జన్మల స్మరణ కూడ కల్గినది. నేను ఆ దేవుని శరణులో వున్నానని చెప్పితివి. అతని మహా కఠినమైన మాయ త్రిగుణాత్మకమయి (సత్వ, రజ, తమో గుణములు) వున్నది. అనగా ప్రపంచమున మాయ మూడు గుణముల వల పరచబడివున్నది. ఈ మాయా జీవుల సమూహమును తన వశములో వుంచుకొని, వాటిని బానిసలుగా చేసి నీరసము అనగా దుఃఖములను కల్గించుచున్నది. నిత్యము నవీనముగా నుండును. ఇందువలన ఓ లక్ష్మీపతి!

ఆపదలో బుద్ధిని ఇచ్చితివి. అనగా నాకు ఈ ఆపదలో భగవంతుడే రక్షించగలడని భావన కల్గినది).

5) మరల అనగా రెండవ జన్మను గురించి నా మనస్సున మిక్కిలిగ్లాని కలుగుచున్నది. జన్మమును వ్యర్థముగా పోగొట్టుకొంటిని. మరో జన్మ కల్గితే చక్రపాణి యగు దేవుని స్మరించెదనని ప్రతిజ్ఞచేసివుంటివి. ఇటువంటి ఆలోచన చేసి మౌనముగా నున్నావు. అనగా నిష్క్రియుడవు అయితిని. ఇది చూచి ప్రసవకాలమునాటి పవనము భగవంతుని ఆజ్ఞ చాలా ప్రచండమైనది. ఇది నీకు అనేక కష్టములను కల్గించెను. వాటిని నీవుసహించితివి. భావము ఏమనగా మాయ తన వలలో చిక్కించుకొని మరల పాపములను చేయుటకు ప్రేరేపణ కల్గించెను. తత్ఫలితముగా నీవు అనేక కష్టములను అనుభవించితివి. ఇంతకు పూర్వము ఏ జ్ఞానము, ధ్యానము, వైరాగ్యము, ఆత్మానుభవము, మొదలగునవి ప్రాప్తించియుండెను. అవి అన్నియు కష్టము అను నీ అగ్నియందు కాలి భస్మమయినవి. అనగా నీవు వాటిని మరచితివి. మిక్కిలి ఎక్కువ దుఃఖమున నీవు మిక్కిలి వ్యాకులుడవు అయితివి. కొద్దిపాటి శక్తి వున్నందున, నీతో ఒక క్షణము కూడ మాట్లాడుటకు వీలు పడలేదు. జన్మించినపుడు నిర్బలుడుగా వున్నందున నీవు కష్టములను అనుభవించుచుంటివి. మాట్లాడలేక పోయితివి. ఎవరు కూడ నీ ఆ భయంకరమైన కష్టమును తెలుసుకొనలేక పోయిరి. అందరు నీవు జన్మించినపుడు ధన్యవాదములు తెలిపే గీతములను గానము చేసిరి.

6) నీవు బాల్యమున చాలా కష్టములను అనుభవించితివి. అవి హద్దు లేనివి. వాటిని లెక్కించుటకు వీలు కాదు. నేను ఆకలి, రోగములు అనేక రకములగు బాధలను అనుభవించవలసి వచ్చెను. కాని నీ ఆ కష్టములను నీ తల్లి కూడ తెలుసుకొనలేక పోయెను. బాలుడు ఏ కారణమున ఏడ్చుచున్నాడో అను విషయము తల్లికి తెలియదు. ఆమె నీ పీడలను తొలగించుటకు అనేక ప్రయత్నములు చేసెను. అందువలన నీఎడ ఇంకా ఎక్కువ జ్వలనమును పొందెను. తల్లి యొక్క అజ్ఞానము చేత నీకు ఇంకాఎక్కువ కష్టపడవలసివచ్చెను. (బాలుడు తన కష్టమును చెప్పలేడు, తల్లి అందాజుతో అతనికి ఉపాచారములు చేయును) కష్టమును ఇంకా ఎక్కువ పెంపొందింప చేయును. కౌమార్యావస్థ, శైశవావస్థ, కిశోరావస్థయందు నీవు అసంఖ్యాకమైన పాపములు చేసితివి. వాటిని ఎవరు వర్ణించగలరు? ఓ నిర్దయుడా! మహాదుష్ట! నీవు తప్ప ఈ కష్టములను ఎవరు ఓర్చుకొనగలరు?

7) యౌవనము వచ్చినపుడు స్త్రీ (యువతి)తో భోగవిలాసములయందు మత్తు కలిగియుంటివి. అప్పుడు మిక్కిలి మోహములోపడి మత్తెక్కియుంటివి. అందువలన నీవు ధర్మమర్యాదలను త్యజించితివి. నీవెనుకటి కష్టముల విషయమంతయును మరచితివి. సంపూర్ణ విషాదములు, కష్ట సమూహమును మరచి పోతివి. మరో జన్మలో నీకు అటువంటి కష్టములే అనుభవించవలసి వచ్చెను. ఇది తెలిసి కూడ నీ వక్ష స్థలము పగలి పోలేదు. మరలా నీవు అటువంటి పనులే చేస్తున్నావు. అందువలన మరల గర్భంబున జన్మమెత్తి

ప్రపంచమనెడి చక్రములో పడితివి. ఈ శరీరము అంతమున కీటకములు, బూడిద, పెంటగా మారవలసివచ్చును. శరీరమును మట్టిలో పూడ్చిన కీటకములు (పురుగులు) పట్టును. ఏదేని జంతువు ద్వారా తినిన పెంట (మలముగా) అయ్యేదవు. ఇటుల ఈ ప్రపంచము నంతటికి శత్రువుగా అయితివి. కాల్చినందున బూడిద అయ్యేదవు. పరులస్త్రీ (పరస్త్రీ), పరధనము ఇతరుల శత్రుత్వము ప్రపంచమున వీటి ఎడ నిత్యము వినూత్నమైన మోహము పెంపొందినది. అనగా నిత్యము వీటి ఆకాంక్షలతోనే నిమగ్నుడనయితివి.

8) చూచుచూ వుండగానే వృద్ధాప్యము వచ్చెను. దీనిని స్వప్నములో కూడ పిలిచివుండలేదు. అనగా స్వప్నములో కూడ దానిని కోరలేదు. నీవు సదా యువకునిగా నుండకోరితివి. ఈ వృద్ధాప్యము గుణములు వర్ణించలేము. దాని గుణములను ఇప్పుడు ప్రత్యక్షముగా ఈ శరీరమున చూచుచున్నాము. ముసలితనమువలన శరీరము బలహీనమయి రోగములు, పీడలు ఇంకను పీడింపసాగెను. తలకంపించుచున్నది. ఇంద్రియముల బలము వినష్టమయినది. నీమాట ఎవరికి ఇష్టము లేదు. నీ ఇంటి కుక్క కంటె కూడ అనాదరణ పొందెదవు. కుక్కకు వేళకు భోజనము నీరు కూడ ఇవ్వరు. ఇటువంటి పరిస్థితి ఏర్పడినను నీ హృదయమున వైరాగ్యము పుట్టుటలేదు. నీ దాహము (కోరికలు) నీటి అలలవలె పెంపొందుచున్నవి. నీవు కోరికల దాహములో చిక్కుకొని పోవుచున్నావు.

9) నీ యొక్క అనేక జన్మముల కథ ఎవరు చెప్పగలరు? అందులో నీవు ఏమేమి చేసినది? అనుభవించినది ఇవి అయితే నీ ఒక జన్మలోని కర్మలు లెక్కించబడినవి. నాల్గుగనులయందు నాలుకు రకములగు రూపములలో విభిన్న యోనుల యందు తిరుగు చుండును. నీవు ఇప్పటికి మనస్సునందు ఆలోచించకవున్నావు. నీకు ఇటువంటి కర్మలు చేయకూడదు. ఇందువలన ఇన్ని రూపములలో దారితప్పి తిరగవలసి వచ్చినది. నీవు నేడు ఆలోచించుము. విషయ వాసనా రూపమయిన విరాకములను త్యజించి, భక్తులకు సుఖమును కల్గించు రాముని భజన చేయుము. ఆ రాముడు ఈ అగమ్యమైన, అపారమైన ప్రపంచమను సాగరమును (భవసాగరమును) దాటించు పడవ నీవు ఇటువంటి సుదర్శన చక్రధరుని దేవతలకు స్వామి, రాముని భజన చేయుము. వారు కారణము లేకయే కరుణ చూపెట్టును. ఉదారుడు, అపారమైన మాయా బంధనము నుండి ముక్తిని కల్గించువాడు. వారు స్వర్గమునకు యజమాని. లోకమునకు యజమాని లక్ష్మీపతి. జీవులకు యజమాని. వాటికి ముక్తిని కల్గించువాడు.

10) రాముని భక్తి సులభము. సుఖమును కల్గించునది. అది జగత్తులోని మూడు తాపములను (దైహిక, దైవిక, భౌతిక) శోకమును, భయమును తొలగించునది. అయినా భక్తుల, సాధువుల, సత్సంగము లేకయే భక్తి లభించదు. భగవంతుని కృపతో లభించెదరు. దీనులయెడ దయగల రాముని కృపవలననే లభించుదురు. వాని స్పర్శ, దర్శనము, సేవ చేయుటవలన వారి దగ్గర వుండి జీవితము గడపుట వలన పాపసమూహములు వినష్టమగును. వారు లభించుటవలన సుఖము దుఃఖము ఒకే మాదిరి యుండును. నిరహంకారుడగును.

జ్ఞానము కల్గుటవలన మదము, మోహము, లోభము, విషాదము, క్రోధము మొదలగు దుర్గుణములు సులభముగా దూరమగును. వ్యక్తి వైరాగ్యమును పొందును.

11) సాధువుల సేవ చేయుటవలన రాగద్వేషాది భయములు తొలగిపోవును. రఘువీరుడగు రాముని చరణముల యందు ప్రీతి కల్గును. శరీరమున ఉత్పన్నమగు అన్ని దుర్గుణములన్నియు నష్టమగును. తదుపరి ఆత్మస్వరూపము ఎడ అనురక్తి పెంపొందును. ఆత్మ స్వరూపమున అనురక్తి పెరుగుట వలన ఈ ప్రపంచము కొంత విలక్షణముగా నుండును. అనగా ప్రపంచము ఎడ భక్తుల హృదయమున సంతోషము, సమత్వము, శాంతి భావములు వ్యాపించియుండును. శరీర ధర్మము ఇంద్రియముల ఆకర్షణలచేత పూర్తిగా విముక్తమగును. అనగా ప్రపంచము ఆకర్షణలు తన ప్రక్కకు ఆకర్షింపచేయుటలో అసమర్థులయి యుండును. అతడు పూర్తిగా జితేంద్రియుడగును. అతడు నిర్మలుడు, రోగరహితుడు, సమరసుడు అగును. అతనిపైన సుఖ-దుఃఖముల ప్రభావము వుండదు. అతని పరిస్థితి ఇట్లు అగును. అతడు ముల్లోకములను పవిత్రము చేయువాడుగా అగును. లేక ముల్లోకములయందు పవిత్రునిగా భావించబడును.

12) ఏ వ్యక్తి అయినా ఆ మార్గమున మనస్సు వుంచి ప్రయాణము చేయునో భగవంతుడు అతనికి సహాయకుడుగా ఎందుకు వుండడు? అనగా తప్పక సహాయమును చేయును. సాధువులు (భక్తులు) చూపించిన మార్గమున అతనికి సర్వ సుఖములు లభించును. అతడు భగవంతుని కృపవలన సదా సుఖమును పొందును. ప్రపంచమున ఏ విధమైన ఆశను కల్గియుండడు. అతడు స్వప్నములో కూడ ద్వైత భావము బాధించదు. చెప్పవలనంటే కోట్ల విషయములున్నవి. అవి ఎవరు చెప్పగలరు? భావము ఏమనగా భవజగత్తునుండి ముక్తి పొందవలెనన్న ఇదియే మూలమంత్రము. అన్యమగు విషయములు వ్యర్థము. బ్రాహ్మణులు, దేవతలు, గురువు, భగవంతుడు, భక్తుల సహాయము లేకయే ఈ భవసాగరమును దాటలేము. ఇది తెలుసుకొని తులసీదాసు దుఃఖమును తొలగించు లక్ష్మీపతి భగవంతుని గుణములను గానము చేయుచున్నాను.

(ఈ గేయములయందు జీవుని సంపూర్ణదశ (స్థితి) గర్భావస్థ నుండి వృద్ధావస్థ వరకు వర్ణించబడినది.)

93. ఎవరిపైన కృపాసాగరుడగు రఘురామ్ముని (రఘుపతి) కృప వుండునో ఇతరులు ద్వేషించిన ఏమియును హానికలుగదు. భక్తునికి కించిత్ హాని కూడ కలుగదు. ఇటుల చేయుటకు ఎవరైన కోటి ఉపాయములు చేసినను, నీచుడు, సాధువు మరణము కోరును. ఆ దుష్టుడు స్వయముగా ఆమరణమునకు గురి అగును. వేదముల యందు ప్రసిద్ధమయిన ప్రహ్లాదుని కథవిని భక్తి మార్గమున ప్రయాణము చేయని వారెవరుందురు? హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని చంప ప్రయత్నించెను. కాని నరసింహుని చేతుల్లో స్వయముగా చనిపోయెను.

భగవంతుడు గజరాజును రక్షించెను మసలి నుండి. విభీషణుని రాజుగా చేసెను. ధృవునికి స్థిరమైన పదవి ఇచ్చెను. అతడు కొంచెము కూడ తన స్థానము నుండి కదలడు. అంబరీషునికి ఇచ్చిన శాపమును స్మరించి దుర్వాసుడు నేటికిని గ్లానితో కరగిపోవు చున్నాడు. దుర్యోధనుడు చేయని కుకర్మకు అంతే లేదు. కాని మూర్ఖుడు తన అహంకారమున జ్వలించుచుండెను. భగవంతుని కృప చేతనే భాగ్యము, విజయము పొంది యశము పాండవులే జబర్‌దస్తీగా పొందిరి. ఎవడైనా ఇతరులను చంపుటకు బావి (గుంత) త్రవ్విన, ఆ దుష్టుడే, ఆ బావిలో పడి చనిపోవును. చెడపకురా చెడేవు. భక్తులకు ద్రోహము చేసినవానికి కలలో కూడా సుఖము లభించదు. అతనికి కల్పవృక్షమున కూడ చేదుగల విషఫలములే కాయును. అనగా అతని ఏ పనియు, కోరికయు నెరవేరదు రెండు సిరస్సులు (తలలు) గలవాడు ఎవడుండును? భక్తుల ప్రదేశమున జబర్‌దస్తీగా పర్యటించగలడు? తులసీదాసు చెప్పుచున్నాడు, రఘువీరుడగు రాముని భుజబలముపై భరోసా (అధారము) గలదో వానికి సదా భయము వుండదు. ఎవరికిని దేనికిని భయపడడు.

(భక్తుల వద్దకు వెళ్ళి ఆపదను కల్గించు వాడు ఎవరు వుండడు).

94. ఓ రామా! ఓ నాధా! ఎప్పుడైనా నీకర కమలములను, నాతలపైన వుంచారా? ఆ హస్తములతో దుఃఖములోనున్న భక్తులకు అభయ దాన మొసంగితివి. వివశుల ఒకే సారి నీ నామస్మరణము చేసిరి. (ఇక్కడ గజ అజామిలుని విషయము). నీవు కమలముల కంటె కోమలమైన నీ హస్తములతో నీవు శివధనస్సు విరచి రాజగు జనకుని సందేహ నివృత్తి తొలగించితివి. నీ కరకమలముల చేత మిక్కిలి ప్రేమతో నా వికుని (గుహుని) లేవనెత్తి సోదరుని వలె ఆలింగనము చేసికొంటివి. ఓ దయానిధి! నీకరకమలములచేత (గద్దయ గుటాయువుకు పిండ దానము చేసి దాని అంతయు కర్మలు చేసి) దానిని నీ లోకమున గల వైకుంఠమునకు పంపితివి. నీ చేతులతోనే నీవు వాలిని వధించి - సుగ్రీవునిని వానరరాజుగా చేసితివి. రావణుని చేత భయభీతుడైన విభీషణుడు నీ శరణుజొచ్చెను. అప్పుడు నీ కరకమలముల చేత అతనిని లంకకు రాజుగా చేసితివి. నీ హస్తముల దనుర్బాణములవట్టి రాక్షసులను చంపి దేవతలకు అభయ దానమిచ్చితివి. నీ హస్తములు సుఖమనెడి నీడను ఇచ్చును. శీతల ఛాయ అది. పాపములు, కష్టములు మాయను నాశనము చేయును. తులసీదాసు రాత్రింబవళ్ళు అది మీ కరకమలముల శీతల ఛాయను కోరుచున్నాడు.

95. నీ దీనుల ఎడ దయగలవాడా! ఈ ప్రపంచము పాపము, దరిద్రము, దుఃఖములతో అసహన తాపమున కాలిపోవుచున్నది. ఓదేవా! ఈ దుఃఖములోనున్న తులసీదాసు నీ ద్వారము దగ్గర నిలబడి నిన్ను పిలుచుచున్నాడు. అందరికి అన్ని రకముల దుఃఖములు తొలగిపోవుచున్నవి. నష్టమయినవి. ప్రభువే స్వయముగా ఇటు చెప్పెను. బ్రాహ్మణుడు సాక్షాత్ నా రూపమే. కాని ఈ కలియుగమున ఈ బ్రాహ్మణుల స్థితి యిలా ఉన్నది. వీరి బుద్ధిని క్రోధమును, రాగము, మోహము, మదము, లోభము దురాశ అనునవి మ్రింగినవి.

బ్రాహ్మణుల తరువాత సమాజమున క్షత్రియుల స్థానము వచ్చును. వీరి పరిస్థితి ఇటులవున్న-రాజు-సమాజము. రాజు - అతని అధికార గణము అత్యాచారములు చేయుచున్నారు. వీరు నిత్యం కల్పనచేసి కోట్ల కొలది కఠోరమైన పాపములను చేయుచున్నారు. అనగా క్షత్రియులు సమాజమునందు కఠోరమైన పాపములు చేయుచూ క్రొత్త క్రొత్త చెడు ఉపాయములను అమలు పరచుచున్నారు. అనగా క్షత్రియులు సమాజమును పీడించుటకు కొత్త పద్ధతులను నిత్యము నేర్చుకొనుచూ వాటిని స్వీకరించుచూ పాపములను చేయుటలో మిక్కిలి ఎక్కువగా జొరపడి చేయుచున్నారు. తర్కవాదము అనగా నాస్తికవాదము నీతి, విశ్వాసము, ప్రేమ, ధర్మ మర్యాదను, కుల మర్యాదలను అన్ని మంచి అంశములను వెతికి వెతికి బలవంతముగా నష్టము కల్గించుచున్నారు. ప్రపంచమున ఆశ్రయ వర్గములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర ధర్మము లోకము, వేదములు అన్నీ కూడా మర్యాదులు. అన్ని వినష్టమయినవి. అనగా ఈ మర్యాదలను ఎవ్వరూ పాటించుటలేదు. వీటి అన్నిటి ఫలితము ఏమనగా ప్రజలు పతనమయినారు. బూటకము, పాపముల యందు మునుగుచున్నారు. అందరూ తమ రంగాలలో మత్తు కల్గియున్నారు. శాంతి, సత్యము, మంచి విపయములు (పద్ధతులు) కరిగి (తగ్గి) పోయినవి. చెడు బూటకములతో కూడిన పద్ధతులు కపటమనే వెల్ల అందరిపైన పూయబడినది. అనగా అందరూ దురాచారముల, కపటముల వారు అయిరి. సాధు - సంత్ (భక్తులు) దుఃఖముతోనున్నారు. సజ్జనత్వము దుఃఖములో సదా నిమ్మగ్నమయినది. దుష్ట ఆనందమును పొందుచున్నారు. దౌష్ట్యము మిక్కిలి సంతోషమును కల్గివున్నది. పరమార్థము అనర్థములో పరివర్తనమయినది. అనగా ధర్మమును అజులు తన స్వార్థమును నిరూపించుకొనుటకు సాధనముగా చేసుకొన్నారు. జంత్రము, మంత్రము, యోగము, సాధన మొదలగునవి ప్రభావ హీనమైనవి. సిద్ధి, సారము లభించుట లేదు అనగా సిద్ధులు సారములేక పోయినవి. వాటిని సాధించుటకు ప్రయత్నము చేయుటలేదు. కామధేను రూపియగు భూమి కలియుగము అను కటిక నేల చేతిలో పడి వివశత్వముతో వ్యాకులపడుచున్నది. అందులో వేసిన విత్తనము, పుట్టుట లేదు. పొలము, వ్యవసాయమును అంతయును నాశనమగుచున్నది.

నేను కలియుగము యొక్క కృత్యములను ఎంతవరకు అని వర్ణింతును. పనిలేని పని అనగా నిరుపయోగమగు పనిచేయుచూ తిరుగుచున్నాడు. ఆపైన కూడా సంతోషము కల్గుటలేదు. క్రోధమున దంతములు కొరికి సదా చేతులు పులుము కొంటూవున్నాడు. ఇతని మనస్సులో ఏమి నిర్ణయించుకొన్నాడో తెలియదు. ఓ ప్రభూ! నీవు నీశీతలమైన స్వభావము చేత ఏదో ఒక విధముగా ఇతనిని బలహీనపరచుచున్నావు. అటులనే సిరస్సుకు ఎక్కు గర్వముతో పోవు చున్నాడు. ఇందువలన నీవు కోపముతో అతనికి వ్రేలు చూపుచూ కొద్దిగా మందలించుము. ఇతడు మరల అలా చేయడు. వ్రేలు చూపిన వెంటనే సొరకాయ ఫలము అంకురమువలె వెంటనే వాడిపోవును. మరల అల్లరి చేయడు. (విశ్వాసము ఏమనగా వేలు చూపిన ఏ ఫలమైన అంకురము వాడిపోవును.) బలిచేత నీకు ఈ పృధ్వితో సంబంధము వున్నది. ఇతని పరిస్థితిని చూచి, న్యాయమును చేయుము, లేనిచో ఈ పృధ్వి

ఆనందము, మంగళము (శుభము) లేక ఖాళీ అగును. అనగా పృధ్వి యొక్క ఆనందము, మంగళము అంతయు నష్టము అగుచున్నది. ఇటుల చేసిన ప్రజలు సౌభాగ్యవంతులు అగుదురు. రాముడు మాపైన కృపాదృష్టి పెట్టినాడు. అనగా సంపూర్తిగా కృప చూపెట్టెను.

నా ఈ ప్రార్థన విని భగవంతుడు ఆనందముతో నవ్వెను. ఆయన కరుణాజలముతో పృధ్విని తడిపెను. పృధ్విని తడిపెను, ఆహ్లాదితము చేసెను. (నీటితో నవ్వించెను) లోకమంతట రామరాజ్యము వ్యాపించినది. శుభశకునములు కనపడెను. ఎందుకనగా రాజగు రామచంద్రుడు, జగత్తును జయించినవాడు. భావము ఏమనగా జగత్తును జయించిన రాముని ఎదుటనే ఆ యుగము పరాజయము పొందెను. పృధ్వి అంతయు ఆనందమున శుభములతో నిండినది. ఇటులచేసి సమర్థమయిన, చతురుడనగా, సజ్జనుడుగా రాముడు పుష్పముల హారతులతో సైన్యములను గెలిపించెను. పాపములు నశించినవి. పుణ్యములు విజయము నొందెను. మంచి భక్తులు స్వభావము ప్రకారము మిక్కిలి ఆదరముతో రాముని ప్రశంసింపసాగిరి. అనాయాసముగా (సులభముగా) అనగా విశేషమేమన పరిశ్రమ లేకయే మొత్తము కష్టములను తొలగించెను.

ఓ రామా! నీ ఈ యశము ప్రాకుతూ పోయినది. వినష్టము అయిన వారిని మరల ఉద్ధరించెదవు. (సుగ్రీవునికి విభీషణునికి రాజ్యము యిప్పించితివి) వినష్టమయిన వారిని మరలా ఉద్ధరించి వారి వస్తువులను వారికి మరలా యిప్పించెదవు. తులసీదాసు చెప్పుచున్నాడు :- దుఃఖితుల దుఃఖములను తొలగించు దేవుడు ఎంతోమందికి అభయమిచ్చి నీ శరణులోనికి తీసుకొన్నావు. అనగా ఎవరైనా అతని శరణుజొచ్చిన ఆయన అతనికి అభయదానమిచ్చెను.

(తులసీదాసు లోకపక్షమును చూపెట్టెను. లోక కల్యాణ భావనను ప్రదర్శించెను.)

96. ఓ దురదృష్టమైన మానవుడా! ఈ ప్రపంచమున నరక రూపమయి జీవించుచున్నావు. అనగా నరకములోని యాతనలు పొందుచున్నావు. ఈ ప్రపంచమున వచ్చిపోవుట అనుదాని నుండి ముక్తి కల్గించుటకు అనువగు భగవంతుని చరణముల నుండి విముఖుడవు అయితివి. అనగా భగవంతుని చరణములను ప్రేమించుట లేదు. ఇటువంటి వారు దుష్టబుద్ధిగలవారు, మలినులు, వేదముల ద్వారా, చెప్పబడిన మార్గమును వదలి పాప మార్గమున వెళ్ళే వారులుగా అయినారు. వారు సత్సంగముచేయరు. భగవంతుని భజన చేయరు. రాముని కథ వినుటలో అభిరుచి లేదు. వారు భార్యాబిడ్డలు, ధనము, గృహము మొదలగు మమత (మోహము) అను రాత్రిలో పడి నిద్రించుచూ వుందురు. సదా ఇందులోనే మోహితులయి, బంధింపబడి, అజ్ఞానులై యుందురు. వారు సదా ఇందులోనే నిమగ్నులయి ఉందురు. అందువలన వారికి జ్ఞానము కల్గదు. తులసీదాసు చెప్పుచున్నాడు. ఈ దుష్టులు భగవంతుని నామామృతము త్యజించి, హఠముతో విషపూరితమైన విషమును అడిగి అడిగి త్రాగుచున్నారు. అనగా విషయవాసనలయందు లిప్తులయి (అంటుకొని)

వున్నారు. అవి విషమువలె హాని కల్గించును. ఇటువంటి మనుష్యులు పంది, కుక్క, నక్కలు సమానముగా కేవలము ప్రసవ కాలమున తమ తల్లులకు బాధ కల్గించుటకు జన్మించుచున్నారు. అనగా వీరు జన్మించుట వలన వీరి తల్లులకు దుఃఖము కల్గుచున్నది. ఇదియే కాక జీవితము యొక్క మహిమ ఏమియుండదు.

97. ఓ రఘువంశ నాయకా రామచంద్రా! నేను ఏ విధముగా నిన్ను ప్రార్థించుదును? నా అనేక పాపములనుచూచి, నీ నామము పాపరహితము అని విని భయభీతుడనగుచున్నాను. అనగా ఎవరికి పాపముతో సంబంధముండదో, నా ఇటువంటి పాపిని ఉద్ధరించుటకు దూరముగా నుండుదురు. అతనికి ఇంకను దండన కల్గించెదరు. ఇది ఆలోచించి భయభీతుడనగుచున్నాను. పరుల దుఃఖమును చూచి దుఃఃతుడగుట, సుఖమును చూచి సుఖముతో నుండుట జ్ఞానుల యొక్క ఈ శీల స్వభావమును నేను నా హృదయమున పొందు పరుచుకొనలేదు. నా స్వభావము ఇది. ఇతరుల దుఃఖమును చూచి పరమానందము కల్గుచున్నది. ఇతరుల సంపద చూచి అగ్ని లేకయే ఈర్ష్యాగ్ని చేత నేను మండిపడుచున్నాను.

భక్తి, వైరాగ్యము, జ్ఞానము మొదలగు సాధనముల ఉపదేశములను ఇచ్చి ఇచ్చి అనేకులగు దీనులను మోసగించుచూ తిరుగుచున్నాను. నా నామము శివునికి సర్వస్వము. సుఖమునకు కేంద్రము. దానిని అమ్మి-అమ్మి నేను నా పొట్టకుగాను (అది నరకమునకు తీసుకొని పోవును) నింపుచూ వున్నాను. అనగా నేను నీ పవిత్రమైన పేరుచాటున లోకమును మోసగించి, నా పాపపు పొట్ట నింపుకొనుచున్నాను. నా మనస్సులో ఇది తెలియును - నేను నీకు సరియగు భక్తుని కాక మోసగాడిని, దుష్టున్ని, నా పాపములు సముద్రము వలె అనంతమయినవి. భయంకరముగా నున్నవి. ఒక బిందువుకు సమానమగు తుచ్ఛ మాత్రమున కూడ కించింత్ మాత్రము కూడా నా పాపములను పేర్కొనుట లేదు. నేను వింటూనే చెప్పెడి వానితో కలహించుచున్నాను. ఇతరుల దుమ్ము కణముతో చిన్న తుచ్ఛమైన అవగుణములను కొండంతగా విశాలము చేసి వర్ణించుచున్నాను. వారి పర్వతములవలె విశాలమగు గుణములను ధూళికణములకంటె తుచ్ఛముగా నిరూపణ చేసి వాటిని అగౌరవ పరచుచున్నాను. అనగా ఇతరుల గుణములను మిక్కిలి తుచ్ఛముగా, అవగుణములను గొప్పగా గోరంతను కొండంతలు చేసి చెప్పుచున్నాను.

నేను అనేక విధములగు వేషములను ధరించి అనగా అనేక రకములగు మోసములు రచించి రాత్రింబవల్లు వశములో నుండునట్లు, ఇతరుల ధనమును అక్రమించి సంపాదించుచున్నాను. కాని ఒక క్షణము కూడా స్థిర (శాంతుడునయి)ముగా ప్రేమతో భగవంతుని చరణ కమలమును స్మరించలేదు. ఓ భగవంతుడా! ఒక వేళ నీవు నా ఆచరణములను శ్రద్ధతో చూచిన, నాకు కోట్లకొలది కల్పములవరకు నరకము అను అగ్నిలో కాలి ఉడికి చనిపోవలసియున్నది. భయంకరమైన నరక యాతనలు ఓర్చుకొనవలసి యుండును. ఎందుకనగా నా ఆచరణలు భయంకర రూపమున పరిపూర్ణమయి వున్నవి.

అయినా ఓ దేవుడా! ఒకవేళ నన్ను ఒక దఫా కృపాదృష్టితో చూచినచో నేను ఈ భవసాగరమును ఆవు గిట్టలవలె, శ్రమలేకుండ అధిగమించ (దాట)గలను. అనగా ప్రయాస లేకయే నాకు ముక్తి కలుగును.

ఇందులో మనస్తత్వము ప్రకారము వివేచన చేసి రాముని కృపను యాచించడమైనది. భక్తులను రామభక్తులుగా, దుష్టులను తులనాత్మకముగా వర్ణించెను. శివుడు రామనామ మహిమను పార్వతికి చెప్పెను. కపటులు రామనామము చాటున పొట్టపోసుకొనుచున్నారు.

98. ఓ కృపాసాగరా! రామ! నాకు మిక్కిలి సంకోచము కల్గుచున్నది. నేను ఏ విధముగా నా మనవి వినిపించవలెను. నేను పనులన్నియు ధర్మవిరుద్ధముగా చేయుచున్నాను. ఓ నాథా! నేను మీకు మంచి వానిని ఎట్లు అగుదును? భగవంతుడు జడచేతనముల యందు అంతటా వ్యాపించియున్నాడు. సర్వవ్యాప్తి అయినా హఠముతో వాటి పక్క కన్నెతి కూడా చూడలేదు. నేను నా నేత్రములను మిడుతలను యువతి అను దీపపు వెలుతురు ప్రక్కకు అగ్నిలో కాలుటకు పంపుచున్నాను. అనగా నా నేత్రములు మిడతలవలె అగ్ని రేఖ ప్రక్కకు ఆకర్షింపబడి, అందులో కాలి చనిపోవుచున్నవి. ఇదే మాదిరి నా నేత్రములు యువతుల సౌందర్యము ప్రక్కకు ఆకర్షింపబడి అటు ప్రక్కకి చూచుచూ వున్నవి. భావము ఏమనగా నేను ఎల్లప్పుడు సుందరీమణుల దర్శనము చేసుకొనుచున్నాను. భగవంతుని ప్రక్కకు కన్నెత్తి కూడా చూడలేదు. నేను స్వయముగా తెలుసుకొనుచున్నాను. మన చెవులు పూర్ణమైన సార్థకత రామకథ వినుటలోనే వున్నది. కాని నేను నా చెవులతో వరుసగా ఇతరుల దోషములను వర్ణించుచూ వుండగా వినుచున్నాను. వానిని విని విని చెవులలో బంధించుకొని వున్నాను. భావము ఏమనగా ఇతరుల దోషముల వర్ణన వినుట నాకు ఇష్టమగుచున్నది. భావము ఏమనగా ఇతరుల దోషముల వర్ణన వినుట నాకు చాలా ఇష్టముగా వున్నది. మాటి మాటికి వానిని వినగోరుచున్నాను.

నేను నా నాలుక ద్వారా నీ గుణములను గానము చేయక శ్రమలేకయే సుఖమును సంపాదించుకొనుచున్నాను. నేను అదే నోటితో మండూకము వలె యితరుల నిందను వరుసగా (విశ్రాంతి లేక) వల్లించుచున్నాను. వాటిని వరుసగా వదిరినా జీవితమునకు హాని కల్గించు కొనుచున్నాను. నేను అందరికి ఇదే శిక్షణ ఇచ్చు చున్నాను. మన హృదయమును పూర్తిగా పరిశుద్ధము చేసుకొనవలెను. అప్పుడే అందులో భగవంతుడు వుండును. కాని నేను స్వయముగా నా హృదయమునందు అభిమానము (గర్వము) మోహము, మొదలగు దుష్ట సమూహమును సిద్ధము చేసుకొని వున్నాను. అనగా నేను చెప్పునది చేయునది అను విషయమున చాలా వ్యత్యాసమున్నది. నేను ఉపదేశములను చెప్పుచున్నాను. కాని నేను ఎల్లప్పుడు పాపకార్యములను చేయుచున్నాను. మానవ శరీరమును ధరించి భక్త జనులు భగవంతుని చరణముల యందు సాధన చేయుదురు. దానిని (శరీరమును) పొంది కూడా నేను - వ్యర్థముగా పోగొట్టు కొనుచున్నాను. ఇంటిలో బంగారు బిందెనిండా అమృతము నిండి వున్నది. నేను దానిని వదలి ఆకాశమున బావిని త్రవ్వుటకు ప్రయత్నించుచూ

తను అమృతము నిండి వున్నది. కాని దానిని వదలి నేను ప్రపంచములోని విషయ వాసనలతో తృప్తి పొందగోరుచున్నాను. ఆ సాధనము కొరకు తిరుగుచున్నాను. నేను ఈ విధముగా తృప్తిని చెందునట్టి పని వ్యర్థము వృధా అసంభవము. ఆకాశమున బావి త్రవ్వుటకు ప్రయత్నించుట.

నేను మనసా! వాచా! కర్మణా అనేక పాపములను చేసితిని. వాటిని ప్రయత్న పూర్వకముగా ఇతరులకు తెలియకుండ దాచి వుంచితిని. ఇతరులతో ప్రేరేపింపబడి, ఈర్ష్య వశమున స్వయముగా చిన్న మేలు పని చేసినాను. దానిని తప్పెట కొట్టి చాటించి చెప్పుచున్నాను. ఇతరులు శుభకార్యములను చేయుచున్నా చూచి ఈర్ష్యపడుచున్నాను. ఒక సాధారణమైన మంచిపనిని చేసినచో దానిని అందరి ఎదుట చెప్పుచూ తిరుగుచుందును. బ్రాహ్మణుల ఎడ ద్వేషములతో వ్యతిరేకించుట అనగా నా భాగమునకు వచ్చినట్లు బ్రాహ్మణులనే కాక, నేను బలవంతముగా అందరి ఎడ శత్రుత్వము పూనుచున్నాను. ఇంతయేగాక నా బుద్ధి చాతుర్యముతో ఇది నిరూపించ కోరితిని - అందరి భక్తులయందు నా పేరు లెక్కించకోరుచున్నాను. అనగా నా చాతుర్యము ద్వారా నేను గొప్ప భక్తుడనని నిరూపింప కోరితిని. ఓ ప్రభూ! ఒక వేళ నేను శేషనాగుని, సరస్వతిని, మొదలగువారిని సంతోష పరచి - వారితో నా దోషములు చెప్పిన - వారు వేయికల్పముల వరకు, నా దోషములను పూర్తిగా వర్ణించలేరు. నా దోషములు అసంఖ్యాకము అనంతమయినవి. మరలా నేను నా ఒక నోటితో నా ఆ దోషములను ఎటుల వర్ణించగలను?

ఒకవేళ ఎప్పుడైనా నేను చేసిన తప్పులు (దోషముల) ఆలోచించిన నీ శరణు పొందగలనా? అనగా ఎప్పటికి ప్రాప్తించుకొనలేను. భావము ఏమనగా నేను చాలా పాపాత్ముడను. ఎప్పటికిని భగవంతుని శరణు పొందుటకు యోగ్యుడను కాదు. కాలేను నేను మనస్సుకు ఎల్లప్పుడు ఇదే భరోసా కల్గించితిని. రాముని స్వభావము అతని శీలము అపరిమితము అనగా రాముడు తన ఈ స్వభావము శీలము కారణముతో నాపైన ఒకానొక నాడు తప్పక కృప చూపును. తులసీదాసు చెప్పుచున్నాడు. ఓ ప్రభూ! నాలో ఆ గుణములు లేవు. వాటి ద్వారా నేను స్వప్నములోనైనా అనగా ఎప్పట్కైనా నిన్ను సంతోష పరచుటలో సఫలుడనగుదును కాని ఇది ఆలోచించి, నా మనస్సుతో స్వాంతనము కల్గించుకొనుచున్నాను. భగవంతుని కృపకల్గిన వెంటనే ఈ ప్రపంచమనెడి సముద్రపు ఆవుగిట్టలవలెనే తుచ్ఛమగుచున్నది. అనగా భగవంతుని కృపకల్గిన ఈ భవసాగరమును చాలా సులభముగా దాటగలం.

(భగవంతుడు విశ్వము యొక్క అణువు అణువులోనున్నాడు. దుష్టుల గుణదోషములను వర్ణించెను.)

99. ఓ రామా! ఓ రఘువీరా! ఓ స్వామీ! వినుము. నా మనస్సు సదా అవినీతి పనులయందు లగ్నమయివున్నది. ఇది నీ చరణ కమలములను మరచి, రాత్రింబవల్లు

అటు-ఇటు దారి తప్పి తిరుగుచున్నది. అది వేదముల ఆజ్ఞను పాటించుట లేదు. ఎవరికిని భయపడకుండనున్నది. అనగా వేద మార్గమున నడవదు. పాపకర్మ చేయుటవలన దండనకు భయపడుటలేదు. ఈ మాదిరి అనేక దఫాలు కర్మఅనెడి గానుగయందు నువ్వులవలె నలగ ద్రొక్కుట జరిగినది. భావము ఏమనగా మనస్సు చెడ్డ కర్మ చేయుటవలన మాటిమాటికి విభిన్న యోనులయందు జన్మించవలసి వచ్చెను. కష్టములు అనుభవించవలసివచ్చినది. ప్రపంచములోని విషయ వాసనల మోహమున పడి ఆ కష్టములను మరచి పోయితిని. సత్సంగము వున్నచోట భగవంతుని కథవున్న చోట అక్కడ మరచి కూడ స్వప్నములో అదిరాదు. అనగా పవిత్ర కార్యములకు సదా దూరముగా నుండెను. ఎవడు అయితే లోభము, మోహము మదము, కామము, క్రోధము మొదలగు దుర్భావముల యందు మునిగి వుండును. ఇటువంటి మనుజులను ఇతడు బాగుగా ప్రేమించును. అనగా అటువంటివారి సాంగత్యమున నుండును.

ఇతరుల సద్గుణముల గురించి ద్వేషించి లోపల కుములుచుండును. ఇతరుల దోషములను విని సంతోషించును. అతడు స్వయముగా పాపముల నగరమును నిర్మించును. అనగా అనేకమైన భయంకరమగు పాపములు చేయును. ఇతరుల గృహములను అనగా సాధారణమైన పాపములను చేయుచుండును. అతని వెనుక పడి నల్దిశల చెడుపు చేయుచూ తిరుగుచుండును. తాను స్వయముగా మహాభయంకరమైన పాపి. నీ పేరు అన్ని సాధనముల ఫలము నిచ్చును. వేదముల జ్ఞానసారము. ఈ ప్రపంచమనె నదిని దాటుటకు నావ వంటిది. దానిని ఈ దుష్టుడు ఇతరుల చేతియందు ఒక చిల్లి గవ్వకు హరముగా అమ్మును (విక్రయించును) ధనమునకు బానిస అయివుండును. అనగా ధనము యొక్క దురాశచేత నల్దిశల రామనామ స్మరణ చేయుచూ ధనమును యాచించుచూ తిరుగుచుండెను. అనగా శుభకార్యము చేయు కోరికతో చెడు కోరికలు అనగా ఇంద్రియాసక్తమైన చెడ్డ భావనలు. కోపగించుకొని, నా మార్గమున భయంకరమైన బాధలు నిలబడి నన్ను అక్కడి నుండి పారద్రోలుచున్నవి. మరలా ప్రాపంచిక విషయ వాసనలయందు ఇరికించుచున్నది. నేను ఒక మాదిరి దీనున్ని, మలినమైన వానిని, మూర్ఖునిని, భయంకరమైన ఆపద వలలో ముట్టడింపబడి వున్నాను. ఆపైన ఓ కరుణానిధి! మానసికమైన ఈ భయంకరమైన దెబ్బను నేను సహించలేను. అనగానా మనస్సు చాలా ప్రబలమైనది. నన్ను మరచి దారిలో వెళ్ళనివ్వదు. చాలా దుఃఖములను కల్గించును. నేను ఈ నా మనస్సును వశములో వుంచుకొనుటకు అనేక రకములయిన ప్రయత్నములు చేయుచూ అలసి పోయితిని. ఇందువలన నేను నీతో మొదట చెప్పుచున్నాను. తులసీదాసు యొక్క ఈ దుఃఖము అప్పుడే తొలగును. నీవు నా హృదయములో నీడేరా వేయుటకు అనగా నీవే ఈ మనస్సును వశమున వుంచుకొని అతనిని నీ చరణముల యందు వుంచుకొందువు.

(శిథిల గ్రామమున కాలంతరమున క్రొత్త గ్రామములు వృద్ధి అగును. పురాతత్వ శాఖవారు ఇటువంటి గ్రామ స్థానములకు మహత్తును స్వీకరించెదరు.)

కాపాడు కొనుట. గౌరవము నిలుపుకొనుటకు) నీ శరణులోనికి ఎవరిని చేర్చుకొనలేదు. ఓ భగవంతుడా! నీవు ఏ కారణము లేకయే ప్రపంచములోని అన్ని బాధలను తొలగించువాడవు. వేదములు, సర్వ ప్రపంచములోని వారందరూ ఈ విషయమునే చెప్పుచున్నారు. అజామిలుడు నీచ బ్రాహ్మణుడు. మహాపాపాత్ముడు. పాపములకు కేంద్రము కాని యమదూతల ద్వారా యమయాతన కల్గినప్పుడు, తన కుమారుడగు నారాయణ పేరు నెపముతో స్మరించెను. నీపేరు స్మరించుట వలన యమలోకమునకు వెళ్ళకుండా రక్షించితివి. భయంకరమైన అపదనుండి కాపాడితిని. పశువులు, నీచులు, గర్వముగల సముద్రుడు, గజేంద్రునిని మకరము పట్టినప్పుడు, వాటిద్వారా నీ నామస్మరణ అయ్యెను. నీవు వెంటనే గరుడ వాహనము వదిలి, వెళ్ళి దానికి సహాయము చేయుటకు పరుగిడితివి. కాలి నడకనే వెళ్ళితివి. గజేంద్రుని హృదయములోని మర్మాంతకమైన బాధను తొలగించితివి. వ్యాసుడు (బోయ) వాల్మీకి, నిషాద రాజుగా గుహుడు, పింగళ అనుపేరుగల వేశ్య గణిక, గ్రద్ధ (జటాయువు) మొదలగు వారు అసంఖ్యాకమైన చెడ్డ గుణములకు మూలమై యున్నవారు. అనగా భయంకరమైన పాపాత్ములు అయినా ఓ రామా! నీవు కేవలము నాపేరు స్మరించినారను మాటున అందరి - అన్నింటి దుఃఖములను తొలగించితివి. భావము ఏమనగా వీరందరూ కేవలము రాముని పేరు స్మరించిరి. వారినందరిని ఉద్ధరించెను. ఇతర ఏ పుణ్యకార్యములు చేయలేదు. కేవలము రామనమ స్మరణ చేసిరి. అయినా పేరు ప్రతముననే వీరి ఉద్ధరణ జరిగినది. రఘుకుల రాజులపలో భూషణము వంటి ఓ రామా! నేను ఏ కర్మ అచరణ వలన వీరి కంటే తక్కువ వాడనో తెలుపుము. అనగా నేను కూడా వీరి వలెనే భయంకరమైన పాపాత్మున్ని. అయినా నేను (తులసీదాసు) రాత్రింబవల్లు అజ్ఞానమనెడి భయంకరమైన చీకటితో నిండిన బావిలో పడి కష్టములు అనుభవించుచున్నాను. భావము ఏమనగా అనేక మంది భయంకరమైన పాపాత్ములను కేవలము నీ పేరు స్మరించినంత మాత్రముననే తరింప చేసితివి. నేను వారికంటె తక్కువ పాపిని కాదు. నీ పేరు కూడ స్మరించుచున్నాను. నీవు నా అజ్ఞానమును దూరము చేసి (తొలగించి) నాకు ముక్తి ఎందుకు కల్గించరు?

101. ఓ కృపా సింధు! ఈ దీనుడు నీ ద్వారము వద్ద ఎందుకు న్యాయము పొందలేకవున్నాడు? నీ ప్రసిద్ధి ఏమనగా, ఎప్పుడైనా, ఎక్కడైనా దుఃఖములోనున్న వారు నిన్ను స్మరించిన, నీవు వారి దుఃఖమును తొలగించితివి. గజేంద్రుడు, ప్రహ్లాదుడు, పాండవులు, వానరుడగు సుగ్రీవుడు మొదలగు వారందరి శత్రురూపముననున్న అపదలను తొలగించితివి. అనగా వీరి శత్రువులను నాశనమును చేసి వారి దుఃఖములను దూరము చేసితివి. రావణుని భయము చేత అతని తమ్ముడగు విభీషణుడు వచ్చి నీకు ప్రణమిల్లెను (నమస్కరించెను). నీ శరణు జొచ్చెను. అప్పుడు నీవు లేచి నీ సోదరుడగు భరతునివలె విభీషణుని ఆలింగనము చేసుకొంటివి. నేను నీ నామస్మరణ చేసినా హృదయమున ఒక గ్రామము నిర్మించ కోరినాను. అందులో ఒకటి తరువాత ఒకటి నిదానముగా భజన, వివేకము, వైరాగ్యము,

మంచివారు. మొదలగునవి. వారిని తెచ్చి తెచ్చి నివసింప చేయుచున్నాను. ఇది చూచి దుష్టమైన కామము (కోరికలు) క్రోధితులు అగుచున్నారు. వచ్చి వారితో జబర్ దస్తీ చేయుచున్నారు. ఓ స్వామీ రామా! వీరు నిన్ను తొలగించి (నాశనము చేసి) అక్కడ స్త్రీలను, శత్రువులను, ధనము మొదలగు వాటిని వుండుటకు ప్రయత్నము చేయుచున్నారు. భావము ఏమనగా ప్రయత్నము చేసి శుభభావమును నా హృదయమునకు తెచ్చికొనుటకు మంచివారితో కలసి వుండుటకు నెమ్మది నెమ్మదిగా (నిదానముగా) ప్రయత్నము చేయుచున్నాను. కాని కామము మొదలగు దుష్ట భావనలు నా మనస్సుకు స్త్రీ, ధనము, శత్రుత్వము మొదలగు వాటి ప్రక్కకు తిప్పుటకు ప్రయత్నించుచున్నవి. వీటి ఆకర్షణ నా శుభమైన కోరికను స్థిరముగా నుండనిచ్చుట లేదు.

నేను సామ, దాన, భేద, దండో పాయముల మొదలగు అనేక ఉపాయములతో ప్రయత్నించి ఓడిపోయితిని. కాని ఈ దౌష్ట్యములు వినుటలేదు. కారణము లేకయే కల్పించుకొని చాలా దుఃఖములను కల్గించుచూ వున్నవి. అనగా కారణము లేకయే పీడించుచున్నవి. ఇందువలన స్పష్టముగా నీవు న్యాయము చేయమని నిన్ను కోరుచున్నాను. ఒకవేళ నన్నే ఎందుకు న్యాయమని అడుగుచున్నావన్నావని అడగవచ్చు నీవు. ఇతర దేవీ దేవతలకు ఫిర్యాదు చేయను. ఎందుకు? అంటే దానికి కారణము ఇతర దేవతలందరు స్వార్థపరులు, అసమర్థులు, అయోగ్యులు, నిష్ఠురులు, దయలేనివారు. ఇందువలన ఓ రామా! ఇప్పుడు నేను ఎక్కడికి పోవలయును? ఈ ప్రపంచములోని నా బాధలను పోగొట్టువారు ఇతరులు ఎవరున్నారు? తులసీదాసు చెప్పుచున్నాడు.ఓ రామా! ఒకవేళ నేను నీచుడను అయినప్పటికి నేను నీవానినే. ఇతరులకెవ్వరికిని భక్తున్ని కాదు. ఒకసారి భక్తి అనెడి హస్తమును పట్టుకొన్నాను. అప్పుడు నా గ్రామము ఏ విధమయిన ఆటంకము లేకుండ బాగుగా నిర్మింపచేసుకొందును. భావము ఏమనగా భగవంతుని భక్తి ద్వారానే హృదయమున జ్ఞానము, వివేకము, వైరాగ్యము మొదలగు శుభ భావనలు స్థాపింపబడును. కామ, క్రోధాది దుర్భావముల వినాశనము సంభవమగును. ఇతర ఏ సాధనము లేదు.

(రాముని శీలము ఎడ సంకేతము చేయడమైనది.)

102. ఓ రామా! నేను ఈ విధముగా దాసుడ కాగోరుచున్నాను. కారణమేమనగా ఈ ప్రపంచమునందు అందరు తమ తమ యాజమాన్యము స్థాపింపగోరుచున్నారు. అందరినీ కుతూహలముగా ఈ కలియుగము యొక్క విషాక్త ప్రభావమున నా ఇంద్రియములు నన్ను బానిసగా వుంచుకొనుటకు ప్రయత్నములో వున్నవి. నన్ను ప్రాపంచిక విషయ వాసనలయందు చిక్కుకొనునట్లు చేయును. ఇందువలన దిగులుపడి నీ శరణు జొచ్చితిని.

నన్ను కలియుగము. కర్మ, ఇంద్రియముల విభిన్న విషయ వాసనలనెడి కొనుగోలుదారులు చుట్టుముట్టి యున్నారు. అనగా వారందరు నన్ను తమ బానిసగా చేసుకొనుటకు ప్రయత్నించుచున్నారు. నేను వీటికి అమ్ముడు పోవుటకు ఇష్టపడక పోయిన నన్ను బలవంతముగా బంధించి, నన్ను బాగుగా ఎక్కువ వెలపెట్టెదరు. అనగా నాకు చాలా

దురాశ కల్గించెదరు. ఓ రామా! నీపేరు బంధనము నుండి ముక్తిని కలిగించునది. నీ కీర్తి చాలా గొప్పది. ఇందువలన నేను ఎప్పుడైతే వీటితో చెప్పితిని. నేను మాత్రము రామునికి దాసుడను కాగోరుచున్నాను. వీరు నాఎడ కపటమగు ప్రేమను చూపించుచూ నన్ను స్వయముగా తమ హృదయములో నుండమని ఆజ్ఞను తెలుపుటకు పట్టుదల చూపసాగెను. భావము ఏమనగా ఒక వేళ వీటి చేతికి అమ్ముడు పోవుటకు సిద్ధముగా లేకపోయిన కనీసము వీటికి తన హృదయమున స్థానము ఇచ్చుటకు నాకు భయము కలుగుచున్నది. ఇవి ఒకసారి హృదయమున చొచ్చుకొని వచ్చిన, మరల వెడలిపోవు ఎందుకనగా ఇవి కపటము గలవి.

నేను నీపేరు చాటును చేసుకొని బ్రతికి వున్నాను. అనగా అవి నాపైన అధికారమును స్థాపింపలేక పోయెను. ఇప్పుడు కలియుగము, నన్ను చాలా పీడించుచున్నది. ఇప్పుడు నీవు ఈ పేద భక్తున్ని రక్షించుము. లేనిచో మరలా వెదకిననూ ఎక్కడ చిరునామా వుండదు. అనగా కలియుగము నన్ను తినివేయును. ఓ దయగల ప్రభూ! నీ కౌతుకము ద్వారా కొంగకు, కుక్కకు న్యాయము చేసితివి. ఇప్పుడు అదే కుతూహలముతో చర్యతీసుకొని తులసీదాసు నా వాడు అని చెప్పిన నాకు వారితో సంబంధము తెగిపోవును.

103. ఓ కృపాసింధు! నేను ఇందువలన నా మనస్సున నిరుత్సాహముగా మౌనముతో వున్నాను. అనగా పాప కర్మల విషయము కూడ చెప్పుట లేదు. నా తొడ చరసిన నా గౌరవము పోవును. నేను చెప్పుటకు ఒగ్గుపడుచున్నాను. (పడవలసివచ్చినది). నా వాసనలు మొదలగునవి నా వెంటనున్నవి. తియ్య తియ్యని మాటలు మాట్లాడుచున్నవి. మరి రెండవ ప్రక్క నన్ను చంపకోరుచున్నవి. అనగా కపట స్నేహితులు. నేను లేకపోతే వుండలేవు. తోడుగా వుండ మోసము చేసి చేసి నా హృదయమును కాల్చుచున్నవి. అవి నా హృదయమున నివసించుచున్నవి. నా హితమును కోరునవి. ఇది తెలుసుకొని నేను వాటి కోరికలను పూర్తి చేసితిని. ఇవి చెప్పుటవలన ప్రపంచములోని విషయ భోగము నన్ను అనురక్తునిగా వుంచెను. అయినా ఈ దుష్ట, చెడు కర్మలను చేయునవియై యున్న, కపటముగలవి గానము చేయు కర్రగా వుంచుకొన్నవి. గానము చేయువారు కర్రలో గజ్జలు కట్టుకొని కర్రను వుంచుకొని యుందురు. తమ మిత్రులను గానమునకు అనుకూలముగా నాట్యము చేయుటకు వుందురు. అదేమాదిరి వీరు (ఇవి) నన్ను కర్రను చేసుకొని నా మనస్సును ఆడించుచూ వున్నారు. అనగా నా మనస్సు ఇంద్రియము సైగ మేరకు నృత్యము చేయును. నటించును.

వీరు తమ ఇష్టానుసారము చేయుచున్నారు. కర్మలు ఇవి చేయును. నేను ఇంతవరకు వినలేదు. చూడలేదు. ఇటువంటి పనులు వాటిచెడు అంత నాతలపైన పడుచున్నది. అనగా కామ, క్రోధము మొదలగునవి నా మనస్సును వశములో వుంచుకొని, వానితో చెడు కర్మలు చేయించుచున్నవి. వాటి ఫలితము అనుభవించవలసి వచ్చినది. జీవునికి ఇది మాటి మాటికి జన్మ మరణముల బాధను అనుభవించుకొనవలసి వచ్చును. ఇవి అన్నియు

అన్యాయము గలసి అజ్ఞానమున పడి కనపడక వున్నవి. (భావనలు శరీరము లేనివి). కాని వీటిని వదలుట లేదు. వుండలేవు. ఓ ప్రభూ! నేను ఈ (సందేహమున) సందిగ్ధావస్థలో వున్నాను. వీటిని వదలవలయునా? లేక లేదా? ఇందువలన ఈ సందేహమున ముక్తుడనగుటకు ఒకే ఒక ఉపాయము వున్నది. నీవు హస్తమను పట్టుకొనుము. నా సహాయము చేయుము. నేను నిన్ను ఆపదనుండే కాపాడువాడని ప్రశంసించెదను. నీ ఒకసారి (ధఫా) ఈ దాసుని చూచినంత మాత్రముననే నా దుర్దశ తెలియును. నీవు ఒకసారి చూచిన వెంటనే తులసీదాసు ఆపద తొలగిపోవును.

(శరీరములోని భావములకు మానవీయ విధానము చేసెను. ఇంద్రియముల వశమున జీవుని దుర్దశ ఎంతో నేర్పుతో తులసీదాసు చిత్రించెను).

104. ఓ రఘువీరా! ఓ స్వామీ! నేను ఏ ముఖముతో నీకు చెప్పుదును? ఓ నాథా! నీ శరణు కోరుతున్నాను. నేను నా పనులను చక్కగా తెలుసుకొన్నాను. సంకోచముతో చస్తున్నాను. అనగా నేను ఏ ఒక మంచి పని చేయలేదు. అందువలన దాని ఆధారము నన్ను ఉద్ధరించమని కోరుటకు మనస్సు రాలేదు. నీవు సేవ చేసిన వారి వశమున వుందువు. స్మరించిన సఖుడవు అయ్యేదవు. శరణుజొచ్చిన వారికి ప్రత్యక్షము అయి దర్శనము ఇచ్చెదవు. అయినా ఓ రామా! నేను నీ అసంఖ్యాకమగు గుణముల స్మరించను. అనగా వాటి తరపున ధ్యానము వుంచలేదు. అనగా వాటిని గమనించలేదు. నీవు కృపాసాగరుడవు. దీనబంధువు. దుఃఖములోనున్న వారికి శుభములను కల్గింతువు. శరణుజొచ్చిన వారిని రక్షించెదవని నీకు కీర్తి వున్నది. నేను నీ కీర్తినివిని తెలుసుకొని కూడా విస్మరించితిని.

నేను మాత్రము నీ సేవ చేయలేదు. నేను నిన్ను ధ్యానించలేదు. నీ స్మరణ చేసి నీ చరణామృతము అందమైన ప్రీతిని పొందలేదు. అనగా చెడు కర్మలు చేసి నా జీవితమును చెడగొట్టుకొన్నాను. రాముని వంటి మంచి స్వామిని పొంది కూడా నా శక్తినంతటిని చెడగొట్టుకొన్నాను. అనగా చెడు కర్మలు చేసి జీవితమును చెడగొట్టు కొన్నాము. ఓ నాథా! నీవు పేదలపైన దయచూపు వాడవు అయినా నేను ఎప్పుడును పేదరికమును స్వీకరించలేదు. అనగా నా అహంకారమున ఎప్పటికిని పేదవానిగా భావించలేదు. ఇందువలన ఓ ప్రభూ! నేను పేదవానిగా అయివుంటే భగవంతుడగు రాముడు నన్ను తప్పక ఉద్ధరించెదరు. (ఉద్ధరించియుందురు) ఇది వారి స్వభావము. కాని నేను పొగరు తనముతో నన్ను నేను పేదవానిగా భావింపలేదు. ఇందువలన ఓ ప్రభు! ఇప్పుడు నీ నుండి అగునది అది చేయుము. అనగా నీవు ఎట్లు అనుకొందువో అట్లు ఉద్ధరించవచ్చును.

(ప్రపంచములో అనురక్తుడయిన తనకు తాను ఎప్పుడును తనను, పేదవానిగా భావించడు. తులసీదాసు ఇక్కడ మనస్తత్వమును చిత్రించెను. మానవ స్వభావమును వర్ణించెను. లోక పక్షము ఎడ కూడ ప్రకాశము కల్గించెను).

105. ఓ రామా! నేను ఎక్కడకి వెళ్ళను? ఎవరితో చెప్పను? నేను నా జీవితమంతయు నీ ద్వారము దగ్గరనే గడిపితిని. నేను నీ దాసుడను. ఓ నాథా! నేను నా స్వామితో అనగా అత్యధికమైన దుఃఖమును పొందిన కారణమున చెడుపు చేసివుంటిని. అనగా దుఃఖములో మానవుని వివేకము నష్టమగును. నేను కూడా దుఃఖము చేత పీడింపబడి, నీకు విముఖుని అయితిని. వివేకము కోల్పోయినపుడు మానవుడు తన లాభనష్టముల గురించి ఆలోచించడు. అయినా ఓ కృపానిధి! నీవు ఎట్లు చేసెదవో నేను అట్లు అయ్యెదను. నీవు కృపాసముద్రుడవు. అందరిపైన కృప కల్గియుందువు. నన్ను దుఃఖములో వుండి చూచి విముఖుడవు కావు. అందరిపైన కృప చూపు స్వభావమును త్యజించలేవు. నాదేమి? నేను నీచుడను. ఓ రఘువంశము భూషణా! నీవు నా ప్రక్కకు చూడనంతవరకు - అంతవరకు ప్రతి దినము చెడ్డవానిని అగుచూవుందును. నిత్యము నాకు చెడ్డ పరిస్థితి అగుచుండును. ప్రతి దినము నాకు దోషములు అన్వయించెదరు.

అందువలన నేను నీకు వీపు చాచి వుంచితిని. ఎందుకనగా దృష్టిలేదు. అనగా నేను అజ్ఞానాంధకారమున అంధుడనయి దారితప్పి తిరుగుచున్నాను. నీవు వివేక దృష్టిగలవాడవు. విశ్వమునకు జ్ఞానమును ఇచ్చువాడవు. అంతయును చూడగలవు. భావము ఏమనగా నీవు నా రాబోవు భవిష్యత్తు దశను తెలుసుకొనువాడవు. ఓ రామా! నీ యంతటి వాడు స్వయముగా నీవే. ఈ ప్రపంచమున శరణాగతుని చింతను తొలగించువాడవు. నీవు తప్ప మరొకరు లేరు. ఓ దేవా! నేను పరాధీనున్ని. దీనుడను. అనగా ఇంద్రియముల వశమున పరాధీనుని అయినందున దీనుడను. కాని నీవు స్వతంత్రుడవు. అందరికి స్వామివి నేను నిన్ను అభినందించుచున్నాను. మాట్లాడు వానితో అతని నీడ ప్రార్థించగలదా? అనగా చైతన్య రూపముతో జడరూపము ఎప్పుడైనా ప్రార్థించగలదా?

భావము ఇది :- జీవుడు జడ రూపము. ఈశ్వరుడు చైతన్య రూపము అప్పుడు ఈ జడరూపము చైతన్య రూపమగు ఈశ్వరున్ని ఎట్లు ప్రార్థించగలుగును? జడము నీడవలె అదియే చేయును. చైతన్య రూపము చేయించినట్లు చేయును. అనగా నా కర్మల మొత్తం బాధ్యత నీపైననే యున్నది. నా ద్వారా నీవే దాని కర్తవు.

ఇందువలన ఓ నాథా! నీవు మొదట నీ ప్రక్కకు చూచుకొనుము. తదుపరి నా ప్రక్కకు చూడుము. అప్పుడు నీకు ఈ దాసుని మాటలను నిజమైనవిగా భావించవలసియుండును. రామనామము సహాయము (ఆధారము) చాలా గొప్పది. అది కూడా దాని సహాయమును పొందెను. అదియే ఈ ప్రపంచము వలనుండి రక్షింపబడి వున్నది. ఓ రామా! నీ పద్ధతి స్వభావము నా హృదయమున నిత్యము - మహా ఆనందముగా (ప్రఫుల్లితముగా) నుండును. అనగా నా హృదయము వీటిని జ్ఞాపకము చేసుకొని నిత్యము ఆనందమున నిండియుండును. రాముడు నాపైన తప్పక కృప చూచునని ఆలోచించితిని. ఎందుకనగా ఆయన స్వభావమే అటువంటిది. ఇందువలన ఓ రామా! ఎప్పుడు నీకు ఏది బాగుగా కనబడునో అటుల నాకు తులసీదాసుపైన కృప చూపుము. ఎందుకనగా తులసీదాసు నీవాడే.

(తులసీదాసు సాంఖ్యతత్వమును ప్రతిపాదించెను. ఆర్తభావము చరమ స్థాయికి చేరుకొన్నది).

106. ఓ కల్యాణ స్వరూపుడగు రామా! నన్ను నీ విషయమున చింతవున్నది. మరియు లేదు. ఈ ప్రపంచములో జీవులన్నియు కూడా దుఃఖమునకు గురియైన పాత్రలు అందరూ అనుభవించుచూనే యున్నారు. భావము ఏమనగా ఎప్పుడైనా దుఃఖమును పొందవలసి యున్నది. ఈ విషయమును గురించి చింతలేదు. నేను కూడా దుఃఖమును పొందవలసియే యున్నది. నీ సేవకుని అయికూడ ప్రపంచము నుండి ముక్తి నీయలేక పోయితిని. దీని వలన నీకు కూడా చెడ్డపేరు కల్గను. ఈయన భక్తుడయి కూడా కష్టములు అనుభవించుచున్నాడు. పెద్దవారితో సంబంధము ఒక ప్రక్కననే వుండునా? చిన్నవారు వారిని తమవారని భావించుచుందురు. కాని వారు చిన్నవారిని తమ వారుగా భావించరా? నాయటు వంటివారు నీకు అనేక మంది వున్నారు. అయితే నన్ను నీ వానిగా భావించారా? నేను నిన్ను నా వానిగా భావించునపుడు నీవు నన్ను నీవానిగా భావించవా? కాని నీవు నా కొక్కడివే. భావము ఏమనగా నీవు నన్ను వదలి వేయవచ్చును. కాని నేను నిన్ను వదలి వుండలేను.

ఓ స్వామీ! నీ సర్వజ్ఞుడనని తెలిసి నా మనస్సుకు చాలా గ్లాని కలుగుచున్నది. నేను హృదయమున నా దుఃఖమును తెలుసుకొని చలించి పోవుచున్నాను. విషయము ఏమనగా వాస్తవముగా నేను కుటిలమైన దుష్టమైన సేవకుని. కాని మాటలాడునపుడు నీకు మంచి సేవకుడివలె మాట్లాడుచుండెదను. నీవు సర్వజ్ఞుడవు. వాస్తవము తెలియును. ఈ కారణముననే భయపడుచున్నాను. నేను మంచి వానిని కాక నీచుడను. ఇతర స్త్రీ పురుషులు ఇదియే చెప్పుచున్నారు. నేను రాముని సేవకుడను. ప్రపంచము పద్ధతి ఇది. చెడిపోయిన నౌకరు, మరియు కుక్క అపరాధములకు తిట్లు దాని యజమానికి తినవలసి వచ్చును. ఇతడు అతని నౌకరు లేక కుక్క అతనిది. అనగా దోషములు వీరు చేయుచుందురు. తిట్లు యజమాని తినవలసి వచ్చును. ఇట్లు అపరాధములు నావి; లోకము నన్ను నీ నౌకరుగా భావించుచున్నది. ఇట్లు నన్ను ఉద్ధరించనందున తిట్లు నీవు తినవలసి వచ్చును.

నేను సందేహములో వున్నాను. నా సందేహము ఎట్లు తొలగవలయునో నాకు ఉపాయము తోచలేదు. ఓ దీనబంధు! తెలుసుకొని ఏమి చేయవలయునో అది చేయుము. ఓ దీనబంధు! నీవు కొంచెము నా యశస్సును గురించి చూడుము. బహుశా అందులో నాకు స్థానమున్నది. నా స్థానము తప్పక వున్నదా? అయినా ప్రభు - నీవు నన్ను త్యజించిన నీ శరణుయందు పడియుందును. భావము ఏమనగా నీవు భక్తవత్సలుడవు. శరణాగత రక్షకుడవు. దీనోద్ధారకుడవు. పతిత పావనుడవు. మొదలగు అనేక పేర్ల వలన ప్రసిద్ధుడవు. నేను భక్తుడను శరణాగతుడను. దీనుడను, పతితుడను మొదలగు వారిలో ఏదో ఒకనిగా తప్పక అయివుందును. ఈ సంబంధము చేతనే నీవు నన్ను ఉద్ధరించవలసియుండును.

చేయనిచో నీ ద్వారము దగ్గర ధర్నా చేయవలసి యుండును. ఎప్పుడో ఒకసారి చేయవలసి వచ్చును.

(తులసీదాసు వాక్చాతుర్యము అద్భుతమై తన ఉద్ధరణ కొరకు రాముని పలువిధములుగా కోరును. కరుణా భావమును మిక్కిలి నైపుణ్యముతో కూడియున్నది).

107. ఓ మనసా! నీవు రాముని సేవచేయుటకు సిగ్గుపడక పోయినచో మంచి నాణెముగా అయి, చెల్లని రూకవలె అందరి చేతులలో మారక యుందువు. అనగా ఒకవేళ నీవు రాముని సేవచేసినచో అందరు మంచి నాణెమువలె గౌరవింతురు. చెల్లని నాణెమువలె పదిమంది ఇంటివాకిండ్ల దగ్గర తిరగవలసిన పనిలేదు. ఒకవేళ నీకు లోభముతో రాముని నామస్మరణ చేయుటకు సోమరితనము చేయవు. ఓ దుష్టా! నీవు గారడీ వాని లుబ్దత్వమునకు ప్రతీకగా కొయ్యబొమ్మవలె దుమ్ము తగులుచూ అనగా ఇంటింటి వద్దకు తిరుగుట నుండెడిది కాదు. అందరి ఎదుట అవమానము పొందవు.

ఓ మనసా! ఒకవేళ నీవు నేను చెప్పినట్లు రామనామమును సంపాదించిన అనగా నిరంతరము రామనామ స్మరణ చేయుచూ వున్నచో, సీతాపతి అగు రాముడు నిన్ను తన దగ్గర వుంచుకొనును. నీవు సుఖముగా నుందువు. మరొక లోకము పరలోకము అన్నిచోట్ల నీగతి బాగుంటుంది. అనగా నీ లోకము, పరలోకము రెండును చక్కగా అనుకూలమగును. ఒకవేళ నీకు రాముడు ఇష్టమయినచో అందరు నిన్ను ప్రేమింతురు. కాలము, కర్మము మొదలగు అన్ని కార్యముల కారణము అనగా ప్రేరణ కల్గించువాడవు. వీరిలో ఎవరుకూడా నిన్ను కోపపడరు. అందరు నీకు అనుకూలమయ్యెదరు. ఒకవేళ నీ హృదయమున రామనామమును ప్రీతిగా స్వీకరించిన (ప్రేమించిన) స్వార్థము (ఈ లోకము) పరమార్థము, యాత్రీకులు అందరు నిన్ను విశ్వసించెదరు. అనగా నీ స్వార్థము, పరమార్థము రెండును సిద్ధించును. ఈ లోకమున నీవు సుఖముగా నుండెదవు. పరలోకమున నీకు వైకుంఠము లభించును.

ఒకవేళ నీవు సాధువుల సేవ చేసినచో ఇతరుల పీడలను విని (దుఃఖములను) తెలుసుకొని స్వయముగా నీవుకూడా బాధ పడినచో నీ హృదయమనెడి సరోవరమున కోట్ల జన్మల కర్మరూపమున నున్న బురద నిండి వున్నది. ప్రోగయివున్నది. అది క్రింద కూర్చొను నీ మనస్సు నిర్మలమగును. చెరువు మురికి నీరు స్థిరముగా నున్నందున బురద క్రింద పేరుకొని యుండును. నీరు పరిశుభ్రముగా నుండును. ఇదే మాదిరి మనస్సు యొక్క చపలత్వము స్థిరమై మనస్సు శుద్ధమగును. ఈ ప్రపంచము యొక్క మార్గము అగమ్యి (దుష్కరము) మయి మరెప్పటికి సమాప్తము కాదు. (కాని ఒకవేళ నీవు పైన పేర్కొనిన కార్యములు చేసినచో నీవు శ్రమలేకయే ఈ మార్గమును దాటిపోగలవు. నీకు ప్రపంచమునుండి విముక్తి కల్గును). భగవంతుని వ్యతిరేకమయిన విరుద్ధమయిన పేరు మరా - మరా స్మరణ మహిమ చాలా గొప్పది. వాల్మీకి కిరాతుకుడు (బోయవాడు) ఒక ఋషి (ముని) అయ్యెను.

భావము ఏమనగా వాల్మీకి రాముని విరుద్ధమైన నామము మరా - మరా జపించుట వలన కిరాతకుడు ముని అయ్యెను. నీవు నేరుగా విరుద్ధము లేని రామ - రామ అను నామస్మరణ వలన ఏమైనా కావచ్చును. నీకు ముక్తి కలుగును. (ఒకవేళ నీవు రాముని స్వీకరించిన) ఓ మూర్ఖా! దేవతలకు కూడా దుర్లభమగు, ఈ మానవ శరీరమును ప్రాప్తించుకొని (సంపాదించుకొని - పొంది) ఈ విధముగా వ్యర్థముగా పోగొట్టుకొనరు. నాశనము చేసుకొనరు. రాముని నామస్మరణ వలన నీవు కళ్యాణమునకు ఆది కారణము అగుదువు. బ్రహ్మస్వరూపము అయ్యెదవు. విధాత కూడా నీకు అనుకూలమయి నాపైన సంతోషించును. (ప్రసన్నుడగును) ఓ మనసా! ఒకవేళ నీవు ప్రేమ - విశ్వాసముతో రామనామమునందు ప్రీతి ఏర్పడిన రాముని కృప వలన మూడు విధములైన (దైవిక, దైహిక, భౌతిక) వాటితో దగ్ధము కాదు, అనగా ప్రపంచములోని విఘ్నములు బాధలు బాధించవు.

(దోషములు ఒకరు చేసిన, మరొకరికి దండన మరొకరు అనుభవించవలసివచ్చును. ఇది ఒక సూక్తి).

108. రాముడు తన మంచి స్వభావము చేత ఎవరికి మేలుచేయలేదు. అనగా అందరికి మేలు చేసెను. సీతాపతి రాముని యశస్సు యుగయుగముల నుండి ప్రపంచమున ప్రసిద్ధి చెందినది. బ్రహ్మాది దేవతలు ప్రపంచములోని దుఃఖములను వర్ణించి భగవంతునితో ఇట్లు ప్రార్థించిరి. పృధ్విని రక్షించుటకు అవతారమును ధరించుము. ఇందువలన సూర్యవంశము అనెడి పద్మములను (కలువలను) వికసింపచేయు, ఆనందమను అమృతము వర్షింపచేయు చంద్రుని వలె రాముడు అవతరించెను. ఋషి విశ్వామిత్రుడు తాటకియను స్త్రీ రాక్షసితో (శక్తి) మిక్కిలి వికలుడై యుండెను. అనగా తన యజ్ఞ రక్షణ చింతయందు మిక్కిలి చింతించుచుండెను. అప్పుడు ప్రభువగు రాముడు తాటకను వధించి, యజ్ఞమును రక్షించెను. శత్రువగు తాటకకు మిత్రులవలె ఫలమునిచ్చెను. ఆ పైన క్రోధమున్నప్పుడు కృపచూపెను. అనగా తాటకను నరకమునుండి తప్పించి స్వర్గమునకు పంపెను.

రాముడు స్వయముగా వచ్చి పాషాణముగానున్న అహల్య పాపమును తొలగించెను. అనగా ఎటులయితే మరల స్త్రీగా చేసి భర్త వద్దకు పంపెను. తన కూతురు సీత వివాహము అను విషయమున మిక్కిలి దుఃఖములో నున్న జనకుని (మిథిలాధీశుడు)కి తగిన జవాబు ఇచ్చెను. ధనస్సును త్రుంచి వారి దుఃఖమును తొలగించెను. భార్గవ పరశురాముడు క్రోధ పుంజము అహంకారము మనెడి భావములయందు నిమగ్నుడై యుండెను. తనను స్వయముగా అద్వితీయ యుద్ధవీరునిగా తల్లి దండ్రుల ఎడ మేటి భక్తిగల వానినిగా గర్వముతో నిండివుండెను. రాముడు అతని ప్రక్కకు కేవలము చూచి శాంతి, సమతకు పాత్రునిగా చేసెను. అనగా అతని క్రోధమును శాంతపరచి సమద్రష్టగా చేసెను. ఇటువంటి రాముడు తల్లి దండ్రుల ఆజ్ఞను పాటించి ప్రసన్నుడుగా నుండెను. సంతోషముగా అడవికి వెళ్ళెను. ఇటువంటి రామునికి ధర్మదురంధరుడు, ధైర్యము పూనుటలోను అద్వితీయుడు, గుణ శీలములకు కేంద్రం, అద్వితీయమైన విజేత మరి ఎవరున్నారు?

నిషాదరాజు పేదవాడు గుహుని కులమును గురించి రామునికి తెలియదు. అతడు నీచ జాతికచెందినవాడు. గుహుడు బక్షించని ప్రాణి లేదు. ఇటువంట గుహుడు రామునితో పవిత్రమైన ప్రేమ చూపించి రాముని సఖుని (మిత్రుని - సోదరిని) వలె ఆదరమును పొందెను. శబరి, గ్రద్ధయగు జటాయువునకు ముక్తి కల్గించువారెవరు? మిక్కిలి దుఃఖముతోనున్న సుగ్రీవుని దుఃఖములను, ఆపదలను ఎవరు తొలగించిరి? యమునికి ఆహారము కానున్న విభూషణుని ఎవరు రక్షింపగలరు? నేడు అదే విభీషణుడు, లంకలో రాజ్యము పాలించెను. అక్కడ పూర్వము రావణుడు రాజ్యము నేలుచుండెను. అయోధ్యావాసి మూర్ఖుడగు చాకలివాడు అతనికి బూడిదకు సమానమగు బుద్ధి లేకుండెను. ఆ దుష్టుడు కూడా పరమ ధామమును చేరుకొనెను. అక్కడ చేరుటకు మునుల మనస్సు కూడా అలసిపోవును. అనగా మునులు ఆదాయమును గురించి కల్పన కూడ చేయలేదు.

రామనామము స్మరించిన వారికి ముక్తి లభించకుండ విధాత ఎవరిని సృష్టించలేదు. పార్వతి పతి శివుడు తాను స్వయముగా రామనామము స్మరించుచూ దానిని ప్రచారము చేయుచుండును. అజామిలుని కథ విని ఎవరికి ఆనందము కలుగదు? కలియుగమున రాముని నామము స్మరించిన భగవంతుని లోకమగు వైకుంఠమునకు వెళ్ళలేదు? రామ నామ మహిమ అటువంటిది. అది స్మరించినచో జిల్లేడు చెట్టుకూడా కల్ప వృక్షమగును. ఈ విషయమునకు సాక్షి వేదములు. పురాణములు ఇచ్చుచున్నవి. ఈ విషయమును గురించి నమ్మకము లేనిచో తులసీదాసు ప్రక్కకు చూడుము. తులసీదాసు చాలా నీచుడు. మూల నక్షత్రమున పుట్టినందున మాతా పితలు (తల్లిదండ్రులు) కూడా అతనిని వదలివేసిరి. ఇప్పుడే అదే తులసీదాసు రాముని భక్తునిగా ప్రసిద్ధి గాంచెను.

(ఈ గేయమునందు తులసీదాసు రాముని చరిత్రనంతయును చెప్పియుండెను. శివుడు రామ నామమును జపించుచూ కృతార్థుడయి పార్వతి సహితముగా కాశిలో వుండి చని ప్రాణులకు ముక్తి లభించుటకు రాముని నామ మంత్రమును ఉపదేశించుచున్నాడు.)

109. ఓ రఘుపతి! నేను నిన్ను అభినందించుచున్నాను. నాకు గతి నీవే, నీ శరణు జొచ్చినందుననే నాకు ఉదారమగును. నాయటువంటి సిగ్గులేని, నీచుడు, గుణహీనుడు, పేదవానికి నీవు - తప్ప రెండవ స్వామి ఎవరు లేరు. శరణుకూడా ఇచ్చువాడులేడు. అటులయితే ఈ లోకమున ఇంటింటిలో మంచి యజమానులు నిండివున్నారు. అనేకమంది దేవీ దేవతలున్నారు. అయిన వారందరికి తమ స్వార్థము కనపడచుండును. అనగా వీరందరూ మొదట పూజలు పొందుదురు. తరువాత కొంచము ఫలమునిచ్చి తిరుగుబాటు చేసెదరు (తన్నుదురు). వానరుడగు సుగ్రీవునికి మిత్రుడా! ఓ విభీషణుని హితము కోరినవాడా! ఓ కోసలదేశ రాజా రామా! నిన్ను వదలి నేను ఇతర ఎచ్చోటను నేను సరిపడను (కలసిపోను) అనగా శరణు పొందగలను. ఓ శరణాగతుల దుఃఖములను తొలగించువాడా! భక్తులకు శుభమును చేకూర్చువాడా! శరణాగతులకు నీపేరు వజ్రకవచము (పంజరము) వంటిది. అనగా వజ్రముతో నిర్మించిన పంజరములో నున్న పక్షి బయటి భయములనుండి

ముక్తురాలైయుండును. సురక్షితముగా నుండును. అదే మాదిరి నీ నామస్మరణ చేత భక్తులు సంపూర్ణమైన ప్రాపంచిక విఘ్న బాధల నుండి ముక్తులగుదురు. ఓ కృపాసింధు! ఇప్పుడు తులసీదాసును నీ దాసునిగా చేసుకొనుము. నేను మూల్యమునకు విక్రయింపబడకయే నీ చేతులయందు అమ్మకమునకు సిద్ధముగా వున్నాను. అనగా నా స్వార్థము లేకయే, సదా నిష్కామ భావముతో మీ సేవకుని అగుటకు సిద్ధముగా వున్నాను.

110. ఓ దేవా! దీనులపై నీవలె దయ చూపువారు ఇతరులు ఎవరున్నారు? నీవు ఒక్కడవే సత్‌శీలము గలవాడవు. శీలమునకు నిధి. మంచి జ్ఞానివి. జ్ఞానులలో సర్వశ్రేష్ఠుడవు. శరణాగతులకు ప్రియుడవు. భక్తులను రక్షించువాడవు. ఓ ప్రభూ నీవలె సమర్థుడు. సర్వాంతర్యామివి అందరికి ఇష్టమైన మరొక స్వామి ఎవరు వున్నారు? నీవు శివునికి ప్రియమైన మానస సరోవరమున నుండు హంసవు. నిన్నే ధ్యానించునుండును శివుడు. ఏ దేవుడు నీవలె జటాయువు పక్షి రాక్షసుడగు విభీషణుని, వానరులైన (హనుమంతు-సుగ్రీవులు), ఎలుగుబంటి జాంబవంతుడు, కొండచెంచు వనిత శబరి-వీరి ప్రేమకు వశుడవయి తన మిత్రులనుగా చేసుకొనెను. ఓనాథా! మాయకూడిన ఈ మోసమయముగా ప్రపంచము జీవుని దోషములు - గుణములు, కర్మయు, కాలము, నీ చేతిలో వున్నవి, అనగా నీవే వీటికి అధిపతివి. నియంతవు. కర్తవు తులసీదాసు మంచివాడుగా లేక చెడ్డవాడుగా వుండటము నీవలననే. కొంచెము ఇతని ప్రక్క చూసి తృప్తిని కల్గించుము.

(మాయా ప్రపంచము రెండు విధములుగా నుండును. (1) సృజనాత్మకము, (2) మాయాత్మకము. సృజనాత్మక రూపములో మాయ క్షితి, జల, పవన, అగ్ని, గగనము - ఈ ఐదింటి ద్వారా భౌతిక సృష్టి సృజనమగును. మాయత్మక రూపమున అవిద్యా సంధిని, సందీపనీ విద్య, ఆహ్లాదినీ ఈ ఐదు రూపములయందు సృష్టిలో తన ప్రసారము వ్యాపించుయుండును.)

111. నాకు ఒక రామనామము యందే విశ్వాసమున్నది. నా యొక్క ఈ కుటిల మనసు స్వభావము ఇటువంటిది. ఇతరులనెవ్వరిని నమ్మదు. నాభాగ్యము చేత ఆరు శాస్త్రములు వైశాషిక, న్యాయ, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస నాల్గు వేదములు ఋక్, యజు, సామ, అధర్వణ చదువుటకు వ్రాయలేదు. అనగా ఈ అన్నింటి జ్ఞానము నుండి పూర్తిగా వంచింపబడితివి. ఇదియేగాక నా మనస్సు వృతములు, తీర్థ స్థలములు (పుణ్య స్థలములు) తపములనుండి పూర్తిగా వేరయి ఇతర సాధనముల పేరు వినిన వెంటనే మనస్సు భయమును కల్గించుకొంటున్నది. భయపడుచున్నది. ఈ సాధనములను చేయుటకు ఎంత శ్రమ పడవలయునో ఏమో అని మనస్సు ఆలోచించుచున్నది.

వీటిని సాధన చేయవలెనని మనస్సుపైన ఆధారపడివున్నది. ధనము లేకుండ కర్మకాండలు చేయలేము. నా వద్ద ధనము లేదు. అందువలన వీటిని ఎట్లు పూర్తి చేయగలను? ఇదియే గాక జ్ఞానము, వైరాగ్యము, యోగము, తపములు, జపములు, మోహము, క్రోధము, కామము మొదలగు వాటి భయము కల్గుచున్నది. అనగా ఈ చెడ్డ వాసనలు (కోరికలు) వున్నందున వాటిని పైన పేర్కొన్న వాటిని సాధించి ముక్తి పొందుట దుష్కరము. రాముని గుణరాశిని గానము చేయువారు శివుడు, ఈ లోకమున అన్ని విధములుగా యోగ్యుడని భావించబడినది. ఒక వేళ భవము అర్థము ప్రపంచము అని భావించిన అర్థము ఇట్లు అగును. రాముని గుణ సమూహముల గాయకుడు అన్ని విధములుగా సదా యోగ్యుడు. రామనామ మనెడి కల్పవృక్షము నీడలో కూర్చొని వారికి ప్రపంచమనెడి భయంకరమైన దట్టమైన మేఘములు (సంతాపమనునవి) తేజస్సు పీడించలేవు. అనగా రాముని పేరు అన్నిటి కంటే భక్తుని రక్షించును.

ఎవరు నరకమునకు వెళ్ళుదురో ఎవరు స్వర్గమునకు, ఎవరికి తెలియును. తులసీదాసుకు మాత్రము ఈ ప్రపంచమున రాముని దాసుడయి జీవితము గడపటమే బాగుంటుంది అని భావింతును.

(ఆత్మ తత్వమును గురించి సంకేతము చేయబడినది. తులసీదాసు స్వర్గ నరకముల చింతన కంటె రామమయమగు ఈ ప్రపంచమన వుండుటకు ఎక్కువ ఇష్టపడును.)

112. ఈ కలియుగమున రామనామము కల్పవృక్షమువలె అన్ని కోరికలను పూర్తి చేయును. ఇది దరిద్రము. కరువు (లేమి) దుఃఖములు, దోషములు, అతివృష్టి, అనావృష్టి మొదలగు ప్రపంచములోని అన్ని ఆపదలను తొలగించునది. రామ నామస్మరణ చేసిన ప్రతికూలముగానున్న విధాత యొక్క అధర్మముల ఎడ ప్రతికూలమైన మనస్సు అనుకూలమగు చున్నది. వెంటనే, అనగా భాగ్యమున అదృష్టమును సుఖమును వ్రాయునట్టి బ్రహ్మ రామనామ స్మరణ చేసిన అ దుఃఖములను తొలగించి సుఖములను వ్రాయును. భావము ఏమనగా రామ నామము భాగ్యమను లిపిని మార్చివేయును. మహర్షి వాల్మీకి శివుడు ఇద్దరును ఈ పేరును విరుద్ధముగా మరా - మరా జపించుచూ బందిపోటు దొంగ మహర్షి అయ్యెను. శివుడు సాదాగా రామ - రామ అనుచూ హాలా హల విషమును త్రాగెను. స్వయముగా బ్రహ్మరూపముగా స్వీకరించి భావించబడిరి. భావము ఏమనగా రాముని పేరు విరుద్ధముగా లేక సాదాగా ఎటుల స్వీకరించి గానము చేసిన మంచి భావముతో స్మరించిన నామస్మరణ చేసిన వాడు గొప్పవాడు అగును.

ఎవరికి అయితే అందమైన రామనామ బలము ఆధారముగా వున్నదో అతనికి ఇహ, పరలోకములు అనుకూలము అగును. అనగా అతడు ఈ లోకమున సుఖముగా నుండును. పరలోకమున వైకుంఠమును పొందును. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. రామనామము వలన ఏ విధమగు చింతయుండదు. మృత్యువు భయము లేదు. చనిపోయిన తరువాత

ఎక్కడ వెళ్ళవలయునను చింతవుండదు. మరలా పుట్టెదమా లేక ముక్తి కల్గునా? అనగా ముక్తి నిశ్చయము. ఇంక చింత ఎందుకు?

(తులసీదాసు కలియుగమున రామనామమే ముక్తి కల్గించు సాధనముగా భావించిరి.)

113. రాముని వంటి మంచి స్వామి సేవ చేయవలెను. వారు సుఖమును కల్గించు, శీలవంతుడు, జ్ఞాని, వీరు పవిత్రుడు. కోట్లాది మన్మధులవలె సౌందర్యవంతుడు, సరస్వతి, శేషనాగుడు, సాధు గణము వారి మహిమను వర్ణించుచూ వున్నారు. సామవేదము వీరి గుణములనుగానముగా చేయుచుండును. చంద్రుని భూషణముగా ధరించిన శంకరుడు ప్రేమతో వారి నామస్మరణ చేయుచూ వారి ఎడ భక్తి శ్రద్ధ కల్గి వుండకోరుచున్నారు.

వీరి పేరు స్మరించిన తీర్థయాత్రలకు, విదేశములకు వెళ్ళనవసరము లేదు. అనగా అన్ని పుణ్యస్థలముల సందర్శనా ఫలము, రామ నామ స్మరణ వల్లనే లభించుచున్నది. దుఃఖము లేశ మాత్రము కూడా వుండదు. ఇట్లు రామ నామ స్మరణ చేయువారు రామునికి ఒకసారి నమస్కరించిన వారు సంకోచమున నిండి పోయెదరు. అనగా ఎంతో శీలవంతుడు, నామ స్మరణ చేసిన వెంటనే ఇతనికి ఏమి ఇవ్వవలయునను సంకోచమున నిమగ్నమగును. ఈ విషయమునకు విభీషణుడే ప్రబల సాక్ష్యము. అతడు ఇప్పుడు కూడా లంకలో కూర్చొని అఖండ రాజ్యమును పాలించుచున్నాడు. విభీషణుని అమరుడని భావింపబడినది. అతడు ఇప్పుడును లంకను పాలిస్తున్నట్లు విశ్వాసము. ఇటువంటి రాముని సేవ చేయడము మిక్కిలి సహజమే. వారు భక్తుల హృదయమనెడి మేడలలో స్థిరుడై నాలుగు యుగములయందు ప్రతి ఒక జామున మేల్కొని యుండును. అనగా చెడు పనులనుండి, సదా వారిని రక్షించుచుండును. వారు భక్తుల దోషములను చూచి కోపగించుకొనరు. అదియేగాక భక్తుల గుణములను గానము చేయుచూ విని ఎంతో ఆనందించును. వారి భజన చేయుటవలన, తిర్యక్ యోనిగల పశుపక్ష్యాదులు (వానరులు - ఎలుగుబంట్లు) మరియు తమో గుణముల శరీరము గల వారును రాక్షస (విభీషణుడు) మొదలగు వారు ముల్లోకముల యందు శిరోభూషణములు అయిరి. అనగా శ్రేష్ఠ భక్తులరూపమున మూడు లోకములయందు ప్రసిద్ధి గాంచిరి. తులసీదాసు చెప్పుచున్నాడు. ఎవరయితే ఇటువంటి ప్రభువును భజింపరో, విధాత కూడా వారికి వ్యతిరేకి అగును. అనగా వారి భాగ్యమున విధాత రాముని భజన చేయుట వారికి వ్రాయలేదు.

114. నేను నా స్వామి రామునికి దోషము ఎట్లు ఆపాదించగలను? ఓ భగవంతుడా! ఈ కామముతో కూడిన దురాశాపరుడనై భక్తిని త్యజించి (వదిలి) అటు ఇటు వ్యర్థముగా తిరుగుచున్నాను. కామ పిపాసను శాంత పరచుకొనుటకు అన్వేషణలో వున్నాను. నా మనస్సు ఇతరులతో పూజ చేయించుకొనుట అనగా ఇతరుల ద్వారా ఆదరమును సన్మానమును పొందుటకు మిక్కిలి కోరిక కలియున్నది. కాని నీ పూజ చేయుటకు చాలా

మాత్రము నామ మాత్రమునకు పని జరుపుకొను పద్ధతిలో చేయుచున్నాను. ఇతరులకు ఉపదేశములు ఇచ్చును. కాని తాను స్వయముగా ఇతరుల ఉపదేశములను స్వీకరింపడు. ఈ మనస్సు మూర్ఖత్వము ఇట్లు వున్నది.

ఎంతో అభిరుచితో పాపములు చేసివుండెను. ఆ పాపములను సదా దాచి వుంచెను. హృదయమున అనగా ఎవరును చెప్పరు. సత్సంగము చేత ఒకటో అరో మంచి పనులు చేసినచో (చేసి యుండిన) సంతోషముతో లోకమునంతటికి చెప్పి వినిపించి తిరుగుచుండును. నేను ఎప్పుడైనా మంచి పనులు చేసినచో పొలములో విత్తిన విత్తనముల కోత తరువాత రాలిన ధాన్యపు గింజలవలె సంగ్రహించి చాలా జాగ్రత్తగా హృదయమున వుంచుకొందును. అనగా ఎవరికిని చెప్పను. కాని ఈ గర్వము బలవంతముగా నాహృదయమున చొచ్చుకొని పోయి వాటిని వెతకి బయటికి తీసుకొని వచ్చును. భావము ఏమనగా జంబమునకు గురి అయి నేను లోకమునంతటికి చెప్పి వినిపించుచున్నాను.

లోభము నా మనసు గొంతులో ఆశ అను పగ్గముతో బంధించి నన్ను కోతివలె ఆడించుచున్నది. అనగా ఆశచేత నేను లోభము నుండి ముక్తి పొందలేకున్నాను. కాని నేను ఇతరులకు శ్రేష్టమైన వైరాగ్యము (త్యాగము) తత్వము విషయములు విద్వాంసుని వలె వర్ణించి వర్ణించి అనగా కర్ణమధురమైన భాషలో వినిపిస్తూ వుంటాను. అనగా స్వయముగా తానులోభములో పడి ఇతరులకు త్యాగము మాటలు చెప్పుచుండును. ఇంత అయిన నేను నీ భక్తుడని పిలువబడుచున్నాను. నేను సిగ్గంతయు నూరి తాగియున్నాను. రఘువీరా! నీవు నా సిగ్గులేని తనమునకు ఆనందపడి నన్ను వదలుము అనగా మాయ అనెడి ప్రాపంచిక బంధముల నుండి నన్ను ముక్తుని చేయుము.

(తులసీదాసు అనేక విధములుగా ప్రయత్నించి రామునిని ప్రసన్నుని చేసుకొను ఉపాయము చేయును. శాస్త్రము ప్రకారము పాపము పుణ్యము రెండింటిని చెప్పుట వలన మహత్యము నష్టమగును. ఇందువలన మనము మన పాపములను ఎప్పటికిని చెప్పరాదు. భక్తుని మార్గములో అహంకారము, బూటకము అన్నిటికంటే గొప్ప బాధలు).

115. ఓ ప్రభూ! దోషము అంతయును నాదే. నీవు, శీలమునకు రాశి (సమూహము) కృపగల వాడవు. దిక్కులేని వారికి రక్షకుడవు. దుఃఖములో నున్న దుఃఖములను తొలగించువాడవు. నా వేషము అలంకరణ మాటల ద్వారా నేను వైరాగ్యమును పూనినట్లుగా తెలియవచ్చును. అయిన నా మనస్సు పాపములకు, దారుణములకు ఖజానా వంటిది. రాముని ఎడ నా ప్రేమ విశ్వాసము సార రహితము అనగా తొల్లివలె అసత్యమైయున్నది. కాని కపటముతో కూడిన నాకర్మలు సారయుతమై వాస్తవముగా నున్నవి. అనగా నేను రామునితో ప్రేమ లేక సదా మోసము కపటములతో కూడినవై చేయుచుందును. నేను చెడు సాంగత్యములో వుండుటకు ఎక్కువ ఇష్టపడుచుందును. కాని సాధువుల సత్సంగము కల్గిన క్రోధితుడనగుదును. అనగా నాకు చెడు సాంగత్యము ఇష్టము మంచి సాంగత్యము

అయిష్టము. ద్వేషము. నా పరిస్థితి ఇటులవున్నది. కుందేలు, నక్కకు సేవ చేసి, సింహముతో యశస్సును కోరినట్లు ఎటులయితే కుందేలు నక్క సహాయమున ఏనుగును చంపి సింహమువలె కీర్తిని పొందగోరినట్లు కాని ఇది అసంభవము. ఎందుకనగా నక్క కపటముగల మిత్రుడు. అది కుందేలును తినును. ఇదే మాదిరి ఈ మనస్సు (కుందేలు) విషయ వాసనలు (నక్క) ద్వారా మహా ప్రతాపముగల (సింహమునకు సమానముగా) దానినిగా కాగోరును. కాని ఫలితము ఈ విషయ వాసనలు వీనిని తినును. నష్టము కల్గించును.

శివుడు నాలుకకు నిత్యము ఈ శిక్షణ ఇచ్చుచున్నారు. నిత్యము రామ నామము ఉచ్చరించు చుండును. ఈ పేరు కలియుగమున బూటకముగా పేర్కొన్నను చింత అను సముద్రమును అగస్త్యముని వలె శుష్కింపచేయును. నష్టము కల్గించును. భావము ఏమనగా కలియుగము బూటకమగు మనస్సుతో పైపైన ప్రదర్శన కొరకు రామనామము స్మరించిన చింతలన్నియు తొలగిపోవును. ఈ రామనామము ఆనందము శుభములకు ప్రధాన కారణము. నేను సంపూర్తిగా ఈ నిర్ణయమునకు వచ్చితిని. నాకు రామనామము ఒకటే అన్నిటికంటె ముఖ్యమైనది. అనగా సహాయకారినిగా నున్నది. రామ నామము ఇటువంటి ప్రభావమును వినుటవలన తులసీదాసుకు మిక్కిలి ఆనందము కల్గుచున్నది. తులసీదాసు రాముని పేరు స్మరించును. ఇందువలన అతని ఉద్ధారము తప్పక కావచ్చును (కల్గును).

(రాముని పేరు ఏ భావముతో ఉచ్చరించిన తప్పక ఉద్ధారము అగును. తులసీదాసుకు దృఢమైన విశ్వాసము భక్తుని యొక్క తన లఘుత్వభావము దాస్యభక్తికి మూలాధారము).

116. ఓ హరి! నీవు పాపాత్ములను పవిత్రము చేయుదువు అని నేను విన్నాను. నేను పాపిని. నీవు పతితపావనుడవు. సరి ఇప్పుడు ఇద్దరి పని అయినది. అనగా నాకు పతిత పావునునితో అవసరముండెను. నీకుపతితులతో, ఇప్పుడు నాకు ఉద్ధరణ స్వయముగా అగును. ఇద్దరి కోరికలు నెరవేరును. వేదములు ఈ విషయమునకు సాక్ష్యము ఇచ్చుచూ చెప్పుచున్నవి. నీవు వ్యాధుడు (వాల్మీకి) గణికా (పింగళ వేశ్య) ఏనుగు (గజేంద్రము), అజామిలుడు (నీచబ్రాహ్మణుడు) అవివేకమగు ఇటువంటి పాపులను తరింపచేసితివి. అనగా నీవు అసంఖ్యాకమైన పాపాత్ములను ఉద్ధరించితివి. వారు తెలిసి తెలియక నీ పేరు స్మరించిరి. వారు నరకము - యమపురికి పోకుండ నిలిపితివి. అనగా వారంతా స్వర్గమునకు వెళ్ళిరి. ఇది వినియే తులసీదాసు అయిన నేను నీ శరణు జొచ్చినాను. ఇప్పుడు ఇతనిని కూడ స్వీకరించండి.

ఇది చిన్న గేయపదము అయినప్పటికి చాల అందముగను; భావగర్భితముగను నున్నది. ఇటువంటి చిన్న పదములలో (గేయములలో) తులసీదాసు తన విశాల జ్ఞానము యొక్క ఆదరణను దూరముగా చిమ్మి సహజమైన, సరళమైన భక్తుని రూపమున ప్రత్యక్షమగును. తన లఘుత్వము రాముని మహాత్మ్యమును ఎక్కువ ప్రభావముగా ప్రస్తుతించుటలో సఫలుడయ్యెను.

చిక్కిపోయి యుందురు? అనగా నాకు నీయటువంటి సమర్థుడైన ఇతర ఏ దేవుడు లభించలేదు. అందువలననే, నేను నీ ద్వారము వద్ద పడివుండి, నీ నామమును వర్ణించుచూ ఎండిపోవుచున్నాను. చాల పెద్ద అవమానమును కూడా సహించుకొన్నాను. ఎందుకనగా నేను ఎంతో బ్రతిమాలినను కూడా నా ప్రక్కకు చూడకయున్నావు. నేను నీతో నీ కృప అనెడి అమృత రూపమగు జలమును దానముగా ఇవ్వవలయునని కోరుచున్నాను. అది సాటిలేనిది. నా చిత్తము అనుచాతక పక్షిపిల్ల, నీ స్నేహమనెడి స్వాతి నక్షత్రము జలమును కోరుచున్నది. అనగా నా మనస్సు పిల్లవాని వలె అధీరమయి (ధైర్యములేక) వున్నది. నాకు తెలివి లేదు. ఒక వేళ పెద్దలవలె తెలుసుకొనియుందును. కాని ఇప్పడు నా మనస్సు చిన్న బాలునివలె అలుగుచున్నది. బహుశా అటు దారి తప్పినదేమో.

కాలము, కర్మవశమునకు గురి అయి అనగా పరిస్థితుల చక్రములో పడి ఒకవేళ ఎప్పుడైనా, నా మనస్సునందు చెడు వాసనలు (కోరికలు) కల్గిన, వాటిని త్యజించి వికలుడవై, నేను నీ దగ్గరకు - చేప నీటిలో సుఖముగా నుండును. నీటినుండి బయటపడిన ఇలవిల తన్నుకొనును. కాని వెంటనే గాబరాపడి నీటియందు మునకలు వేయును. భావము ఏమనగా నా మనస్సు వాసనల ప్రక్కకు క్షణము కోరకే అకర్షింపబడుచున్నది. అయినా భయపడి వెంటనే నీ శరణుజొచ్చెను. నీ చరణములకు పరుగెత్తుకొని వచ్చిచేరును. ఎందుకనగా వాసనల ఘాతకమైన పరిణామమును అనుభవించినది.

తులసీదాసడనగు, నా హృదయమున ఎంత మోసము, కపటము నిండియున్నది. దానిని పూర్తిగా ఎట్లు చెప్పవచ్చును? అనగా దానిని వర్ణించుట అసంభవము. భావము ఏమనగా తులసీదాసు భయంకరమై కపటము గలవాడు. అయినా వానిలో పక్కా భరోసా వున్నది. దశరథ రాజపుత్రుడైన రామా! నీ రాజ్యములో ప్రజలు సేద్యము చేయక విత్తనము వేయకయే పంటకోసు కొనుచుందురు. అనగా రామరాజ్యమున సత్కర్మ చేయక పోయినను అనేకమంది పతితులు ముక్తి లాభమును పొందిరి. వారి ఉద్ధారము అయ్యెను. ఇదే మాదిరి నాయటువంటి పాపి ఉద్ధారము అగును. ఈ విశ్వాసము వున్నది.

(తులసీదాసుకు రామభక్తి ఉపలబ్ధి కల్గినట్లు తెలియుచున్నది. వారి మనస్సు కొంచెము శాంతముగా, స్థిరముగా నున్నది. ఇదియే ఆనందము యొక్క సిద్ధావస్థ అని చెప్పబడుచున్నది. అయినా నా మనస్సులో కోరికలు ఉత్పన్నమగు చుండును. స్వాభావికముగా కాలము, కర్మయే మనస్సును అస్థిరము చేయుచున్నవి. భక్తి చేయుట వలన విషయ వాసనలు అప్పుడప్పుడు తల ఎత్తుచుండును. దూరమగు చుండును. అనగా సంయమనము పొందుచుండును. రాముడు సర్వశక్తి సంపన్నుడు. భక్తుని మనస్సునందు అహంకారము వుండుట మంచిది కాదు. ఇందువలన తులసీదాసు వినయమునకు ప్రాముఖ్యత ఇచ్చును.)

118. సేవ చేయకయే దీనులను కృపతో చూచిన ఉదారమైనవారు లోకమున మరెవరున్నారు? రామునికి సమమగు ఉదారమైనవారు మరొకరు లేరు. మోక్షమును పొందుటకు గొప్ప గొప్ప మునులు జ్ఞానులు కూడా యోగము, వైరాగ్యము మొదలగు విభిన్న సాధనముల ద్వారా పొందలేనట్టి ఆ గతిని, ప్రభువు రాముడు, గ్రద్ధ (జటాయువు) శబరి (అడవి జాతి కోయ)కి కల్గించెను. తదుపరి మనస్సులో ఇదే భావించిరి. నేను వీరికి కొంచెము మాత్రమే ఇచ్చితిని. అనగా ఏమియు ఇవ్వలేదు. రావణుడు తన పది శిరస్సుల సమర్పించి శివునితో పొందిన సంపదను రాముడు మిక్కిలి సంకోచములో విభీషణునికి ఇచ్చెను. రామునికి సంకోచము - నేను నా భక్తునికి ఏమి ఇవ్వలేదని. ఎందుకనగా లంకారాజ్యమును బ్రహ్మ ఇతని భాగ్యమున వ్రాసి ఇచ్చెను. నేను ఇతనికి ఏ విధమైన మేలు చేసితిని తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఓ మనసా! నీవు అన్ని విధముల సుఖముగా నుండగోరిన రాముని భజన చేయుము. కృపానిధియగు రాముడు నీ మనోవాంఛలనన్నిటిని పూర్తిచేయించకోరినాడు.

119. ఈ ప్రపంచమున సరియైన దానము, సర్వ శ్రేష్టమైన శిరోమణి ఒకడే రాముడు వున్నాడు. ఎవరైన వారిని ఒకసారి యాచించిన, రెండవ దఫా యాచించనవసరము లేదు. అనగా రాముడిని ఒక దఫా అడిగిన భక్తుని మనోవాంఛనలన్నియు (కోరికలన్నియు) పూర్తి చేయుదురు. అతను మరల ఎవరినైనా అడగవలసిన పరిస్థితులు పొందడు. అటుఇటు పోవనవసరముండదు. అసురులు, దేవతలు, మానవులు, మునులు అందరు స్వార్థపరులే. వీరు ఎవరితోను కూడా తీసుకొనక ఏమియును ఇవ్వరు. అనగా పూజ, కానుకలు, సమర్పనలు లేనిదే ఎవరును ఎవరికి ఏమియును ఇవ్వరు. కాని కోసల దేశపు రాజు కృపానిధి రాముడు కల్పవృక్షము వంటివాడు. వారు ఒకసారి నమస్కరించిన కల్పవృక్షము వలె (భక్తుల) కోరికలను తీర్చును. ప్రతి దానము ఏమియును పొందడు. రాముడు నిస్వార్థమిత్రుడు.

భగవంతుడు ఇంకను అనేక అవతారములను పొందెను. వేదముల ద్వారా నిర్ణయించిన మర్యాదలను రక్షించెను. కుచేలుడు కృష్ణునికి బాల్య స్నేహితుడు. అయిన కృష్ణుడు వీరికంటె ముందు అటుకులను (బియ్యమును) తీసుకొని యుండెను. అప్పుడే అతనికి సంపదనిచ్చెను. అనగా మొదట తీసుకొనకుండ ఇవ్వలేదు. కాని రాముడు ఏమియును తీసుకొనకయే వానరుడు (కోతి) శబరి, సుగ్రీవుడు, విభీషణుడు, మొదలగువారికి యాచనారహితముగా చేయలేదా? అనగా వీరి మనోవాంఛలన్నింటిని పూర్తి చేయవలసి యుండెను ఓ దయానిధి! నీ శరణు జొచ్చునట్టి భయంకరమగు ఆశా రూపియగు పిశాచి నాకు దుఃఖమును కల్గించుచున్నది. అనగా నీవు తులసీదాసుకు కూడా నీవు ఆశను పూర్తిచేసి ఈ పిశాచి నుండి రక్షించుము. తులసీదాసును నీ శరణులోనికి తీసుకొమ్ము.

తులసీదాసు రామావతరమును ఇతర అవతారములకంటె శ్రేష్టమైనదిగా నిరూపించెను ఈ పదమునందు)

రాముని ప్రేమ నిర్వహణ చేసి అతని వియోగములో తన ప్రాణములు పోగొట్టుకొనెను. ఈ విధముగా అమరలోకమున అమరమైన యశస్సునకు అధికారి అయ్యెను. కాని రాముడు ఇటువంటి ప్రేమించువారిని తన తండ్రి కంటే ఎక్కువగా జటాయువు పైన మమత చూపెట్టును. తన గుణముల ద్వారా యశమును పొందెను. అనగా రాముడు తన తండ్రికి పిండదానము చేయలేదు కాని జటాయువు అంత్యక్రియలప్పుడు పిండదానము ప్రదానము చేసెను. ఇక్కడ రాముడు తండ్రి కుమారుల సంబంధము కంటె ఎక్కువగా జటాయువు ప్రేమ బంధనమును ఒప్పుకొనెను. (స్వీకరించెను.)

రాముడు తన మిత్రుడగు సుగ్రీవుడు తన భార్యయగు తారా వియోగమున బాధపడుటచూచి, సీతా వియోగ దుఃఖమును మరచెను. రాముడు వాలిని చంపి సుగ్రీవునికి తన భార్యయగు తారను ఇప్పించెను. మరలా నాలుగు మాసముల వరకు ఎదురుచూచి సుగ్రీవుడు సీతా అన్వేషణలో సహకరించెదనని చెప్పివుండెను. అనగా అతడు (రాముడు) తన మిత్రుని దుఃఖమును ముందుగా తొలగించెను. అనగా మొదట తన మిత్రుని దుఃఖమును తొలగించెను. తరువాత సీతను గురించి యాచించెను. భార్యభర్తల సంబంధము కంటె ఎక్కువగా మిత్రుని ప్రేమ సంబంధమునకు ఎక్కువ మహత్తును ఇచ్చెను. యుద్ధ క్షేత్రమున సోదరుడగు లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు రామునికి విభీషణుని చింత ఎక్కువగా పీడించుచుండెను. ఇతనికి లంకారాజ్యము లభించవలెను. అనగా రామునికి లక్ష్మణుడగు సోదరుని కంటె విభీషణుని వంటి మిత్రుడే ఎక్కువ.

తన ఇల్లు - తన గురువు. విశ్వామిత్రుని గృహము, అత్తగారిల్లు వాటిలో రామునికి సేవచేసిన తరువాత ఇట్లు చెప్పెను - నాకు శబరి ఫలముల వంటి తియ్యందనము - ఆనందనము మరి ఎక్కడను లభించలేదు. అనగా ప్రేమతో ఇచ్చిన రేగు పండ్లను రాముడు ఇతర అహార పదార్థముల కంటే శ్రేష్ఠముగా భావించెను. మునులు రాముని సహజ స్వరూపమును (సచ్చిదానంద పరబ్రహ్మ) వర్ణ చేసెదరు. రాముడు సంకోచముతో తలవంచి నిలబడి యుండెను. అనగా సంతోషించక సంకుచితుడగును. కాని కేవట్ (నావనడుపు) వానిమిత్రుడుగా చెప్పినప్పుడు వారికి మిక్కిలి ఎక్కువ ఆనందము లభించును. వానరుల సోదరుడు అన్నప్పుడు తన గొప్పతనమును భావించును. ఓ సోదరా! ముల్లోకముల యందు ప్రేమ కృతజ్ఞతను పాటించువాడు. రామునికి సముడు రెండవ వాడు లేడు. ఆయన హనుమంతుని సేవలకు కృతజ్ఞుడయి అతనితో చెప్పెను. నేను నీకు ఋణపడి వున్నాను. సేవకుని ద్వారా చేసిన సేవకు ఇంత కృతజ్ఞత ప్రకటించు రాముని వంటి వారు ఎవరును లేరు. తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. రాముని స్నేహము, శీలము (వినయమును చూచి కూడ ఒకవేళ హృదయమున వారి ఎడ భక్తి భావము కలుగపోయినచో ఓ రామా! నీ జన్మ అర్థమేమి? వ్యర్థమయ్యెను. మీ అమ్మ నీకు జన్మనిచ్చి వ్యర్థముగా తన జీవితమును శరీరమును కూడ నాశనము చేసుకొన్నది.

121. ఓ రఘువీర! నీవు ధనవంతులు లేక గర్వముగలవారిని నిర్లక్ష్యము చేయుదువు - ఇందులోనే నీ గొప్పదనమున్నది. పేదలను గౌరవించి, వారిపైన కృపచూపుచున్నావు. దేవతా సమూహము ప్రయత్నము చేసి చేసి ఓడిపోయినది. అయినా వారికి స్వప్నములో కూడా దర్శనమియ్యరు. అయిన నీకు నావ నడుపు నావికుడు నిషాద రాజు గుహుని, కపట స్వభావము గల వానరులు - ఎలుగుబంట్లు పాపాత్ములను నీ స్నేహితులుగా చేసుకొని సోదరులవలె వ్యవహరించితివి. నీవు దండకారణ్యవనమునందు విహరించుచూ అనేక మంది మునులతో కలసితివి. కాని ఈ విషయము నీవు ఎవరికిని తెలియచెప్పలేదు. కాని నీవు గ్రద్ద జటాయువు, అడవి జాతి శబరి యొక్క అందమైన ప్రేమకు చర్చ వరుసగా అందరితోను చెప్పితివి. అనగా తపస్వీకులు, జ్ఞానులు, మునులు యొక్క మహత్యము, సన్మానమును చేయలేదు. కాని జటాయువు, శబరిని నీకు పరమ ఆత్మీయులుగా ప్రకటించితివి. భావము ఏమనగా నీవు గర్వము గల వారిని, పెద్దవారిని ఉపేక్షించి సదా దీనులను దుఃఖముతో నున్న వారిని దీనులను దళితులను ఆదరించితివి.

నీవు కుక్క చెప్పగా సన్యాసిని ఏనుగు మీద కూర్చోపెట్టిన శరము నుండి బయటకు పంపితివి. అతనిని మఠమునకు మహంతగా చేసితివి. అనగా సన్యాసికి కుక్కమాట వింటివి. దీని విరుద్ధముగా భార్యసీతను నిందించువారిని, మూర్ఖుడగు చాకలిని తన ప్రజగా భావించి నీతిని పాటించుచూ ప్రజలను రక్షించుటకు రాజు కర్తవ్యము నీ నగరము అయోధ్యలో నివసింపచేసితిని. అందువలన ఇది నిరూపణ అయ్యెను. నీ ఆస్థానములో సదా ఈ పద్ధతి అమలులో వున్నది. పేదవానికి సదా సన్మానమును చేసెను. అయినా ఓదీన దయాలుడా. ఈ దీనుడగు తులసీదాసు విషయము నీకు ఎవరును చెప్పలేదు. అదేనాకు ఆశ్చర్యము కల్గుచున్నది.

122. రాముడు దీనులకు మేలుచేయువాడు. ఇతడు మిక్కిలి కోమలమైన స్వభావము గలవాడు. కరుణానిధి. రాముని అన్నిటికంటె గొప్ప విశేషత ఏమనగా, కారణము లేకయే నిస్వార్థముగా ఇతరులకు ఉపకారము చేయును. సాధనము లేని, హీన - దీనులు గౌతమ ముని భార్య అహల్య తన భర్త శాపము చేత శిల అయివుండెను. రాముడు తన ఇంటినుండి కాలినడకతో బయలుదేరి, తన పవిత్ర చరణములతో దానిని స్పర్శ చేసి భయంకరమైన శాపమునుండి ఆమెను ఉద్ధరించెను. నిషాద రాజగు గుహుడు సదా హింస చేయుచుండెను. అతని శరీరము తామసిక గుణ ప్రధానమైనది. అతడు మనస్సునందు పశువుల వలె విహరించుచుండెను. రాముడు అతని ప్రేమ వశమునకు గురి అయి అతని కులము, జాతిని లెక్కించక తన హృదయమున ఆలింగనము చేసుకొని కానుకగా ఇచ్చెను.

ఒకవేళ ఇంద్రుని పుత్రుడు జయంతుడు రాముని ఎడ, సీత చరణముల యందు

ముక్కుతో పొడిచి భయంకరమైన నేరము చేసినప్పటికి, వర్ణించుటకు వీలు కానప్పటికిని అతడు వ్యాకులముతో శరణు జొచ్చుటకు చెడ తిరుగుచుండెను. ఎక్కడ శరణు పొందలేక చివరకు రాముని శరణు లభించెను. అతడు దానికి అభయ దానమొసంగి దాని భయమును తొలగించెను. జటాయువు గ్రద్ద పక్షియోని యందు పుట్టెను. ఇతరుల మాంస భక్షణము చేయుచుండెను. గొప్ప వ్రతము చేయునది కాదు. రాముడు దానిని తన తండ్రివలె చివరి క్రియలు చేసి అన్ని విధములుగా దాని జీవితమును సఫలమొనర్చెను.

శబరి మూర్ఖురాలైన నీచజాతికిచెందినది. ఆమెను లోకము, వేదములు రెండును నిర్లక్ష్యము చేసెను. అనగా లోక మర్యాద వేద మర్యాదయందు ఆమెకు స్థానము లేకుండెను. ఆమె ఉభయుల ద్వారా త్యజింపబడివుండెను. కాని కృపాసాగరుడగు రాముడు ఆమె ప్రేమను చూచి ఉద్ధరించెను. తన సోదరుడగు వాలి భయము చేత వికలుడయి, సుగ్రీవుడు రాముని శరణు జొచ్చెను. నన్ను రక్షించమని ప్రార్థన చేసెను. రాముడు తన భక్తుని యొక్క ఆ భయంకరమైన దుఃఖమును సహించలేక పోయెను. అతడు వాలితో తిట్లు తిని కూడా అతనిని వధించి సుగ్రీవుని దుఃఖమును నివారించెను.

శత్రువగు రావణుని చిన్న తమ్ముడు విభీషణుడు రాక్షసుడు ఏ భజనకు అధికారి? కాని అతడు రాముని శరణుజొచ్చినప్పుడు రాముడు స్వయముగా ముందుకు వెళ్ళి చేతులు చాచి అతనికి స్వాగతము చెప్పెను. వానరములు, ఎలుగుబంట్లు పాపాత్ములు. వాటిని స్మరణకు తెచ్చుటయే అమంగళముగా భావించెడివారు. ఓ నాథ! నీ మహిమ గొప్పది. వారిని కూడా పవిత్రులను చేసితివి. వేదములు ఇందుకు సాక్ష్యము.

ఓ రామా! నేను ఎంతవరకు లెక్కించగలను? నీవు ఆదీనుల ఆపదలను కష్టములను తొలగించితివి. కలియుగమున పాపములతో బంధింపబడి యున్నది. తులసీదాసు పైన కృప చూపుట నీవు మరచి పోయితివి. అనగా తులసీదాసుపైన కృప ఎందుకు చూపవు?

(భావము ఏమనగా రాముడు దీనుల దుఃఖముతోనున్న వారి వద్దకు తానే వెళ్ళి వారి దుఃఖమును తొలగించువాడు. ఇటువంటి ఆలోచన గలవాడు).

123. రాముని భక్తి చేయుటకు చాలా కష్టములను ఎదుర్కొనవలసి వచ్చును. ఇది చెప్పటము చాలా సులభము. కాని చేయుటలో మిక్కిలి అపారమైన మిక్కిలి కష్టము. దీని రహస్యము తెలియును. ఇది చేసిన వారికే తెలియవచ్చును. రాముని భక్తి చేయువానికి ఎంత కఠినము. రహస్యము అనునది అతనికి తెలియునని భావము. ఎవరైనా ఏదేని కళయందు ప్రవీణుడైన ఆ కళ అతనికి సరళముగా సుఖమునిచ్చునదిగా నుండును. ఇతరులకు కాదు. గంగానదీ ప్రవాహమున చేప జల ప్రవాహమును ఎదురించి, దానికి విరుద్ధముగా సరలముగా వెళ్ళును. కాని ఏనుగు అటువంటి గొప్ప జంతువు (ప్రాణి) ఆ ప్రవాహమున కొట్టుకొని పోవును. అనగా చేపకు జల ప్రవాహమునకు విరుద్ధముగా పోవు శక్తి తెలియును. ఇందువలన దానికి ఆపని సులభము. కాని ఏనుగునకు ఈ కళ తెలియదు.

ఇందువలన చంపబడును. ఇదే మాదిరి రాముని భక్తింహస్యమును తెలిసినవాడే దానిని చేయగలడు. ఆనందమును పొందగలడు. కాని అనుభవము లేని వానికి ఇది అగమ్యము.

(తులసీదాసు మరొక ఉదాహరణము ద్వారా వీనిని తెలియచేయుచున్నాడు). ఇసుకలో కలిసివున్న చక్కెరను బలము ద్వారా భయంకరమైన పరిశ్రమ ద్వారా ఇసుకనుండి వెలికి తీయుట సాధనము కాదు. కాని ఈ చక్కెర రసమును తెలుసుకొన్న చిన్న చీమ ప్రయత్నము లేకయే ఇసుక నుండి వేరు చేయగలదు. ఆనందమును పొందగలదు. ఈ విషయమే రాముని భక్తి ఎడ అమలు చేయవచ్చును. అనుసరించవచ్చును. భక్తి ఆనందము తెలిసిన వారికి ఇది మిక్కిలి సరళము. ఇప్పుడు రామభక్తి ఎవరు చేయగలరో తులసీదాసు చెప్పుచున్నాడు. యోగులు ప్రపంచమున కనుపడునటువంటి అన్నియు సమస్త పంచభూతాత్మకమగు ప్రపంచము నంతటిని తన మనస్సులో ఇముడ్చుకొని నింద్రా అనగా అజ్ఞానమనెడి నింద్రాను వదలి నిద్రించును. అనగా అవిద్యను నాశనము చేసి ఆత్మస్వరూపమను చింతన యందు లీనమగును. బ్రాహ్మీ అవస్థను పొంది, సంపాదించి, భేదాత్మకమైన జ్ఞానమును (భేదబుద్ధిని) పూర్తిగా తొలగించుకొనును. అతడే వైష్ణవ పదము యొక్క పూర్తి సుఖమును పొందును. భావము ఏమనగా ఎవరయితే ప్రాపంచిక వస్తువుల సంబంధముల మాయా మోహముల నుండి ముక్తుడు కావలెను. సంపూర్ణ విశ్వమును తన హృదయములో ఆత్మ దర్శనము చేసుకొనునో, తన పరాయి అనుభవము నుండి వేరగును. ఇదియే ఆత్మ జ్ఞాని బ్రహ్మానందమునకు పూర్తిగా అధికారి కాగలడు. భోక్త అగును.

ఈ బ్రహ్మానందము అనగా బ్రహ్మ అవస్థయందు ప్రాప్తించుకొని, సాధకుడు శోకము, మోహము, భయము హర్షము, రాత్రి, దేశ కాలము యొక్క హద్దులకు వేరుగా అధిగమించి, పూర్ణముగా ఆత్మజ్ఞాని అగును. అనగా వీటి అన్నింటి ప్రభావము అతనిపైన వుండదు. తులసీదాసు చెప్పుచున్నాడు : ఈ దశను పొందకయే అసత్యమును సత్యముగా భావించుట పూర్తిగా తొలగిపోదు.

(రాముని భక్తిలోని సుగమము, అగమ్యము రెండును చెప్పెను - తులసీదాసు సగుణ నిర్గుణముల సమన్వయము చేసెను. ఇసుక ప్రపంచములోని వాసనలు. రసమును తెలుసుకొనుటవలన చక్కెరను తేలికగా బయటికి తెచ్చును. వాసనలను వదిలి భక్తి రసము ఆనందమును భక్తుడు పొందును.)

124. ఒక వేళ రాముని చరణముల యందు ప్రీతివున్నచో రాత్రింబవల్లు మూడు విధములైన కష్టములు ఆపదలనే ప్రవాహమును ఎందుకు సహించవలెను? అనగా నిరంతరము ఆపదలను ఎందుకు అనుభవించవలసియుండును? ఎవరయితే రాత్రింబవల్లు స్వప్నములో కూడా సంతోషమనెడి అమృతమును పొందినచో ఈ మనసు మృగతృష్ణవలె అసత్యమైన ఈ ప్రపంచములోని విషయ వాసనలను సత్యమని వాటి వెనుక జింకవలె చెడు తిరుగుట తన ప్రాణమును కోల్పోవుట. అనగా ప్రపంచములోని విషయ వాసనలు మృగతృష్ణలోని

జలమువలె అసత్యమైనవి. ఇందువలన వాటివెనుక పడుట వ్యర్థము. సంతోషమే ఒకే ఒక సత్యము. సుఖమును కల్గించుచున్నది. ఒకవేళ లక్ష్మీపతి భగవంతుని మహిమను హృదయములో ఆలోచించి, భక్తి భావముతో మనస్సు అతని భజన చేసినచో, ఈ ఆకలితోవున్న కుక్క పొట్టలోపలికి పోయిన దానివలె ప్రతి ద్వారము వద్దకు ఎందుకు తిరగవలసి వచ్చును?

ఏలోభి తన దురాశకు లోనయి ఆశకు దాసుడగును. వారు అందరికి దాసులుగానే వుండవలసివచ్చును. అగును. ఎందుకనగా తన ఆశలను పూర్తి చేసుకొనుటకు వారికి బానిసల వలె అందరిని సంతోషపరచవలసి యుండును. కాని వారునమ్మి (ప్రభువుపైన విశ్వాసముతో) తమ ఆశలపైన విజయమును పొందినచో వారు కేవలము భగవంతుని సేవకులే అనగా భగవంతుని జనులు. ఓ రామా! నేను నిన్ను కేవలము ఎందుకు ప్రార్థించుచూవున్నాను. అంటే నా దగ్గర భజన సాధనములు ఒకటి కూడా లేవు. అనగా నేను శ్రవణము, కీర్తన, వందనము మొదలగునవి నవ విధములైన భక్తియందు ఒక సాధన కూడా తెలియదు. ఇందువలన ఓ నాథా! నేను తులసీదాసునగు నాపైన కేవలము నీపేరుతోనే కృపచూపుము. అనగా నేను కేవలము నీపేరు స్మరించుచూ వుంటాను. నీకు నాకు ఇదే సంబంధము.

125. నాకు రాముడు మధురముగా (ప్రియముగా) సాహిత్యము యొక్క నవరసములు వ్యంజనమునకు సంబంధించిన ఆరు రసములు మొదలగునవి నాకు సారహీనముగా కనబడుచున్నవి నాకు. అనగా నాకు బాగుండవు. నాకు సాహిత్యమున మంచి రుచికరమైన, భోజనము నందు ఆనందము లభించుటలేదు. నేను వేరు వేరు శరీరములను ధరించి, అనగా విభిన్నమైన యోనులయందు పుట్టి ప్రపంచములోని విషయ వాసనలన్నియు అసత్యమైనవి, మోసముతో కూడినవని ఇతరులు చెప్పగా విని స్వయముగా తెలుసుకొన్నాను. ఇవి తమ ఆకర్షణ వలలో చిక్కింపచేసుకొని జీవుని జ్ఞానమును దోపిడి చేయును. స్వప్నములోకూడా మనస్సు విసుగు చెందదు. చాలా ఆకర్షణీయముగా నుండును. ప్రబలముగా నుండును. నేను నా హృదయమున తెలుసుకొన్నాను. నేను తులసీదాసును ఒకే ఆధారమున బలసహాయమున భగవంతుని దౌష్ట్యముతో కూడిన మాటలు చెప్పుచున్నాను. నా బలము ఏమనగా నాథా! నీవు నీపేరు గౌరవమును నిలుపుకొనుటకు కరుణచేత ఎవరెవరినో భవసాగరము నుండి దాటుటకు నమ్మకము కల్గించితివి. అనగా నీ నామస్మరణ చేసిన వారందరికి, నీవు ఉద్ధరించితివి. ఎందుకనగా నీవు ధీనబంధువు. పతితపావనుడవు మొదలగు రూపమున ప్రసిద్ధి పొందితివి. ఇట్లు చేయనిచో నీకు చెడ్డపేరు వచ్చేది. ఈ భయముననే నీవు అందరిని ఉద్ధరించితివి. అందువలన నన్ను ఉద్ధరించుము.

(సాహిత్యమున నవరసములు (1) శృంగారము (2) హాస్యము (3) కరుణ (4) వీర (5) రౌద్ర (6) భయానక (7) భీభత్స (8) అద్భుత (9) శాంతిరసములు. షడ్రసములు (1) కారము (2) ఉ[illegible] (3) తీ[illegible] (4) పులుప (5) [illegible] (6) [illegible]. రాముడు ప్రి[illegible] అయిన

126. ఓ రామా! నా మనస్సు నీలో ఎప్పుడును అనురక్తము కాలేదు. కపటము, మోసము వదలి తన స్వభావము ననుసరించి నిరంతరము ప్రపంచములోని విషయ వాసనలయందు ఆసక్తి కల్గియున్నది. అనగా విషయములయందు ఇష్టము కల్గియుండుట మనస్సు యొక్క సహజ స్వభావము. ఇది ఈ విధముగా తన్మయము పరాయి స్త్రీల ప్రక్కకు చూచితిని. ఇంటింటా యున్న పాపములను, జగడములు విన్నాను. అదే మాదిరి సాధువుల, సజ్జనుల, భక్తుల సత్సంగము చేయలేదు. గంగానదిలోని నిర్మలమైన నీటి అలలవంటి పవిత్రము చేయునట్టి రాముని గుణములను వినలేదు. ఈ ముక్కు (నాసిక) మంచి మంచి సుగంధములను (సువాసనలను) పీల్చకోరుచున్నది. నాలుక షడ్రసోపేతమైన ఆహారమును తినగోరుచున్నది. సదా తినగోరుచున్నది. అదేమాదిరి నాసిక రాముని మెడలో వేసిన పూలహారము - సువాసనను పీల్చుటకు, నాలుక భగవంతుడు ఎంగిలి చేసిన పదార్థములను అనగా భోగమును పొందుటకు ఉత్సాహముతో నిండి పేరాశ పడదు. అనగా కోరదు.

పాపాత్ముని శరీరము శ్రీగంధము. చంద్రముఖి, సుందరియగు స్త్రీ. ఆభూషణములను, వస్త్రములను స్పర్శ చేయ కుతూహలమును చూపెట్టును. అదేమాదిరి భగవంతుడగు రాముని చరణ కమలముల స్పర్శకొరకు ఆశించదు. నేను మనసా, వాచా, కర్మణా చెడు దేవతల, స్వాములకు సేవ చేసితిని. అదేమాదిరి రాముని సేవచేయలేదు. ఒకసారి నమస్కరించిన కృతజ్ఞతా భారమున అణగి సంకోచము అగును. అనగా రాముడు అటువంటి శీలమునకు కేంద్రము.

ఈనాచంచలమైన చరణములు నాలోభత్వమును సంపాదించుటకుగాను ఇటింటా వాకిలి వద్దకు చెడుగా తిరుగుచున్నాను. కాని ఈ దురదృష్టవంతుడు ఎప్పుడైనా ఆశ్రమములోనికి వెళ్ళి నడిచి అలసిపోలేదు. వనవాస సమయమున సీత - రాముడు వున్నచోటికి వెళ్ళలేదు. అనగా చిత్రకూటము, పంచవటి, దండకారణ్యము మొదలగు పవిత్రమయిన పుణ్యస్థలములయందు వెళ్ళలేదు ఎప్పుడును. ఓనాథా! నా అంగములన్నియు నీ చరణములనుండి విముఖమైయున్నవి. ఎప్పుడును నీ చరణ సేవచేయలేదు. కాని కేవలము నానోరు నీ ఆధారమును పట్టుకొన్నది. భావము ఏమనగా నా నోటితో నీ నామమును పేర్కొనుచున్నాను. దీనికి కారణము తులసీదాసుకు ఈ విషయమున నమ్మకము వున్నది. భగవంతుడు కృపామయుడు. భగవంతుడు అందరి ఎడ కృప కల్గియుండును.

(ఈ గేయమున లోక పక్షమును, మర్యాదను చిత్రీకరించెను. రామభక్తికి ఆటంకము కలిగించు భూత ప్రేతల పూజను తులసీదాసు ఖండించెను.)

127. తులసీదాసు తన పాపములను స్మరించి ఆత్మగ్లానితో నిండి, రాముని ప్రార్థించుచూ వున్నాడు :

ఓ రామా! నీవు నన్ను యమయాతనల చేతనింపుము. అనగా నేను మాటిమాటికి

యమయాతన (జన్మమరణముల యాతన) అనుభవించునట్లు ఏర్పాటు చేయుము. ఎందుకనగా ఓ రామా! నేను నీయటువంటి పవిత్రమైన, సౌందర్యమైన హృదయము (మంచి హృదయము)గల స్వామి నుండి విముఖుడనైతిని. అనగా నేను నీసేవ (భక్తి) చేయలేదు. నీవు నన్ను పది మాసములు గర్భస్థితిలో వుంచితిని. తల్లి-దండ్రులవలె పోషించితివి. మేలుచేకూర్చితివి. తరువాత పెద్ద అయిన పిమ్మట నాయటువంటి మూర్ఖుడును, దుష్టుడును జ్ఞాని (వివేకుని) శీలవంతునిగా, ఆదరమునకు యోగ్యునిగా చేసితివి. నేను నీయటువంటి అంతర్యామి. ప్రతిఘటము (శరీరమున నివసించు)నవుండువాడవు. నేను కపటము చేయుచున్నాను. నా పాపమును దాచి వుంచుటకు ప్రయత్నము చేసితిని. అనగా నేనిట్లు ప్రయత్నించటము నా మూర్ఖత్వమునకు చరమ సీమ. ఎందుకనగా నీకు తెలియకుండ ఏమి దాచివుంచగలను? అయినా ఓ రామా! ఇటువంటి దుష్టబుద్ధిగల నీచసేవకుని ఎడ, ఎప్పటికిని మలినము రానివ్వలేదు. అనగా ఎప్పుడును అతనితో కోపగించుకొనలేదు. చెడుభావన కలుగలేదు.

నేను ఇక్కడ నీ దాసుడనని చెప్పుకుంటూ పొట్టనింపుకొనుచున్నాను. అనగా రామ భక్తుడనని పిలవబడుచూ బిక్షము - అడుగుకొని పొట్ట నింపుకొనుచున్నాను. కాని అక్కడ నా హృదయమునందు విషయ వాసనలకు అమ్ముడు పోయితిని. అనగా నా హృదయము విషయ వాసనల యందు అనురక్తమైయున్నది. అయినా ఓ ప్రభూ! నీ ఔదార్యము మిక్కిలి ప్రశంసనీయము. నాయటువంటి ధూర్తుడు, మోసగాడు నిష్కపట భావమున కృప చూపితివి. నీవు నా మోసమును క్షమించి నాపైన సదా కృప చూపితివి. ఓ సీతకు ప్రియమైన రామా నీవు నాకు ప్రతి క్షణమున చూపెట్టిన ఉపకారములను చక్కగా తెలుసుకొని అర్థము చేసుకొని నా యొక్క వజ్రమునకంటె కఠినమైన హృదయము ప్రేమతో ఛేధింపబడలేదు. నా హృదయము ఉపకారములను పొంది కూడ నీతో ప్రేమ కల్గియుండవలెననెడి కృతజ్ఞతను చూపెట్టలేదు.

ఓ స్వామి! నేను నా బుద్ధి అనెడి త్రాచుయందు ఒక పల్లెములో స్వామీ అనగా నీవలన నాయందు చూపెట్టిన అన్ని ఉపకారములను, రెండవ పల్లెములో, నేను స్వామికి విరుద్ధముగా చేసిన అచరణలనన్నింటిలో కొన్నింటిని మాత్రమే వుంచి తూకము వేసిన నా ప్రక్కవున్న పల్లెము బరువుగా వున్నట్లు కనపడెను. అయిన ఓ నాథా! నీవు ఇంత జరిగినా కూడ, నా మేలు చేయుచున్నావు. భవిష్యత్తులో కూడా చేసెదవు. తులసీదాసు తన ప్రక్కన నుండి ఇది తెలియును. తన ఉపకారములచేత అణగిపోయిన ఈ దాసును ప్రభువే ఉద్ధరించగలడు. ఎందుకనగా వారు ఇంతవరకు అతని అపరాధములన్ని క్షమించి, వాటిని పాటించుచూ వచ్చుచున్నారు.

128. నేను ఈ విధముగా జీవితమును గడపగలనా? కృపగల రఘునాధుడగు రాముని కృపతో సజ్జనుల, భక్తుల వంటి స్వభావమును స్వీకరించగలనా? భక్తులు లభించిన దానితో సదా సంతుష్టులై యుందురు. ఎవరిని ఎప్పటికిని ఏ వస్తువు కొరకు యాచించరు. అనగా

పూర్తిగా నిష్కాముడనైయుందును. నేను త్రిశుద్ధిగా ఇతరులకు మేలు చేయుట యందు నిమగ్నమై యుందును. ఈ నియమమును సదా పాటించుచుండును.

నేను నా చెవులతో కఠోరమైన అసహ్యమైన మాటలు విని కూడా నేను క్రోధాగ్నియందు కాలిపోను. అనగా అవమానింపబడినప్పటికి క్రోధమును చూపెట్టను. నేను గౌరవము, సన్మానము కోరికలనుండి ముక్తున్ని అయి సదా మనస్సును ఏకరసముగా వుంచుకొందును. సుఖ దుఃఖముల ప్రభావము నుండి ముక్తుడనయి శాంతముగా నుంచుకొందును. ఎప్పటికిని చలింపను. నేను ఎల్లప్పుడు ఇతరుల సద్గుణములనే ప్రశంసించెదను. ఎప్పటికిని ఇతరుల పొరపాట్లను మరచి కూడ పేర్కొనను. నేను నా శరీరమునకు సంబంధించిన చింతలను వదలి సుఖ-దుఃఖములను సమాన భావముతో సహించెదను. అనగా సుఖములో వుప్పొంగను. దుఃఖములో దుఃఖపడను. తులసీదాసు చెప్పుచున్నాడు ఓ ప్రభూ! నేను ఈ మార్గముననే నడచుచూ భగవంతుని స్థిరమైన భక్తిని పొందెదను.

(ఈ గేయమునందు ఆశా సంచారి ద్వారా భక్తి భావనను జాగృతము చేసుకొనుటకు ప్రయత్నము చేయబడినది. రామభక్తి కొరకు అవసరమైన గుణములు సంత్-సాధుపుల భక్తుల రూపమున వర్ణన చేసెను.)

129. నాకు ఇతరుల ఎవరిపై భరోసాలేదు. అనగా రామనామమును వదలి ఇతర ఏ సాధనము నేను భరోసా పెట్టుకొన్నది ఏదీలేదు. ఈ కలియుగమున సాధనా రూపమనెడి వృక్షములు వీటిలో శ్రమఫలములే ఉద్భవించును. (కాయును). భావము ఏమనగా సాధనమున్నియందు శ్రమ ఎక్కువ చేయవలసి యుండును. అయిన మనస్సులోని కోరికలను సిద్ధింపచేయలేకున్నవి తపము, తీర్థము, ఉపవాసము, దానము యజ్ఞములు మొదలగు అనేక సాధనములు వున్నవి. వాటిలో ఎవరికి ఏది ఇష్టమో దానిని వారు చేయవలెను. కాని ఇవన్నింటిని చేసిన ఫలితము ఏమి లభించుచున్నది? ఇది అది లభించిన తరువాతనే తెలుసుకొనవచ్చును. వేదముల యందు కర్మఫలములు ఆకుల నిండ బందింపబడి వున్నవి. అనగా వీటిని గొప్పగా వర్ణింపబడి వున్నది. కలియుగము తన దుష్ట ప్రభావము చేత ఈ ఫలములను ప్రాప్తించక అడ్డు చేయుచున్నది. వీటిని చేయుటవలన లాభము ఏమియున్నది?

మానవులు శాస్త్రీయముగా జపము - యజ్ఞములు చేయుచున్నారు. అయినా వీటితో కూడా ఆపని అగుటలేదు. అనగా వారి కోరిక పూర్తి కాలేదు. యోగము సిద్ధులను సాధించుట వలన స్వప్నములో కూడా ప్రార్థించుట లేదు. వీటిని చేయుట వలన రోగములు, ప్రియజనుల వియోగము ఆపదలను అనుభవించవలసి యుండును. అనగా యోగ క్రియల చేత శరీరమునకు రోగము వచ్చును. స్వజనుల వియోగము అనుభవించవలసియుండును. ఇందువలన ఇవి నిరుపయోగము. కామము, క్రోధము, మదము, లోభము, మోహము - చెడు వాసనలు కలసి, జ్ఞానము - వైరాగ్యము యొక్క

వృత్తులను హరింపచేయును. నష్టము కల్గించినవి. ...్యాసము స్వీకరించిన మనస్సు చెడిపోవుచున్నది - అనగా మిక్కిలి వ్యాకులమునకు గురి అగుచున్నది. వాటితో నిర్మించిన పచ్చికడవలో నీరుపోసిన కరిగి పగిలిపోవును. మనస్సు సన్యాసము యొక్క కఠిన కఠోరసాధనములను సహించి విరిగిపోవును మనస్సు. భావము ఏమనగా మనస్సుద్వారా సన్యాసము స్వీకరించుట అనిష్ట మొదట మనస్సును శాంత పరుచవలెను.

అనేక రకములైన అభిప్రాయములు మీమాంస, న్యాయ, సాంఖ్య మొదలగునవి. అనేక పథములు (నానక్‌పంథ్, కబీర్‌పంథ్ మొదలగునవి) అనేక పురాణములు విని తెలుసుకొన్నాను. కాని ఇక్కడ చతుర్దిశల జగడములు - తంటాలు వ్యాపించివున్నవి. మరికొంతమంది చెడు చేయుచున్నారు మొదలగునవి ఇందువలన నా గురువు రామభజన చేయుటకు అజ్ఞాపించెను. ఈ రామభక్తి మార్గమే రాజమార్గమువలె ప్రశస్తము. నిష్కంటకము అయ్యెను. లక్ష్యము వరకు చేరుటకు అనుకూలమైయున్నవి. రామభక్తి యందు విశ్వాసము, ప్రేమ పెట్టక అన్య సాధనముల వలన జీర్ణమయి నశించవలసి వచ్చును. అదే బాగుగా చనిపోనీ. కాని ఈ భవసాగరమును దాటుటకు రామ నామమొక్కటియే ఓడవలె ఉపయోగపడుచున్నది. ఎవరైనా ఈ సముద్రమును దాటకోరినచో ఈ ఓడ అనే దానిపైన ప్రయాణము చేయవలెను. అనగా రామ నామ స్మరణ ద్వారా ప్రపంచమునుండి ముక్తుడు కావలసియున్నది.

(కర్మకాండను వ్యతిరేకించడమైనది చాల తక్కువ మందికి మాత్రమే కర్మకాండ ఫలితము లభించును. చిత్తశుద్ధికి వ్యతిరేకమయినది. కేవలము రామనామమే సర్వశ్రేష్టము. సన్యాసము కష్టమయినదని తులసీదాసు చెప్పెను. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము - ఇది చాల కఠినమైనది. ప్రాపంచికమైన మనోవాంఛలు ఫలీభూతమైన, ఇంద్రియముల పైన విజయమును పొందవలెను. మనస్సు పూర్తిగా శాంతము, నిర్లిప్తము అయియుండవలెను. నిర్వికల్ప చిత్తముగల వారే సన్యాస ఆశ్రమమునకు అధికారులు. ఇతరులు స్వీకరించలేరు. మనస్సు అస్థిరమైనప్పుడు ఆ స్థితిలో సన్యాసమును పూనుట (గ్రహించుట) సదా అనిష్టకారి అగును.

130. సీతారాములు ఇష్టములేని వారికి అతడు కోట్లకొలది శత్రువులుగా భావించుము త్యజించుము. అతడు తనకు ఎంత ప్రియుడు అయినాసరే. ప్రహ్లాదుడు తన తండ్రియగు హిరణ్యాకశ్యపుని, విభీషణుడు తన అన్న అయిన రావణుని, భరతుడు తన తల్లియగు కైకను బలిచక్రవర్తి తన గురువైన శుక్రాచార్యులను, వ్రజగోపికలు పతులను త్యజించి యుండిరి. ఎందుకనగా వీరందరు భగవద్ ప్రాప్తి పొందుటకు ఆటంకముగా నుండిరి. వారు భగవంతుని ప్రేమించక యుండిరి. వీరిని చేయనీయక వుండిరి. అయిన తమ స్వజనులను త్యజించిన వీరందరు లోకమునకు ఆనందమును కల్గించిరి. లోకమునకు శుభము చేకూర్చువారు అయిరి.

వీలయినంతవరకు మిత్రులను, పూజ్యులను ఒప్పుకొనే ప్రశ్న వారి అందరికి రాముని స్నేహము వలన, స్వీకరించవలెను. అనగా మిత్రులు, పూజ్యులు రాముని పూజించువారే. కాటుక ఏమి పనికి వచ్చును? అది పూసిన కన్ను చెడిపోవుటవల్ల కాటుక నిరుపయోగము ప్రపంచ స్నేహబంధనములున్నందున ఏమిలాభము. దానివలన మానవులు - ఇహపరలోకములు రెండును చెడిపోవును. నేను ఎక్కువగా ఎక్కడికి చెప్పవలయును? తులసీదాసు చెప్పుచున్నాడు. మన ఉద్దేశము - దేనివలన రాముని చరణముల యందు ప్రేమ ఉత్పన్నమయిన అతడే మన హితైషి. మనకు అన్ని విధములుగా పూజ్యుడు. (ప్రాణములకంటే ఎక్కువ ప్రియుడు.)

(ఈ గేయము నందు ఏకాగ్రత గురించి సంకేతము చేయబడినది. కొద్దిపాటి ఆకర్షణ పెంచుటకు ప్రయత్నము నందు అజ్ఞానము, మోహము పెంపొందిన ఆ ప్రయత్నము వ్యర్థము.)

131. రాముని ఎడ ప్రేమలేని వారి జీవితము వ్యర్థము. ఇటువంటి వారు (ప్రేమలేని) ఈ లోకమున గాడిద, కుక్క, పందికి - సమానము. అనగా ఉద్దేశ్య హీనమైన జీవితము గడపవలసి వచ్చును. భావము ఏమనగా రామునియందు ప్రేమలేనివాడు గాడిదవలె బరువు మోయుచూ, కుక్కవలె ఇంటింటా వాకిలి దగ్గర తిరుగుతూ, పందివలె భక్షన - అభక్షములను తినుచుండును. కామము, క్రోధము, మదము, లోభము, నిద్ర, భయము, ఆకలి, దాహము - ఇవి అందరికి వుండును. అనగా ప్రతి ప్రాణి వీటిని అనుభవించును. కాని దేవతలు, సాధువులు - భక్తులు మానవులు ప్రశంసించునట్టివారు అగుదురు. మానవ శరీరము ధరించినందున సీతాపతి రాముని ప్రేమించుట ముఖ్యముగా వుండును. ఈ శరీరము పవిత్రమగును.

ఎవరైన మానవుడు శూర-వీరుడు, చతురుడు, సుపుత్రుడు, శుభలక్షణములు గలవాడు గుణవంతుడైనా కావచ్చు. రామభక్తిలేనిచో ఎర్రిపుచ్చకాయ ఫలము వలె తన చేదును వదలదు. అనగా ఏ విధమగు ఎర్రి పుచ్చకాయ చూచుటకు బయట అందముగా వుండును. కాని తినినచో లోపల చేదుగా వుండును. అదేమాదిరి పైన పేర్కొన్న గుణములతో విరాజిల్లు చున్నప్పటికి వ్యక్తి రామభక్తి లేనిచో అతని నైచ్యము పోదు. భావము ఏమనగా రామభక్తియే మానవునిని నిర్మలుని చేయును.

కీర్తి, ఉన్నత కులము, కర్మ, ఐశ్వర్యము బాగుగా వుండవచ్చును. శీలము (స్వభావము - రూపము) కూడా లావణ్యమై బాగుగా నుండవచ్చును. కాని రాముని ఎడ ప్రేమ - భక్తి లేనిచో ఇవన్నియు ఉప్పులేని కూరలవలె రుచి హీనముగా నుండును.. భావము ఏమనగా భక్తిలేనిదే ప్రపంచములోని సుఖ సౌందర్యములు రసహీనము.

(శక్తి, శీల, సౌందర్యములు ఈ మూడింటి సమన్వయముగల మానవ జీవితము,

132. ఓ నీచుడా! నీవు రాముని వంటి యజమానిని ప్రేమించలేదు. వారితో ఏ విధమై సంబంధము పెట్టుకొనలేదు. నీద్వారా ఇంత ఆనాదరణ అయినప్పటికి ఆ రాముడు ని వదలి వేయలేదు. అనగా నీపైన ఎల్లప్పుడు దయకలిగియే యున్నాడు. నీవు ఇతర వ్యక్త (భార్యా, పుత్రులు కుటుంబ సభ్యులు మొదలగు వారితో) కొత్త-కొత్త సంబంధము అనేక ప్రకారమగు ఆలోచనలు, విషయ వాసనలు నా శరీరమును కల్చివేయునట్టివి. ప్రాణములను హరించునవి. అనగా వీటిని గురించి చింతిస్తూ-చింతిస్తూ నీవు చనిపోవుదు

నీ తరపున నీ సంబంధము కలవారు అంది మేలు కోరుచుందురు. కాని ఈ ఇ అనగా నీవు - నీ సంబంధీకులు మేలుకు మూలకారము సీతాపతి రాముడే. అనగా అ అందరికీ కళ్యాణము కల్గించువాడు. ఇతడు జీవుని జీవితము (ఆత్మ స్వరూపమున అం యందుండువాడు). ప్రాణములకు ప్రియుడు, ప్రపంచ ప్రాణములకు అంతర్యా రూపమున చైతన్యమును కల్గించువాడు), సుఖములకు మూలకారకుడు. ఇటువం రామున్ని నీవు మరిచి పోయితివి.

రాముడు నీయటువంటి దుష్టులకు కూడా మేలుచేసెను. భవిష్యత్తులో కూడా మే చేసెదరు. ఇటువంటి మంచి స్వామి యెడ నీవు ఎందుకు కష్టములను కల్గించితివి. అన విముఖుడవు ఎందుకు అయితివి? తులసీదాసు ఇట్లు చెప్పుచున్నాడు. ఓ మనసా! ఒకవే నీవు ఈ దినము కూడా ఈ విషయమును తెలుసుకొన్నట్లయితే, ఇందులోనే నీ మే వున్నది. ఇప్పటికిని ఏమియును చెడిపోలేదు. ఎందుకనగా పిరికివాడు కూడా రెండవసా యుద్ధము చేసి వీరుడు పరాక్రమవంతుడు కావచ్చును. భావము ఏమనగా నీవు మనస్సు గ్లాని పొందవద్దు. ఇప్పుడైన చైతన్యము (ఎచ్చరిక)తో రామునితో ప్రేమించ నారంభించుమ ఇందులోనే నీ కళ్యాణమున్నది.

(ఆత్మకు శాసకుడు ఎవరు లేరు. పరబ్రహ్మయే జీవికి జీవనము, ప్రాణము, జీ బ్రహ్మల భిన్నత్వము నిరూపణ అయినది. ఇందువలన అద్వైత సిద్ధాంతము అంతర్గతమున రాదు. ప్రాణములు ఐదు (పంచ ప్రాణములు భావించబడినవి. హృదయమున ప్రాణమ మల ద్వారము - అపానము నాభి యందు సమానము, కంఠమున ఉదానమ శరీరమంతటా వ్యానము.)

133. ఓ రామా! ఒకవేళ నీవు నన్ను వదిలినను నేను నిన్ను వదలను. ఎందుకనగా చరణముల వదిలి, నేను ఇంక ఎవరిని ప్రేమించవలెను? అనగా నాకు రెండవ వా ఎవరును లేరు. నేను నా చెవులతో వినలేదు. కన్నులతో చూడలేదు. మనస్సు ద్వా అందాజుగా నిర్ణయించలేదు. ఈ ప్రపంచమునకు సమానము సుఖమును ఇచ్చున మంచి స్వామి మరొకరు రెండవ వారు లేదు. నేను జడ జీవుడను. నీవు విభుడు ఈశ్వరుడవ నీవు మాయకు అధిపతివి. నేను మాయలో పడి వున్నాను. నేను నీ మాయా బంధనములల చిక్కుకొని (బంధింపబడి) దుఃఖములను అనుభవించుచున్నాను. నీవు మాయకు ఆజ్ఞచేసి నా ఉద్ధారము చేయగలవు.

నేను చెడ్డ. నీచుడనగు బిచ్చగాడిని (ఎందుకనగా నేను నా దాత ఎడ కృతఘ్నుడనయి వున్నాను) నీవు నా స్వామివి. గొప్పదాతవు. (అనగా పాత్రకు పాత్ర అను ఆలోచన లేకయే అందరికి సమాన భావముతో అంతయును ఇచ్చుచుందువు) నేను కుపుత్రుడను. నీవు నాకు తల్లిదండ్రులు. కుపుత్రుని కూడా సదా రక్షించుచూ వున్నారు. పాలించుచున్నావు. నేను మాత్రము నీ ఎడ విముఖునిగా వున్నాను. అయినా నీవు నన్ను రక్షించుచూ, పాలించుచూవున్నావు. నేను ఇట్లు నీచున్ని. ఒకవేళ నామాట కూడా ఎక్కడయినా అడిగితే అనగా కొంచెము అడిగినచో స్వీకరించిన నేను మూల్యము లేకయే వారికి అమ్ముడు పోవుదును. అనగా వారి బానిసత్వము స్వీకరించెదను. భావము ఏమనగా నాయటువంటి నీచుడు, బేకార్ (పనిలేని) మనిషిని ఎవరును పట్టించుకొనరు. ఇప్పుడు కేవలము నీ సహాయమును ఆదరమును నమ్మియున్నాను. నీవు తప్ప నాకెవరు ఇతరులు లేరు.

(మాయ, భక్తి రెండును బ్రహ్మవి. మాయ బ్రహ్మదాసి. భక్తి పట్టపు రాణి. ఇక్కడ జీవ బ్రహ్మల అనైక్యమని నిరూపించబడినది. జీవము జడము ఎందుకనగా మాయకృత ఆవరణము. జ్ఞానము పూర్ణము లేకుండుట. అణువు అయినందున జ్ఞానము పరిమితము. స్వపురుషార్థమున ఆలోచన, చైతన్యమున్నను జడమే. దీనికి విరుద్ధముగా పరమాత్ముడు ఈశ్వరుడు, విభువు (ప్రభువు) అపరిమితమైన జ్ఞాన సంపన్నుడు. మాయాధీనమున వున్నందున దుఃఖములు సుఖములు అను ద్వంద్వమున నుండును జీవుడు. పరమాత్మ ద్వంద్వమునుండి విముక్తుడు. బ్రహ్మ యొక్క అంశ స్వరూపుడయినందున జీవుడు బ్రహ్మను చెందును. జీవుడు తన స్వరూపమును మరచివుండును. జీవుడు బ్రహ్మను ముక్తికొరకు ప్రాపంచిక సుఖ వైభవములను యాచించుచుండును. ఈ గేయమున, అనన్యత, ఏకాగ్రత, రాముని ఎడ హఠము భావనవున్నది.)

134. ఓ రామా! నీవు ఉదాసీనుడయినా సరే. అనగా నన్ను గురించి చింతించుట వదలి వేయుము. కాని నీకు కేవలము నీ ఆశమాత్రమే యున్నది. దుఃఖముగా నున్నవారు, స్వార్థపరులు ఎల్లప్పుడు పిచ్చివారివలె తలాతోక లేని (పనికిరాని) మాటలు మాట్లాడుచుందురు. ఎందుకనగా వారి మనస్సు అస్థిరముగా నుండును. భావము ఏమనగా నీవు పిచ్చివారి మాటలు చెడ్డవని భావించవద్దు. నేను దుఃఖములోనుండి స్వార్థము చేత - మెలకువగా లేకుంటిని ఇందువలన చెప్పవలసిన, చెప్పరాని మాటలు అన్నియు అంటిని. జలమును దానముగా ఇచ్చు మేఘమునకు ప్రతి దానము (దానమునకు బదులు దానము) ఏవి కావలెను? అనగా దాని ధర్మము, ఇందువలన దానిని ప్రశంసించవలసిన పనిలేదు. కాని చాతక పక్షి మేఘముల ఎడ ప్రేమను నిర్వహించును. దానిని చూచి అతనిని (చాతకమును) ప్రశంసింపవలెను. ఇక్కడ ప్రశంసకు మూలకారణము మేఘమే అది స్వార్థము లేకయే, చాతక పక్షికి స్వాతి జలమును ఇచ్చుచున్నది. కాని ప్రపంచము మేఘమును ప్రశంసింపక చాతక పక్షిని ప్రశంసించుచున్నది. ఇదే మాదిరి నీవు ఉదారుడవు, దాతవు అయినందున అందరికి సహాయము చేయుచున్నావు. కాని పరోక్షముగా భక్తులు ప్రేమ భావనవలననే నిన్ను ప్రశంసించుచున్నారు. ఒకవేళ భక్తులు లేనిచో నిన్ను ఎవరు ప్రశంసించెదరు?

పవిత్రమైన పుష్టికరమైన జలమునకు చేపకు ఏమియును లాభము లేదు. అయినా చేపకొరకు జలము వదలి మరొక స్థానము ఏదివున్నది? అక్కడ అది మృత్యువునుండి రక్షించుకొను స్థలము ఏదివున్నది? భావము ఏమనగా నాయటువంటి మనుష్యులవల్ల నీకు ఏమియును లాభము లేదు. కాని నాకు నిన్ను వదలిని రెండవ వారు ఎవరున్నారు? భవ సాగరములోని ఆపదల నుండి నన్ను రక్షించువారు లేరు. నా జన్మ జన్మల బంధనములను త్రెంచువారు ఎవరు? ఓ ప్రభూ నేను నిన్ను ప్రశంసించుచున్నాను. పెద్దల చాటున చిన్నవారు ఎల్లప్పుడు, ఆపదలనుండి రక్షింపబడుచువున్నారు. మంచి నాణెములతో పాటు చెల్లని నాణెములు కూడా చెల్లును. గోధుములతోపాటు, గడ్డిచెట్టు కూడా నీరు లభించును. భావము ఏమనగా నీయొక్క అనేక మంది భక్తుల మధ్యలో కూర్చొనుట వలన నాయటువంటి నీచుడు కూడ ఉద్ధరించపడుచున్నాడు.

నీ ఆస్థానము ఇట్లువుండే ఆస్థానములో శత్రువులు - మిత్రులు, ప్రతికూలము అనుకూలము, అందరికి మేలు కల్గును. అనగా నీవు సమానమైన భావముతో అందరికి శుభమును కల్గించెదవు. ఓ రామా! నాకు కళ్యాణము కల్గించు ఒకే ఒక రాముని నామమే ఆధారముగా నున్నది. ఓ నాథా! చెప్పుట వలన విషయము చెడిపోవును. ఇందువలన మనస్సులోనే దాచుకొని వుంచుట మంచిది. ఒకవేళ నేను నా దుఃఖములను తప్పెట కొట్టి చాటించినచో ఇందువలన నీకు చెడ్డపేరు వచ్చును. రాముని భక్తుడయినప్పటికి తులసీదాసు చాలా దుఃఖముతో నున్నాడు. ఇందువలన ఈ విషయమును మనస్సులోనే వుంచుకొనుట మంచిది. ఓ కృపానిధి! నీవు తులసీదాసు అన్ని విషయములను ఎరుగుదువు. ఎందుకనగా అంతర్యామివి.

(ఈ గేయమునందు మొదట తులసీదాసు తనను దుఃఖితుడుగా స్వార్థపరుడుగా వుంటూ తనను రక్షించమని కోరును. రామునికి చెడ్డపేరు వచ్చునని భయపెట్టును. నీవు నన్ను ఉద్ధరించక పోయినచో అందరికి నా దుఃఖగాథ చెప్పి వినిపింతును. ఇందువలన నీకు చెడ్డపేరు వచ్చును. ఇందువలన ఎవరికి చెప్పక నీకే చెప్పుచున్నాను. ఇటువంటి వాక్ చాతుర్యము ఇతర కవులలో దుర్లభము. తులసీదాసు భావమును కల్గియుండియు అప్పుడప్పుడు అలిగినప్పుడు మొండిమాటలు, (మర్యాదలేని మాటలు) చెప్పును. తులసీదాసుకు రాముని ఎడ సాటిలేని మేటి అగాధమైన విశ్వాసము. దృఢత్వము వుండెను. ఇటువంటి పదములు చాలా అందముగానున్నవి.)

135. ఓ రామా! నేను ఎక్కడికి పోవలెను? ఎవరితో చెప్పను? నాదీనుని మాటలను ఎవరు వినెదరు? ముల్లోకముల యందు నీవు ఒక్కడవే అసహాయులందరికి గతిని ప్రసాదించెదవు. వారిని ఉద్ధరించెదవు. ఈ ప్రపంచములో చెప్పాలంటే ఇంటింటా ఒక స్వామి నిండియున్నాడు. చాలమంది దేవీ దేవతలు తమను ఈ లోకమున స్వామి అని చెప్పుకొనేవారు అనేకులు వున్నారు. కాని నిరాధారులకు సహాయము చేయవలెనని నీ గుణములు మాత్రమే. అనగా నీలోనే అసహాయులకు సహాయము చేయు గుణములునీలో మాత్రమే యున్నవి.

ప్రాణులు నీ గుణగానములను చేయుచున్నారు. భవసాగరమును దాటిపోవుచున్నారు. గజేంద్రుని రక్షణ విషయమున గరుడను వదలి కాలి నడకన పరుగిడి వచ్చినదెవరు? నీయటువంటి పాపాత్ముల కేంద్రము అనగా మహాపాపాత్ముల ఎవరు పాలించి పోషించినది? (రక్షించినది) నీయటువంటి పుత్రుని ఏ తల్లి కన్నది?

నాయటువంటి దుష్టుడు, పిరికివాడు, అరచిల్లిగవ్వకు అమ్ముడు పోయిన అనగా తుచ్ఛునిని కూడా. ఓ జటాయువు శ్రాద్ధములు చేసినవాడా! బహుమూల్యునిగా చేసితివి. అనగా నాయటువంటి నీచున్ని, తుచ్ఛున్ని అయిన వ్యక్తిని అయి నేను నీపేరు స్మరించి ఈ లోకమున ఇంత గౌరవమును పొందుచున్నాను. నేను నీకు కృతజ్ఞున్ని. ఓ ప్రభూ! నా మాట నీవు చేసిన అయినది (మాట విలువ పెరిగినది) ఓ రామా! నీవు నన్ను ఉద్ధరించుటలో ఆలస్యము చేసిన, నీ ఆలస్యమనెడి తల్లి అనేక పాపములను, దుఃఖములను ఉత్పన్నము చేయును. అనగా నీవు ఆలస్యము చేసిన నేను ఏమేమి పాపములనుచేస్తానో తెలియదు. దాని ఫలితముగా అనేక రకములైన దుఃఖములను అనుభవించెదను. అందువలన శీఘ్రమే నన్ను ఉద్ధరించుము.

(రాముడు తన తండ్రియగు దశరథుడు చనిపోయినప్పుడు క్రియా కర్మలను చేయలేదు. కాని జటాయువు చనిపోయినప్పుడు తన చేతులతో దానికి పిండదానము చేసెను.)

136. ఓ దశరథరాజు ప్రియపుత్రుడు రామా! ఒకసారి (దఫా) నా ప్రక్కకు కృపాదృష్టితో చూడుము. నన్ను స్వీకరించుము. నీ శరణులోనికి తీసుకొమ్ము. నీవు వినష్టమయి వారిని మరలా నిర్మించెదవు. (సుగ్రీవుడు - విభీషణుడు) మొదలగు వారిని - వినష్టమయిన వారికిరాజ్యములు ఇప్పించితివి. శరణాగతులను పాలించువారు - నీవు తప్ప ఇంకెవరున్నారు? రెండవది పేరు పేర్కొననిచో పైన నేలవలె తుచ్ఛమైన జీవులు కూడ పొలము (పైరు) వలె అనగా జ్ఞానులు, గుణవంతులు అగుచున్నారు. నీ ఉపదేశములు, కర్మలు నా మనస్సునందు పాదుకొని పోయినవి. అనగా నాకు వాటియందు దృఢమైన విశ్వాసము ఏర్పడినది. నేను ఈ ప్రపంచములోని గొప్పవారినందరిని చూచితిని వింటిని, తెలుసుకొన్నాను. అనగా వీరిలో ఎవరిపైన నమ్మకము లేదు. నీ ఎదుట వీరు అందుకు తుచ్ఛము, లెక్కించరాని వారు. ఎందుకనగా - వీరిలో ఎంతమంది శిలగామారిన అహల్యవద్దకు వెళ్ళి కష్టమును తొలగించినవారు, పరశురాముని వంటి మహా పరాక్రమశాలి యందు క్రీడవలె సునాయాసముగా సరళముగా విజయమును ఎవరు పొందిరి? తల్లి దండ్రుల, సోదరుల మేలుకొరకు లోకము, వేదముల మర్యాదను ఎవరు పాటించిరి. తన మాటపైన స్థిరముగా నుండువారెవరు? ప్రణమిల్లిన వెంటనే భక్తులకు అన్ని విధములుగా ఆనందమును కల్గించువారు ఎవరు? స్నేహమునకు వశమయి నీచులను, దుష్టులను ఏకముచేసి పర్యటించిన వాడు ఎవరు? అనగా వారికి శరణు ఇచ్చిన వాడు ఎవరు? గ్రద్ధ జటాయువు, అడవి జాతి శబరికి నీవలె శ్రద్ధ చూపువారెవరు? శ్రాద్ధములు ఎవరు చేయుదురు?

ఆధారము లేని వారికి ఆధారము, దీనులయందు దయగలవాడు ఎవరు? వానరులు, నావికుడు, రాక్షసులు, ఎలుగుబంట్లకు మిత్రుడెవరు? ఓ మహారాజైన రామా! నీవు ఎంతోమంది, పేదలను, గుణహీనులను నీచులను కృపతో చూచితివి. వారందరు విద్వాంసుల ప్రపంచమున గౌరవముగా శోభిల్లుచున్నారు. అనగా విద్వాంసుల సాధువుల - భక్తులలో వారి గణన జరుగుచున్నది. (లెక్కించబడుచున్నారు.)

నీ బిరుదములు (యశస్సు-కీర్తి) ఇందులో ఏ ఒకటి కూడా గొప్పగా వర్ణించి చెప్పలేదు. అనగా అసత్యమైన విషయము లేదు. అయినా సముద్రము వంటివాడా! తులసీదాసు వంతు ఇంత ఆలస్యమైనది ఎందుకు? ఎందుకనగా నేను నీచుడను, అధముడను, దుష్టుడను.

137. ఓ కరుణానిధి! రామా ఏదో ఒక విధముగా నా ప్రక్కకు చూడుము. నాకు మరెచ్చటను స్థానము లేదు. కేవలము నీ యొక్క మంచి ఆధారము మాత్రమే ఉన్నది. నా బుద్ధి వేల రాతి బండల కంటె జడమై గట్టిగా మందముగా అయినది. నేను ఎవరితో చెప్పుకొందును? శిలను ఉద్ధరించనదెవరు? భావము ఏమనగా ఒక నీవే పాషాణం (రాయి) యైన అహల్యను ఉద్ధరించితివి. నీవే రాయివలె జడమైన నా బుద్ధిని శుద్ధము చేసి నిర్మలము చేయగలవు. విశ్వామిత్రుడు యజ్ఞము చేసినట్లు నేను కూడా నీ చరణముల యందు యజ్ఞము చేయనున్నాను. కోరినాను. కాని నేను కలియుగము నందలి పాపమనెడి దుష్టులను చూచి భయభీతుడనగు చున్నాను. భావము ఏమనగా నీవు తాటకిని, సుబాహు మొదలగు రాక్షసులను చంపి విశ్వామిత్రుని యజ్ఞమును రక్షించితివి. ఇప్పుడు అదే మాదిరి ఈ పాపముల నుండి రక్షించి నాకు నీ చరణముల యందు భక్తి అనెడి యజ్ఞము చేయుటకు అవకాశము ఇమ్ము.

తన కర్మ రూపమున వానర రాజు వాలి (బలశాలి) భయమున నేను బాధపడుచున్నాను. ఏ విధముగా సుగ్రీవుడు వాలి వలన బాధపడెను. నీవు వాలిని చంపి, అతనిని (సుగ్రీవునిని) రక్షించితివి. అదే మాదిరి నీవు నా కర్మల ఘాతుక ప్రభావమును నష్టము చేసి నన్ను రక్షించుము. ఓ అనాథులకు నాథుడవు. నేను నీ భుజముల ఛత్ర ఛాయ (గొడుగునీడ) లో వుండకోరుకొనుచున్నాను. రావణుడు విభీషణునిపైన చరణ తాడనము చేసి అతనిని కొట్టి వుండెను. అదేమాదిరి మోహమనెడి రావణుడు నా విభీషణుని వలె తులసీదాసునగు నన్ను పీడించుచున్నది. ఓ తులసీదాసు స్వామీ! నేను మూడు విధములైన ప్రపంచములోని తాపముల (దైహిక, దైవిక, భౌతిక) చేత కాలుచూ (మండుచూ) వున్నాను. నన్ను రక్షించుము.

138. ఓ నాథా! నీ గుణగాథవిని నా మనస్సులో చాలా అభిరుచి ఉత్పన్నమగుచున్నది. ఏదో ఒక విధముగా నిన్ను సంతోష పరచకోరుచున్నాను. కాని నిన్ను సంతోష పరచుటకు భక్తి

(మనస్సు స్వామి) నా నివాసము వుండుట కూడ సరిగాలేదు. నా దగ్గర సత్కర్మలనెడి ధనము కూడ లేదు. అందమయిన శరీరము లేదు. మంచి మనస్సు, మంచి స్వభావము లేదు. నిన్ను ఆనంద పరచుటకు అవసరము. నా ఆయుస్సు కూడా ఎక్కువ లేదు. అందువలన చాలా కాలము వరకు ప్రతీక్ష (నిరీక్షణ) చేయుటకు వీలు కాలేదు. మరెప్పుడైన పని నిరీక్షణ నుండుటకు వీలు అగును. అనగా నీ భక్తి సంపాదించు కొనుటకు వీలు వుండేది. ఒక సాధనము కూడ లేదు. నేను అన్ని విధములుగా దీనున్ని - హీనున్ని.

ఈ ప్రపంచము రీతి ఇదియేనేమో? నేను ఎవరినైనా త్రాగుటకు నీరు అడిగిన వారు నన్ను అమృతము ఇవ్వమని అడుగుచున్నారు. అనగా నేను మనస్సును శాంతింప చేసుకొనుటకు ఉపాయమును అడిగినవారు నన్ను ముక్తి పొందుటకు యుక్తి అడుగుచున్నారు. నేను నిన్ను ఎట్లు ఆనంద పరచవలయునో ఎవరును చెప్పకయున్నారు. నేను నా వ్యధను ఎవరికి చెప్పవలెను. ఎవరికైనా చెప్పుటకు నాకు ధైర్యము కల్గుటలేదు. నీవు నా తండ్రివి. నేను నిన్ను ప్రశంసించుచున్నాను. నీవే ఇప్పుడు ఉపాయము చేయుము. నీ కృపా దృష్టి నా మీద పడిన నా ఓడిపోయిన పందెము విజయమునుచేకూర్చునది అగును. అనగా నేను అన్ని విధములుగా ఓటమిని పొందియున్నాను. ఇప్పుడు కృపతో చూచిన నా ఉద్ధారము అగును.

నీవే జ్ఞాన దృష్టి కల్గించి చూపెట్టినప్పుడు, కనపడని వస్తువులు కనపడును. ఇందువలన నాకు అటువంటి జ్ఞాన దృష్టి కల్గించిన వాస్తవికతను చూడగలను. నీవు తెలియజెప్పిన, తెలియని విషయములను తెలుసుకొనగలను. ఇందువలన నాకు తెలియచెప్పుము. అనగా నా అజ్ఞాన బుద్ధిని తొలగించి నా హృదయమున జ్ఞానమను ప్రకాశమును కల్గించుము. ఓ ప్రభూ! దీన - హీన మత్స్యముల (చేపల) రాజులకు, కేవలము నీపేరు అను జలాధారము వున్నది. అనగా ఇతర పాపాత్ములు, దీనులు, చిన్న చిన్న చేపలవంటివారుగా నున్నారు. కాని నేను వీటి అన్నింటికి రాజును అనగా సర్వశ్రేష్ఠ పాపాత్ముడను. ఇందువలన ఇతర సాధనములచేత నా పని కాదు. నీనామ రూపమనెడి జలముతోనే నా కళ్యాణమగును. ఒకవేళ ఈ మాటలను కృత్రిమముగ చెప్పుచున్నచో - నా నాలుక కాలిపోవుగాక.

నాపని అన్ని విధములుగా చెడిపోయినది. కాని ఇప్పుడు ఒకే ఒక అందమైన సహాయపడు ఆధారము. అది తులసీదాసు ఈ ఆపద సమయమున ఆపదను గురించి సూచన చేసితిని. నాస్వామి రాముడు మంచివాడు. రాముడు స్వయముగా అన్నియును చక్కదిద్దును. (నిర్వర్తించును.)

(నేను దాహము గొని త్రాగుటకు నీరు అడిగిన వారు నన్ను సిద్ధుడనని భావించి ప్రాపంచిక సుఖములను లేక బ్రహ్మ జ్ఞానము ఉపదేశమును అడుగుచున్నారు. నేను స్వయముగా నీచుడను. మూర్ఖుడను. వారికి ఏమి ఇవ్వగలను? ఏమి ఉపదేశించగలను? తెలియ జెప్పగలను? నిష్కపటము వర్ణించెదను. నేను పాపుల మత్స్యరాజును. దేవుని కృప వలననే లోతైన సముద్రమున నుండగల్గుచున్నాను. నీవు తప్ప ఏ దేవీ దేవతలు నన్ను ఉద్ధరించలేదు.)

139. ఓ రామా! నీవు ప్రేమ పద్ధతిని చక్కగా ఎరుగుదువు. దేవతలు నీ యశస్సు కీర్తిని ఈ విధముగా భావించి స్వీకరించిరి. నీవు పెద్దల అహంకారమును, చిన్న వారి యొక్క దీనత్వము, హీనత్వమును తొలగించెదవు. అనగా పెద్దల అహంకారమును వినాశనముచేసి, దీనుల, హీనులను ఉద్ధరించెదవు. సంపన్నులను చేసెదవు. నీవు గ్రద్ధ జటాయువు శ్రాద్ధములను చేసితివి. బిల్లు జాతి (అడవి జాతి) స్త్రీ ఫలములను (రేగు పండ్లను - శబరి యివ్వగా) తింటివి. భక్త సమాజమున ఈ విషయములు బాగుగా చర్చింపబడుచున్నవి. నీవు ఆదరించిన వారిని లోకము, వేదములు ఆదరించుచున్నవి. వారిని యోగము, జ్ఞానము కంటె శ్రేష్టముగా భావించుదురు. అనగా యోగము, జ్ఞానము ద్వారా పరమపదవిని పొందలేము అది నీ భక్తుల స్మరణ చేసి నందుననే లభించుచున్నది. (హనుమంతుని నామజపముల వలన ముక్తి లభించును.)

ఓ ప్రభువు! ఓ కృపానిధి! ఈ కఠినమైన కలియుగమున కూడ, భక్తులు నీ మహిమ తెలుసుకొని వారు తమ హృదయమున దానిని ధరించుకొనుచున్నారు. నీ ప్రేమ అను రసము తెలియనివారు, విముఖులగుచున్నారు. అయిన ఓ ధీన బంధు! ఈ తులసీదాసు పరాయి వశమున పడి విషయవాసనలకు అధీనుడనయి వున్నాను. అయినా నీ ద్వారము వద్ద హఠముతోనున్నాను. అనగా సత్యాగ్రహము చేయుచూ పడివున్నాను. నీవు అతనిని ఉద్ధరించవలసియే యుండును. ఎందుకనగా అతడు దీనుడు - హీనుడు.

140. రామ నామము జపించుటవలన మనస్సు మొక్కు తొలగిపోవును. (మాట చల్లారును). ఈ కలియుగమున (యోగములు, యజ్ఞములు, తపము) వ్యర్థమై ప్రభావ హీనమయినవి ఎట్లన, చిత్రములోని సూర్యుడు చీకటిని పోగొట్టలేని మాదిరి అనగా చిత్రీకరించిన సూర్యుని బొమ్మ చీకటిని తొలగించలేనటులనే ఈ కలియుగమున యోగములు, యజ్ఞములు, తపములు ప్రభావ హీనమయినవి. కర్మరాసులు వున్నవి. కాని అవి అన్నియు, దుఃఖము, పాపముతో తడిసివున్నవి (కూడి వున్నవి) అనగా కర్మచేసిన ఫలితములభించదు. తాపము కల్గును. విషయ వాసనల ఆకర్షణల వలన కర్మలు సరిగా చేయనందులన పాపములు కల్గుచున్నవి.

అనగా కర్మలన్నియు వ్యర్థమగుచున్నవి. ఎట్లనగా ఒక వృక్షమునకు పండ్లు అనేకము అందమయినవి కల్గుచున్నవి. కాని వాటిని తినుటకు వీలులేదు. బూటకము, లోభము, దురాశ - మొదలగునవి ఉపవాసమును (అర్చనను) పూర్తిగా నశింపజేసినవి. అనగా వీటి ద్వారా ఉపాసన జరుగదు. అదియే గాక ముక్తిని ప్రజలు పొట్టను పోషించుకొనుటకు సాధనముగా చేసుకొన్నారు. అనగా ముక్తిని సంపాదన కొరకు సన్యాసము మొదలగునవి కపటముతో ప్రజలు తమ పొట్టనింపుటకు పోషణకు చేయుట మొదలయినది.

యోగమువలె కావలెనని ప్రయత్నించిన అగుటలేదు. సమాధియందు వుండగోరిన వందలాది ఆటంకములు కల్గుచున్నవి. వైరాగ్యము, జ్ఞానసాధన జరుగుట లేదు. వైరాగ్యము,

జ్ఞానము, వచనములు (ఉపదేశములు) విభిన్నమైన వేషముల వరకే పరిమితమై యున్నది. దానిననుసరించి (దాని ప్రకారము) ఎవరును కర్మ చేయుట లేదు. కేవలము ఉపదేశముల, వేషభూషలవలెననే పనులన్నియు చేయబడుచున్నవి. కపటము యొక్క అనేక చెడు మార్గములు నిర్మింపబడినవి. అనగా కపటము ద్వారా బూటకము చూపెట్టబడుచున్నది. అందరిని దారి తప్పించి చెడు మార్గమున పయనింపచేయుచున్నది. ప్రజలు చెప్పుట ఆచారము (చేయుట)లో వ్యత్యాసము. చెడు పద్ధతి అనగా మోసము వచ్చి చేరినది. చెప్పినట్లు చేయుట వుండదు. (ఆచరణ వుండదు) ప్రజలు తమ ఆచరణములనే ప్రశంసించుకొనుచున్నారు. అనగా వేరు వేరు పథములవారు తమ పంథాయే (సంప్రదాయమే) సర్వశ్రేష్ఠమైనదని ప్రకటన చేయుచున్నారు. మహదేవుడు ఉపదేశము ఇచ్చుచున్నాడు. చనిపోవునప్పుడు గంగ ఒడ్డున వుండవలయును. కాశి అటువంటి ధర్మక్షేత్రము (ధార్మిక కేంద్రము) పుణ్యస్థలమై, రాముని నామ ప్రతాపమై యున్నది. మహాదేవుడు ఇదియే చెప్పుచూ, స్వయము తాను దీనిని జపించుచుండును. యుగ యుగములవరకు ప్రపంచములోని ప్రజలందరు ఈ విషయమునే తెలుసుకొనుచూ, వేషమును పూని దీనినే వర్ణించుచూ చెప్పుదురు. ఇందువలన ఈ కలియుగము నుండి ముక్తి పొందుటకు ఒకే ఉపాయము ఇదియే చెప్పబడినది. మన బుద్ధిని రామనామముతో సంలగ్నము చేయవలెను. రామనామమునే ప్రేమించవలెను. ఎందుకనగా ఆపదలను తొలగించుటకు రామనామమే ముక్తిని ప్రదానము చేయబడినది. రామనామము నందు ప్రేమ విశ్వాసము వుంచుకొనుటి వలన తన కృప గల స్వభావము చేత ఎప్పుడో ఒకానొక చోట, దఫా, తప్పక కృప చూపెట్టును తప్పక.

141. ఓ రామా! నాకు నీ దాసుడనని అనిపించుకొనుటలో ఏ మాత్రము సిగ్గులేదు. ఎందుకనగా ఏ ఆచరణములు మీకు బాగుగా నుండునో (ఇష్టమగునో) వాటిని నేను చింత చేయక సంతోషముగా త్యజించుచున్నాను. అనగా వాటిని నేను చేయను. అయినా నీ దాసుడను అని పిలిపించుకొనుటకు సిగ్గుపడను. ముని గణము వాటిని సంపాదించుకొనుటకు అన్ని సంబంధములను (విషయ వాసనలు మొదలగునవి) త్యజించి జపము, యజ్ఞము మొదలగునవి చేయుదురు. భజన చేసెదరు. ఆ ప్రభువుకు నాయటువంటి మూర్ఖుడు, మహాదుష్టుడు, నీచుడను ఏ ఉపాయముల ద్వారా పొందగలను. భగవంతుడు విశుద్ధమైన వాడు, నిర్మల స్వరూపుడు. నా హృదయ మలినము అనగా పాపములతో నిండి వున్నది. ఇది చూచి నేను సంధిగ్ధావస్థలో పడివున్నాను. ఏమిచేయవలయును? ఒక చెరువులో కాకులు, గ్రద్దలు, కొంగలు, పందులు మొదలగునవి వుండును అక్కడికి హంస వచ్చి ఎందుకు వుండును? అనగా నా హృదయమున కామము, క్రోధము, మొదలగు కలుషితమైన వాసనలు నిండి వున్నందున ఈ పాపి మలినము అయ్యెను. అందులో నిర్మల స్వరూపుడగు భగవంతుడు వచ్చి ఎట్లుండును? అతడు ఇంత మురికి ప్రదేశమున ఎట్లు నివశించగలడు? భావము ఏమనగా భగవంతుడు సాధువుల - సజ్జనుల, భక్తుల కలుషిత భావము లేని, భక్తి,

జ్ఞానము, వైరాగ్యము మొదలగు శుభ భావములు గల పవిత్రమయిన హృదయము యందు నివసించును.

నాకు ప్రపంచమున ఎక్కడ కూడా స్థానము లేదు. నేను శరణు జొచ్చుటకు అనుకూలము లేదు.

తత్వజ్ఞులైన విద్వాంసులు దేవుని శరణుజొచ్చి మూడు విధములైన తాపములను (దైహిక, దైవిక, భౌతిక) శాంతింప చేసుకొందురు. అతని శరణు జొచ్చినను, మదము, మోహము, లోభము మొదలగునవి బాధించుచుండును. ఎందుకనగా సవితి ద్వేషము స్వర్గమున కూడా వదలదు. అనగా నేను రాముని శరణు జొచ్చినప్పటికి పూర్ణ శాంతి లభించదు. విషయ వాసనలు నన్ను వికలున్ని చేయుచుందును. నేను ఇతరులకు, జ్ఞానులు, భక్తులు ఈ భవసాగరమును దాటుటకు పడవ వంటివారు. అది చెప్పుచూ తిరుగు చుందును. కాని ఓ హరి! నేను ఆ సజ్జనుల, భక్తులతో గొప్పగా వైరమును (శత్రుత్వమును) కల్గించుకొని నీతో, నా మేలు చేయుదువని ఆశించుచున్నాను. అనగా నేను చెప్పుటలో చేయుటలో మిక్కిలి తేడా వున్నది. నేను ఎటుల నీ కృపను పొందగలను?

నాకు ఈ లోకమున ఎక్కడ చోటు లేదు. అక్కడకి నేను వెళ్ళి శరణు పొందలేను. ఇందువలన నేను బలవంతముగా నీ సంబంధములు జోడించు కొనుచున్నాను. నీ దాసుడనని అనిపించుకుంటాను. సర్వశ్రేష్ఠుడైన, ఉదారమైన వాడా రామా! నన్ను నీ శరణులోనికి తీసుకొనుము. ఈ తులసీదాసు గుణగానము చేయుచున్నాడు.

(జ్ఞానము, వైరాగ్యము, శాంతి, క్షమ, సమత మొదలగునవి శుభ భావములు. జీవునికి ఇద్దరు స్త్రీలు వున్నారు:- (1) ప్రవృత్తి (2) నివృత్తి. వీటిలో పరస్పరము ద్వంద్వము వుండును. ప్రత్యేక పరిస్థితిలో కూడ జీవునిని బాధించుచుండును. శుభము, అశుభవము అను భావముల మధ్య నిరంతరము ద్వంద్వము వుండును. ఇందువలన ప్రాణి శాంతి పొందలేడు.)

142. ఓ రామా! నేను ఏ విధముగా ప్రార్థింతును. నేను అచరణములను గురించి యోచించిన - నా ఆచరణలు ఎంతో పాపములతో కూడి వున్నవి. నేను మనస్సునందు ఓటమిని ఒప్పుకొని అనగా నిరుత్సాహ పరుడనయి భయబీతుడనగు చున్నాను. నోరు తెరచి దేవుని ఏ విధముగా ప్రార్థించుదును? భగవంతుని ఎటువంటి సాధనముల ద్వారా భక్తులపైన కృప చూపెట్టునను విషయము నాకు బాగుగా తెలియును. ఆ సాధనమును హఠముతో త్యజించుచున్నాను. (త్యజించితిని). దానిని స్వీకరింప లేదు. అనేక ఆపదలు, కష్టములు అనుభవించు మార్గముననే ప్రయాణము చేయుచున్నాను. రాత్రింబవల్లు మనసా, వాచా, కర్మణా (త్రికరణ శుద్ధిగా) ఇతరుల మేలు (పరోపకారము) చేసిన ముక్తి లభించునను విషయము నాకు తెలియును. కాని నా అచరణలు వీటికి పూర్తిగా విరుద్ధముగా నున్నవి. ఇతరుల సుఖమును చూచి కారణము లేకయే వారిని ద్వేషించుచున్నాను. మనస్సునందు క్రోధముతో కుములుచున్నాను. ఇవి చేయుచున్నాను.

బాగుగా మనసు వుంచి సత్సంగము చేయవలెనని వేదముల - పురాణముల అభిప్రాయము. నేను నా గర్వము, మోహము, ఈర్ష్య మొదలగు వాని వశముకు గురి అయి ఈ అభిప్రాయమును ఆదరించలేదు. అనగా అనేక మంది సాధువుల సత్సంగమున హాజరుకాలేదు. ఈ భవసాగరమున ఎల్లప్పుడు వుండునట్టి పనులనే చేయవలసి యుండును. ఇట్టి పనులే నాకు ఇష్టము. అనగా ఎల్లప్పుడు ప్రాపంచిక విషయ వాసనల మోహమున లిప్తుడనై యున్నాను. ఓ నాథ! ఈ ప్రపంచములోని దుఃఖముల నుండి ఎట్లు ముక్తి పొందవలెనో నీవే చెప్పుము ఇప్పుడు. ఎప్పుడైనా నీవు కరుణతో చూచెదవని నమ్ముచున్నాను. ఈ ప్రపంచములోని బంధనములను స్వీకరించవలెనో తెల్పుము. ఎప్పుడైన నీ కరుణా స్వభావము చేత ప్రేరితుడవయి నాపైన కరుణ చూపెట్టెదవని విశ్వాసమున్నది. నేను ముక్తిని పొందగలను. తులసీదాసునగు నాకు ఇతరుల ఎవరిపైన నమ్మకము లేదు. వారు నన్ను ఉద్ధరించరు. తదుపరి నశించి - నశించి ఎందుకు చావవలెను? వృథాగా అన్య సాధనములను స్వీకరించి నా ప్రాణములు ఆపదల యందు ఎందుకు చిక్కుకొనవలయును?

143. ఓ నాథా! నాకు ఇతరులపైన భరోసా లేదు. మృత్యువు ఎప్పుడు వచ్చి కబలించునో తెలియదు. ఇందువలన నేను త్వరితముగా నీ శరణము జొచ్చితిని. నా వద్ద జ్ఞానము, వైరాగ్యము, భక్తి మొదలగు ముక్తి సాధనములు స్వప్నములో కూడ ఎప్పుడు లేకుండెను. అనగా నేను స్వప్నములో కూడా వీటిని స్వీకరించలేదు. లోభము, మోహము, మదము, కామము, క్రోధము మొదలగు శత్రువులు - రాత్రింబవల్లు చుట్టిముట్టినవి. అనగా నేను వీటియందు లిప్తుడనయి వున్నాను. వీటితో కలసి వున్నందున నా మనస్సు చెడు మార్గమున పోవుచున్నది. ఇప్పుడు నీవే నన్ను చెడు మార్గమున పోకుండ చేయగలవు. నా వశములో లేదు ఈ విషయము.

సాధువులు, భక్తులు వేదములు కేకవేసి చెప్పుచున్నవి. ఈ మనస్సు ఈ మార్గము పాపముతో కూడినది. విషయ వాసనలు (ప్రపంచము) దుఃఖమును కల్గించుచున్నవి. అనగా తెలిసికూడా విషయ వాసనల యందు అనురక్తుడనయి పడి చిక్కుకొని వున్నాను. ఇదంతయును నీ ప్రేరణవలననే కల్గుచున్నది. అనగా నీవే నాతో ఈ పాపములను చేయించుచున్నావు. లేనిచో తెలిసి - దుఃఖములను అనుభవించకోరెదరు? ఓ నాథా దేని బలమున ఈ ప్రపంచము దుఃఖముల నుండి ముక్తి పొందవలెనో ఇప్పుడు నీవే చెప్పుము. ఎప్పుడైనా నీ కరుణా మయమైన స్వభావము చేత విషమును అమృతముగా చేయగల సమర్థుడవు అగ్నిని మంచువలె చేయగలవు. పడవ లేకయే జీవుని ప్రపంచమనెడి సాగరము నుండి దాటించగలవు. ఓ భగవంతుడా! నేను రెండవ దఫా వెతికినను (పరిశోధించినను) నీవలె దయ చూపగలవాడు మిక్కిలి శాంతమును కల్గించువాడును.

నమ్మి నీ ఆధారమున నున్నాను. తులసీదాసునగు నేను ప్రాపంచిక దుఃఖములనుండి నీవు కత్తిరించిననే తెగిపోవును. నా ఉద్ధరణ అగును. నేను ఉద్ధరించబడగలను.

(పంచేంద్రియముల ధర్మమగు - శబ్ద, రూప, స్పర్శ, రస గంధముల వలననే జీవుడు ప్రపంచమున అనురక్తుడయి వుండును. జీవుడు, బ్రహ్మ చేతిలో కీలుబొమ్మ. జీవుడు స్వయముగా ఏమియును చేయలేడు. బ్రహ్మ అతనిచే చేయించును. జీవునికి అదియే చేయవలసి వున్నది.)

144. తులసీదాసు లోకమును సంభోదించి చెప్పుచున్నారు. ఓ ప్రపంచమా! ఇప్పుడు నేను నిన్ను తెలుసుకొన్నాను. అనగా నీ రహస్యమంతయు నాకు తెలిసినది. నీవు నిజముగా కపటమునకు కేంద్రము. కాని ఇప్పుడు నీవు కపట జాలమున బంధించలేవు. ఎందుకనగా నా దగ్గర భగవంతుని బలమున్నది. అనగా భగవంతుడు నా సహాయకారి. నీవు చూచుటకు అందముగా కనపడుచున్నావు. మరల ఆలోచించిన నీవు ఎందుకు పనికి రావు. నిరుపయోగము నీ పరిస్థితి అరటి చెట్టు వంటిది. బయటకు అందముగా లావుగా వుండును. దానిని పగులకొసినచో లోపల కండ వుండదు. వివేకముతో ఆలోచించిన మిథ్య అని నిరూపణ అగుచున్నది. నీ అస్తిత్వము కూడ వుండదు. నీ పరిస్థితి ఆ అరటి వృక్షము వంటిది. అరటి చెట్టు లోపల కండ వుండదు అరటి చెట్టు బుడము బెరడుతో నిర్మితమై యుండును. ఒకటి ఒకటి పై పొరలను తొలగించిన చివరి వరకు పొరల బెరడు తప్ప మరేమి వుండదు. ఇదేమాదిరి జ్ఞానముతో ప్రపంచమును విశ్లేషణ చేసినచో ఈ ప్రపంచమున కూడా నిస్సారము తత్వహీనముగా నిరూపణ అగును.

నేను నిన్ను తెలుసుకొనుటకుగాను అనేక జన్మలు ధరించవలసి వచ్చెను. దారి తప్పి తిరుగుచున్నాను. అయిన నిన్ను తెలుసుకొనుట చాలా కష్టము అనగా నీ వాస్తవ తత్వమును తెలుసుకొనలేక పోయితిని. నీవు నన్ను మాటి మాటికి మహా మోహ రూపమును మృగతృష్ణ నదిలో ముంచితివి. అనగా మాటి మాటికి ప్రాపంచిక విషయ వాసనల వ్యామోహమున ఇరికించి (చిక్కించి) వుంచితివి. అయిన నేను నీ వాస్తవ తత్వమును తెలుసుకొనలేక పోయితిని. ఓ దుష్టుడా! వినుము. నీవు బాగుగా కోట్ల కొలది రకములైన కపటముల, మోసములతో పనిచేయవచ్చును. కాని భగవంతుని పరమ భక్తుడు ఎప్పుడును నీ వశములోనికి రాడు అనగా నీ ఎడ ఆకర్షితులు కారు. ఇప్పుడు నీ సహాయకులు (కామము, క్రోధము, మొదలగు) సహితముగా వారి హృదయములలోనికి వెళ్ళి, నీ డేరా వేసుకొని నందకుమారుడగు కృష్ణుడవు (భగవంతుడు) కాలేవు. అనగా ఇప్పుడు నీకు హరి హృదయముల యందు, ఆశ్రయము లభించును. వారే సేవలలో చిక్కుకొని వుందురు. భగవంతుడగు కృష్ణునిని ధ్యానించని వారు.

ఇప్పుడు నీవు వెళ్ళి వారిపైన కపటము అను వలను పన్ని నీ రహస్యమును తెలుసుకొనలేరు. నీ మోసమును తెలుసుకొనలేరు. వారు నీ చేష్టల వాస్తవమును

తెలుసుకొనలేరు. వారు తాడును సర్పముగా భావింతురు. భయముతొ చచ్చినట్లు అగుదురు. అనగా తమ భ్రమ చేత చనిపోయెదరు. తాడునే పాముగా భావించెదరు. ఓ దుష్టుడా! నీవు నీ మేలు అను దానిని వినుము. నీవు నీ ప్రక్కకు నీ పరివారము (కామము, క్రోధము మొదలగునవి) క్షేమము కోరిన తొలగవద్దు. నీవు తులసీదాసు స్వామి రాముని భక్తులను వదలి అక్కడికి పరుగిడి పొమ్ము. అక్కడ అహంకారము కామము నివసించుచున్నవి. అర్థము ఏమనగా అహంకారము, కామము గలవాడె నిన్ను సరియైన గౌరవమును స్వీకరింతురు. (గర్వమును పొందుదురు) రామభక్తులు కాదు.

(తులసీదాసు లోకమును మిథ్యగా భావించక ప్రపంచములోని విషయముల ఎడ ఆసక్తినే మిథ్యగా ఋజువు చేసెను. నందకుమార అని పిలుచు రాముని కృష్ణుని యందు భేదములేని భావమును స్థాపించెను. తులసీదాసు ప్రపంచములోని మాయా మోహముల నుండి ముక్తుడయ్యెను. పరమహంస అయ్యెను.)

145. ఓ సోదరుడా! నీవు రామనామము జపిస్తూ నడుచుము. లేనిచో లోకమున నిరుద్యోగములో (నిరుపయోగముగా) వుండెదవు. దానినుండి ముక్తి లభించుట మిక్కిలి వ్యయ ప్రయాసలకు గురి కావలసి వచ్చును. అనగా మాయ అనెడి వెట్టి చాకిరిలో పడిపోయినచో - జన్మ - జన్మాంతరముల వరకు అనేక యోనుల యందు జన్మించవలసి యుండును. రామభక్తి యొక్క ఈ మార్గము సులభముగా విడిచిపోవలసి వచ్చును. ఇందువలన రామనామము జపించుచూ వున్నందున యముని దూతలు నిర్దోషిగా పట్టుకొనరు. రాముని సేవకుల ప్రక్కకు వ్రేలు కూడ ఎత్తి చూపలేరు.

నీ కుటిల రూపముననున్న వడ్రంగి చంవనపు పేరు స్మరించి ఈ శరీరమనెడి పనికిరాని పల్లకి చేసి నాకు ఏ విధమైన విలువ లేకుండ ఉచితముగా ఇచ్చెను. అనగా కుటిల కర్మల పన్నాగము ఫలితముగా నాశనమగు క్షణ భంగురమైన రోగములకు కేంద్రము, మానవ శరీరము లభించినది. ఈ శరీరము ఆవాసనల మంచముతో సమానము. ఈ శరీరమనెడి మంచము - అనాది కాలము నాటి అజ్ఞానము, విషయ సుఖముల వాసనా రూపమగు పాత ఎదురు కర్రలు ఇందులో అమర్చబడియున్నవి. దీని అలంకరణ (నిర్మాణము) తలతోకలేనిదిగా వున్నది. పరస్పరము సదా వెదురకములైన విచిత్ర తత్వములు (క్షితి, జల, పావక, గగనము, సమీరము) వీటి మిశ్రమముతో దీని నిర్మాణమయి వున్నది. (శరీరము పంచతత్వములతో నిర్మింపబడును). దీని అంగములన్నియు ఒక మాదిరి సమానముగా వుండక వంకరగా, పొడవుగా, పొట్టిగా ఎగుడు - దిగుడులుగా మొదలగు అనేక రకములైనవి వున్నది. వీటిలో సమానత్వము రూపము ఏకత్వములు లేవు. శరీరము అంగములు ఇట్లు వుండును. దానితోపాటి కల్గిన, అరిగిన చాల నిరుపయోగము. అనగా అది క్షణ భంగురము. ఎప్పుడైనా నష్టము అగును. (మానవ శరీరము నాశనము అగునది కాబట్టి వ్యర్థము) దీని మరియొకటి ఏమనగా నాల్గు కోణములు లేనందు మంచము నాల్గు

కోనములు గలది అగుచున్నది. భావము ఏమనగా ఈ మానవ రూపమున నున్న మంచమున మూడు గుణములు (సత్, రజ, తమోగుణములు) పొంది యున్నవి. మూడు అవస్థలు (బాల - యువ - వృద్ధాప్య) మూడు పట్టెలున్నవి. సుఖ, దుఃఖము అనెడి నిలువు పేకతో అల్లకము చేయబడి వున్నది. ఈ మంచమును తీసుకొను పోవు డోలాలు మోయువారి సంఖ్యలో కూడా విషమత్వము (వైవిధ్యము) వున్నది. (నీచులుగా మంచము మోయువారు నాల్గురు లేక ఆరుమంది వుందురు) కాని ఈ పాలకీని మోయుటకు వచ్చిన వారి సంఖ్య ఐదువున్నది. (ఇక్కడ ఐదు ఇంద్రియములతో సంబంధము చెప్పబడినది.) సంఖ్య యొక్క వైవిధ్యము (విషమత్వము) వలన వాటిలో పరస్పరము ఏదేని సంధిలేదు. కొంతమంది ఒక ప్రక్కకు లాగుదురు. మరికొందరు వేరొక ప్రక్కకు లాగుచుందురు. (ఇంద్రియములు మనస్సును తమ తమ ప్రక్కకు లాగుచుండును) రెండవ ఇబ్బంది ఏమనగా ఈ డోలీలు మోయువారు కామవనెడి మత్తులో మత్తెక్కివున్నారు. అనగా విభిన్నమైన ఇంద్రియములు తమ తమ విషయమను మత్తులో నిమగ్నమయి మైమరచి వున్నవి. మూడవ ఆపద ఏమనగా వీరందరి చరణములు ఒకరినొకరు సహకరించవు. మత్తులో చిత్తు అయి వున్నారు. అనగా ప్రతి ఒక ఇంద్రియము - తమ విషయమనెడి మత్తులో నిమగ్నమయి యున్నవి. తమ విషయము ప్రక్కకు ఆకర్షణ కల్గి, ఇతరుల చింత చేయక ఇష్టానుసారమగు పద్ధతిలో నడచుచున్నారు. నడకయొక్క ఈ విషమత్వమువలన తారతమ్యము (ఒకలయ - ఒక గతి) లేకున్నది. చాల విషమత్వమైన నడక పరిణామము - మంచము (డోలీ) ఒక స్థితిలో వుండక పైకి క్రిందికి అదుర్లు కలిగి వుండును. తోపుడువల్ల ఊగుతూ వుంటుంది. భావము ఏమనగా విభిన్నమైన ఇంద్రియములు శరీరమును మాటిమాటికి తమ తమ విషయ వాసనల ప్రక్కకు లాగుచున్నవి. శరీరమునకు కష్టము కల్గుచున్నవి. అది ఒకదాని కోరికను పూర్తి చేయుటకు ప్రయత్నించు చున్నవి. మరొకసారి రెండవ దాని కోరికను తీర్చును. ఇంద్రియములు పరస్పరము లాగుకొనుటలో శరీరము చాలా భయంకరమైన దుఃఖమును అనుభవించుచున్నది.

విషయమైన, భయంకరమైన దారిలో శరీరమనే డోలీ ప్రయాణమై పోవుచున్నది. ఆ మార్గమున కుటిలమైన కర్మ ఫలితముగా మూడు రకములైన తాపములనెడి కంటకములు విషయ వాసనలనెడి కంకరరాల్లు, నిండి వున్నవి. అవి పాదములకు గ్రుచ్చుకొనుచున్నవి. భార్యపుత్రులు మొదలగు మమతారూపమగు చెట్లు పొదలు చిక్కును కల్గించుచున్నవి. కామము, క్రోధము మొదలగు గుణముననున్న లతలు లేక సర్పములు నడచుచూ కాల్లకు చుట్టుకొని కష్టములను కల్గించుచున్నవి. ఈ మార్గమున అన్నింటికంటే అపవిత్రమైన విషయము, మార్గమున ముందుకు తీసుకుపోవుటకు ప్రయత్నము చేసినపుడు తన ఇల్లు చేరవలసి గమ్యము మిక్కిలి ఎక్కువ దూరము తొలగుచూ వున్నది. దారిలో ఎవరు తోడు స్నేహితులు లేరు. భావము ఏమనగా మానవుడు కర్మజాలమున, ఎక్కువగా చిక్కుకొని పోయినపుడు తన అంతిమ లక్ష్యము దూరమగుచూ వుండును. మాయ అనునది

ఆటంకమును కల్గించి జీవునిని తన లక్ష్యము వరకు చేరుకొననివ్వదు. ప్రపంచము యొక్క కర్మజాలమున, చిక్కుకొనునట్లు చేసి దూరముగా తొలగించుకొని తీసుకొని పోవును. దారిలో స్నేహితులు - మిత్రులు దారి తప్పి తిరుగుట తప్పేది. కాని ఈ మార్గమున మాయా ప్రభావమున వున్న మిత్రులు లేనందున జీవుడు లక్ష్యభ్రష్టులై దారితప్పి తిరుగుచూ వుండును. ఈ మార్గములోని అన్నిటికంటే గొప్ప ఆపద (కష్టము) అగమ్య (కఠిన)మైనది. భక్తి మార్గమున ప్రయాణము చేయుట చాలా కష్టము. వెంట ఏ సంబలము, ఆహారము వుండదు. అనగా మంచి కర్మలు చేయలేదు. వాటి సహాయమున ప్రయాణము పూర్తి చేయవచ్చును. అన్నిటి కంటే కష్టమైనది ఏమనగా ప్రయాణము చేయువాడు తాను చేరుకోవలసిన ఊరిపేరు మరచెను. భావము ఏమనగా ప్రపంచములోని విషయ వాసనల ఆకర్షణల చేత గురి అయి జీవుడు తన లక్ష్యమును ఆత్మానుభూతిని కూడా విస్మరించెను. తులసీదాసు చెప్పుచున్నాడు - ఓ రామా! ఇప్పుడు నీవే అనుకూలుడవయి దయచేసి నా ఈ ప్రపంచ రూపమునున్న భయమును తొలగించుము. అనగా ఆ మార్గమును దాటిపోవుట, నన్ను నా ఆత్మానుభూతి వరకు చేర్పించుము. నీ కృపలేనిదే నా ఉద్ధారము అసంభవము.

(తులసీదాసు రాముని కృపవలననే లక్ష్యము పూర్తికి ఒకే ఒక అంతిమ సాధనగా భావించెను).

146. తులసీదాసు మనస్సును, లేక ప్రాణిని సంబోధించి చెప్పుచున్నాడు. నీవు స్వాభావికముగా ప్రేమించునట్టి (నిష్కామభావము) రాముని ప్రేమించలేదు. ఇందువలననే నీకు ప్రపంచములో పాత్రగా కావలసివచ్చెను. (వచ్చిపోవుట) చక్రములో పడివుండవలసి వచ్చెను. నీవు ఇప్పటికైనా నా శిక్షను (విద్యను) స్వీకరించుము. అద్దమునందు ముఖము ప్రతిబింబము కనబడుతుంది. ఆదర్పణము ఎదుటినుండి తొలగిన మనస్సులో అమూర్తి (రూపము) వుండదు. అనగా మనము దాని విషయము ఆలోచించుట లేదు. లేక ఆ ప్రతిబింబము వాస్తవముగా దర్పణములోపల వాస్తముగా వుండక, మనము దాని ఎదుట నిలబడివున్నంత వరకు కనబడును. తొలగినచో కనబడదు. దానిని గురించి ఆలోచించుము. అదేమాదిరి తల్లి-దండ్రులు, భార్య ఇతరులందరు సంబంధము గలవారి సేవ చేయుచూ వున్నంతవరకు మన వారుగా నుందురు. కాని వృద్ధాప్యమున శక్తి హీనులమయినపుడు వీరి సేవ చేయలేనప్పుడు మన వారుగా నుండరు. భావము ఏమనగా వీరందరు స్వార్థపరులు వీరి స్వార్థము సాధించుకొనునంత వరకు వారు మన బంధువులు. కాని వీరు వాల్మీకి గృహస్థులవలె మన పాపకర్మల పరిణామములను అనుభవించుటకు, మనకు తోడుగా (మిత్రులుగా) వుండరు. వాటిని మనము ఒంటరిగా అనుభవించవలసి వచ్చుచున్నది.

వీరు ఎంత స్వార్థపరులో తులసీదాసు ఒక దృష్టాంతము నిచ్చి తెలియ జేయుచున్నారు. నువ్వులను ఫలముల మధ్యవుంచి సువాసన వుండుటకు చేయుదురు. వాటిని తదుపరిగానుగలో వేసి నూనె తీసి, చెక్కను గానుగ నుండి పారవేసెదరు. అదే మాదిరి

మనలో ధనమును సంపాదించే శక్తి, సౌందర్యము, బల - పౌరుషము మొదలగు గుణములు వున్నంతవరకు ఇంటివారు మన క్షేమమును గురించి అడుగు చుందురు. కాని ఈ గుణములు నష్టమయినచో మనలను వ్యర్థులుగా (పనికిరాని వారుగా) భావించి, ఉపేక్ష చేసి విస్మరించెదరు. ఇటువంటి స్వార్థపరులు ఈ ప్రపంచమున నిండి వున్నారు. వారి మనస్సు మలినమై (నల్లగా) శరీరము (తెల్లగా) అరుణరంగుతో వుండును. అనగా వారు చూచుటకు అందముగా నుండి మనస్సునందు కపటము, స్వార్థము కల్గియుందురు.

ఇంతవరకు నీవు అనేక మంది మిత్రులను, చేసుకొన్నావు. చేసుకొనుచున్నావు. భవిష్యత్తులో చేసుకొందువు. కాని రాముని వంటి ప్రేమను నిర్వహించునట్టి వాడు ఇంతవరకు ఒక్కడూ కనపడ లేదు. ఇందువలన రామునినే ప్రేమించుము. నీవు ఇంతవరకు రాముని గురించి తెలుసుకొనలేదు. ఆయనలో సంబంధము పెట్టుకొనలేదు. దాని వలననే సంబంధములన్నియు నిజమయినవిగా భావించుచున్నావు. భావము ఏమనగా ఒక రాముడే సర్వ సంబంధములను పూర్తిగా, నిజాయితిగా నిర్వహించును. ఇతరులు ఎవ్వరూ చేయలేరు. ఈ కారణము చేత, ఏ విషయములో నీకు లాభమున్నది. దేనిలో నష్టమున్నది. దేనిలో నష్టము తెలుసుకోలేదు. అనగా నీకు ఇంతవరకు నీ మేలు - కీడు తెలుసుకొను బుద్ధిలేదు.

నీవు అసత్యమును సత్యముగా భావించితివి, సత్యమును అసత్యముగా భావించితివి; అనగా అసత్యమైన నశించు శరీరమును సత్యమైనదిగా భావించి, నీవు దానికి సేవ చేయుచుంటివి. సత్యమైన ఆత్మను అసత్యమైనదిగా భావించి నీవు దానిని నిర్లక్ష్యము చేసితివి. నీ హితమును నష్టము చేయు నీ చేతులారా నీ చరణముల యందు గొడ్డలితో నరకు కొంటివి. (సంహరించితివి) ప్రపంచములో ఇటువంటి వాడు వచ్చిపోలేదు. ఇప్పుడు లేడు. భవిష్యత్తులో వుండడు. అనగా అందరికి మృత్యువు వాత పడవలసి వుండును. ఇటువంటి మూర్ఖులు చనిపోవుచూనే వున్నారు. వేదములు, పండితులు, ఈ విషయమును చెప్పినవి. నేను కూడా ఈ విషయమును కేక వేసి ఈ విషయమునే చెప్పుచున్నాను. ఈ ప్రపంచమున ప్రభువగు రాముడు మాత్రమే సరియైన, నిజమైన స్నేహితుడు. నీవు నీ హృదయముల నేత్రములతో, జ్ఞాన దృష్టితో చూడుము ఆలోచించి తెలుసుకొనుము.

147. సరియైన స్నేహితుడు కేవలము ఒక మృదువైన కోసలదీశుడు మాత్రమే ప్రేమతో కృతజ్ఞుడగు వాడు రాముడు. రామునికి సమానమగు రెండవ దయగలవాడు లేడు. అనగా రాముడు ప్రేమకు వశుడయి అందరిపైన దయచూపెట్టును. మన ఈ శరీరమునకు ఎంతమంది మిత్రులువున్నారో. అనగా ఈ శరీరము కారణమున మనలో సంబంధము కలిగి మనతో కలసి వుందురు. భార్య, పుత్రులు, బంధువులు మొదలగు వారు అందరూ స్వార్థపరులు, దేవతాపూజ, సేవ చేయుటవలన, సంతోషించెదరు. ఆపద సమయమున

తులసీదాసు ప్రేమ - ప్రేమాస్పదమునకు తేడాను తెలుపుచూ, చెప్పుచున్నారు. సంగీతము నిష్ఠురముగా నుండును. సంగీతము ఆకర్షణ చేత ఆకర్షింపబడి, జింక తన ప్రాణమును పోగొట్టుకొను చున్నది. అగ్ని, సముద్రులు అనగా అందరి ఎడ సమానముగ ప్రవర్తించువాడు. మిడుతలు దీపము యొక్క కాంతికి ఆకర్షింపబడి, దాని వద్దకుపోవును. అది వాటి ప్రేమను నిర్లక్ష్యము చేసి వాటని భస్మము చేయుచున్నది. జలము కూడ వీరువలె ప్రేమను నెరవేర్చదు. చేప నీటినుండి వేరయిన వెంటనే విలవిల తన్నుకొని చనిపోవును. జలము కొంచెము కూడ ఆలోచన చేయదు. తన దారిలో ముందుకు సాగిపోవుచూ నుండును. వెనుకకు ఒక దఫా తిరిగి కూడా చూడదు. ఇదే మాదిరి, చందమామ జన్మాంతము రోగి, మచ్చలు (పాండురంగు) రోగమువలన దినదినానికి క్షీణించుచూ పోవును. కాని చకోరపక్షి అతనిని (చంద్రునిని) ఎక్కువగా ప్రేమించును. రాత్రింబవల్లూ కంటి రెప్ప వాల్చక అతనినే చూచుచుండును. ఆయన తన రూప గర్వములో మునిగి చంద్రుడు దాని ప్రక్కకు చూడడు. సూర్యుడు గొప్పవాడు; కమలములు అతనిని చూచిన వెంటనే వికసించును. కాని గ్రీష్మ ఋతువులో అదే సూర్యుడు ఆకమలముల నూతన తీక్షణమైన కిరణములచే కాల్చివేయును (కమిలిపోవును). మేఘము కూడ గొప్పది. కాని చాతక పక్షి దాని కొరకు ఎదురు చూచుచు, క్రమముగా దానిని పిలుచు చుండును. దానిని కీర్తిలోని ఒక జలబిందువును ఇమ్మని యాచించు చున్నది. మేఘము తన గొప్పతనము అను గర్వములో మునిగి దానిపైన ఒడగండ్లు కురిపించును. విద్యుత్తును ప్రసరింప చేయును (పిడుగు పడునట్లు చేయును) ఈ విధముగా సూర్యుడు, మేఘము గొప్ప వారయినను ప్రేమ క్షేత్రమున దయలేని వారుగా నుందురు. వారు తమ ప్రేమికులను అంతము చేయుచున్నారు.

ఎవరు ఎవరిని ప్రేమించుచున్నారో, అతడే సుఖమునిచ్చును. తమ ప్రేమా స్పదులను చూచి ప్రేమికులకు సుఖము కల్గును. రామునివలె సదా సరళ స్వభావము గల స్వామి మరొకరు రెండవ వారు లేదు. సేవకుల ద్వారా చేయబడిన సేవకు, తన స్వీకృతిని ఇచ్చిన న్యాయము ఈయనయే, మరొకరు లేదు అనగా ఆ సేవకుని కర్తవ్య పరాయణత్వమును శభాష్ అని ప్రశంసించును. ఇతరుల దోషములను చూచి కూడ వాటిని త్యజించును. అనగా వారి ప్రక్కకు తిరిగి చూడడు. రాజుగారి ఆస్థానమున దీన ప్రజలను ఆదరముతో ప్రేమతో చూచెదరు. భావము ఏమనగా రాముని ఆస్థానమున మాత్రమే భక్తులకు సన్మానము చేయుదురు. వారి చెడుగుణముల ప్రక్కకు ధ్యానము వుంచరు.

జటాయువును, శబరిని తమ తల్లిదండ్రులవలె ఆత్మీయులుగా భావించెను. రాముడు, సుగ్రీవుడు వానరుడయినను తన స్నేహితునిగా చేసుకొనెను. పాపులను పవిత్రము చేసెను నావికుడగు నిషాద రాజు గుహునిని అలింగనము చేసుకొని సోదరుడగు భరతునివలె చూచెను. దురదృష్టవంతులను, భాగ్యశాలురను చేసితివి. భావము ఏమనగా బ్రహ్మ భాగ్యమున సుఖ సంపదలను ఇవ్వని వారికి కూడ రాముడు వారిని కూడ పూర్తిగా సుఖములను సంతోషములను ఇచ్చెను. ఐశ్వర్యవంతులను చేసెను. కుచేలునికి ఐశ్వర్యము

నిచ్చెను. భయ భీతులైన సుగ్రీవ - విభీషణులకు ఆశ్రయమిచ్చెను. భావము ఏమైన రాముడు ఒకడే ఇటువంటివాడు. వేదములయందు ఆయన బిరుదములు ప్రసిద్ధి గాంచివున్నవి. కవి పండితులు వాటిని గురించియే గానము చేయుచున్నారు.

ఎటువంటి నీచుడైనను. పాపియైనను రాముని నామమును ఆశ్రయించిన అనగా ఆధారము చేసుకొనిన, వారి పాపముల ప్రక్కకు ధ్యానముంచక స్వీకరించును. ఒక నమ్మకమైన వ్యక్తి ద్వారా ధనమును లెక్కించక వుంచుకొనును. నమ్మకముతో సరిగావున్న లేక పోయిన తన వద్ద గంటులో బంధించును. మానసికముగా మైల (చెడు భావములతో) కూడియున్నను, కలియుగమున అతని కర్మలు కుటిలమైనవి అయినప్పటికి వినేవాడు పాపి అగును. ఇటువంటి దుష్టుడనగా తులసీదాసునగు నేను కూడా రాముని స్వీకరించితిని. రాముడు పేదవారిపైన కృప గలవాడు.

(సంగీతము, అగ్ని, జలము, సూర్యుడు, చంద్రుడు, మేఘము, తమను ప్రేమించే వారి ఎడ దయలేక నిర్దయులై ప్రవర్తింతురు. రాముడు మాత్రమే తనను ప్రేమించు వారిని సంపూర్ణముగా స్వీకరించును. ప్రపంచమున ఈ శరీరము గురించియే సంబంధమున్నది.)

148. ఓ నీచుడా! ఒకవేళ నీవు సీతాపతి రామునితో ప్రేమ సంబంధము కలిగియున్నక పోయినచో, ఇహ - పర సుఖములు ఎట్లు సంభవించును. అనగా రామునితో ప్రేమ సంబంధము లేనిచో లోక - పరలోకము రెండును నష్టమగును. ఈ లోకమున సుఖము లభించదు; చనిపోయిన తర్వాత మోక్షము లభించదు దుష్ట కలియుగము, నిన్ను ప్రాపంచిక విషయముల ప్రక్కకు ప్రేరేపింప చేసి, ఈలోక, పరలోకము రెండును దోపిడి చేయబడినవి. నాలుగు వర్ణములు, ఆశ్రమ ధర్మములు (కర్తవ్యములు) పొత్తములలో గ్రంథములలో నున్నవి. అనగా వాటి వర్ణన మాత్రమే లభించు చున్నది. వాటి ననుసరించి ఆచరణ ఎవరునూ చేయుటలేదు. నాల్గు దిశలలో (అంతటా) ప్రజలు వేషము ధరించి (పండితులు, పండాలు, సన్యాసులు) మొదలగు వారు పర్యటించుచూ కనపడుచున్నారు. అయినా ఆవేషముల ననుసరించి ఎవరును ప్రవర్తన (ఆచరణ) కల్గిలేరు. కర్తవ్యము చేయకయే వేషములను ధరించుట వ్యర్థము. ప్రాణము లేని శరీరము తాజ్యము చేయనగును.

వేదముల యందు వర్ణించిన ప్రకారము మోక్ష సాధనలన్నియు లభించుచున్నవి. ఈ సాధనముల ప్రకారము చేసినందున నాల్గు ఫలములు - ధర్మము, అర్థము, కామము, క్రోధ, మోక్షం లభించును. అని వినబడినది. నీరు లేక, చెరువు, నది వున్నట్లు రాముని కృపలేకయే నిస్సారము, వ్యర్థమైన జ్ఞాన మగును. ముక్తికి అనేక మార్గములు వున్నవి. అనేక రకములయిన సాధనములు వున్నవి. జపము, తపము, యజ్ఞము, యాగము మొదలయినవి. అయినా ఓ తులసీదాసు! నీవు నేను చెప్పినందువల్ల రాత్రింబవళ్ళు రామనామము జపించు అనగా మోక్ష ప్రాప్తి కొరకు ఒకే రకమైన సరళంగా సుగమ సాధనములు రాముని నామ జపము మాత్రమే.

(సాంగోహంగమమగు వస్తు జ్ఞానము మోక్షమే. శాస్త్రార్థముల ప్రకారము అనుకూలమైన, నిర్దిష్టమైన ఆచరణ కల్గియుండుట మోక్షము. తత్వమసి, సోహమ్, మొదలగు మహా వాక్యములు వివరణయే. మోక్షము. స్వాత్మానందమగు జ్ఞానమయమగు అవస్థ మోక్షము. అస్తి - నాస్తి ఈ ఉభయాత్మక మగు జ్ఞానము యొక్క విచ్ఛేదమూ, మోక్షము, శబ్ద బ్రహ్మ యొక్క యధేష్ట జ్ఞానమును మోక్షముగా భావించవలెను. నిర్వికల్ప సమాధి గతమైన ఆనందమును మోక్షముగా భావించవలెను. ఏకదేశిక సిద్ధాంతము నుండి సిద్ధమగు భక్తి విధానము మోక్షము. ఆత్మ సమర్పణానంతరము భగవత్ ప్రాప్తి పరమ విరహము వ్యాకులతా (నిరంత్యము) దానిని మోక్షమని అనవలెను. ఇట్లు అనేక అభిప్రాయాలు వున్నవి. భక్తిని జ్ఞానము కంటె శ్రేష్టమైనదిగా భావించబడినది. భక్తిలేని జ్ఞానము గలది అయి ప్రాణము లేనిదిగా నుండును.)

149. తులసీదాసు తనను తానే సంభోదించుకొనుచూ చెప్పుచున్నారు.

ఓ తులసీదాసు నీవు నేటికినీ నీ రాముని కర్తవ్యమును (వారి ద్వారా చేయబడి పనులను (కర్మలను) కర్తవ్యముగా భావించవలెను. తెలుసుకొనుము. తెలుసుకొనినచో నీకు శుభము కల్గును. చూడుము. నీవెక్కడ? కోసలనరేశుడు రాముడు ఎక్కడ? అనగా నీకు ఆయనకు ఏ విధమగు సమానత్వము లేదు. అయినా నిన్ను అందరూ ఏమను చున్నారు?

భావము - నీవు నీచుడవు రాముడు గొప్పవాడు. అయినా ప్రపంచమంతయును, నిన్ను రామభక్తుడని, సేవకుడని అనుచున్నది. ఈ అదృష్టమును గొప్ప గొప్ప యోగులు, జ్ఞానులు కూడా సంపాదించలేదు. రాముడు సంతోషపడి నీపైన కృపచూపెనా? ఎప్పుడైనా కోపగించుకొని నిన్ను తిట్టెనా? కాని నీవు దర్పణము (అద్దము) నందు నీ ముఖమును చూచి, బాగుగా ఆలోచించి, మనస్సునందు ఓటమి ఒప్పుకున్నావు. భావము ఏమనగా, నీవు నీ కర్మలను చూచి, నాయటువంటి పాపికి రాముడు ఎప్పటికిని లభించడు అని ఆలోచించి, మనస్సునందే ఓటమిని స్వీకరించి కూర్చొనియున్నావు.

నీ అనేక జన్మల చెడిపోయిన కర్మలు చక్కదిద్దుకొనుటలో అరక్షణము కూడా రెప్పవాల్చుట లేదు. ఎందుకనగా ప్రేమ పూర్వకముగా ఓ కృపానిధి! నన్ను రక్షింపుము అనుట వలన రాముడు ఎవరిని నాథులుగా (మంచివారిగా) చేయలేదా? వాల్మీకి, నావికుడిగా, గుహుని కథ ప్రసిద్ధిగాంచినది. అడవిజాతి (శబరిని) ఎలుగుబంట్లును రాముని ద్వారా సన్మానించడము. లోకమునకు తెలుసు. ఈ కథలను విని, రాముని ఎదుటికి రాని వారు అనగా వారి శరణుచెందని వారికీ జ్ఞానోపదేశములు ఎవ్వరూ ఇవ్వవలెను? రాముని స్మరించినచో రాముడు అందరిని రక్షించునని, వారికి తెలియచెప్పవలెను?

సుగ్రీవుడు రామునికి ఏమి సేవ చేసియుండెను? అతడు ప్రేమ సంబంధమును ఏమి

నిర్వహించెను. రాజ్యమును పొంది సీతాన్వేషణ మరచిపోయెను. అతని సోదరుడగు వాలిని వ్యాధుని వలె చాటున నుండి చంపెను. రాముని యొక్క ఈ పని విని ఎవరికిని ఇష్టము వుండదు. భావము ఏమనగా రాముడు కర్తవ్య విముఖుడుగా సుగ్రీవుని కొరకు వాలిని, చాటున నుండి (దాగుకొని) చంపిన కళంకము తనపైన వేసుకొనవలెను. విభీషణుడు రాముని భజనపము చేసి యుండెను? రాముడు అతనికి ఎటువంటి ఫలితము నిచ్చెను?

దీని రహస్యము ఏమనగా పేదవారిపైన దయ చూపెట్టు రాముడు, అందరిని రక్షించు తన ప్రతిజ్ఞ లజ్జను సదా వుంచుకొనును. అనగా పేదలను రక్షించువాడు తన ఈ యజ్ఞమును గురించి సదా లజ్జ కలిగి వుండవలెను. ఇందువలన ఓ తులసీదాసు! నీవు రాముని నామస్మరణ జపింపజేసి, ఇతరుల నెవ్వరిని చర్చించవద్దు. ఎందుకనగా రాముడు అందమైన ముఖము గలవాడు సుఖమును ఇచ్చును. బుద్ధిమంతుడు, సమర్థుడు, కృపగలవాడు. దీనులను రక్షించు స్వామి.

సజల నేత్రుడు. మిక్కిలి ఆనందముగా కంఠావరోధముతో కూడిన వాణి (మాటలు) ఉద్వేగముతో కూడిన మనస్సు, రోమాంచితమైన శరీరము రాముని గుణములు గానము చేసిన ప్రపంచమున నున్న ఎవరి బాధలు తొలగలేదు. అనగా అందరి భాదలు తొలగినవి. ప్రభువగు రాముడు ఉపకారమును స్వీకరించువాడు. సర్వజ్ఞుడు. ఇది ఆలోచించి నీవు వెనుకటి పాప కర్మల చేత ఉత్పన్నమైన గ్లానిని వదలివేయుము. ఓ తులసీదాసూ నీకు రామునికి వున్న పరిచయము ఎరుక ఏమి క్రొత్తదిగాదు. అనగా చాలా పురాతనమైనది అనగా జీవుడు బ్రహ్మభక్తుడు భగవంతుని సంబంధము అనాదికాలము నుండి ప్రవర్తింపబడుచున్నవి.

(రాముడు ధర్మ రక్షకుడయి కూడా వాలిని చాటున వుండి చంపి అధర్మపరుడను కళంకము తెచ్చుకొనెను.)

150. ఒకవేళ రాముని వంటి స్నేహపరునితో, ప్రేమించనిచో ఈ మానవ శరీరము పొందిన లాభమును ఏమి సంపాదించినట్లు? ఈ మానవ శరీరమును ధరించి జ్ఞానులు ప్రపంచములోని సుఖములను త్యజించి, రాముని ఎడ ప్రేమ కల్గియుండిరి. నీవు అదే శరీరమును పొంది బాగుగా మనసారా పాపములను చేసితివి. ఓ దౌర్భాగ్యుడా నీవు పాపముల సముద్రుడవు. ఈ ప్రపంచమున జ్ఞానము, వైరాగ్య యోగము, యజ్ఞము, మొదలగు ఆనంద మార్గములు కొద్దిగా లేవు. అనగా చాలా వున్నవి. అయినప్పటికి రాముని ప్రేమలేకయే ఈ విషయములన్నియు, మృగతృష్ణలోని నీరు, సముద్రము అలలలోని నీరు అనగా ప్రభావ హీనముగా నుండునని వ్యర్థము సారహీనము. భావము ఏమనగా మృగతృష్ణ జలము నందు అస్తిత్వము వుండదు. అది మనకు ఏ విధముగా కార్యమును సాధింపలేవు. అదే మాదిరి ఈ సాధనములన్నియు రాముని ప్రేమ లేనిచో నిరుపయోగము. వీటివలన మనకు ఏ విధముగా శుభము చేకూరదు.

ప్రపంచమును చూచి, వేద పురాణములను విని, జ్ఞానుల మాటలను తెలుసుకొని రాముని చరణ కమలముల యందు ప్రేమ, విశ్వాసం కల్గియుండవలెను. ఎందుకనగా రాముని చరణములు సంపూర్ణమగును. కళ్యాణమునకు గని వంటిది. మూలకారణము ఒకవేళ నీవు నేడు కూడ ఈ విషయమును మనస్సునందు తలంచి, తెలుసుకొనుము. హృదయమున ఓటమిని స్వీకరించుము. అనగా నీ సర్వ దోషములను స్వీకరించినచో రెప్పపాటు కాలములో నీకు కళ్యాణము (శుభము) అగును. నీవు తులసీదాసు యొక్క ఈ సలహాను స్వీకరించుము. సరియైన హితము చేకూర్చు రామునితో స్నేహముతో పాటు స్మరించుము. అనగా ప్రేమ పూర్వకముగా రాముని భక్తి కల్గియుండుము. దీని వలననే నీకు శుభమగును.

(కబీరు కూడ బాహ్యాచారమును, ఆడంబరమును దృఢత్వముతో ఖండించి, ఒకే ఒక ప్రేమ భావనను జీవుని ఉద్ధరించునదిగా స్వీకరించును.)

151. ఓ రామా! ఓ స్వామి! నీవు కృపగలవాడవు. తన స్వభావము ప్రకారము నాపైన కృప జూపుము. పరమార్థమును స్వార్థమును దానముగా ఇచ్చునట్టి సంపూర్ణ సాధనములు (జపము, తపము, యోగము, జ్ఞానము మొదలగునవి) సుఖమును కల్గించునట్టివి మేలును (శుభమును) కల్గించునట్టివి. కాని కలియుగము కోపగించుకొని ఈ అందమైన అన్ని సాధనములను నష్టము చేసి, తన కఠోరమైన చెడు మార్గముల ద్వారా (బూటకము లోభము మొదలగునవి) నడిపించినది. అనగా వీటిని ప్రచారము చేసినది. నా హృదయము దృష్టిని ప్రసరింప చేసినచోటంతా నిత్యము నవీనమైన దుఃఖము ఎక్కువయి పెంపొందించునవి అయినవి. సురుచునని కలతో పారిపోయినది. అనగా మనస్సు మంచి విషయముల యందు లగ్నము కావటము లేదు. చెడు రుచి ఎదుట వచ్చి నిలబడి యున్నది. అనగా ఏ వస్తువులు ఇష్టము లేదో, అవియే వరుసగా ఎదుటికి వచ్చుచున్నవి. అనగా ఇవి చూచి మనస్సు దిగులు చేత వికలత్వమును చెందుచున్నది. శరీరము లోభముల చేత వికలమయినది. వాక్కు అసత్యము చెప్పుచూ, చెప్పుచూ అశుద్ధము, అపవిత్రము అయినది. భావము ఏమనగా మనస్సు, శరీరము, వచనము (వాక్కు) మూడును అపవిత్రమయి, మలినములయినవి. అయినా ఓ ప్రభూ! ఇది అంతయు అయినప్పటికి, నీతో తులసీదాసు అనగా నాకు సంబంధము బాగుగా ఉన్నది. అనగా నీవు నన్ను ఇంత అయినను త్రోసి పుచ్చలేదు. ఎందుకనగా, నేను ఇంతవరకు ప్రేమించుట మరచి పోలేదు. భావము ఏమనగా నీకు - నాకు సేవ్య - సేవక సంబంధమున్నది.

152. ఓ మనసా! నీవు అనేక ఉపాయములు - చేయుచూ దారితప్పి చెడ తిరుగుచున్నావు; ఎందుకు రఘువీరుడైన రాముని చరణముల నుండి విముఖుడవు అయినందున నీ దుఃఖములు తొలగిపోవు అర్థము ఏమనగా నీవు రాముని భక్తి కల్గియుండక పోయినచో దుఃఖములను అనుభవించవలసియే యుండును. నీవు కోట్ల కొలది ఉపాయములను

చేసినప్పటికీ మూడు రకములైన (దైహిక, దైవిక, భౌతిక) తాపములు తొలగిపోవు, ఈ విషయములను భుజములను - ఎత్తి - ఎత్తి అనగా కేకవేసి వేసి (బిగ్గరగా) మహాముని శుకదేవుడు చెప్పియున్నారు. నీవు నీ సహజ స్వభావము (చపలత్వమును) వదలి పాలను వదలి కేవలము నీటిని మథనము (చిలికిన) నేయి లభించునా? దీని గురించి ఆలోచన చేసితివా? అనగా రామునికివి ముఖుడయి నందున సుఖమును కోరుట, నీటి నుండి నేయి లభించదు; అటులనే సుఖము అసంభవము. ఇందువలన నీవు ఈ విషయమును తెలుసుకొని నీ భ్రమను త్యజించుము. భగవంతుని రెండు చరణములను భజించుము రాముడు, సేవ చేయుట వలన సరళముగా లభించును. ఎందుకనగా రాముడు సద్గుణములకు గహనము, గంభీరమైన అనగా సఘనమైన (దట్టమైన) అడవి (సర్వగుణ సంపన్నుడు). శాస్త్రములు, వేదములు, గ్రంథములు, ఋషులు, భక్తులు అందరు గంభీర బుద్ధిగల వారి ఉద్దేశ్యమే. విను తులసీదాసు చెప్పుచున్నాడు. స్వామి లేకయే, గొల్లవాని పశువులు, గంగానది గట్టున వున్న దాహము చేత చనిపోవుచున్నవి. భావము ఏమనగా - ముక్తికి సాధనము రాముని భక్తియే. సమీపమునున్నను; కూడ తన అజ్ఞానమున జీవుడు దాని దగ్గరకు కూడా పోలేదు. ప్రపంచ దుఃఖముల చేత విలపించి విలపించుచుంటివి; చనిపోవుదువు.

153. వేదములు, మునులందరు, స్థిరమైన బుద్ధిగల వారు (విద్వాంసులు) రాముని చరణములయందు నా ప్రేమ వున్నందున ఇందువలన కష్టములను పొందుచున్నాను అని చెప్పుచున్నారు. ఈ విషయమును చంద్రుని ఒడిలో వుండిన జింక, చంద్రుని అమృతమును, తొలగించి పొందినది. అది మృగతృష్ణ జలమును చూచి ఎందుకు భ్రమలో పడుతుంది? అనగా రాముని చరణముల ఆనందము పొందిన వాడు తుచ్ఛమైన ఇహలోకములోని విషయ వాసనల యందు సుఖములకు ఆకర్షింపబడడు. అనేక పురాణముల నుండియే అజ్ఞానము తొలగదు. వాటిని చదివి తెలుసుకొన లేనిచో పక్షి చిలుకవలె స్థితి వుండును. అనగా చిలుకకు రామనామములు వల్లింప జేసినచో అది దానిని వల్లించు చుండును. కాని దాని మహిమను తెలుసుకొనలేదు. ఇదే మాదిరి పురాణము మొదలగు వాటిని అధ్యయనము చేయుటవలన దాని వాస్తవమైన భావము హృదయంగమము చేసికొనక అజ్ఞానము తొలగదు. చిలుక తన అజ్ఞానముననే వలలో చిక్కుకొని వుండును. (చిలుక పొలములో పాతిన నాల్గు కోణములు గల కర్రపైన కూర్చొనిన వెంటనే క్రిందకు పడిపోవుదునను భయముతో దానిని వదలదు. పొలము రైతు వచ్చిన దానిని పట్టుకొనును.) ఇదే మాదిరి జీవుడు తన అజ్ఞానము చేత మాయాపాశమున స్వయముగా బంధింప బడుచున్నాడు. ఆ మూర్ఖమగు చిలుక బూరుగుచెట్టు పుష్పము ఆశలో ఈ పుష్పము చూచుటకు ఎంతో ఆనందముగా నున్నది, తినినచో ఎంతో మధురముగా నుండునని ఆ పుష్పము వద్దకు పోవును. తినుటకు ముక్కుతో పొడిచినప్పుడు అందులో కండ లభించదు. ఇదే మాదిరి ఈ ప్రపంచములో జీవుడు బాహ్య ఆకర్షణలకు గురి అయిన వాటి దగ్గరకు వెళ్ళును. ఈ ప్రపంచము తత్వహీనమని తెలుసుకొనును. తదుపరి పశ్చాత్తాపమును పొందును.

తెలియును. శ్వాసను వశములో వుంచుకొని ప్రాణాయామము ద్వారా మనస్సును వశములో వుంచుకొనలేను. తులసీదాసునగు నాకు పరమ కరుణా సాగరుడవైన రాముని భరోసా కల్గియున్నాను. ఆ ప్రభువే నా ప్రపంచములోని భయంకరమైన వ్యథను తొలగించును.

(ఎంత చదివినా, వినినా, నేర్చినా సందేహము యొక్క మూలము తొలగిపోలేదు. కబీరు ఎంత అని ఎవరికి చెప్పగలడు. దుఃఖమునకు మూలము ఇవియే. వైదిక విధులు : సత్యము, శౌచము, యజ్ఞానుష్ఠానములు, పునశ్చరణ, పంచాగ్ని, యంత్ర - మంత్రము, ప్రాణాయామములు, సమాధి మొదలగునవి.)

154. ఓ మనసా! అవకాశము తప్పిన అనగా కాలము గడచిపోయిన నీవు పశ్చాత్తాపమును పొందుదువు. నీవు ఈ దుర్లభమైన మానవ శరీరమును పొందితివి. ఇందువలన దీనిని పొంది రాముని చరణముల మనసా, వాచా, కర్మణా (త్రికరణ శుద్ధిగా) భజించుము. సహస్రార్జునుడు! రావణుని వంటి రాజులు కూడ శక్తివంతమైన కాలము పంజానుండి తప్పించుకొనలేక పోయిరి. వారు మేము, మేము అనుచూ అనగా అహంకారము మత్తుగా, చిత్తు అయి సంపద మేడలను అంటుకొని యుండిరి. కాని చివర సమయమున (అంతిమ కాలమున) వారికి కూడా ఖాళీ చేతులతో వెళ్ళవలసి వచ్చెను. అనగా చనిపోయిన తర్వాత ఏ సంపదను తమ వెంట తీసుకొని పోలేక పోయిరి.

నీవు ఈ విషయమును తెలుసుకొనుము. భార్యాబిడ్డలు అందరు తమ స్వార్థమున మునిగియుందురు. ఇందువలన నీవు వీరిని ప్రేమించవద్దు. ఓరీ నీచుడా! అంతమున (చివర) వీరు అందరు నిన్ను వదలివేసెదరు. ఇందువలన నీవు ఇప్పటి నుండియే వీరిని ఎందుకు వదలవు? ఓ మూర్ఖుడా! ఇప్పుడా అజ్ఞానమను నిద్రను వదలి జాగ్రత్త పడివేయుము. నీ స్వామి అగు రామునిని ప్రేమించుము. నీవు నీ హృదయములో నున్న దురాశల నన్నింటిని (ప్రపంచములోని ఆశలు) వదలివేయుము. తులసీదాసు, కామాగ్ని విషయ రూపముననున్న నెయ్యి వేసినా శాంతింపదు. అనగా నెయ్యి వేసినచో అగ్నిజ్వాల ఇంకనూ ఎక్కువ అగును. అదే మాదిరి ఎక్కువగా విషయ వాసనచే కామాగ్ని ఇంకను ఎక్కువ ప్రజ్వరిల్లును. ఇందువలన నీవు ప్రపంచములోని విషయ వాసనలను త్యజించి (వదలి) రాముని భజన చేసిన సదా అందులోనే నీకు శాంతి లభించును.

155. ఓ మూర్ఖమైన మనసా! నీవు ఇటు అటు ఎందుకు పరిగిడుచున్నావు? నీవు భగవంతుని కనుల చరణామృతమును వదలి, మృగతృష్ణలోని జలమునందు నిమగ్నుడవై యున్నావు? అనగా భగవంతుని భజన వదలి నిస్సారమగు ప్రపంచములో విషయ వాసనలలో ఎందుకు మునుగుచున్నావు? తిర్యక్ యోని గల (పశువులు, పక్షులు, సర్పముల) దేవతల, మనుష్యుల, అసురుల, అన్యమగు అనేక ప్రపంచమయిన యోనులయందు నీవు దారితప్పి పరిభ్రమించితివి. ఆ యోనులయందు నీ యిల్లు - భార్య

- బిడ్డలు, అనేకములగు బంధువులు నిన్ను పుట్టించుకొనిన మాతాపితలు వుండిరి. వారందరు, నీకు నేర్పిన దానివలన నీకు నిరంతరము అనేక నరకములు అనుభవించవలసి వచ్చెను. అనగా వారు నీకు ప్రపంచ విషయ వాసనల యందు అప్పుడయి వుండుటకు ప్రోత్సహించిరి. దాని ఫలితము నరకము అయినది. వీరు నీకు మంచి మార్గమున ప్రయాణము చేసిన శుభమగును. అటువంటి మార్గము చూపెట్టలేదు. నీ ప్రపంచ బంధనములు జన్మ - మరణములు నివారించబడవు.

నీవు అనేక విధములుగా మోసగించబడినప్పటికి నీవు నేటికి ఆ విషయ వాసనలలో వ్యస్తుడవయి (మునిగి) యున్నావు. అనగా ఆ విషయ వాసనల చేత నీకు నరకము అనుభవించవలసి వచ్చెను. అయినా నీవు మరలా వాటి వెనుకనే పడి యున్నావు. ఓ మూర్ఖా! కామాగ్ని (కామ వాసనా అను అగ్ని) భోగము (విలాసము) అను రూపమనెడి నెయ్యి పోసిన ఎట్లు ఆరిపి వేయవచ్చును? అనగా విషయ భోగములు అనుభవించుట వలన, కామాగ్ని చల్లారక, ఇంకను ఎక్కువగా ప్రజ్వరిల్లును. రెండవ ప్రక్కన ఇక్కడ విషయ భోగములు పొందినందున పూర్తికాక వున్నందున నీకు ఎక్కువ కష్టములు అనుభవించవలసి వచ్చెను. నీకు స్వప్నములో కూడ, సుఖము లభించలేదు. ఎందుకనగా నీవు వాటిని పూర్తి చేయుటకు ప్రయత్నించు చుంటివి. విఫలుడవైనందున దుఃఖమును పొందుచూ వుంటివి. వేదములు ఏ విధముగా ధనమును దుఃఖమును కలిగించునదిగా చెప్పెను. అనగా మానవుడు ధనము లేకున్నను దుఃఖమును పొందును. ధనమున్నందున అనేక రకములైన పాపములను చేసి చివరకు నరకము పొందును. అందువలన ధనము వున్నను, లేకునన్నను, రెండునూ దుఃఖ హేతువులే, అదే మాదిరి విషయ వాసనల పూర్తి అగుట, కాకుండుట రెండునూ దుఃఖమునకు కారణము. అగ్గివలె దుఃఖమును కల్గించుచున్నవి. ఉదాహరణకు అడవియందు భూతాగ్నిని చూసి (కొరివి దయ్యము) యాత్రికులు భయము చేత ముందుకు పోలేరు. వెనుకకు వెళ్ళలేరు. భయము చేత జంకి అక్కడనే నిలబడి యుందురు.

ఓ మూర్ఖా! చూడు, నీ జీవితము క్షణము - క్షణము నష్టమగుచున్నది. నీవు ఈ దుర్లభమైన మానవ శరీరమును పొంది కూడా దీనిని వ్యర్థముగా పోగొట్టుకొంటివి. నీవు ప్రపంచము యొక్క ఆశలను త్యజించి, భగవంతుని భజన చేయుము అని తులసీదాసు చెప్పుచున్నాడు. ఎందుకనగా కాలరూపముననున్న సర్పము ప్రపంచము నంతటిని తినుచున్నది. నీవు కూడ ఎప్పుడో ఒకసారి ఆహారము అయ్యెదవు.

(ముక్తి పొందుటకు వైరాగ్యము అనుభవమును ఉత్పన్నము చేసుకొనవలసియున్నది. అనాసక్తితో అన్ని కార్యములను చేయవలసియున్నది.)

156. ఓ దేవుడా! నీవు రాగితో నిర్మించిన వీపువలె, నష్టము కానిది. బలిష్టమైనది శరీరము అని భావించి యున్నావు. అనగా నీవు ఈ శరీరము ఎప్పటికిని నష్టము గాదు. అజరమై,

అమరమయి యుండునని నీవు భావించితివి. అయినా ఓ నీచుడా! నీ తలపైన మృత్యువు తిరుగుచున్నదని నీకు తెలియదు. నీవు భగవంతుని పూర్తిగా విస్మరించితివి. పృధ్వీ, రమణి (అందమైన భార్య). ధనము, ఇల్లు, మిత్రులు, పుత్రులు - మొదలగు వారు ఎవరినీ స్వీకరించలేదు. నీవు ఎవరికి బంధువు? వీరు ఎవరి వెంట వెళ్ళిరి? అనగా మృత్యువు అయిన వీరిలో ఒకరును వెంటరారు. వీరి అందరి మనస్సునందు కపటము నిండి వున్నది. అనగా వీరందరు స్వార్థమునకు మిత్రులు.

రాజులు (రావణుని వంటి) ప్రపంచమును జయించి, యముని బంధించి తమ జైలులో వేసి యుండిరి. వారిని కూడ కాలము అల్పాహారముగా చేసుకొనెను. అనగా కాలము వారిని తినెను. కాలము నిన్ను కూడ తినును. నీ లెక్క ఏమి? సరియగు సారముగల తత్వమనునది అని తెలియునా? వేదములు ప్రధానముగా దేనిని వర్ణించియున్నవో ఆలోచించి తెలుసుకొనుము. ఓరీజీవా! ఈశ్వరుడు (రాముడే సత్యమని తెలిసి) కూడ నీవు అతని భజన చేయుట లేదు. అతనిని నిరంతరము శివుడు ధ్యానించు చుందురని తులసీదాసు చెప్పెను.

157. ఈ మానవ శరీరమును ధరించినందున ఏమి లాభము? ఒకవేళ ఈ శరీరము మనసా, వాచా, కర్మణా ద్వారా స్వప్నములో కూడ ఇతరులకు ఉపయోగం లేదు. ప్రపంచములోని సుఖములు, స్వర్గ నరకములు, శివుడు, బ్రహ్మ అన్యము వనములు అన్నీ చోట్ల పిలువకనే వచ్చెదరు. అనగా లభించును. విషయ వాసనల యందు ఆసక్తివున్న జీవుడు, శరీరము, నష్టమగును. ఈ మూర్ఖుడు మోహవశమునగాని అయివుండి మనస్సున సంతోషించుచూ పరస్త్రీలను కోరుట, ఇతరులకు ద్రోహమును చేసెను. అనగా మనస్సుకు వచ్చినట్లు చెడు కర్మలను చేసితివి. ఈ జీవుడు గర్భావస్థలో అనేక దుఃఖములను భయంకరమైన కష్టములను మరచి పోయెను. ఇతడు వెనుక జన్మమున ఎన్నో దుష్కర్మలను చేసినందున ఈ జన్మయందు గర్భావస్థయందు దుఃఖమును అనుభవించవలసి వచ్చెను. ఇప్పుడు అటువంటి కుకర్మలచే మనసారా చేయుటకు సిద్ధమయ్యెను.

ఈ ప్రపంచమున భయము, నిద్ర మైధునం, ఆహారములు మొదలగునవి అందరిలోను సమానముగా నున్నవి. అనగా ప్రతి ప్రాణియందు, ఈ భావనలు వుండును. కాని ఈ జీవుడు దేవతలకు కూడ దుర్లభమైన మానవ శరీరమును పొంది కూడ, భగవంతుని భజన చేయలేదు. తన మదము, అహంకారము గర్వమును దీనిని పోగొట్టుకొనెను. నష్టము చేసుకొనెను. భావము ఏమనగా పశుపక్ష్యాది జీవులయందు వివేక బుద్ధి వుండదు. ఇందువలన అవి పైన పేర్కొనిన గుణములకు వశీభూతమై యుండును. కాని మానవునిలో వివేకము అను బుద్ధి వుండి కూడ అతడు దానిని ఉపయోగించు కొనలేదు. తన జీవితము వృథాగా పోగొట్టుకొన కోరుచున్నాడు. అతనికి, తన పరాయ అన్న బుద్ధి లోపించినది. అనగా సమద్రష్ట కాలేక పోయెను. అంతఃకరణము శుద్ధుడయి రాముని ప్రేమ యందు విలీనము కాలేక పోయెను. అతనికి ఈ అవకాశము గడచిపోయినందున పశ్చాత్తాపము పడుటకంటె

మరేమి మిగులును. అనగా మానవ శరీరము పొంది కూడా ఒక వేళ మానవుడు సమదృష్టి లేని వాడయిన, ఈశ్వర భక్తుడు, నిర్మలమైన అంతఃకరణముగల వాడు కాలేనందున అతనికి ఇటువంటి మంచి అవకాశము లభించదు. ఎందుకనగా మానవశరీరము ద్వారానే ఈ శుభకార్యములు సంభవమగును. అన్యయోనుల యందు కాదు. భావము ఏమనగా జీవునికి మరల విభిన్నమైన యోనుల యందు పరిభ్రమించవలసి వచ్చును.

(తులసీదాసు ఆత్మసాధన లేక మానవులు లోక కళ్యాణమునకు ఎక్కువగా సాంఘిక మర్యాదలను పాటించవలయునని ప్రభోదించెను. వ్యక్తి పక్షమును వదలి లోక పక్షమును స్వీకరింప ప్రోత్సహించెను.)

158. నీవు మానవ జన్మ పొందిన తర్వాత ఏ పనిని పూర్తి చేశావు. వేదముల యందు పరోపకారమును గురించి ఎక్కువగా వర్ణించియున్నది. నీవు పొరపాటున గూడా దానిని గురించి ఆలోచించలేదు. అనగా మరచిపోయి కూడ పరోపకారము చేయలేదు. ఇప్పుడు తులసీదాసు ప్రపంచమును వృక్షముగా పోల్చి దాని రూపకమును చెప్పుచున్నారు. ద్వైతము అనగా తను, పరాయులు ఇతరములు అనుభవమును ఈ ప్రపంచమనెడి వృక్ష మూలము. భయము దాని కంటకములు, శోకము వృక్షము నందు వచ్చు ఫలములు ఈ మాదిరి ఈ వృక్షము తొలగించుటకు వీలు కానిది. దీనిని తొలగించుటకు ఒకే ఒక ఉపాయము ఏమనగా రామభజన రూపమున నున్న గొడ్డలితో (తీక్షణమైన) దీనిని నరకి తొలగించవచ్చును. కాని నీవు ఇటుల చేయలేదు. అనగా రాముని భజన చేసి ఈ ప్రపంచమనెడి వృక్షము నుండి ముక్తి పొందలేకపోయెను.

అసత్యమైన ప్రపంచమును సత్యమైనదిగా భావించు ఈ సంశయాత్మకమైన సాగరమును రామనామమనెడి ఓడను భజన చేయుము. అనగా దాని ద్వారా దాటి పోవుటకు ఆత్మను ఉద్ధరించుకొనలేదు. దీని ఫలితముగా నీవు వివేక హీనుడు అనగా మూర్ఖుడవయి అనేక జన్మలను పొంది అనేక యోనుల యందు పరిభ్రమించు చున్నావు. నీవు ఇతరుల సహజమైన సంపద చూచి ద్వేషాగ్ని యందు నీ మనస్సుని జ్వలింప చేయు చున్నావు. అనగా లోలోన మండుచున్నావు. అయినా నీవు శాంతి, సంయమము, దయ, దీనులను కాపాడుట వంటి శుభకార్యములను చేసి, నీ మనస్సును శాంత పరచుకొని భగవంతుని భజన చేయలేదు. నీవు స్వామి, గురువు, తండ్రి, మిత్ర తుల్యమైన (సమానమగు) రాముని మనసా, వాచా, కర్మణా విస్మరించితివి. అనగా ఎప్పుడు కూడ వారిని మనసారా ధ్యానించలేదు. సత్కర్మల ద్వారా వారిని సంతోష పరచలేదు. నోటితో వారి గుణములను గానము చేయలేదు. తులసీదాసు జటాయువును ఉద్ధరించిన రాముడు నన్ను తప్పక స్వీకరించునని మనస్సు నందు విశ్వాసమున్నదని చెప్పెను.

(ప్రపంచములోని సుఖములనుకోరిక నుండి ముక్తుడగుటయే కళ్యాణ ప్రదము. పరోపకారమును మానవుని యొక్క ప్రధానమైన కర్తవ్యముగా భావించబడినది.)

159. ఓ మనసా! అభిమానమును వదలి భగవత్స్వరూపుడగు గురువు చరణ కమలములను భజింపుము. వారిని భజించుట వలన సుఖమునకు సముద్రుడగు భగవంతుడగు రాముడు లభించును. పాడ్యమి, పక్షమునకు మొదటి దినము; ఇటులనే రాముని ప్రాప్తించు కొనుటకు సర్వప్రథమ సాధనము ప్రేమ; ప్రేమ లేనిదే రాముడు లభించుట అసంభవము. ఒకవేళ రాముడు జీవుల హృదయమున పొందు సమయమున తన సంపూర్ణమగు కళలతో పూర్తిగా విరాజిల్లుచుండును. అనగా పూర్ణరూపమున వుండును. అయినా ప్రేమ లేనిది ఆయన సాక్షాత్కారము అసంభవము.

ద్వితీయ (విదియ) వలె రాముని పొందుటకు రెండవ సాధనము తను ఇతరులను అను భేదభావమును కల్గించు బుద్ధిని వదలి, సమద్రష్ట అయి ధైర్యమును పూని పృథ్వీమండల మంతయు విహరించవలెను. హృదయము, మోహమును, మాయ, మదము లేనిదై యుండవలెను. అక్కడ రాముడు వుండును. తదియవలె మూడవ సాధనము పురుషోత్తముడు లక్ష్మీపతి ముకుంద భగవానుడు మాయాత్మకమైన మూడు గుణములు, సత్వ, రజ, తమో గుణములు నుండి వేరుగా నుండవలెను. ఇందువలన ఈ గుణములు గల స్వభావమును వదలక పరమానందమును పొందుట దుర్లభము. అనగా సాధకునికి సత్, రజతమో గుణముల ప్రభావమునుండి ముక్తుడు కావలెను. అప్పుడే అతనికి బ్రహ్మానందము లభించును.

చతుర్థికి సమానమగు సాధనము బుద్ధి, మనస్సు, చిత్తము అహంకారము ఈ నాల్గింటిని తన వశములో నుంచుకొనవలెను. ఇట్లు చేయుట వలన పరిశుద్ధమైన వివేకము ఉత్పన్నమగును. అప్పుడు సమరసమనెడి సహజమైన ఆత్మానంద రూపమును పరమపదము స్వతహాగా ప్రాప్తించును. పంచమికి సమానము. ఐదవ సాధనము స్పర్శ, రస, శబ్ద, రూపము గంధము ఈ ఐదింటి యొక్క చెప్పినది వినకుండుట, చేయక వుండుట, వుండవలెను. అనగా పునర్జన్మ పొందవలసియుండును. భావము ఏమనగా పైన పేర్కొన్న అయిదు ఇంద్రియముల త్వచ, జిహ్వ, నాసిక, కర్ణము, నేత్రము చెప్పినది వినక వీటికి సంబంధించిన విషయముల యందు ఆకర్షణలో పడకూడదు.

షష్టికి సమానమగు ఆరవ సాధనము సీతాపతి రాముని చరణముల యందు ప్రేమను పొందుటకు కామము, క్రోధము, మదము, మాత్సర్యము, మోహము. లోభముపైన విజయమును పొందవలెను. రాముని కృపారూపమనెడి జలము లేకయే, లోభము అనెడి అగ్నిని ఆర్పివేయలేము. సప్తమికి సమానము ఏడవ సాధనము ఏడు ధాతువులు త్వచ, రక్తము, మాంసము, అస్థి, మజ్జా, మేధ, వీర్యము చేత నిర్మితమైన ఈ శరీరమును గురించి యోచించి ఇది క్షణభరోసయు, పాపముల పుట్ట ఈ శరీరమును పొందుట కేవలము ఒకే ఒక ఫలము (సార్ధకత) దీనివలన సదా పరోపకారమును చేయుటయే.

అష్టమికి సమానమగు ఎనిమిదవ సాధనమగు రాముడు అష్ట ప్రకృతిగల(పృథ్వీ, జలము, తేజస్సు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, పవనము) వాటినుండి

విడిగా నుండు శుద్ధ స్వరూపము. అనగా రాముని యందు ఈ ప్రకృతి యొక్క వికారము వుండదు. ఇటువంటి శుద్ధ స్వరూపము గల భగవంతుడు, అనేక రకములగు ప్రాపంచిక వాసనలు గల హృదయమున దేవుడు ఎట్లుండును? అనగా రాముడు నిర్వికార హృదయముననే నివసించును. నవమికి సమానమగు సాధనము తొమ్మిదవది. తొమ్మిది రంధ్రములు గల నగరము అనగా శరీరము ఆత్మ మేలు చేయలేదు. అనగా ఆత్మ సాక్షాత్కారము కాలేదు. అనగా ఆత్మ అనేక యోనుల యందు పరిభ్రమించు చుండెను. స్వయమునకు (తనకు తానే) దుఃఖమును కల్గించుచుండును.

. దశమి దినమునకు సమానమగు పదవ సాధనము తన పది ఇంద్రియములను, ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములను సంయమములో వుంచుకొనవలెను. ఎందుకనగా ఈ పది ఇంద్రియముల సంయమముల తెలియక పోయినా దాని ద్వారా మించిన రామ ప్రాప్తికి చెందిన సర్వ సాధనములు నిష్ఫలమగును. శారంగధనుష్ ధారియైన రాముడు లభించడు. ఇందువలన ఇంద్రియము సంయమము అవసరము. ఏకాదశికి సమానమగు పదకొండవ సాధనము - పది ఇంద్రియములు ఒక మనస్సు, పదకొండింటిని వశములో వుంచుకొని వీటి ఒకే ఒక లక్ష్యము రాముని ప్రక్కకు ఉన్ముఖులను చేసి రాముని సేవ చేయవలెను. సేవ చేయువాడు పరమార్థ రూపుడగు ఏకాదశి వ్రతమును, ఫలమును పొందును. వచ్చి పోవు బంధనముల నుండి ముక్తి పొందును.

ద్వాదశికి సమానమగు పంద్రెండవ సాధనము, ముల్లోకముల యందు నిర్భయముగా నుండుటకు దానము చేయవలెను. ఏకాదశి వ్రతము తర్వాత ద్వాదశి పారాయణము అనగా వ్రతమును సమాప్త భోజనము చేయబడును. ఈ వ్రతము పారాయణము, ఇతరులకు మేలు చేయుట, ఇట్లు చేయుట వలన శోకము వ్యాప్తము కాదు. త్రయోదశికి సమానమగు సాధనమగు పదమూడవది, మూడు అవస్థలయందు జాగృతి, స్వప్న, సుషుప్తిని త్యజించి (త్యాగము చేసి) భగవంతుని భజన చేయవలెను. భగవంతుడు మనస్సు, కర్మ, వాక్కులకు అతీతుడు. సర్వవ్యాప్తి, అనంతుడు, భావము ఏమనగా దేవుడు అవస్థా భేదము వలన భగవంతుని పూర్తిగా భజింపలేక యున్నాడు. అనగా సమభావముతో భగవంతుని భజన చేయవలెను. స్వయ్ఙం వ్యాప్తుడు భగవంతుడు స్వయముగా బ్రహ్మాండ రూపము భావము ఏమనగా జీవుడు అవస్థా భేదము చేత భగవంతుని పూర్తిగా భజింప లేకయున్నాడు.

చతుర్దశికి సమానమగు పదునాల్గవ సాధనము - గోపాలుడు అనగా, ఇంద్రియములకు యజమాని భగవంతుడు పదునాల్గు లోకములలో వ్యాపించి యున్నాడు. జడ చేతనములు అన్నియు ఆయన రూపమే. కాని జీవుని ఎడ బుద్ధి నశించనంతవరకు భగవంతుడు జీవుని యొక్క ఈ ప్రాపంచికమైన వలను తెగ గొట్టడు. అనగా అతనికి జన్మ మరణముల బంధనము నుండి ముక్తుని చేయడు. పూర్ణిమ అమావాస్యవలె పదహైదవ నాధనము ప్రేమ, భక్తి రసముతోనే భక్త జనులు భగవత్ ప్రేమ రసమును తెలుసుకొనగలరు. ఈ

రసమును తెలుసుకొన్న తరువాత వారు శాంతమైన, శీతలమైన, గర్వములేని జ్ఞానులు అయి విరక్తులు అయ్యేదరు. భావము ఏమనేగా ప్రపంచములోని విషయ వాసనల ఆకర్షణల నుండి సంపూర్తిగా ముక్తులయ్యేదరు.

ఇక్కడ తులసీదాసు ఫాల్గుణ మాసములోని పౌర్ణిమ అమావాస్యలను గురించి వివరించి యున్నారు. ఈ పూర్ణిమ అమావాస్యకు హోలి పండుగ (కామన్న పండుగ - కామదహనము) మూడు రకములైన తాపములను (దైహిక, దైవిక, భౌతిక) వైరాగ్యమనెడి అగ్ని యందు కాల్చివేయవలెను. ఫాల్గుణము క్రీడ చేసుకొనవలెను. భావము ఏమనగా (వైరాగ్యము) ఉత్పన్నమయినచో ప్రపంచములోని విషయ వాసనల ఎడ ఆసక్తి తొలగిపోవును. ఇటుల అయినచో జీవుడు పాపము చేయడు. పాపములు చేయని వానికి, పాపములు చేయనందున, మూడు తాపములు తొలగిపోవును. జీవుడు ముక్తభావము చేత పరమ ఆనందమును పొందును. ఓ జీవా నీవు మనస్సు నందు నీవు పరమ సుఖమును పొందకోరిన ఇదే మార్గమున పయనించుము. అనగా క్రమక్రమముగా పైన పేర్కొన్న పదునైదు సాధనములు సాధించుము. వేదములు, పురాణములు, జ్ఞానులు, అందరి అభిప్రాయము ఇదియే. భగవంతుని చరిత్రను గుణములను గానము చేయుటయే హోలీ పండుగ గేయములు ఈ విషయములను గురించి భవసాగరమును దాటవలయును. మరల ఎప్పటికిని మరచి పోయి కూడ యమదూతల వలలో పడకూడదు. అనగా జన్మ మరణముల భ్రమణములో పడకూడదు.

అ విద్యను నాశనము చేయునట్టి, దుఃఖములను దూరము చేయువాడు, ఆనందమునకు రాశి, భక్తుల కృపలేనిదే, అనేక ఉపాయములు చేసినను లభించడు. అనగా భక్తుల కృపవలననే భగవంతుని దర్శనమగును. అన్యసాదనముల ద్వారా కాదు. ఇందువలన భావ సాగరమును దాటుటకు భక్తుల పవిత్ర చరణములనే నావగా భావించవలెను. భక్తుల కృప చేతనే దుఃఖమును వినాశమును చేయు రాముడు, ప్రయత్నము లేకయే లభించును.

(ఈ గేయము నందు ఒక పక్షము యొక్క పదహైదు దినముల పాడ్యమి నుండి పౌర్ణిమ, అమావాస్య వరకు రామ భక్తుని సంపాదించుకొనుటకు పదహైదు సాధనములు చెప్పబడినవి. భగవంతునిని గురువునకు సమానమైన సాధనమును కల్పించెను. పదునాల్గు భువనములు క్రింద పేర్కొనడమైనవి :

(1) భూ (2) భువః (3) జన (4) తప (5) సత్య (6)బ్రహ్మ (7) తల (8) అతల (9) సుతల (10) వితల (11) తలాతల (12) రసాతల (13) సాతాల (14) మహర్లోకము. చంద్రుని కళలను బట్టి జీవుని పదహారు కళలు చెప్పబడినవి :

(1) నిరాశ (2) సద్వాసన (3) కీర్తి (4) జిజ్ఞాస (5) కరుణ (6) ముదితా (7) స్థిరత్వము (8) మంచి సాంగత్యము (9) ఉదాసీనత (10) శ్రద్ధ (11) లజ్జ (12) సాధుత్వము (13) తృప్తి (14) క్షమ (15) వివేకము (16) విద్య.)

160. ఒకవేళ రామునిపైన తన శరీరము, ఇల్లు, ధనము, స్త్రీ, పుత్రుల యందున్నంత శ్రద్ధ ఆకర్షణమున్నట్లు అప్రయత్నముగా ద్వంద్వ రహితముగా కోరిక యున్నచో అటువంటి వారు ద్వంద్వ రహితులై సుఖము - దుఃఖము లేకయే అనగా సమరసమయి, పరమహంస కావలెను. అతని గర్వము నష్టమగును. జ్ఞానమునందు నిమగ్నుడు కావలెను. ప్రపంచములోని విషయ వాసనల నుండి విరక్తుడు కావలెను. అనేక పరీక్షల యందు సంపూర్తిగా ఖరాగా (శుద్ధముగా) నిఖరముగా, విజయమును పొందాలి. ఇటుల అయిన సుఖములకు కేంద్రమైన అనగా సంపూర్ణమగు జ్ఞానమునకు స్వామియగు కోసల నరేశుడగు రాముడు అతనిపైన ప్రసన్నుడగును. వారి వశమున ఎందుకు వుండదు (వుండును).

ఏ మానవుడైనా భగవంతుని చరణముల యందు ప్రేమ కల్గి యున్నచో సర్వజీవులకు మేలు చేయును. అతని మనస్సు, నిర్మలమై, నిష్కపటమగును. అతని హృదయము నందు, భక్తి, ప్రేమ, నియమములు దృఢముగా నుండును. అతడు సదాసమరసుడైన అనగా ఒక భావము రామభక్తియందు మునిగి యుండును. తులసిదాసు - దశముఖ రాముని కృప వున్నచో సాధనమగునని చెప్పుచున్నాడు.

(ఇక్కడ దశ శిరస్సులు అనగా పది ఇంద్రియములు అని భావించవలెను. అనగా రాముడే పది ఇంద్రియముల పైన విజయమును సంపాదించుటకు శక్తి కలిగి యుండును; ప్రసాదించును.)

161. ఓ మనసా! ఒకవేళ నీవు భగవంతుని యొక్క కల్పవృక్ష రూపమును (కల్ప వృక్షము వలె సంపూర్ణ మనోకామములను కోరికలనన్నింటిని) తీర్చునట్టి దేవుని భజింప కోరినచో విషయ వికారములను త్యజించి త్యాగరూపమగు, భగవంతుని భజన చేయుము. నేను చెప్పునది నీవు నేడు చేసినను, ఇంకను ఏమియు చెడిపోలేదు.

శాంతి, సంతోషము, సంపూర్ణమైన నిర్మలత్వము, విచారము (మంచి ఆలోచన, సత్సంగము; ఈ నాల్గింటిని పట్టుదలగా హృదయమున ధరించి, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, రాగము, ద్వేషము, భావములను పూర్తిగా వదలి వేయవలెను. చెవుల ద్వారా రాముని కథను వినుము. నోటితో రాముని నామము పేర్కొనుట, హృదయమున భగవంతుని స్థాపించుకొని శిరస్సుతో రామునికి నమస్కరించి, చేతులతో రాముని సేవచేసి, పాదముల ద్వారా (కాళ్ళతో) ఆయనను అనుసరించుము. నేత్రములతో కృపానిధి (సాగరుడు) జడ - చైతన్య రూపుడగు భగవంతుని సీతాపతి రాముడగు మహారాజు అగు రాముని దర్శనము చేసుకొనుము.

ఇదియే భక్తి, వైరాగ్యము, జ్ఞానము, భగవంతుని ప్రసన్నుని చేయుటకు ఒక ఉపాయము. ఇదియే శుభమైన వ్రతము. పరిశుద్ధమైన ఆచరణ, నీవే ఈ శుభ్రమగు వ్రతమును చేయుము. తులసీదాసు ఇదియే కళ్యాణమగు మార్గము, లేక శివుడు తెల్పిన మార్గము. ఈ మార్గమున నడుచు వున్నచో స్వప్నమున ఎప్పటికిన ఏ విషయమున

(శాంతి, సమత వలన మనస్సులోని విషమత్వము తొలగును. సంతోషముతో మనస్సు ఆకాంక్ష రహితమగును. నిర్మల భావనల చేత బుద్ధి, ద్వైత భావమును త్యజించి విశుద్ధమగును. సత్సంగము చేత అహంకారము వదలి పోవును (నష్టమగును) ఇంద్రియములు రూపము, రసము, గంధము, స్పర్శ, శబ్దములు మొదలగు ఆకర్షణలకు గురియగునని భావము. వీటి నుండి ముక్తుడైన భక్తి కల్గును. రాముడు సర్వవ్యాపకుడు అని వర్ణించి నమస్కరించెను..)

162. ఈ ప్రపంచమున రఘుపతి రాముడు తప్ప అన్యులెవ్వరును ఆపదలను తొలగించువారు లేరు. అతని శరణులోనికి వెళ్ళవలెను. సేవకుల వశమున నుండును. ఆయన గారి ఇటువంటి నిష్కపట స్వభావము సహజమైనది. కారణములేకయే స్వార్థముతో భక్తులను ప్రేమించుచున్నాడు. అనగా ఒక రాముడే ఇటువంటివాడు రాముడు. తన భక్తుల చిన్న కొద్దిపాటి సాధారణమైన గుణాలను కూడా పర్వత సమానంగా భావించును (గొప్పగా) అనుకొనును. భక్తుల కోట్ల కొలది అవగుణాలను చూచి కూడా విస్మరించును. ఇటువంటి రాముడు పరమకృపాసముద్రుడు. భక్తులకు ఉచితమయిన అనగా వారి సంపూర్ణమగు మనోవాంఛలను తీర్చును. పవిత్రమైన యశస్సుగలవారు. పాపులను ఉద్ధరించును.

స్మరణ చేసినంతలోనే రాముడు భక్తులకు సులభంగా లభ్యమగుచున్నాడు. అనగా లభించుచున్నాడు. తన భక్తుల దుఃఖములను విని భగవంతుడు వెంటనే మరి సహాయము చేయుటకు బయలుదేరును. తన పీతాంబరమును కూడా చక్క బెట్టుకొనుటకు కూడా సమయం ఆలస్యం చేయక తొందరపడును. ఈ విషయమునకు సాక్షి, పురాణాలు, వేదాలు, శాస్త్రాలు మొదలగునవి వున్నవి. ద్రౌపతీ, గజేంద్రుడు వీరికి ఈ విషయం తెలియును. భగవంతుడు వీరి పిలుపు విన్న వెంటనే వారికి సహాయం చేయుటకు పరుగిడి వచ్చెను.

ఇటువంటి కవులు, విద్వాంసులు లోభము, మోసము, మదము, కామము మొదలగు వాటిలో ముక్తులైనవారు రాముని యశస్సును గానముచేయుచున్నారు. తులసీదాసు! నీవు కూడా కోరికలన్నీ త్యజించి నిష్కామభావంతో మునివధులవైన అహల్యను ఉద్ధరించిన రాముని భజన చేయుము.

163. భజన చేయుటకు తగిన శరణు ఇచ్చువాడు రఘునాధ రామునికి సమానము. అన్యులెవరూ లేరు. రాముడు ఆనందమునకు కేంద్రము. దుఃఖమును తొలగించువాడు, శోకమును దూరము చేయువాడు లక్ష్మీపతి, వారి గుణములు అనంతము లెక్కించగా ఎప్పటికీ సమాప్తంగావు. దుఃఖములో నున్నవారు, అధములు నీచ జాతికి చెందినవారు, కుటిలులు, దుష్టులు, పాపాత్ములు, భయభీతులు, ప్రపంచములో ఎక్కడను విలీనముకారు, అనగా వారికి ఎవరును శరణు ఇవ్వరు. వారు కూడ విధి లేక అనగా పరిస్థితులకు

వివశులయి (స్వేచ్ఛా సూచకము కాని) ఒకసారి భగవంతుని స్మరణ చేసిన, వారికి అతడు నిర్వాణ పదము నిచ్చును. దీనిని దేవతలు కూడ పొందలేక యుండిరి. అనగా అవని దేవతలు కూడ పొందలేకున్నారు.

వారి చరణ రూపమగు కమలముల యందు, మునులు అను భ్రమరములు, లుబ్దత్వమును కల్గియున్నవి. విరక్తులగుచున్నారు. పరమ పదమగు మోక్షము కూడ ఆకర్షితులు కాలేరు. అనగా ఆ మునులు చాలా విరక్తులగుట వలన పరమ పదము కూడ తొలగించలేదు. రాముని చరణ కమలముల యందు భ్రమరములవలె లుబ్దత్వముచే పరిభ్రమించు చుందురు. అనగా రాత్రింబవళ్ళు వారినే చింతించుచూ వుందురు. ఓ మూర్ఖా! రాముని భజన ఎందుకు చేయుట లేదు. ఆయన పరమ (మిక్కిలి ఎక్కువ) కరుణ చూపెట్టు వాడు దిక్కులేని వారికి దిక్కు గలవాడు.

(సుగుణోపాసకులు మోక్షమును పొందకోరరు. సుఖముగా నున్నప్పుడు ప్రజలు రాముని స్మరించరు. దుఃఖములో నున్నప్పుడు వివశులయి రామనామమును స్మరించుదురు. రాముడు వారిని ఉద్ధరించును రాముని గొప్పదనము సంకేతముగా సూచింపబడినది.)

164. ఓ నాథ! నేను నీకు నా ప్రార్థనను ఏ విధముగా చెప్పి వినిపించను? నేను మూడు విధములుగ, మనసా, వాచా, కర్మణా ద్వారా అసంఖ్యాకమైన పాపములను చేసి నేను మీ శరణు జొచ్చినపుడు నిన్ను ఎదుట చూచినపుడు సిగ్గు చేత నా శిరస్సు క్రిందికి వంచుకొనుచున్నాను. అనగా నా పాపముల చేత నేను నీ ఎదుటికి వచ్చుటకు సిగ్గు అగుచున్నది. ఈ లజ్జకు కారణము నేను భగవంతుని భక్తుల వేషము ధరించి ఈ వేషమును ధరించి దీని ద్వారా అందరిని మోసగించు చున్నాను. నా అనేక రకములయిన కపటము అను ఆకుల తడకను ఉపయోగించు చున్నాను. భక్తులను బాహ్య వేషము ద్వారా మోసగించి, నేను రామభక్తుడనని చెప్పుచున్నాను. వాస్తవముగా నేను పరమపాపిని, మరల నేను నా అనేక పాపముల కపటములనెడి ఆకుల తడకను దాచుచున్నాను. అనేక రకములగు బూటకములతో ప్రజలను ఇంకా ఎక్కువ మోసమునకు గురిచేయుచున్నాను. ప్రలోభమును కల్గించుచున్నాను. అటు తర్వాత నీనామమనెడి తెడ్డును, అందులోని అందమయిన మాటల జిగురు అంటించెదరు. అనగా రామనామము జపిస్తూ అందమయిన మంచి ఉపదేశములు ఇచ్చుచున్నట్లు బూటకము చేసి విషయ రూప పక్షులను చిక్కించు కొనుచున్నాము. భావము ఏమనగా నా యొక్క ఈ వేషము, బూటకముతో ఆకర్షింప చేయుదును. ప్రజలు నాకు పండ్లు, పూలు రుచికరమగు తిండి వస్తువులు, శ్రేష్టమైన దుస్తులు (బట్టలు) సువాసనా వస్తువులు కానుకగా ఇచ్చుచుందురు. అందమయిన స్త్రీలు నా ఉపదేశములను వినుటకు వచ్చుచుందురు. నేను ఈ విధముగా నా విషయ వాసనలకు తృప్తి కల్గించుకొనుచున్నాను.

సమర్పించ వచ్చును. అనగా శతకోటి పాపాత్ములు కూడ ఏ కొంచెము కూడ నాకు సమానము కాదు. అయినా నేను సాధువుల లెక్కించునప్పుడు, నన్ను నేను సర్వశ్రేష్ఠ సాధువుగా ప్రకటన చేయుచున్నాను. నేను చాలా వదరుపోతు మూర్ఖున్ని తుచ్ఛున్ని అయినప్పటికి గర్వము అను పర్వతము పైన కూర్చొని యున్నాను. అనగా చాలా గర్విష్టుడను, నేను మూర్ఖుడనయి కూడ నన్ను నేను సర్వజ్ఞునిగా, మనుష్యులతో శ్రేష్టునిగా ప్రకటన చేసుకొను చున్నాను.

ఓ రామా! ఈ విషయము, నిజమా, అపద్ధమా అని చెప్పలేకున్నాను. అయినా కొంతమంది నన్ను నీ భక్తుడని చెప్పుచున్నారు. నేను కూడ స్వయముగా నీ భక్తుడననే పిలిపించుకొనుచున్నాను. ఇందువలన ఓ దేవా నీవు నీ యశస్సు, లజ్జను (పతిత పావనుడు దీనజన ఉద్ధారకుడు) అను దానిని రక్షించు కొనుటకు గాను ఇప్పుడు నీ దాసుడనగు తులసీదాసుడగు నన్ను స్వీకరించుము. ఇప్పుడు నాకు విముఖుడవు కావద్దు అనగా నన్ను నిర్లక్ష్యము చేయవద్దు.

(తులసీదాసు రామనామము పేరిట వ్యాపారము చేయునట్టి, కపట సాధువుల స్వభావమును గురించి కటాక్షము చూపెట్టెను. సామిప్యము, అనన్యతా, వినయమును గురించి సంకేతము చేసెను.)

165. ఓ నాథా! నాకు ఇతరుల ఆధారము లేదు. ఓ కరుణానిధి ఓ రామా! కర్మ మనస్సు వాచా (త్రికరణ శుద్ధిగా) సత్య ప్రతిజ్ఞ చేయుచున్నాను. నేను మీ చరణముల యందు అర్పించుకొన్నందుననే నీ పాదరక్షలు ఆధారము అనగా నీ చరణముల యందు సమర్పించుకొనుట వలననే, నాకు గీత వుండునని ఈ విషయమున నాకు దృఢమైన విశ్వాసమున్నది. నా మనస్సు కామము, క్రోధము, మద, లోభముల మమత మోహములకు, కేంద్రమని తెలియును. అందువలన నాకు, నా మనస్సుకు జ్ఞాన విజ్ఞానములు పట్టవు. నా హృదయమున అనేక కోరికల సంకల్పములు కలుగుచున్నవి. అనేక రకములయిన వాసనలు నిండియున్నవి. ఇది చూసి నాకు గురిగింజ ఎత్తు కూడ మోక్షము ఆశలేదు. అనగా నాకు లభించదు. భావము ఏమనగా విషయ వాసనలు తొలగకుండ మోక్షము అసంభవము. వాసనలు పూర్తిగా లేనప్పుడే మోక్షమని చెప్పబడును.

ఒకవేళ నా హృదయము నందు స్వర్గమునకు వెళ్ళవలెనని కోరిక ఉన్నది. కానీ వేదాల ద్వారా చెప్పబడిన కర్మము, ధర్మములు చేయకయే స్వర్గానికి పోవుట అసంభవము. వీరుకాక సిద్ధులు, దేవతలు మానవులు, దానవులు మొదలగు వారి సేవ చేయుట చాలా కష్టము. ఎందుకనగా సిద్ధహఠయోగము సాధన చేయుట వలన దేవతలు యోగము చేయుట యజ్ఞ భాగమునిచ్చుటకు దానవులు మొదలగు ప్రాణులను బలిఇచ్చుట వలననే

మకరందమును మధువును పానము చేయుటకు దాహము కొనియుండును. అనగా ఇంత గొప్ప ఋషులు నీ చరణ సేవ చేయకోరిక కల్గియుందురు. దానిని పొందలేరు. నా ఇటువంటి పాపులకు అవకాశం ఎక్కడ? నీ చరణ సేవ చేయ సామర్థ్యం లేదు. నీ పేరు పతిత పావనుడని నేను విన్నాను. నీవు అందరికీ శాంతిని కల్గించువాడవు. ఈ విషయంను తెలియచేయుచూ కూడా ఈ నామము గర్వము అను బంధనమున పడిఉన్నందున మీరు అటుఇటూ పరిభ్రమించు చున్నదని నేను విన్నాను. అనగా నా దేహాభిమానమున నిమగ్నమయి మరలా విషయ వాసనలయందు రమించుచున్నది.

నా కర్మల వలన నేను అధికారమైతే నరకానికి సమానంగా భయంకరమైన చీకటితో నిండినప్రపంచమను బావిలో పడవున్నాను. ఐనా ఓ రాజా! రామా! ఐనా నాకు నీ భరోసా (ఆధారము) ఉన్నది. నీవు తప్పక నన్ను ఉద్ధరించెదవు. తులసీదాసు : - ఓ రామా! నేను నీ బలమునాధారం చేసుకొని గుహుడు గజేంద్రుని జటాయువును హనుమంతుని జాతిని (వానరులను) జ్ఞాపకం చేసుకొని ఈ ప్రపంచ భయమును ఏ మాత్రము లెక్కపెట్టము. అనగా నీవు ఈ అధమ ప్రాణులను ఉద్ధరించితివి. నన్ను కూడా తప్పక ఉద్ధరించెదవు. ఈ విశ్వాసం మనస్సున ఉన్నందున నేను ఈ ప్రపంచం భయానికి భయపడను అని చెప్పెను.

(వేదాల ద్వారా నిర్దేశించిన కర్మలను చేయుటకు అధికమైన కోరిక ఉండవలెను. వేద కర్మలు అనగా యజ్ఞంలో యాగంలో దానము తపము, సంయమము, యోగము, జపము, తీర్థయాత్రలు, రథములు మొదలగునవి.)

166. ఓ రఘువంశమణీ! నాకు ఎక్కడ స్థానమున్నది. ఎక్కడికి వెళ్ళి ఉందును. పతిత పావనుడవు శరణాగత రక్షకుడవు. ఎవరికినీ శరణు ఇవ్వని వారికి శరణుఇచ్చెదవు. ఇటువంటి వాటి లేని యశము ఎవరికి ఉన్నది? ఇతరులెవ్వరు ఇంత గొప్పవారు లేరు. ఓ రామా నీవు నా దోషాలను మనస్సులో ఉంచుకొని తెలుసుకొని వాటి కారణమున కృద్ధుడవై నా ప్రార్థన వినవు. విముఖుడవై ఉన్నావు. ఐనా ఓ కృపా సాగరా నేను నిర్భయంగా నా మాట విని కూడా నా ప్రక్కకు చూడక ఎట్లు ఉండెదవని చెప్పుచున్నాను. అనగా నీ యశస్సు చాలా గొప్పది. ఐనా నీవు నా వంటి పాపి మాట వినవు. ఇదియే ఆశ్చర్యము. ఇదియే నీ యశస్సుకు అన్ని విధాలా విరుద్ధమైన విషయం, కార్యము.

ఒకవేళ నా ప్రధానమైన అభిలాష నీ ఉండు లోకము వైకుంఠమునకు వెళ్ళి నివసించినచో అది పూర్తి కావటం లేదు. నా ఆ అభిలాషను కామము మొదలగు దుష్ట గణాలు చుట్టుముట్టి ఉన్నవి. అనగా అవి ఆ కోరికను అణగగొట్టుచున్నవి. మోక్షమును పొందుట నాకసంభవము. స్వర్గం పుణ్యాఫలము చేత లభించును. అనగా నేను ఏ పుణ్యములను చేయలేదు. అప్పుడు స్వర్గమునకు ఎట్లు పోగలను. నా కోరికలు నష్టం కాలేదు. మోక్షాలను ఎట్లు పొందగలను? (ఇప్పుడు కేవలము ఒక స్థానము యమనగరము) అనగా నరకము కానీ నా దగ్గర నీ నామబలము ఉన్నది. ఇందువలన నేను నరకము వద్దకు ఎందుకు పోవుదును. అనగా నీపేరు స్మరించినవాడు ఎవరునూ నరకమునకు వెళ్ళరు.

నిర్ధనుడను. ఎక్కడ వుండుటకు స్థలము (స్థానము) లేనందున మిక్కిలి వికలుడనయి వున్నాను. ఓ నాధా! ఇప్పుడు నీ దాసుడనగు తులసిని కృపతో తులసీ దాసు వుండుటకు ఒక గ్రామములో ఇవ్వుము. అచ్చట గజేంద్రుడు జటాయు. వ్యాధుడు (వాల్మీకి) మొదలగు వారు నివశించు చున్నారు. నన్ను కూడ ఈ పాపులతో పాటు వుండుటకు చోటు ఇవ్వుము (వుండనిమ్ము).

(వైకుంఠములో వుండుటకు చోటు ఇవ్వమని తులసీదాసు అడిగెను.)

167. ఓ రఘు వంశమణి! నీవు ఎప్పుడైనా నాపైన కరుణ కృప చూపెదవు. నీ కృపవలన వ్యాధుడు (వాల్మీకి) గజేంద్రము, బ్రాహ్మణుడు అజామిలుడు, అన్యులు అనేక మంది దుష్టులు తరింపబడిరి. ఓనాథ! నీవు నన్ను వారి వలెనే (సమానముగా) భావించి నన్ను కూడ ఉద్ధరించెదవు. అనేక యోనులందు జన్మించి, నేను అనేక రకములయిన దుష్టకార్యములు చేసితిని. అయినా నీవు ఆనా నీచ కర్మలను మనస్సులో వుంచుకొనవు. అనగా గమనించవు. పేదలకు మేలు చేకూర్చుట అపరాజితుడుగా నుండుట, సర్వజ్ఞుడవు సరమర్థుడవు; భక్తులను పాలించుట కోమల చిత్తము ఇవి నీ గుణములు. నీటి ననుసరించి ఆచరణ కల్గి యుందువు. నీ ఈ గుణములననుసరించియే, నా ఎడ ప్రవర్తించెదవు.

నీవు, మోహము, మదము, అభిమానము (గర్వము) కామము మొదలగు వాటిని (సమూహములను) వంశ సహితముగా వినాశనము గావించి, నా అసహ్య గుణములను, దుఃఖమును తొలగించెదవు. యోగము, జపము, యజ్ఞము, విజ్ఞానములో మిక్కిలి ఎక్కువ నిర్మలము. దృఢ భక్తి ఇవ్వుము. హృదయమున పరమభక్తి ఇవ్వుము. హృదయమున పరమ ఆనందము, బ్రహ్మానందము నింపగలవు. నీవు నన్ను నీచ శిరోమణి, సంపూర్ణ సాధనముల (యోగము, యజ్ఞము, జపము, తపము) మొదలగునవి లేని, మనస్సున కపటముగల, మలినుడని భావించి, మనస్సులో భయ భీతుడవు అయ్యెదవు. (ఇటువంటి నీచున్ని ఎట్లు ఉద్ధరించవలయును.) నీ కీర్తి వేదముల యందు కీర్తింపబడినది. మీ నిర్మలమైన కీర్తిని ఎట్లు విస్తరింప చేసుకొనగలవు. భావము ఏమనగా నన్ను ఉద్ధరించుట వలన, నీ కీర్తి ఇంకను ఎక్కువ పెంపొందును. చేయనిచో కొంచెము చెడ్డపేరు వచ్చును.

(విజ్ఞానము అనగా ఆత్మజ్ఞానము అను విషయమును గమనించవలెను. ఇప్పటి విజ్ఞానము కాదు. అపద్ధము చెప్పుట, మోసము, కపటము, విషయ వాసనలు మొదలగునవి చెడు ప్రవృత్తులు ఎందుకనగా కామము, మదము, మోహము మొదలగు వాటి చేతనే ఇవి ఉత్పన్నమగును. ఇందువలన ఈ ప్రవృత్తులు వంశజములుగా భావింపబడినవి.)

168. రఘుపతి రాముడు ఆపదలను తొలగించువాడు. ఈయన పరమ కృపామయుడు భక్తులను పాలించుట, పాపులను పవిత్రము చేయువాడు. క్రూరుడగు (వ్యాధుడు, వాల్మీకి) కుటిలులు (కోల, కిరాత మొదలగు అడవి జాతులవారు) కులహీనురాలగు (శబరి

మొదలగు నీచ జాతుల వారు) పేదవాడు (నావికుడు) మిక్కిలి మలినమైన యవనులు (ముస్లిములు) మొదలగు వారు రామ నామ స్మరణ చేసిన, వారినందరిని రాముడు, తన లోకమగు వైకుంఠమునకు పంపెను. గజేంద్రము వంటి గర్వము గల, పింగళ వంటి నీచమైన వేశ్య, అజామిలుడు నీచ బ్రాహ్మణుడు, మొదలగు దుష్టుల నెవరు లెక్కించగలము? రాముడు ఇటువంటి వారిని అసంఖ్యాకులగు పాపులను ఉద్ధరించెను. తులసీదాసు - ఓ సీతాపతి! ఓ ప్రభు! నీవు ఎవరికి మోక్షము నివ్వలేదు? అనగా అందరికి మోక్షమును నిచ్చితివి. సరి ఎవడు ఎంత పాపాత్ముడైనను మోక్షము కల్గించితివని చెప్పెను.

(పంది దెబ్బ చేత చనిపోవునపుడు హరామ్ పదమును ఉచ్చరించెను. హా రామ్ పదము నందు రాముడు అను పదము వున్నందున ముస్లిమునికి ముక్తి లభించెను. పవనము (గాలి) అన్ని వస్తువులను పవిత్రము చేయును అనుభవించబడినది.)

169. హరికి సమానముగ ఆపదలను తొలగించువాడు. స్వాభావికముగ కృప గలవాడు. అసహ్య దుఃఖ సముద్రము నుండి దాటించువాడు. ఇతరులెవ్వరును లేరు. గజేంద్రము తన బలమును చూచి (ఈ గ్రాహము మకరము నుండి తప్పించుకొనలేనని) తొండమున కమలము నుంచుకొని భగవంతుని శరణు జొచ్చెను. సుదర్శన చక్రము ధరించి భగవంతుడు దాని కరుణామయమైన పిలుపు విని, గరుడను వదలి కాలినడక తోనే దానిని రక్షించుటకు నడచివచ్చెను.

దుశ్శాసనుడు నిండు సభలో ద్రౌపదిని నిరిక్త వస్త్రముల చేయ నారంభించినప్పుడు - ఓ హరి! రక్షింపుము. భగవంతుడు అనేక రంగుల చీరలను కుప్పలను పోసెను. ఈ విషయములను తెలుసుకొని దేవతలు, మానవులు, మునులు, జ్ఞానులు భగవంతుని చరణ సేవ చేయ నారంభించిరి. ఓ రాజా! నృగుని ఉద్ధరించిన ప్రభువు నీవు పలిచిన వెంటనే ఎవరికి అభయ దానము ఇవ్వలేదు? అన్ని కష్టములను తొలగించి ఎవరిని నిర్భయులను చేయలేదు.

170. ప్రభువు తన యశస్సు రక్షణ కొరకు ఋషుల (మునుల) పవిత్రమైన ఆత్మలను త్యజించును. అనగా వాటి ప్రక్క ధ్యానము వుంచరు. నీచులను (పాపాత్ములను) ప్రేమించును. పూతన (రాక్షసి) తన చన్నుల యందు కాలకూట విషమును ఉంచుకొని, కృష్ణుని చంపుటకు వెళ్ళెను. కృపాసాగరుడగు యాదవరాజుగు కృష్ణుడు తన తల్లి రీతిని కల్గించెను. అనగా ఆమెను తల్లిగా భావించి (చంపి) స్వర్గమునకు పంపెను. భగవంతుని చేతుల్లో చనిపోయిన వారికి వైకుంఠము లభించునని భక్తుల విశ్వాసము. కామ భావములతో గోపికలు మోహించిరి. వీరిపైన భగవంతుడు కృష్ణుడు కృప చూపెను. వారితో రాసక్రీడ చేసెను. వారి చరణములను దుమ్ము భవ నిర్మాత బ్రహ్మ తన తలపైన కూర్చే పెట్టుకొనెను. (తలపైన వుంచుకొనెను)

భగవంతుడు నిండు సభలో అతనిని సంహరించెను. అతనిని తనలో విలీనము చేసుకొనెను. అనగా స్వర్గమునకు పంపెను. మూర్ఖమతి గల వాడగు వ్యాధుడు తన మనస్సునందు భగవంతుడగు శ్రీకృష్ణుని చరణములను జింకగా భావించి చూచి గురిపెట్టి కొట్టెను. అతనిని కూడ భగవంతుడు తన స్వభావము ప్రకారము శరీర సహితముగా వైకుంఠమునకు పంపెను. వీరి మాటలను ఎవరు చెప్పగలరు. పాప, పుణ్యములను రెండింటిని చేసినారు. ఇటువంటి వారికి భగవంతుడు వైకుంఠమునకు పంపెను. కాని ఆశ్చర్యము ఏమనగా నాయటువంటి పాపపు మూర్తిని కూడ భగవంతుడు ప్రత్యక్షమగు తన శరణము యందు వుంచుకొనెను.

171. శ్రీ రఘువీరుడగు రాముడు తన మనస్సునందు నీచమనష్యులను కూడ స్నేహముతో చూచును. వారు సరియైన ప్రేమకు సర్వజ్ఞత్వమును ప్రతిపాదించెను. నీచులు కావచ్చు, ఉన్నత కులముగల వారైనను నిషాదగుహుడు, పరమపాపి, నీచుడు, అతనికి ఏమి గౌరవము వుండును. కాని రాముడు అతని ప్రేమను గుర్తించి అతనిని పుత్రినివలె ఆలింగనము చేసికొనెను. గ్రద్ధ జటాయువు ఏమంత దయగలది? వానిని విధాత హింసక ప్రవృత్తి మాంస భక్షణము చేయునట్టి దానినిగా చేసెను. రాముడు తండ్రిగా భావించి పిండదానము చేసెను. కాల్చివేసెను.

శబరి నీచ జాతికి చెందినది. స్వాభావికముగ మలినమైనది. సర్వ అవగుణముల (దుర్గుణముల)కు గని వంటిది. కాని రాముడు ఆమె ఇచ్చిన ఎంగిలి రేగు పండ్లును ఎంతో ప్రీతితో తినెను. జాతికి రాక్షసుడు, రావణుని తమ్ముడగు విభీషణుడు తన శరణుజొచ్చి నందువలన ప్రేమా వేశమున తను మైమరచి రాముడు తన సోదరుడగు భరతునితో కలిసినట్లు చేసెను.

వానరులు ఏమి మంచి స్వభావము గలవి? వాటిని స్మరించిన సదా హాని కల్గును. ఇటువంటి వానరులను (కోతులను) రాముడు తన స్నేహితులుగా చేసుకొనెను. తన వెంట అయోధ్యకు తీసుకొని వెళ్ళి వాటిని బాగుగా ఆదరించి సత్కరించెను. ఇటువంటి రాముడు సహజముగా కృప చూపువాడు. పేదలకు సహాయము చేయువాడు; వారికి నిత్యము దానము ఇచ్చుచుండెను. ఇందువలన ఓ దుష్టుడైన తులసీదాసు! ఇటువంటి స్వామిని భజించుము. ఆయన ఎడ కపటమును చేయవద్దు. నిష్కామ భావనతో భజన చేయుము.

(ఈ గేయమునందు రాముని శీలమును గురించి పేర్కొన బడినది. రాముడు జటాయువును తన తండ్రివలె భావించి అంత్యక్రియలు చేసెను.)

172. రాముని వదలి వేరొకరిని ఎవరిని భజించవలెను. రామునికి సమానముగా మరొకడు లేడు. శరణాగతులపైన ఎంతో ప్రేమ, మమత కల్గి యుండెను. హిరణ్యకశ్యపుడు మనసా, వాచా కర్మణా బ్రహ్మకు భక్తుడు. కాని అతడు తన పుత్రుడగు ప్రహ్లాదునికి దుఃఖము

అతనికి యమలోకమునకు వెళ్ళవలసి వచ్చెను. (అనగా ఒకవేళ బ్రహ్మ తన భక్తుడు అన్యాయము చేయుచుండగా ఆపివున్నచో అతడు చనిపోయి వుండెడివాడు కాదు. రావణుడు శివభక్తుడని ప్రపంచమునకు తెలుసు. అతడు అనేక దఫాలు తన శిరస్సులను నరికి నరికి శివునికి అందించి యుండెను. కాని అతడు రామునిని వ్యతిరేకించుట ప్రారంభించినపుడు శివుడు అతనిని అటుల చేయుట చూచి ఆపలేదు. భావము ఏమనగా రావణుని కుటుంబమంతయును నాశనమయ్యెను. శివుడు మౌనముగా చూచుచూ కూర్చొని యుండెను. తన భక్తుని రక్షించుటకు రాలేదు.

ఇప్పుడు బ్రహ్మ, శివుల వంటి మహామహిమ గలవారే ఇట్లు ఈ స్థితిలో వుండగా, నేను ఇతర దేవతల విషయము ఏమని చెప్పగలను. వారి సామర్థ్యము ఎంత? వారు అందరు స్వార్థమునకు మిత్రులు. భక్తులతో స్వార్థము సాధించుచూ వున్నచో, భోగము, పూజలభించు చుండును. అంతవరకు భక్తులకు మిత్రులుగా వుండెదరు. భక్తునికి ఆపద సంభవించినపుడు ఎప్పటికిని వారికి సహాయము చేయలేదు. ఎప్పుడైనా ఎవరైనా భయపడి వీరి శరణుజొచ్చిన వారికి సహాయము చేయలేదు. సేవ చేసిన ఎవరు ధనము ఇవ్వరు? అనగా నౌకరీకి బదులుగా అందరి నౌకర్లకు ధనము ఎవరు ఇవ్వరు? ప్రపంచము యొక్క పద్ధతి ఇంతయె. తులసీదాసు ప్రేమవారిని ఒక రాముడే ప్రేమించెను. అనగా రాముడు తప్పక స్వార్థము లేకయే సేవచేయకనే పేదలకు సదా మేలు చేయుచుండును.

(ఈ గేయము నందు శివ, బ్రహ్మలను రామునితో పోల్చి పరోక్షముగా రాముడే శ్రేష్ఠుడని చెప్పబడినది. రాముడు వ్యతిరేకించిన వారిని శివ, బ్రహ్మ శరణు ఇవ్వలేదు. రక్షించలేదు.)

173. ఓ ప్రభు! ఒక వేళ వేరొకరు నీవలెనే వున్నచో మాటిమాటికి నా దీన గాథను ఏడ్చి ఏడ్చి ఎందుకు నీకే వినిపించుచున్నాను. నేను నిన్ను ఇబ్బంది పెట్టక వారికే వినిపించెడివాడను. దీనులపైన ఎవరికి మమత వున్నది? ఎవరి పేరు పతిత పావనుడు? పాపము వ్రేళ్ళను అజామిలుడు తన లోకమగు వైకుంఠమునకు పంపెను? అనగా ఈ గుణములన్నియు నీలోనే వున్నవి. ఇతరులలో ఎవరియందును లేవు. శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, యముడు, వరణుడు మొదలగు వారు అనేకమంది లోకములకొలువున్నారు. అయినా దుఃఖమను నదిలో మునిగిపోవునట్టి గజరాజుకు ఎవరును సహాయము చేయలేదు. దానిని రక్షించలేదు.

అనేక మంది రాజులు నిండియున్న కౌరవ సభయందు అర్జునిని భార్య ద్రౌపది కేకవేసి ఓ ప్రభూ! రక్షింపుము అని పిలిచెను. అప్పుడు ఎవరును వస్త్రముల నిచ్చి ద్రౌపది మానమును రక్షింపలేదు. ఒకవేళ అక్కడ హాజరు అయివున్నవారు వస్త్రములనిచ్చి లజ్జను రక్షించు శక్తి గలవారే. అందరు మౌనముగా కూర్చొని హీనమైన అన్యాయమును చేయుచూ వుండిరి. ఓ కరుణాసాగరుడా! రామా! నేను ఒకడనే నీ కథావర్ణన నా ఒక్క నాలుకతో ఎట్లు

వర్ణించగలను. సమర్థుడనగుదును? ఓ కోసల దేశము రాజా? నీవు భక్తుల శుభము కొరకు, మానవ శరీరము ధరించి, ఏమి చేయలేదు? అనగా అన్ని విధములుగా రక్షించితివి. ఒకవేళ అందరికంటె నన్ను ద్వేషింప ఏవగింపవలెననియున్నచో నన్ను నాయటువంటి వారికే అప్పజెప్పుము. అనగా తులసీదాసు - ఓ రామా! ఇతర ఉపాయములు చేసినను, నేను నీచరణములు వదలిపోను. భావము ఏమనగా రామునికి సమానమయిన వారు ఎవరును లేరు. అందువలన తులసీదాసు రాముని చరణములు వదలి అన్యుల వారియొద్దకు పోడు; అని చెప్పెను.

174. ఓహరి! నీవు ఎప్పుడైనా నీ చరణముల దర్శనము చేసుకొనుటకు అవకాశము ఇచ్చెదవా. కలియుగములోని సమస్త దుఃఖములను, పాపములను నాశనము చేయునట్టివి. సమస్త కళ్యాణములను కల్గించునట్టివి. నీ చరణములు శరద్రుతువులో ఉత్పన్నమయిన అందమయిన, ఇప్పుడే వికసించిన ఎఱ్ఱని కమలములకు సమానముగా నున్నవి. రంగులో వాటిని లక్ష్మీదేవి తన అరచేతులతో ప్రేమతో తన చేతులతో నొక్కుచూ (పిసుకుచూ) నుండును. సాటిలేని సౌందర్యమును ధరించునట్టివి. అనగా అనుపమైన రూప లావణ్యము గలవి.

నీ ఈ చరణములు గంగానదికి తండ్రి. (గంగ, విష్ణుచరణములయందే ఉత్పన్నమయినట్లు భావించబడుచున్నది. మన్మథుని శత్రువగు శివునికి ప్రియుడవు ఆయన వామన రూపమున బ్రాహ్మణుడయి బలిని మోసగించెను (వంచించెను). ఈ చరణములే అహల్య శిలగా వున్నప్పుడు స్త్రీగా చేసెను. నృగురాజుకు విముక్తి కల్గించెను. వ్యాధుడగు వాల్మీకి యొక్క దుఃఖములను, పాపములను, తొలగించెను. సిద్ధులు, దేవతలు, మునులు మొదలగు వారందరును వీరికి (రామునికి) నమస్కరించెదరు. ఈయన అందరికి సుఖమును శరణు ఇచ్చును. నీ ఈ చరణములను ఒక దఫా స్మరించినంత (హృదయమున) లోనే జీవులు స్వయముగా తరించెదరు. (భక్తులు స్వయముగా తరించెదరు. తమ సాంగత్యమునకు వచ్చి, నీవారిని, కూడ తరింప చేయుదురు.)

ఓ కృపాసింధు! కౌశలుడగు రఘువీర రామా! నీవు శరణాగతుల దుఃఖమును తొలగించువాడవు. ఈ తులసీదాసుడనగు నేను నీ చరణముల దర్శనము ఆజ్ఞ అనెడి దాహము గొని చాలా బాధపడుచున్నాను. భావము ఏమనగా తులసీదాసుకు నీ చరణముల దర్శనము కల్గించి రక్షించుకొనుము.

(ఈ గేయము నందు రాముని చరణముల మహిమ వర్ణించి, వారికి వందనములు చేయబడినవి).

175. ఓ రామా! నేను ఈ దినము నీ ద్వారము వద్దనే ఆగి నిలిచియున్నాను. బ్రతిమాలి ఒక విషయమును గురించి యాచించు చున్నాను. ఇది తప్ప నాకు వేరొకటి వలదు. ఈ

భయంకరమైన కలియుగమునందు చాలా పెద్ద కఱవు ఏర్పడినది. సంపాదించి తినుటకు కావలసిన సాధనములన్నియు చెడ్డవి. సామానులు చెడ్డవి. అనగా ఏ సాధనములు ఏమినీ భక్తి అను సుందరమైన వస్తువును సంపాదించుకొనుటకు పనికి రానని తెల్పెను. నిరుపయోగమైనవి. ఎందుకనగా జపము, తపము మొదలగు సాధనములన్నియు భక్తిని సంపాదించుటకు నిరర్థకమైనవి. నేను నీచమైన వ్యక్తిని. అయినా, నా మనస్సు చాలా ఉన్నతమైనది. నేను నీచుడవైనప్పటికి పుణ్యాత్ముని కావలెనని భావించుచున్నాను. నా పరిస్థితి కుష్ఠ రోగమునకు దురద యుండు గజ్జి వలెనుత్పన్నమగు విషయ వాసనలనెడి కొత్త వ్యాధిని మాటి మాటికి బరికి గీరుచూ మిక్కిలి ఆనందమును పొందుచున్నాను. తర్వాత బాధ చేత విలపించుదును. అనగా మొదట నాకు పాపముల నుండి విముక్తి కలుగలేదు. సరికొత్త పాపములను చేయుచున్నాను.

తన ఈ విషమ పరిస్థితి చూచి భయభీతుడనయి నేను దయగల సాధువుల సమాజమునకు వెళ్ళి అడుగగా నా యటువంటి పాపికి కూడ ఎవరైన శరణు ఇచ్చెదరా? కోసల దేశపు నరేశుడగు రాముడే అని వారు చెప్పిరి. ఓ కృపా సముద్రుడా! నీవు కాక నీ దీనత్వమును, దరిద్రమును రెండు ఎవడు తొలగించగలడు? ఓరాజా! దశరథుని ప్రియమైన పుత్రుడా! నీవలె దాత వేషము ధరించిన వారి శిరోమణి మరి ఎవరు? నేను జన్మాంతము వరకు ఆకలి గొన్న బిచ్చగాడిని. నీవు పేదలను రక్షించువాడవు. ఇందువలన నీవు ఈ దినము తులసీదాసుడనగు నన్ను భక్తియనెడి అమృతమును అందమయిన రుచికరమగు భోజనము పొట్టనిండపెట్టుము. భావము ఏమనగా నాకు ఎప్పుడును ఏ వస్తువుపైన మమకారము లేకుండ తన్మయున్ని చేయుము.

(జీవుడు మాయా మోహమనెడి రాత్రి నిద్ర నుండి మేల్కొన్నాడు. అనగా జీవుడు చైతన్యమును పొంది విరక్తి భావముతో నిండియున్నాడు.)

176. ఓ కోసల నరేశా! రామా! నన్ను రక్షింపుము. నీ పేరు తప్ప నాకు ఎచ్చటను స్థానము లేదు. ఆధారము లేదు. ఎవరి దగ్గర చేరుటయును లేదు. నీవు నీకు తెలిసినట్లుగా నీ బుద్ధి ప్రకారము నీ భక్తులకు మేలు చేయుచున్నావో అట్లు తల్లితండ్రులు కూడ చేయలేరు. అనగా నీవు తల్లితండ్రుల కంటె ఎక్కువ నీ భక్తుల క్షేమము కల్గించుచుందువు. ఓ రామా! నీ పేరే నాకు గురువు దేవత, స్వామి, మిత్రుడు, సహాయకుడు ఓనాథా! నీ రామ రాజ్యమున మలినమైన మనస్సు గలవారు కలియుగమున మోసము, కపటము చేయలేరు. ఇందువలన పిరికిది అగు కలియుగము కోపముతో, అకారణమున మొదటి నుంచియే చచ్చిన వారివలె నాకు గాయములు అగునట్లు చేసి గాయములు కల్గించినది. అనగా నీవు వారిని అదుపు చేయలేక పోయినందున నీ వశమున లేరు. దీనిచేత నిర్బలులు (బలహీనులు) చచ్చిన వారివలె, వున్నటువంటి దీనులను బాధించు చున్నది. కలియుగము.

నక్క కప్పను చంపి సింహము ఎడ తన శత్రు భావమును పూర్తి చేసుకొనుచున్నది. అనగా దాని శత్రువు సింహమే. అయినా దాని పైన పోవుటకు బలము లేక చేతకాక బలహీనమైన మండూకము (కప్పను) చంపి తన శతృత్వ భావమును శాంత పరచుకొనుచున్నది. అదే మాదిరి ఈ కలియుగముననున్న, నీ దాసునిగా భావించి కారణము లేకయే, పీడించుచున్నది. దీని యొక్క మోసము, కపటముతో కూడిన (నిండిన) కర్మల, అసంఖ్యాకమైన అన్యాయములు, అత్యాచారములు వినివిని వైకుంఠములో సుఖముగా నివసించుచున్న పరీక్షిత్తుడను రాజు పశ్చాత్తాపమును పొందుచున్నాడు. ఈ దుష్ట కలియుగమునకు నేను ఎందుకు శరణు ఇచ్చితివి? ఓ కృపా సాగరుడగు రామా! కొంచెము నా ప్రక్కకు కృపాదృష్టిని పెట్టుము. ఇందుచేతనే భక్తుడనగు నాకు శాంతి కల్గును.

ఓ దేవా! దీనుల ఎడదయగలవాడా! నేను నీ చరణముల దర్శనము కొరకు నీ శరణు జొచ్చితివి.

ఓ దేవా! నేను నీ గుణ గానములను పాడుచున్నాను. ఒకవేళ నీవు కలియుగమును నీ దగ్గరకు పిలుచుకొని దానిని తాపనము లేకుండా చూడగోరుచున్నావా? దాని రోదనను విని, దానిని చంపకోరుట లేదా? కేవలము హనుమంతునికి సైగ చేయుము. గోముఖ వ్యాఘ్రము వలె కనబడుచున్న క్రూరకర్మలను చేయు, బలవంతుడగు హనుమంతుడు కలియుగమును చూచుకొనును. అనగా దాని సరిచేయుదురు.

వాస్తవముగా హనుమంతునికి ఎక్కువ చేయవలసిన పనిలేదు. కోపము చేత హనుమంతుడు ఎర్రగ ముఖమును చేసి, క్రోధము చేత తన పసుపు రంగు గల నేత్రములను ఎర్రగా చేసి కలియుగము ప్రక్కకు చూచిన పవన పుత్రుడగు వీరాంజనేయులు ఈ రూపమును స్మరించిన నన్ను పీడించునట్టి అభిరుచి తొలగిపోవును. అనగా అది భయపడి నన్ను బాధించు కోరిక తొలగిపోవును (విడిచి పెట్టును).

నేను రామునితో ఈ విధముగా ప్రార్థించగా వారు నా అభ్యర్థన విని చిరునవ్వు నవ్విరి. అపుడు తన సోదరుడగు లక్ష్మణునికి నా మాటల ఉద్దేశ్యమును వినిపించెను, తెలియజేసెను. లక్ష్మణుడు కూడ నవ్వి ఇతడు సరిగా చెప్పినాడని జవాబిచ్చెను. సరి ఇంక నా నిర్మాణము అంతయును అగును. అనగా రక్షణ అగును. రాముడు నాకు కల్గించిన న్యాయమును విని భక్తుల నాథువుల గృహముల యందు ధన్యవాదముల మ్రోత మోగెను. చింత, ఆపదలు, నీచత్వము, కపటము, మోసము, పాప సమూహములు, వినష్టమయ్యెను. తన సేవకునిపైన నిర్గుణమగు (త్రిగుణాత్మకమగు మాయలేని) పవిత్రమైన, నిశ్చలమైన ప్రేమ, విశ్వాసమును చూచి ముని గణము, గరుడగామియగు భగవంతుని జయ జయ ధ్యానములు చేసిరి. (ప్రశంసించిరి).

(తులసీదాసు యొక్క భక్తి ఆనందము కాల్పనికమగు మనోరాజ్యమును మర్మముగా, ఆనందముగా ప్రభావయుతముగ చిత్రించిన చిత్రములభించును.)

177. ఓ నాథా! నేను రాత్రింబవళ్ళు నీ కృపాదృష్టి కొరకు నిరీక్షించు చున్నాను. ఓ దీనుల ఎడదయ గలవాడా! నీ కృపా దృష్టి ఎప్పడూ వుండునో తెలియదు. సద్గుణములు, జ్ఞానము, వైరాగ్యము, భక్తి మొదలగు మంచి సాధనముల రాశులు అనగా కలియుగమున పాప సమూహములు, అవగుణముల సంపదలను చూచి భయపడి పారిపోయినవి. లేక ఈ అవగుణములన్నియు కలచిచూచి వికృత్వము చెంది పారిపోయినవి. ప్రపంచమున పాపములు, దుర్గుణములు మిగిలియున్నవి. అత్యధికమయిన అన్యాయములు, చెడు అలవాట్లు వీటివలన ఈ ధరణిపైన వుండుటయే అసంభవము. ఎక్కువ అన్యాయములు, చెడు అలవాట్లు ప్రభావమున భూమి సూర్యుని కంటె ఎక్కువ వేడి ఎక్కువ అయినది. ఈ భూమిపైన యుండుట అసంభవమయినది. ఓనాథా! నీకు ధన్యవాదములు తెలుపుచున్నాను. నేను ఎక్కడికి పోవలెను? నేను ఎక్కడ వుందుదును? వుండుటకు చోటు కనబడలేదు. ఇది యోచించి యోచించి నాబుద్ధి ఎక్కువ వికలత్వము అయినది. ఓ తండ్రీ! ఈ నా శరీరము, కూడ నాది కాకున్నది. చనిపోయిన తరువాత తోడుగా వుండక వెళ్ళిపోవును. అప్పుడు ఎవరు నావారుగా యుందురు? అందరూ కఠినాత్ములే అత్యాచార్యులుగా కనబడుచున్నారు. ఓ రామా! నీవు నల్లని మేఘము వలె నీ కృపా రూపమున జలమును కురిపించి పంటకు వచ్చే ధాన్యము వారి పొలమును తడుపుచున్నావు (తడుపును) అది లేనందున ఇది ఎండి పోవుచున్నది. భావము ఏమనగా సత్కర్మలు నశించుచున్నవి. వీటిని రక్షింపుము. అని తులసీదాసు చెప్పెను.

178. ఓ రామా! నేను నీకు ధన్యవాదములు తెలుప్పచున్నాను. నేను నా దుఃఖగాథను ఇంకెవరితో చెప్పను? కృపా సాగరా? నీయటువంటి సద్గుణముల సముద్రుడా (సర్వగుణ సంపన్నుడవు) తన సేవకుని హితమును కోరువాడు రెండవ వాడు ఎవడును లేడు. లభించడు. నేను అక్కడక్కడ లోభత్వము, దురాశ చేత నాచపల చిత్తమునందు హితమును చేయకోరుచున్నాను. అనగా నా మేలును గురించి ఆలోచిస్తున్నాను. అక్కడక్కడ నేను కుతర్కము ద్వారా నా మనస్సును భయపెట్టి అదే మాదిరి మరలా ప్రాపంచిక విషయ వాసనల ఒడిలో దాగుకొని వున్నాను గుడ్లగూబ (ఉలూకము) సూర్యుని చూచిన వెంటనే తన చెడు వృక్షము యొక్క తొఱ్ఱలో దాగుకొనును. భావము ఏమనగా నేను అప్పుడప్పుడు సత్కర్మ చేయ ప్రయత్నించిన అప్పుడు కుతర్కము చేయు నా బుద్ధి వివశమున ప్రాపంచిక విషయ వాసనల యందు ఆకర్షితురాలగును. సూర్యుడక్కడ సద్గుణములు లేక రామభక్తి ఉలూకము మానసిక ప్రవృత్తి, చెడ్డ తరువుకు తర్కము, తొఱ్ఱ విషయ వాసనల ప్రతీక.

నేను కాలము, స్వభావము, కర్మవైచిత్రము విన్నప్పుడు (మనము కోరినట్లు జరగదు) ఫలమును ఇచ్చును. ఇది విని నేను నాతలబాదు కొనుచున్నాను. అనగా పశ్చాత్తాప పడుచున్నాను. నాకు ఇవి అన్నియు (కాలము, స్వభావము, కర్మలు) సదా సమరసముగా నున్నవి. అనగా వీటి ఫలితము నాకు సదా విపరీతముగానే యున్నవి. నేను వీటిచేత అసహ్యమైన దుఃఖము చేత దహించుకొని పోవుచున్నాను. ఓ నాథా! నేను

అనాథుడనయినందున దుఃఖమునకు హతుడనయితిని. ఇది ఉచితమయినదే. ఎందుకనగా నేను నీకు దాసుడను కాలేదు. అంతవరకు నేను దుఃఖములను అన్ని అనుభవించుట ఉచితమే. ఎందుకనగా నేను అనాథుడను. అయినా ఓ శరణాగతులను రక్షించువాడా! ఇప్పుడు నేను నీవానిగా పిలువబడుచున్నాను. అయినా ఇంత దుఃఖమును ఎందుకు అనుభవించుచున్నాను. అర్థము కావటము లేదు. దీని రెండవ అర్థము నేను ఇప్పుడు నీ వానిని అయిననూ నీవు నా విషయము పట్టించుకొనవు. ఇందువలన నేను దుఃఖమును అనుభవించుచున్నాను. అని చెప్పుకొనవచ్చును.

ఓ మహారాజా! కమల నేత్రుడా! నేను పాపమను సంతాపమున మునిగియున్నాను. ఓ రామా! ఇప్పుడు తులసీదాసునగు నన్ను నీ ఇష్టము ప్రకారము, ఇష్టమయినపుడు నిర్వర్తింపుము లేనిచో ఏదియును ఆశలేదు. భావము ఏమనగా రాముడు తాను కోరినట్లు ఎప్పుడైనా తులసీదాసును నిర్వహింపవచ్చును.

179. ఓ రామా! నీవు, ఎప్పుడైనా నన్ను నీ వానిగా భావించెదవా నీవు దీనరక్షకుడవు. పేదలను ఆదుకొనువాడవు. రాజులయందు మాణిక్యము వంటి వాడవు అనగా రాజాధిరాజువు. నీవు ఎప్పుడైనా నీ మనస్సునందు నీ బిరుదముల గౌరవము రక్షించుకొను విషయములు ఆలోచించుయున్నావా? భావము ఏమనగా నేను పేదవాడను. నీవు పేదల పెన్నిధివి. ఎప్పుడైనా నీ యశస్సును గురించి ఆలోచించి గౌరవమును కాపాడుటకు నన్ను రక్షించుము. ఓ రామా! శీలమునకు సముద్రము వంటివాడవు. అందమయిన వాడవు. అన్ని పనులు చేయుటకు యోగ్యుడవు. సమర్థుడవు. సద్గుణములగనివి. ఓ ప్రభు! నీవు మొదట నీ శరణోజొచ్చిన దీన జనులను ఉద్ధరించితివి. ఇప్పుడు చేయుచున్నావు. భవిష్యత్తులో చేసెదవు. కావున నీవు నీ శరణాగతుడైన ఈ తులసీదాసు ప్రేమను తప్పక గుర్తించెదవు. అతనిని స్వీకరించి ఉద్ధరించెదవు.

నీవు దీనులెడ దయగలవాడవనియు, ప్రతి నిత్యము దానము ఇచ్చుచుండువని వేదములుకు, పురాణములకును జగమెరుగును (ప్రపంచమునకు తెలియును) నేను నీకు ధన్య వాదములు తెలుపుచున్నాను. అయినను నేను చెప్పవలసి వచ్చినది.నీవు నా యందు దయ కల్గియుండక పోయినచో, నేను నీ భక్తి అనెడిభిక్షము అడుగుచున్నాను. అయినా నీవు దానము ఇచ్చుట లేదు. దీనుల ఎడ, దుఃఖితుల ఎడ నీవు అనాథుల హితము చేయునప్పుడు ప్రపంచము యొక్క మర్యాదను పాపాత్ముడగు తులసీదాసును ఉద్ధరించినచో ప్రపంచము ఏమగును అను చింత చేయలేదు అని నీవు ఆలోచించుము. కాని నీవు పాపులను ఉద్ధరించునప్పుడు ప్రపంచము మాటలను గురించి యోచించలేదు. తులసీదాసుకు ఈ విషయమును గురించి దృఢ విశ్వాసమున్నది. దాని ఫలితము బాగుగా నుండును. ఎందుకనగా నీవు నీ శరణాగతుల భయమును తప్పక తొలగించెదవు. నీ బిరుదులే అట్లున్నవి. నీకు వాటి గౌరవమును కాపాడుకొనవలసి యున్నది.

180. ఓ మనసా! నీవు ఎప్పుడైనా రామునిపై రక్తి కలిగియున్నావా అనగా వారితో ప్రేమ కల్గి యున్నావా? నీవు చాలా చెడు మార్గముల చెడు కర్మల వలన, దుష్టుడవయి, బుద్ధి, చెడు కోరికలు, కుటిలత్వము, కపటమును ఎప్పుడు వదలి పెట్టదవు? భావము ఏమనగా నీ చెడు స్వభావమును వదలి రామునిని ఎప్పుడు ప్రేమించెదవు? నీవు మోహమునకు గురి అయినందున ప్రాపంచికవిషయ వాసనలను అమృతముగా, రామభక్తిని అగ్నిగా భావించుచున్నావు. నీ ఈ విరుద్ధమైన ఆచరణ (పద్ధతి) వలన, విషయ వాసనల ఎడల నీ అనురాగమును వదలి, భగవంతుని చరణములను ఎప్పుడు ప్రేమించెదవు?

నీవు ఎప్పుడైనా రామనామము అను అందమయిన అక్షరములను దాని అర్థ రూపమగు మంచి తియ్యని లడ్డును రాముని ప్రేమ యందు పొందగలవా? అనగా రామనామము యొక్క అక్షరము సరియగు అర్థము తెలియజెప్పి రాముని ప్రేమయందు నిమగ్నమయి, ఎప్పుడు వారి గుణగానములను చేసెదవు? నీవు రాముని నుండి ఇటువంటి గుణములను గానము చేసి, వారిని ఆనందపరచి, ఎప్పుడు గుణగానములను చేసెదవు? కోరినట్లు వరదానము పొందగలవు? అనగా వారు నీ కోరికల నన్నింటిని పూర్తి చేసెదరు. అటుల చేసిన నీవు సుఖముగా నిద్రించగలవు. నీ హృదయములోని భయంకరమైన తాపము తొలగిపోవును. రాముని కృప వలన ఆయన దాసుడనగు తులసీదాసు హృదయమున రామభక్తి అనెడి యాగము జాగృత మగును. భావము ఏమనగా నిష్కామ భావముతో రాముని భజన చేయుచూ, వుండిన నీవు నిర్విఘ్నుడవగుదువు. నీ హృదయము నందు వున్న రాముని ఎడ ద్వేషము వలన ఉత్పన్నమయిన తాపము శాంతించును. ప్రేమ పరాభక్తి ప్రాప్తించును.

(భక్తి సిద్ధాంతము ననుసరించి భక్తినికూడ ఒక విధమయిన యోగముగా కూడ ఒక విధమయిన యాగముగా కూడ భావించబడినది. ఇందులో మనస్సును సంపూర్తిగా ఏకాగ్రతతో భగవంతుని చరణముల చింతన చేయబడుచున్నది.)

181. ఎవడయితే ఇతరుల సహాయము లేకుండయే స్వయముగా ఆత్మ నిర్భరుడై యుండెను. అతనిని కామము, మోహము మదము, కామము మత్తులో పడి కంఠము వరకు మునిగి ఉన్నందున కలియుగము యొక్క భయంకరమైన రూపము కనపడక వున్నది. భావము ఏమనగా మోహము, మదము, కామము, మత్తులో విస్మరించిన వ్యక్తికి ఆపదను గుర్తెరుగక తన మత్తునందే మునిగియుండును. అతని చిత్తమునందు రాముని వంటి స్వామి స్వభావము విషయములను విని వారి ప్రభావము పడకయున్న, అన్ని విధములుగ పరాజితుడయి, ప్రజల హితమును చేయగోరువాడు. అనగా రాముడు పతితపావనుడు. శరణాగత రక్షకుడు దీనుల ఎడ దయగల వాడు మొదలగు నామములున్నందున వీటిని విశ్వసించని వాడు.

నేను నా స్థితిని గురించి ఎరుగుదును. అనగా నా బలము బుద్ధిని నేను తెలుసుకొని యున్నాను. రాముని శక్తిని సంపాదించుకొనునట్టి బలము నాలో లేదు. నేను ప్రభువగు

రాముని వంటి కీర్తి యశస్సు గల వారిని ఇతరులను చూడలేదు. అనగా రాముని వంటి ఇతర వేరొక స్వామి లభించలేదు. శిలయైన అహల్యను (భీలు) (అడవి జాతి) శబరిని, జటాయువును, స్వర్ణము రంగు గల జింకను, రాక్షసుడగు, విభీషణుడును - వీరిలో ఎవరి కర్మలు బాగుండెను. అయిన రాముని కృపవలన ఈ రామనామమే నాకు కల్పవృక్షమయినది. నాకు రామనామమే మంచిది. కృపగల రాముని దయమే నాకు నా మనోవాంఛలును తీర్చును. నేను ఇప్పుడు దీనిని పొంది చాలా సుఖమును పొందితిని. నిశ్చింతుడనయితిని. బాలుడు తన తల్లిదండ్రుల రాజ్యమున వారి గొడుగు నీడలో సుఖముగా, ద్వందాతీతమై యుండును.

(రాముని అనుగ్రహమునకు ప్రాధాన్యత ఇవ్వబడినది. వ్యక్తి తన పౌరుషముతో ఏమియును, చేయలేదు. ఆత్మ సమర్పణ ప్రగాఢమగు విశ్వాసమును భావములను తెల్పెను. సగుణ భావమును భక్తిలో భక్తుడు బాలుడగును. జ్ఞాని ప్రౌఢుడుగను భావించబడును. ఈశ్వరుని ప్రేమ జ్ఞానియగు ప్రౌఢునిని కంటె బాలుడగు భక్తుని పైననే యుండును.)

182. ఎవరికైన రాముడు తప్ప ఇతరులపైన భరోసా ఉన్నచో వారిచే ఆధారము చేసుకొని వుండవచ్చును. నాకు మాత్రము రాముడు కల్పవృక్షము. అందులో కల్యాణమును ఫలములు ఉత్పన్నమగును. నా సర్వకళ్యాణములు రామనామము ద్వారానే అగును. కర్మ, ఉపాసన, జ్ఞానము, వైదిక సిద్ధాంతము, మొదలగు అన్ని విధములైనవి సరియైనవి. కాని నేను శ్రావణ మాసపు నెలలో గ్రుడ్డివానివలె అంతటా పచ్చదనము గోచరించుచున్నది. అదే మాదిరి నాకు రామనామము తప్ప మరొకటి స్ఫురణకు రాదు. ఈ కారణమున నా మనస్సు, జ్ఞానము, కర్మ, ఉపాసన, మొదలగు వాటి ప్రక్కకు పోదు.

మొదట నేను కుక్కవలె ఆకులు నాకుచూ నల్దిశల తిరుగుచూ వుంటిని; అయినా నా పొట్ట ఎప్పుడును నిండలేదు. కాని ఈనాడు నేను రామ నామము స్మరించిన నా ఎదుట అమృత రసము వడ్డించబడి వుండటము చూచుచూ వున్నాను. భావము ఏమనగా మొదట నేను అన్ని రకములైన సాధనములు జపము, తపము, యోగము, చేయుచూ తిరుగుచూ వుంటిని. అయినా వాటివలన నా మనస్సుకు శాంతి లభించలేదు. నా ఒక కోరిక కూడ పూర్తి కాలేదు. ఇప్పుడు రామనామము స్మరించిన వెంటనే అమృతమునకు సమానమగు మధురము, అనురత్వమును ప్రసాదించు బ్రహ్మానందము లభించుచున్నది. నా అశాంతి తొలగ, మనస్సు పూర్తిగా శాంతిని పొందినది. ఈ రామ నామము ద్వారా నా పరమార్థము స్వార్థము, అనగా ఈ లోకము, మరలోకము రెండును అయినవి. ఇప్పుడు నా మనస్సు ఏనుగు - మానవుడు ఏ విధమయి ద్వంద్వము సందేహము లేదు. అనగా ఇప్పుడు నేను అన్ని విధములుగా అన్ని సందేహముల నుండి ముక్తి పొందితిని. రామనామము యొక్క ప్రభావము చేత సముద్రము పైన నున్నంత బండల ద్వారా సైన్యమను సముద్రమును దాటెను. నేను కూడ రామనామ స్మరణ చేసి దీని ప్రభావమున భవసాగరమును సులభముగా

ఎవరికైనా రాముని ఎడ విశ్వాసమున్నదో అతని పనులన్నియు అతని ద్వారానే పూర్తి అగును. అనగా నాకు రామ నామము ఎడ అగాధమైన ప్రేమ, విశ్వాసము వున్నది. ఇందువలన నా పనులన్నియు దీని వలననే పూర్తి అగును. రామనామములోని రెండు అక్షరములు ర, మ, నా తల్లిదండ్రులు, నేను వారి ఎదుట బాలహఠము చేత ఆగివున్నాను. అనగా బాలుడు తన తల్లి దండ్రుల ఎదుట ఏదేని వస్తువు కొరకు హఠమును పూనును. తల్లి దండ్రులకు అతని హఠమును పూర్తి చేయవలసి యుండెను. అదేమాదిరి నేను రామనామ మనెడి రెండు అక్షరముల హఠము పట్టుచున్నాను. నన్ను ఉద్ధరించమని కోరితిని. నామాట వినవలసియే యుండును. ఒకవేళ నేను దాచివుంచి చెప్పినచో అనగా అపద్ధము చెప్పుచున్నాను; దీనికి శివుడు సాక్షి. రామ నామము చేత అందరి ఉద్ధారము జరుగును. ఒకవేళ నాకు నేను వాస్తవముగా అపద్ధము చెప్పినచో ఈ పాప ఫలితముగా నా నాలుక కరిగి పడిపోవుగాక. భావము ఏమనగా నాకు రామనామము నందు సంపూర్తిగా విశ్వాసమున్నది. ఈ విషయము సత్యమైనది. రామనామము చేతనే తులసీదాసుకు మేలు కల్గునని తులసీదాసుకు తెలియవచ్చెను.

183. ఓరామా! నా మేలు చేయునది నీ పేరు మాత్రమే. నేను ఈ విషయమును (తల్లిదండ్రులు, భార్య, పుత్రులు మొదలగు వారికి) స్వార్థము, సాధువులు, భక్తులు మొదలగు పరమార్థులు మిత్రుల ఎదుట భుజములను ఎగుర వేయుచూ కేక వేసి చెప్పుచున్నాను. నేను పుట్టిన వెంటనే తల్లి - దండ్రులు నన్ను వదలి వేసిరి. బ్రహ్మ నన్ను కర్మహీనునిగా ఒక విచిత్రమైన వానినిగా జేసెను (భాగ్యహీనునిగా) చేసెను. అయినా నా అదృష్టము విచిత్రముగా అయినది. దాని ఫలితముగా నేను రాముని భక్తుని అయితిని. అదృష్టము యొక్క ఈ వైచిత్ర్యము వలన కొంతమంది నన్ను రాముని దాసునిగా భావించి చెప్పుచున్నారు. చివరకు వారు ఈ విషయము ఏ సందర్భమున చెప్పుచున్నారు? అనగా ఈ రామ నామ మహిమ చేత (ప్రభావమున) రాముని సేవకుడని అనుచున్నారు.

మొదట నేను నీపేరు స్మరించక యుంటిని. అప్పుడు పొట్టకూటి కొరకు పేరాశపడుచుంటిని. ఇటు అటు తిరుగుచుంటిని నేను అప్పుడు చాలా దుఃఖముతో నుంటిని. స్వయముగా దుఃఖమే దుఃఖించు చుండును. భయంకరమైన దుఃఖముతో నుంటిని. కాని నీ నామమహిమ చేత (కృపవలన) నేను తుమ్మచెట్ల నుండి తాండ్ర వృక్షముల నుండి మామిడి పండ్లు పొందుచున్నాను. అనగా రామభక్తుడనని పిలువబడినందున నీచులు, దుష్టులు కూడ నన్ను గౌరవింపసాగిరి. సాధువులు - భక్తులు అనేక ప్రకారములగు సాధనలు చేసి ఇహపర లోకములను చేయుచున్నారు. మునులు అనేక రకములైన చింతనలతో తమ రెండు లోకములను సఫలము చేయుచున్నారు. అయినా తులసీదాసుకు

మాత్రము ఆధారము రామనామ నామమే. పగ్గము అనేక పొరలు వున్నా ముడి ఒకే వేయబడునట్లు ఇదే మాదిరి, సాధువులు, భక్తుల, మునుల లక్ష్యము ముడివలెనే ఒకటియే. కాని పొదలు చుట్టినట్లు సాధనలు అనేక ప్రకారములుండును. వారు రామనామము ద్వారా తమ సాధ్యములను సఫలీకృతము చేసుకొనుచున్నారు. లక్ష్యము ఉభయులది ఒకటే. అనగా రాముని ప్రాప్తి భావము ఏమనగా రామనామము ఆధారముననే సాధనములన్నియు సంకేతమునుకల్గి ఆధారపడియున్నవి.

(ఇందులో తులసీదాసుచే ఆత్మతత్వమును గురించి సంకేతము చేయబడినది.)

184. రామనామము కంటె స్వయముగా రాముడు ప్రియము కాని వారికి అనగా రామునికంటె ఎక్కువగా రామనామమును ప్రేమించి వారికి ఈ ఘోరకలియుగమున ఆది, మధ్య, అంత్యమున మూడు దశల యందు శుభమే కల్గును. అనగా అతని జీవితము ఆనందముగా నడచి పోవును. అనగా జీవిత పర్యంతము సంపూర్ణ జీవితము సుఖముగా గడచిపోవును. రామనామ మహిమ తెలుసుకొని మదము, లోభము, మోహము, క్రోధము, కామము సంకుచితము అనగా భయము చేత భీతిల్లుచుండును. భావము ఏమనగా రామ నామ స్మరణ చేత చెడు భావములు మానవుల వద్దకు రావు. సాధువులు, సజ్జనులు, సదా రామ నామమును జపించుటయందు నిమగ్నమై యుండు వారికి, కఠినమైన ఎండ నీడను కలిగించును. అనగా దానికి దుఃఖమును కల్గించ వీలగును.

రామనామము యొక్క ప్రభావమున రాతియందు కమలము ఉత్పన్నమగునని ఎవరేని చెప్పినచో అది సత్యమే. అసంభవము సంభవమగును. (కమలములు కొలనులో నుత్పన్నమగును రాతియందు కమలములు జన్మించవు.) కాని రామ నామ స్మరణము చేత శబరి - ఒక అడవి జాతి - స్త్రీ అదృష్టవంతురాలయ్యెను. శీలవతి అయ్యెను. పుణ్యాత్మ అయినది. వాల్మీకి, అజాములుని వద్ద ఏమియు సాధనములు లేకుండెను. అయిన వీరు మహాత్ములయిరి. రాముని నామము తిప్పేసి విరుద్ధముగా ఉచ్చరించినందున కూడ మరా, మరా అని చెప్పుట వలన నామ ప్రభావము చేత, గురుగింజలు, రత్నములపైన విజయమును పొందెను. అనగా వాల్మీకి వ్యతిరేకమైన ఉల్టా మరా మరా జపించుచూ మహర్షి అయ్యెను. అజామిలుడు తన పుత్రుని నెపమున నారాయణ అని పిలిచినందున వైకుంఠమునకు పోయెను. ఈ విధముగా గురివిందగింజల వంటి నీచులు తుచ్ఛులగు వీరిద్దరును రత్నములవలె గొప్ప ఋషుల మునులను జయించిరి. అనగా ఋషులు మునులు పొందలేని పదవిని పొందుటలో అసమర్థులైరి, ఆపద వీరికి లభించెను.

రాముని కంటె కూడ రామనామ మహిమ గారడి (నైపుణి) చేయును ఎందుకనగా దీని ప్రభావము చేత పంచవటి, చిత్ర కూటమువంటి చిన్న చిన్న గ్రామములు గొప్ప గొప్ప నగరముల కంటె అధికమైన విలువను పొందెను. నామస్మరణ ప్రభావమున వానరులు, ఎలుగుబంట్లు వంటి అసభ్యమైన ప్రాణులు కూడ మంచి పేర్లకు సమానముగ అయిరి.

సుసంస్కృతులు గలవారుగ అయిరి. ఈ నామ జపము చేయుచు తులసీదాసువంటి చెడ్డవాడు కూడ డంకా కొట్టి మంచివాడుగా అయ్యెను.

(ఓ రామా! నీకంటె నీ నామమే గొప్పదని నాధృఢ విశ్వాసము నీవు అయోధ్యను తరింప జేసితివి. కాని నీ నామము ముల్లోకములను రామనామమే ప్రభావముగలదిగా వర్ణించబడినది).

185. నేను రాముడు కాక మరొకరి సేవకుడుగా వున్నానని చెప్పినచో నానాలుక అబద్ధము (అసత్యము) చెప్పినందున తెగి క్రింద పడిపోవును. (కరిగిపడిపోవుగాక) ఓ సీతాపతి రామా! నేను జన్మ జన్మములకు నేను నీ ముక్కలను తినియే బ్రతికి వున్నాను. నేను ముల్లోకముల యందు, మూడు కాలముల యందు నీ అటువంటి ఈడైన హితము కోరువాడు మరొకడు లేడు. పొందలేరు. ఒకవేళ నీయెడ కపటముతో ప్రవర్తించిన అనగా అసత్యము చెప్పినచో నేను కల్ప కల్పాంతము (చాలా పెద్ద కాలము) వరకు ఘోర నరకమున కీటకము అయి పడివుండెదను. కలియుగము నా మనస్సును తన ప్రక్కకు మరలింప చేసి అనగా పాపకర్మల ప్రక్కకు ఆకర్షింపచేసి, సుడిగుండములో కీటకము వలె కీటకమువలె పరిభ్రమింప చేసెను. భావము ఏమనగా సుడిగుండములోని కీటకము నీటిపైన ఈదుచూ వుండును. సుడిగుండములో పడినను మునిగిపోదు. అదే మాదిరి నామనస్సు ప్రాపంచిక విషయ వాసనలయందు చిక్కుకొని వున్నప్పటికి రామనామ ప్రభావము చేత వాటిలో పూర్తిగా మునిగిపోవుట లేదు. తులసీదాసునగు నేను సదా ఈ విశ్వాస బలముతోనే ఎల్లవేళల ప్రసన్నుడనయి, శాంత చిత్తముతోనున్నాను. అతడు స్థిరముగా రాముని ఆస్థానములో నుండును. ఇందువలన కలియుగము అతనికి ఏమియును చెడుపు చేయలేదు.

(రాముని ఎడ అనన్యమైన, భక్తి భావనకు సంకేతము. ఆత్మ విశ్వాసము. ఆత్మ నిర్భరత, ఆత్మనివేదనము యొక్క చరమ సీను ఇది.)

186. ఏ స్వార్థము లేకయే హితమును చేయువాడు రాముడు తప్ప మరెవరూ లేరు. పేదల పెన్నిధి రూపమున ఎవరు ప్రసిద్ధి చెందిరి. రాముని కనుబొమలు ప్రక్కకే అందరూ చూచుచూ వుందురు. అనగా వారి ఆకృతి (ముఖము) చూచుచూ వుందురు. సంతోషముగా నున్నాడా? లేదా కోపముతోనున్నాడా? పిన్నలు పెద్దలు అందరిని విధాత నిర్మించెను. అందరు తమ స్వార్థమును పూర్తి అగుటకు కోరుకొను చుందురు. అనగా స్వార్థము లేక ఎవరికి మేలు చేయరు. దుష్టులైన అడవిజాతుల, కొండజాతులవారికి, వానరులకు, ఎలుగుబంట్లను పాలించుట, కృపగల స్వామికి శోభ చేకూర్చుచున్నది. అనగా రాముడే ఇటువంటి దయగల స్వామి ఆయన అందరిని పాలించుచున్నాడు.

వారిపేరు స్మరించినంతనే క్రోధము, సోమరితనముతో కూడ పాపములు దారుణములు తొలగును. తులసీదాసువంటి నీచుడగు తన శరణులోనికి తీసుకొనును. ఈ దుష్టుడు

నిమగ్నమై యుండును.

187. ఓ ప్రభూ! నీవు తప్ప నాకు ఇంకెవరు వున్నారు. నేను ఎవరికి నా దుఃఖగాథను వినిపించను? పేదవాడు రాజ్యమును పొందుటకు కోరినట్లు, నా మనసులోని కోరిక నీ భక్తుని కోరుచున్నది. నేను నా కోరికను ఎవరికి వినిపించి సుఖమును పొందుదును. అనగా అందరు నా కోరిక విని చీకొట్టుదురు నన్ను పరిహాసము చేసెదరు. దీనివలన నాకు దుఃఖమే కల్గును. ఎందుకనగా ఎవరును ఈ నా కోరికను పూర్తి చేయరు. ఇందువలన నేను నీతోనే చెప్పుచున్నాను. నేను యమయాతన అనగా నరకముల యొక్క దుఃఖమును, విభిన్న యోనుల యందు జన్మములను పొంది అన్ని విధములైన అసహ్యమగు కష్టములను అనుభవించితిని. ఓ ప్రభూ! (ధర్మార్థ కామ మోక్షము) ఈ నాల్గు ఫలములకు పొందుట నాకు మాత్రము దుర్లభము. అయిన నీవు వాటిని సహజముగా అందరికి ఇచ్చుటలో సమర్థుడవు. కాని నేను వాటిని పొందకోరను.

ఓ రామా! నేను కేవలము నీ క్రీడ కొరకు పక్షి, మృగము, వృక్షము, సేవకుడయి వుండ కోరుచున్నాను. నాకు ఒకవేళ ఇటువంటి సౌభాగ్యము లభించినచో నేను నరకములో కూడా సుఖముగా నుందును. ఇదిగాక నాకు పరమ ఆనందము (మోక్షము) లభించిన, నేను దుఃఖముతో దగ్ధమగుదును. అనగా కేవలము నీ సాన్నిధ్యము కోరుచున్నాను. ఇది తప్ప నాకు మోక్షము వలదు. నీ ఈ దాసుని హృదయములో కేవలము ఈ కోరికయే వున్నది. అతడు (నేను) నీ ఆజ్ఞ పొందిన వెంటనే నా పాదరక్షలు పట్టుకొనును. అనగా సదా నీ పాదసేవ యందే దాసుడనయి వుండ కోరుచున్నాడను. నాకు ఇప్పుడు ఈ మాట ఇవ్వుము. లేదా మనస్సునందే ఈ విషయమును నిర్ణయించుకొనుము. తులసీదాసు యొక్క ప్రతిజ్ఞను నెరవేర్చెదను. అనగా తులసీదాసును నీ సేవ కొరకు స్వీకరించుము.

(తులసీదాసు - పశువు, పక్షి, వృక్షము ఏదో రూపమున రాముని సాన్నిహిత్యమున నుండ కోరుచున్నాడు. భగవంతుని సమీపమున నుండు భావమును వ్యక్త పరచెను.)

188. ఓ రామా! నాకు నీయటువంటి దీనబంధువు ఎక్కడ లభించును? ఇతరుల పీడను తెలుసుకొను అనుభవించు వారు నీవు తప్ప ఎవరు వున్నారు? ఈ ప్రపంచమున నేను అక్కడ కూడ మనస్సును మరలించుచూ వున్నాను అనగా చూచుటకు ప్రయత్నించు చున్నాను. ప్రభువు సమర్థుడనియు, వారి హృదయమున కృపా భావము లేదు. అనగా వారు ఎవరిపైన కృప చూపరు. కృప గలవారు దీనికి అనర్హులు, ఎవరిపైన కృప చూపుటకు అర్హత లేదు. చూచుటకు ప్రయత్నించు చున్నాను. ఇందువలన నేను ఈ విషయములను మా మనస్సులోనే మననము చేసుకొని మౌనముగా నున్నాను. నేనుగా దుఃఖగాథను అనవసరముగా ఇతరుల ఎదుట వ్యర్థముగా చెప్పి వినిపించవలెను? భ్రమను పోగొట్టుకొనవలెను. నా రహస్యము తెలిసిపోవును. ఎవరును నా సహాయము చేయరు. ఇందువలన నేను ఎవరితోను చెప్పక కేవలము నీతోనే దుఃఖము చెప్పుచున్నాను.

ఒకవేళ నేను ఆవుగిట్ట అంతయినా గుంతలో మునిగిన కాని మాటలు మాత్రము సముద్రము లోతును చూచి వచ్చునట్లు మాట్లాడు చుందును. కాని చేతలు మాటల యందు నింగికి నేలకు వున్నంత తేడా వున్నది. నా మనస్సు మిక్కిలి దురాశ గలది. కామమునకు దాసుడను. కాని నేను నోటితోనే దాసుడనని చెప్పుకుంటూ తిరుగుచున్నాను. ఓ ప్రభూ! నీవు తులసీదాసు మనస్సులోని సర్వమును తెలిసికొని వున్నావు. ఎందుకనగా నీవు అంతర్యామివి. అయినా స్వయముగా నేను నీకు కొంత తెలియజేయ కోరుచున్నాను. మోసము కపటము వదలి నీ ద్వారము దగ్గర నీ గుణగానములను చేయుచుండునట్లు ఏదేని ఉపాయమును చేయుము.

189. ఈ నా మనస్సులోని కోరిక కూడ ఒకే మాదిరి అనగా చాలా విచిత్రమైనది. మునుల మనస్సును అగమ్యమైన, పుణ్యఫలములను చేయుచూ మనస్సుకు తృప్తి లేదు. అనగా ఇక్కడ ఇష్టాను సారము పాపములను చేయుచున్నది. అటు మోక్షమును పొందగోరుచున్నది. ఈ భూమి కర్మ భూమి, కాని ఇక్కడ కలియుగమున జన్మమును పొందుట చెడు సాంగత్యమున బుద్ధి అహంకారము, మోహము, కారణమున మత్తు కల్గియున్నది. అనగా మానవుడు తన ఎదుట ఎవరిని దేనిని తెలుసుకొనడు. ఈ మనస్సు కోట్లాది చెడు కార్యములను చేయుచుండును. అటువంటప్పుడు మోక్షము, శాంతి, ఎట్లు పొందగలడు? సాధువుల, గురువుల చేసి, వేద పురాణములను విని, సత్సంగమును పొందగోరిన మ్రోగిన వెంటనే రాగము తెలుసుకొనవచ్చును. అదే మాదిరి ఈ విషయము నిర్ణయింపవచ్చును. మోక్షము, శాంతి, ఎప్పుడు లభించునో తెలుసుకొన వచ్చును. కాని రాముని స్వభావము కల్పవృక్షము వంటిది. అనగా వారు అందరి మనస్సులోని కోరికలను పూర్తి చేయుదురు. కాని దానితో పాటు వారి స్వభావము దర్పణములో ప్రతిబింబమువలె నుండును. దర్పణము లోనికి ముఖమును పెట్టి చూచిన అది అతడు అటులనే కనబడును. ఇదే మాదిరిచూడు కల్పవృక్షమువలె అందరి కోరికలను తీర్చుటకు సిద్ధముగా నున్నాడు. కాని ఆ కోరిక యొక్క శుభమును, అశుభమును అగుట మన కర్మల పైన ఆధారపడి వున్నది. మన కర్మలననుసరించియే మన కోరికలు వుండును.

(ఇందులో తులసీదాసు యొక్క ఒక క్రొత్త సిద్ధాంతము ప్రకటన అగుచున్నది. భగవంతుని కృపతోపాటు కర్మల మహిమ చెప్పబడినది. శుభ కర్మలు చేసిన మన మనస్సు నిర్మలముగా నుండును. దాని ననుసరించియే మన కోరికలు కూడ శుభముగా అనగా విరక్తి ప్రధానమగును. ఇందువలన భగవంతుని ప్రాప్తి కొరకు శుభకార్యములు చేయుట అవసరము.)

190. ఈ అందమయిన జీవితము వ్యర్థముగా గడచిపోయెను. అనగా నష్టమయినది. పరమార్థము లభించలేదు. అనగా ముక్తి లభించలేదు. ప్రతి నిత్యమును నీతిపనులు (చెడ్డ) పనులు చేయటము ఎక్కువ అయినది. బాల్యమంతయును క్రీడలకును వ్యయమయ్యెను.

జీవితమును యువతులు జయించిరి. అనగా యౌవనా వ్యవస్థ యందు యువతులు తమ బానిసగా చేసుకొనిరి. వృద్ధావస్థ, రోగములు వియోగము (తనకు కావలసిన వారు చనిపోవుట) రోగము (ఎక్కువ శ్రమపడుట)తో నిండి గడచిపోయెను. అనగా వృద్ధావస్థ యందు అనేక రకములైన దుఃఖములను అనుభవించును.

రాగము (ఆసక్తి) క్రోధము, ఈర్ష్య మోహము మొదలగు వాటి వశమున నున్నందున అనగా సత్సంగమున నుండవలయునను రుచి లేకుండెను. రాముని గుణగణములను చేయలేదు. వినలేదు. రాముని చరణములను ప్రేమించలేదు? ఆత్మ కళ్యాణమునకు ఎన్ని సాధనములున్నవో వాటియందు మనస్సు లగ్నము కాలేదు. ఇప్పుడు ఈ హృదయము పశ్చాత్తాపమను అగ్నియందు జ్వలించుచున్నది. అసహ్యమైన సాంసారిక (ప్రపంచములోని) విషయములను వినుచున్నాను. అనగా మరల నన్ను ప్రాపంచిక బంధనముల యందు పడవేసి కష్టములను అనుభవింప జేసెను. మాటిమాటికి జన్మ మరణముల యాతన సహించవలసి వచ్చెను. ఇప్పుడు ఓ ప్రభు! తన యజ్ఞము పద్ధతుల మేరకు నీవు అనాధుల, దీనుల, పాపులను ఉద్ధరించెదవు. నీవు తెలుసుకొన్నట్లు చేయుము. అనగా నీ మనస్సుకు వచ్చినట్లు నన్ను ఉద్ధరించుము.

191. ఇదే మాదిరి అనేక జన్మలు గడచి పోయినవి. ప్రాణుల స్వామి అగు రాముడు అటువంటి యజమానులకు త్యాగము, ఇతరుల చరణ సేవ చేయుచూ వుంటిని. అనగా ఇతర దేవతలను పూజించితిని. ప్రపంచములోని మనుష్యులను, ప్రశంసించితిని. సంతోష పరచితిని. మూర్ఖుల, కుటిలుల, పిరికివారిని, దుష్టులను, కలియుగ పాపములను చేయుటలో లిప్తడనయి (అంటుకొని) వుండువారిని ప్రశంసించుచూ నోరు ఎండిపోయినది. సుఖమును పొందుటకు ప్రాపంచిక విషయ వాసనలను పూర్తి చేయుటకు నిరంతరము ఇటు,.అటు పరుగెత్తుతూ వుండుట వలన అయిన అలసిపోలేదు. హృదయము ఎల్లవేళల దారిలోని మురికి ప్రక్కకే దానివలెనే మలినమయి వుండెను. ఇప్పటికి స్థిరము కాలేదు. అనగా సంతోషము శాంతి లభించలేదు. భావము ఏమనగా విషయ వాసనల వలన మనస్సు సదా మలినమయి, వ్యాకులమయి వుండెను. అనగా దానికి సుఖము శాంతి ఎప్పుడును లభించలేదు.

ఈ దీనత్వమును, తొలగించుకొనుటకు హృదయమున అనేక రకములగు ప్రయత్నముల విషయమును గురించి ఆలోచించితిని. అయినా చింతామణిని గుర్తుపట్టకయే మనస్సులోని చింత ఎప్పటికి తొలగదు. అనగా చింతామణికి సమానమగు సర్వచింతలను తొలగించు రాముని కనుగొనక పోయినచో మనస్సులోని చింతలు ఎప్పటికిన తొలగిపోవు. లక్షలాది ఉపాయములు చేసినను, చక్కగా ఆ బాధలు తొలగవు.

192. ఒకవేళ సీతాపతి రామునిని గుర్తుపట్టలేక పోయినచో సర్వకర్మలు, ధర్మము, శ్రమ చేయువారే నిరూపణ అయ్యెదరు. అని జ్ఞానులు చెప్పెదరు. అనగా రామునితో ప్రేమ

చూపని వారు ఇతర కర్మలు - ధర్మములు వృథాగా చేసిన దగును. వ్యర్థము అగును. మంచి పరిణామము లేని, శ్రమ చేయుట అగును. వేదములు, పురాణములు, గొప్ప గొప్ప, ఋషులు, మునులు, దేవతలు, గొప్ప యోగులు సిద్ధులు వున్నారు. వీరందరు మొదట పూజలు పొంది అనగా మొదట తమ పూజ చేయించుకొని అప్పుడు బదులుగా సుఖమును కల్గించెదరు. ఇటుల చేయుటలో లాభ - నష్టములు అంచనా వేయుచున్నారు. అనగా పూజ మేరకు ఇచ్చెదరు. ఎప్పటికిని ఎక్కువ ఇవ్వరు. భావము ఏమనగా వారు పూజ ఇచ్చి తీసుకొనుట పక్కా వ్యాపారులు.

పొరపాటున నామస్మరణ చేసిన పాపములు నశించని వారెవరు? బ్రాహ్మణుడగు (అజామిలుడు) వేటకాడగు బోయ (వాల్మీకి) గజరాజు, గ్రద్ధ (జటాయువు), మొదలగు కోట్లాది దుష్టులు అతని పొట్టలో చేరిపోయిరి. ఎవరు వీరికి శరణు ఇచ్చిరి? భావము ఏమనగా ఇటువంటి పేరు రామనామమే. రాముడే ఈ దుష్టులను శరణున చేర్చుకొనెను. వీరిని ఉద్ధరించెను. అతడు తన భక్తుల పర్వతముల వంటి గొప్ప పాపములను, దోషములను, అనగా భయంకరమైన దోషములను తొలగించి అనగా వాటి ప్రక్క ధ్యానముంచక, భక్తుల యొక్క దుమ్ము కణముతో సమానమగు సాధారణమైన, తుచ్ఛమైన, గుణములకు హృదయములో స్థానమిచ్చును. అర్థము ఏమనగా ఈ గుణములను పెద్దవిగా చేసి ఒప్పుకొంటివి. వారిని తన శరణులోనికి చేర్చుకొనెను. ఓ మూర్ఖా! నీవు ఈ దినము కూడ ఆశలన్ని వదలి ఇటువంటి రాముని ఎందుకుగాను భజన చేయవు? అని తులసీదాసు చెప్పెను.

193. ఓ జిహ్వా! నీవు రాముని గుణగానములను ఎందుకుగాను చేయవు? నీవు రాత్రింబవళ్లు పరనింద చేయుచూ వృథాగా కష్టములను కల్గించుకొనుచున్నావు? అనగా ఇతరులతో కలహము, కొట్లాట ఎందుకు కొనుచున్నావు? నీవు మానవుని నోరు అనెడి అందమైన పవిత్రమైన దేవాలయ మందు నివసించి దానిని అపవిత్రము ఎందుకు చేయుచున్నావు? చేయవద్దు. నీవు చంద్రుని దగ్గర వుండి దాని అమృతము త్యాగము చేసి ఎందుకు మృగతృష్ణలోని జలము కొరకు పరుగెత్తుచూ వున్నావు. అనగా చంద్రునివంటి అందమైన ముఖముగల నోటియందు వుండి అమృత తుల్యమైనభగవంతుని పేరువదలి చర్చించుకుంటూ ఎందుకున్నావు? భగవంతుని పేరు ఎందుకు గాను స్మరించకున్నావు?

కామమునకు సంబంధించిన కథలు, కలియుగమనెడి నల్ల కలువలను వికసింపచేయుటకు వెన్నెలకు సమానము. ఆకామ కథలను చెవులు విప్పి వినుటయే నీకు బాగుండును. భావము ఏమనగా కలియుగము కామకథను (భోగవిలాసపు మాటలు) విని,

ఆనందమయిన కీర్తిని శ్రమణము చేసి నీ కళంకమును (కామ కథలను వినిన కళంకమును) తొలగించుకొనుము. నీవు బుద్ధి అనెడి స్వర్ణమును (స్వర్ణమానమైన నిర్మలము) కాంతివంతమైన బుద్ధి ముక్తి అనెడి మాణిక్యముల ద్వారా బాగుగా సరిచేసి సరిచేసి, ఒక హారమును శరణాగతులకు సుఖము కల్గించు సూర్యవంశ రూపమన కమలమును సూర్యునివలె వికసింప చేయునట్టి రాజగు రాముని మెడలో ధరింప చేయుము. భావము ఏమనగా నీవు నీ నిర్మలమైన బుద్ధి చేత, అందమయిన పనుల ద్వారా భగవంతుని గుణములను గానము చేయుచూ వుండుము.

నీవు వాద - వివాదముల రుచి అనగా ఆకర్షణను త్యజించి, భగవంతుని భజన చేయుము. వారి పరమ చరిత్రను వర్ణించి నీ మనస్సును వినియోగించువారే. అనగా వాద వివాదములను వదలి భగవంతుని గుణముల గానము చేయుము. ఇట్లు చేయుట వలన, నీవు భవసాగరమును తరించగలవు. ముల్లోకముల యందు పవిత్రమగు యంశము లభించును. అనగా అందరు నిన్ను ప్రశంసించెదరని తులసీదాసు చెప్పెను.

(ఈ గేయమున నాలుకను ఇంద్రియములకు ప్రతీకగా రామనామమును పేర్కొనునదిగా వర్ణించెను. జిహ్వాకు మానవీయకరణము చేయబడినది.)

194. ఒకవేళ మానవుడు స్వయముగా తన మేలు తానే చేసుకొనునట్లుయిన, ఇది తోచిన తన శరీరముపైన శిరస్సు వుండగా అంతయును విస్మరించి కబంధునివలె అంధుడయి అందరితో కలహించుచూ జగడము లాడుచున్నాడు. భావము ఏమనగా కబంధుడు యుద్ధ భూమి యందు తనవారు - పరాయి వారు అను భేదము లేక తెలియక భయంకరమైన యుద్ధము చేయుచుండెను. అదే మాదిరి ఈ మానవుడు తన మేలు కీడు తెలియక అందరితో పోరాడుచూ వున్నాడు. కబంధునికి శిరస్సు వుండదు. తెగిపోయి వుండును. ఇందువలన తనవారు పరాయివారు అను భేదము లేక యుండును. కాని మానవుడు చాల మూర్ఖుడు ఏలయిన శిరస్సు వుండి కూడ అనగా బుద్ధి వుండి కూడ అంధుడయి కడు మేలు అను భేదము తెలియక అందరితో యుద్ధము చేయుచుండును.

ఓ రామా! నా దుర్గుణములు, మరియు నీ సద్గుణములు చూసి నా బుద్ధిమానకుము (గౌరవము) రెండును కింకర్తవ్య విమూఢడయి అతని శక్తి క్షీణించుచున్నది. భావము ఏమనగా నా దుర్గుణములు చాలా ఎక్కువగా యున్నవి. భయంకరమైనవి. నీ గుణములు మహిమ గలవి. గొప్పవి. నేను ఎట్లు నీ ఎదుటికి రావలయునో నాకు ఇది తెలియకున్నది. నీతో నన్ను ఉద్ధరించమని ప్రార్థించుట కావలసియున్నది. నీవు నన్ను శరణులోనికి తీసుకొందువని నాకు నమ్మకము లేదు. నీవు తులసీదాసు ఆచరణ, అలవాట్లు, కర్మ చెప్పటము, నా ద్వారా ఇవ్వబడిన ఉపదేశములు, నాబుద్ధి యొక్క వాస్తవికతను కృపగల భగవంతుడా రాముడు తప్ప ఇంకెవరు తెలుసుకొనగలరని తులసీదాసునగు నేను చెప్పుచున్నాను. అనగా నీవు అంతర్యామివి. అంతయును ఎరుగుదువు. నేను చెప్పుటలో

చేయుటలో చాలా తేడావున్నది. బుద్ధిగూడ భ్రష్టమై యున్నది. ఇటువంటి విషమ స్థితిలో నీవు దీనుడనగు దశను (స్థితి) తెలుసుకొని నన్ను ఉద్ధరించెదవని విశ్వసించుచున్నారు. ఎందుకనగా నాయటువంటి అనేక మంది ధూర్తులను పాపాత్ములను ఉద్ధరించెదువు.

195. భగవంతుని చక్కగా స్వీకరించిన వాడు శీలవంతుడు, పవిత్రుడు, వేదముల జ్ఞాని, విద్యా గుణముల చేత పరిపూర్ణుడయ్యెను. పాండుపుత్రులు, అయిదుమంది (పంచ) పాండవుల వృత్తాంతము పంచపాండవులు కుంతి - మాద్రి గర్భముల నుండి పుట్టిరి, భిన్న దేవతల ద్వారా వారి కర్మల కథ ఒక ద్రౌపదితో అందరు సంభోగించుట, జూదము ఆడుట మొదలగు కుకర్మల కథ విని సత్యమార్గము అనగా ధర్మమార్గము భయము భీతిని పొందును. అనగా దానికి భయము అనునది పీడించసాగెను. నన్ను ఎవరు మాట్లాడిస్తారు. ఎవరు ధర్మమార్గమున నడచుకొందురు? కాని భగవంతుడు వారిని స్వీకరించి ముల్లోకముల యందు వారిని పూజ్యులనుగా చేసెను. పవిత్రమైన యజ్ఞగాథను విని భవలోకములోని మానవులు తరించిరి. ముక్తులయిరి. వేదముల ద్వారా నిర్ణయించిన ధర్మమును నృగరాజు కొద్దిగా కూడ దారి తప్పలేదు. అనగా ఏ మాత్రమును పొరపాటు చేయలేదు. అతడు ఏ అవగుణములు లేకయే పాపము లేకయే ఊసరబిల్లి అయి యుండెను. బావిలో, తరువాత భగవంతుడు అతనిని బావి నుండి వెలికి తీసి ఉద్ధరించెను. భావము ఏమనగా అధార్మికులైన పాండవులు ధర్మాత్ములయిరి. నృగరాజుకు పాపము ఏదియు చేయకనే ఊసరబిల్లి కావలసి వచ్చెను. భగవంతుని యొక్క విచిత్రమైన లీలల రహస్యము తెలుసుకొనుట కష్టము.

బ్రహ్మాండమును భాస్యము చేయు దానిని నిర్లక్ష్యము చేసి బ్రహ్మాస్త్రము గర్భమున నున్న పరీక్షిత్తు రాజును ఎప్పటికి వృద్ధికానట్టి, నముచి అను దైత్యుడు ఇంద్రుని వజ్రాయుధము చేత చంపబడలేదు. బ్రాహ్మణుడు అజామిలుడు దేవరాజు ఇంద్రుని కంటె కుకర్మలు చేసి యుండెను. అయిన ఇద్దరును అతి భయంకరమైన అన్ని రకములయిన కుకర్మలు చేసి వుండిరి. అయినను భగవంతుడు వారికి కూడ అనేక రకములయిన సహాయములు చేసి వారి హృదయములోని బాధలను తొలగించెను.

వేశ్య, పింగళా, కామదేవుని వలన ఈ పాపము చేయని వారు ఎవరును లేరు. అయినా భగవంతుడు వారి చరణములను కూడా పవిత్రముగా భావించి వాటికి తన హృదయమును దేవాళయమున స్థానమిచ్చి వుంచుకొనెను. భగవంతుడు ఏ ఆచరణను పవిత్రమైనదిగా భావించునో తెలుసుకొనుట అసంభవము ఇందువలననే తులసీదాసునగు నేను నిలబడియే భగవంతుడగు రాముని కొరకు నిరీక్ష చేయుచు వున్నాడు. భావము ఏమనగా మంచి పని (సత్కర్మ) చెడు కర్మ చేయుటవలన సంతోషములను, సంతోషము లేనిది ఈ విషయమును తెలుసుకొనలేము. ఇందువలన భగవంతుని కృపయే అన్నిటికంటె ముఖ్యసాధనము.

196. రామా నీవు ఎవరిపైన ప్రసన్నుడవగు చున్నావో వారే సరియగు పుణ్యాత్ములు; పవిత్రమైన ఆత్మగలవారు. గణికా పింగళా వేశ్య, గ్రద్ధ జటాయువు; వధికుడగు వాల్మీకి, వీరిని నీవు నీ లోకమునకు తీసుకొని పోయితివి. వీరు కండముల అగ్నియందు ఎప్పుడైన తమను కాల్చుకొన్నారా? కండముల అగ్ని మధ్యలో కూర్చొని పంచాగ్నుల తాపము చేత తమ శరీరమును కాల్చుకొన్నారా? పంచాగ్నియందు తపము చేయుచూ తమ ప్రాణములను ఇచ్చారా? అయినా నీవు వారిని తరింపజేసితివి. నృగరాజు వేదముల ద్వారా నిర్ణయింపబడిన ధర్మ మార్గమున పోవుచుండును. దర్మ మార్గమును ఎప్పుడును తప్పలేదు. ప్రపంచమున ఎన్ని దుఃఖములున్నవో అన్నియు అనుభవించెను. అనగా అటువంటి ధర్మాత్ముడు కూడ భయంకరమైన దుఃఖము అనుభవించెను. గజరాజు దీక్షితుడు కాడు. అనగా అతడు కూడ ఏ గురువు చేత దీక్షపొంది నిన్ను భజించియుండెను. అతడు స్మరించినంతనే గరుడ వాహనమును వదలి సుదర్శన చక్రమును చేతబట్టి నడచి వచ్చితివి.

నీవు, దేవతలు, మునులు, బ్రాహ్మణులు మొదలగు శ్రేష్ఠకులములను వదలి, గోకులమున గోపనందనుని ఇంట జన్మించితివి? కౌరవరాజగు దుర్యోధనుని నిర్లక్ష్యమును చేసి విదురుని ఇంటికి వెళ్ళి భోజనము చేసితివి. దీని రహస్యము ఏమనగా భక్తుల యందు భగవంతునికి వుండుట ఇష్టము. ఆయన తన ఈ పద్ధతిని కొద్దిగా అర్జునునికి తెలియజెప్పెను. అనగా అర్జునునికి సారధిగా వుండి అతనికి గీతను ఉపదేశించి అన్ని విధములుగ అతనిని కాపాడెను. రాముడు స్నేహము ద్వారావే భక్తుని వశములనుండును. రాముని ప్రేమ లేక ఇతర సాధనములు జపము, తపము, యోగము ద్వారానే జయము మొదలగునవి. నీరు చిక్కగా అయిన దానితో సమానము. అనగా క్షణకాలము శాంతిని కల్గించును. శరీరముపైన జలమునుపోసినచో లేక త్రాగినచో కొద్దిపాటి కాలము సుఖము లభించును. మరలా వేడిమి దాహము పీడించు చుండును. ఇదే మాదిరి అన్యసాధనముల ద్వారా పూర్ణమగు తృప్తి లభించక క్షణకాలము శాంతిని కల్గించును. కాని రాముని ప్రేమించిన మానవుడు పూర్తిగా తృప్తిని, సంతోషమును, ప్రసన్నతను కల్గించునని తులసీదాసు చెప్పెను.

197. ఓ రామా! ఒకవేళ నీవు ఇతర దుష్టులను ఉద్ధరించినచో దుష్టుడనగు నన్ను ఉద్ధరించుము. తప్పక ఉద్ధరించగలవు. ఏ పాపాత్ముడైన ఎప్పుడైనా ఏదో ఒక పద్ధతిలో అనగా భావము చెడు భావము అనక నీ పేరు స్మరించిన నీవు లేచి సన్మానముతో వారికి స్వాగతము జెప్పివారిని స్వీకరించితివి. ఆజామిలుడు పాపము గని. అనగా భయంకరమైన పాపాత్ముడు అని తెలిసి యముని భటులు కోపగించుకొని, అతనిని బాధించసాగిరి. అప్పుడు నీవు అజామిలుని స్వీకరించితివి. వారి నుండి రక్షించితి. యమభటులు చేతులు పిసుకుకొని క్రోధమున పండ్లు కొరుకుచూ రిక్త హస్తముల వెళ్ళిపోయిరి.

ఓనాథా! గౌతముని భార్య అహల్య, గజరాజు, గ్రద్ధ, జటాయువు, వృద్ధులగు యమలార్యుడు, వానరులు మొదలగు వారినెందరినో ఎంత మలచినారో నీకు తెలియును.

వీరందరూ జడులు బుద్ధిలేని వారు. నీచులు, పాపాత్ములు, మూర్ఖులు, అయినా వీరికి ఆపదలు వచ్చినప్పుడల్లా సాధువుల సమాజమును వదలి వెంటనే సిద్ధమగు చుంటిని. వీరికి సహాయము చేసి ఉద్ధరించితివి. భావము ఏమనగా నీవు వీరి కష్టము క్షణము కూడ సహించక వెంటనే వీరికి సహాయము చేయుటకు పరుగెత్తి వచ్చితివి. నేటికి కూడ ద్వారము వద్ద అనగా నీ ఇంటి యందు పాపులకు ఎక్కువగా గౌరవమున్నది. తెలియదు ఎంతోమంది పాపాత్ములు పవిత్రులు అయిరి. ఈ పాపాత్ములందరు కలసి నా సాంగత్యమున క్రమముగా కూర్చొనరు. అనగా అందరికంటె భయంకరమైన పెద్ద పాపిని నేను. ఈ ప్రపంచమున ఎంతమంది పాపులు ఉన్నారో, వుండిరో, భవిష్యత్తులో వుండెదరో వారందరూ కలసి పాపము విషయము నీతులు నాలో నాకు శూన్యము. అనగా నేను గొప్ప పాపాత్ముడను. ఓ నాథా! నేను ఇంత వరకు కూర్చొని కూర్చొని వుండి నీ కృత్యములను చూచుచూ వుంటిని. నేను ఎంత పిలిచినను నీవు పలకలేదు. అనగానీవు నా ప్రక్కకు ధ్యానము వుంచి చూడలేదు. నన్ను ఉద్ధరించలేదు కూడ. ఇప్పుడు నీ ఈ తులసీదాసు ఇత్తడి బొమ్మను చేయును. బాగుగా నీకు అపశయము (అపకీర్తి) వచ్చునట్టు చేసెదను. ఇప్పుడు నేను ఇంత అపస్వరమును సహించలేను. తులసీదాసు రాముని భక్తుడు, అయిన ఎన్నో కష్టములు అనుభవించు చున్నాడు. ఇతడు సరియైన భక్తుడు గాక మోసగాడు, సరియైన భక్తుడయిన ఇన్ని కష్టములు ఓర్చుకొనడు. ఎందుకనగా రాముడు తన భక్తులను కష్టపడుచూ వుండగా చూడలేదు.

198. ఓ రాజారామా! ఈ భవలోకమున నీయటువంటి దీనబంధువు, నావంటి దీనుడు రెండవ వారు లేరు. నాయటువంటి దుష్ట శిరోమణి (అందరికంటె గొప్ప దుష్టుడు) నీవలె దైత్యమును నివారించువారు ఎవరును లేరు. నేను మనసా, వాచా, కర్మణా, పాపములు చేయుటలో లిప్తుడనయి వున్నాను. ఓ కృపానిధి! నీవు పాపులకు మోక్షమును ఇచ్చెదవు. ఓ ప్రభు! నేను అనాథుడను. నీవు అనాథులకు హితము కల్గించువాడవు. ఈ విషయము నా మనస్సులో నుండి ఎప్పటికి తొలగదు.

నేను దుఃఖముతో వున్నాను. నీవు దు.ఖముతో నున్న వారి దుఃఖమును తొలగించు వాడవు. నీఈ కీర్తి గౌరవమును వేదములు, పురాణములు చెప్పుచున్నవి. నేను భవలోకములోని బంధనములకు భయపడుచున్నాను. నీవు అన్ని విధములగు భయములను తొలగించువాడు. అయినా ఓ నాథా! నీవు ఏ కారణమున నా యందు కృప చూపుట మరచితివి? ఓ రామా! నీవు సుఖమునకు కేంద్రము దుఃఖములను తొలగించువాడవు నేను మిక్కిలి ఎక్కువ దుఃఖములో నున్నాను. మూడు రకములైన దుఃఖములను, దైహిక, ద్వైక, భౌతికముగా పీడించబడుచున్నాడను. ఇందువలన నీ మనస్సు నందు నా ఈ దీనదశను, నన్ను నా ప్రభుతా (సంపన్నత, వైభవము, శక్తిని తెలుసుకొని నీ శరణు యందు వుంచుకొనుము. భావము ఏమనగా నా సామర్ధ్యమును చూడుము. నావంటి భయంకర పాపరూపమగు

నన్ను ఉద్ధరించగలవా లేదా? అని ఇది యోచించి, నీ శరణులోనికి తీసుకొని వుంచుకొనుము. ఇట్లు చేయుటకు సామర్ధ్యము లేనిచో నిరాకరించుము.

199. నీవలె స్వార్థము లేకుండ ఇతరులకు మేలు చేయువాడు ఎవరును లేరని తెలుసుకొని నేను నీ చరణముల యందు మనస్సు వుంచితిని. వేదములు, పురాణములు, నీ కీర్తిని గౌరవించుచున్నవి. భావము ఏమనగా ఇతర దేవీ దేవతలు స్వార్థముతోనే ఇతరులకు మేలుచేయుచున్నారు. కాని నీవు మాత్రమే స్వార్థము లేకుండ అందరికి మేలు చేయుచున్నావు. నేను పుట్టిన చోటంతయును అనగా ఏ ఏ యోనులందు నేను జన్మించితినో అక్కడ నా తల్లి-దండ్రులు, పుత్రులు స్త్రీ (భార్య) అనేక మంది బంధువులు వుండిరి. కాని వారందరు స్వార్థము చేతనేనా పైన ప్రేమ చూపుచుండిరి. మనస్సు నందు కపటమును కల్గియుండిరి. వీరిలో ఒకరును నాకు భగవంతుని భజన చేయుట నేర్పలేదు. అందరును నన్ను ప్రపంచమున చిక్కుకొని వుండుటకే ప్రోత్సహించిరి.

నేను శరీరము ధరించి అనగా జన్మ పొంది, దేవతలు, మునులు, మనుష్యులు, దైత్యులు, నాగులు, కిన్నెరలు మొదలగు వారికి ఎందరికో తలవంచలేదు? (వంచితివి) అనగా నేను వీరందరి సేవ, సంతోష పరచుచుంటిని. అయినా నేను నా పాపముల వలన, మూడు రకములయిన తాపములను దైహిక, దైవిక, భౌతికములతో జ్వలించుచూ వుంటిని. విలవిలలాడు చుంటిని, పరిభ్రమించుచుంటిని. ఓ హరి! వీరిలో ఎవరు కూడ నాయందు దయయుంచి నన్ను ఈ కాలుచున్న తాపముల నుండి ఎవరును రక్షింప ఎవరునురక్షించుటకు, సహాయ పడలేదు. నేను నా సుఖము కొరకు అనేక రకములయిన ప్రయత్నములు చేసితిని. కాని భగవంతుని చరణముల యందు విముఖుడనయి నందున దుఃఖమును అనుభవించుచూ వుంటిని. కాని నేను ఇప్పుడు ఈ ప్రపంచము యొక్క ఆపదలు జరామరణాదులు మొదలగునవి నా తలపైన వ్యాపించి యున్నవని చూచి, నీరు లేని పడవ నిష్క్రియగా చైతన్య రహితమై పడివున్నట్లు నిరుత్సాహముతో, అలసివున్నాను. ఇప్పుడు నా ఉద్ధారము, నీ భక్తి అనెడి జలము లభించినచో అగును. అప్పుడే నా జీవితము అను నావ (పడవ) ముందుకు పోవును.

ఓనాథా! నేను నా స్వామిని, సుఖములకు కేంద్రమయిన వానిని విస్మరించితిని, ఇందుచేత నాకు ఈ పరిస్థితి ఏర్పడినది అని తెలుసుకొనుము. ఇందువలన ఓ హరి! ఇప్పుడు క్రోధమును వదలి నాయందు దయను చూపెట్టుము. ఈ తులసీదాసు నీ శరణుజొచ్చినాడు.

200. ఓ హరి! ఈ కారణముననే, నేను నా జ్ఞానమును పోగొట్టుకొన్నాను. అనగా అజ్ఞానమున పడిపోయితిని. నేను నా హృదయమనెడి కమలమున సదా స్థిరముగా నుండునట్టి రాముని వదలి ప్రపంచములోని విషయ వాసనల వెనుక పడి వికలుడనై తిరుగుచూ వున్నాను.

అనగా నేను భగవంతుని భజన చేయక విషయ వాసనల యందు మనస్సును వుంచితిని. దీని వలన శాంతి లభించక సదా అశాంతి లభించు చుండును. జింక మిక్కిలి మూర్ఖురాలైనందున తన శరీరము నాభియందు వున్న కస్తూరి మాదక గంధమును తెలుసుకొనలేక ఆ గంధము వేరొక చోటు నుండి వస్తున్నదని భావించి దానిని వెతుకుటకు పర్వతములు, వృక్షములు, లతలు, పృథ్విని బిలములను మొదలగు వాటిని వెతుకుచూ గంధము ఎక్కడి నుండి వచ్చుచున్నదని తిరుగునట్లు నా స్థితి వున్నది.

నిర్మలమగు జలముతో నిండియున్న చెరువునందు, పాచి, ఆకులు మొదలగునవి వ్యాపించి ఆ జలమున తన క్రింద లోపల వుంచి మూత వేయును. దాహము కొన్నవాడు, ఇందులో జలము లేదని దాహముతో దానిని (చెరువును) వదలి వేరొకచోట తిరుగుచుండును. అదే మాదిరి నేను మూర్ఖుడనయి నా హృదయమున విషయవాసనలు వ్యాపించినందున, వ్యాపించిన అశాంతిని అనుకలత నా హృదయములోనే నున్న భగవంతుని సత్య స్వరూపము (సరియైన)ను గుర్తించలేక, విషయ వాసనలతో తృప్తిని పొందగోరుచున్నాను. ప్రయత్నించుచూ చున్నాను. నా హృదయమును జ్వలింపచేసుకొనుచున్నాను. ఒకటి నా శరీరము వివిధ తాపముల చేత (దైహిక, భౌతిక) కారణమున అటులనే జ్వలింపబడుచున్నాను. పైన (బాహ్యమున) అసహ్యామైన దరిద్రము నన్ను ఇంకను ఎక్కువ బాధించుచున్నది. నేను నా హృదయములోనే నెలకొని వున్న రామనామ రూపమనెడి కల్పవృక్షమును త్యజించి, విషయ వాసనలనెడి, తుమ్మచెట్లు (కంటకమయమైన)గల తోటయందు మనస్సు వుంచినాను. అనగా కల్పవృక్షమువలె సర్వసుఖముల నిచ్చునట్టి రామ నామమును వదలి తుమ్మ చెట్లను (కంటకములు గల) భయంకరమైన దుఃఖమును కల్గించునట్టి విషయ వాసనల యందు అనురక్తుడయి వున్నాను.

(ఓ రామా! పురాణములు, నీవంటి జ్ఞాన కేంద్రము (మహాజ్ఞాని) మరి నా వంటి మూర్ఖుడు మరొకడు లేడు. ఓ నాథా! నీ మనస్సుకు మంచిగా కనబడినదే యోచించి చేయుము అని తులసీదాసు చెప్పుచున్నాడు.)

201. ఓ కరుణామయ! వినుము; ఈ మూర్ఖపు మనసు నిన్ను బాగుగా దారి తప్పించినది. ఈ ప్రపంచమున మాటి - మాటికి అనేక యోనుల యందు జన్మించి నా దుఃఖ గాథకు ఏడుస్తున్నాను. అనగా అనేక పాపకర్మలు చేసి దుఃఖమును అనుభవించుచూ చున్నాను. అమృతమునకు సమానమగు శీతలము, మధురము, సంకులమైన ఆనందమును నా ఎదుటనే అనగా హృదయములోనే వున్నాడు. అతడు దూరముననున్నాడని మరచి పోయితిని. అనగా మనస్సువలననే నేను నా హృదయములో నున్న దేవుని మరచిపోయితిని. మూర్ఖుడనయి మోహమునకు గురి అయి, అనేక విధములగు శ్రమలను చేయవలసి వచ్చెను. నీటిని మధించి (చిలికి) వెన్నతీయునట్లు వ్యర్థశ్రమగా ఈ నా శ్రమ ఫలితము ఇట్లయినది. భావము ఏమనగా నేను సుఖమును పొందుటకు విషయ వాసనలను పూర్తి

కర్మ బురద వంటిది అని నాకు తెలియును. అందులో చిక్కుకొనినచో ప్రాణి ఉద్ధరణ కాలేడు. అయినను నేను కూడ మనస్సును కర్మలయందే నిమగ్నము చేసితిని. అనగా అనేక విధములగు కర్మలను చేయుచుంటిని. కర్మచేసి, కర్మజాలము నుండి ముక్తి పొందగలనని నేను భావించుచుంటిని. కాని నా ఈ ప్రయత్నము మురికి ద్వారా మురికిని కడిగి పోగొట్టుటకు ప్రయత్నించినట్లు వ్యర్థములయ్యెను. అనగా నేను కర్మజాలమునందు విషయ వాసనల పూర్తి చేయు ప్రయత్నములో మిక్కిలి ఎక్కువ చిక్కుకొని దిగబడి పోయితిని. ఎందుకనగా కర్మచేసి, కర్మజాలము నుండి ముక్తి పొందుట అసంభవము. ఇది రాముని భక్తి చేతనే సంభవము. దాహముగొన్న మూర్ఖుడైన వాడు గంగను వదలి మాటి మాటికి దాహముతో వికలుడయి ఆకాశమును పిండి సారము తీయుట ఎటుల అసంభవమో అటులనే నా ఈ ప్రయత్నమున్నది. భావము ఏమనగా ప్రపంచములోని విషయ వాసనల వెనుక పరుగెత్తుకొని పోయిన శాంతి లభించదు. ఓ ప్రభు! తులసీ దాసునగు నా యందు దయ చూపుము. నేను నా దోషములను ఏవియు నీకు తెల్పక దాచి వుంచలేదు. ఓ నాథా! నేను రాత్రి ప్రక్క వేయగనే రాత్రి గడచిపోయినది. నేను బాగుగా మంచి నిద్రపోలేదు. అనగా గాఢ నిద్ర చేయలేదు. భావము ఏమనగా సుఖమును పొందుటకు అనేక రకములయిన ప్రయత్నములు చేసినా జీవితమంతయు గడచి పోయినది. అయినా నాకు మంచి సుఖము లభించలేదు. జన్మజన్మాంతరముల వరకు దారితప్పి తిరుగుట వలన అలసట తొలగి సరియగు సుఖము లభించును. ఆత్మానందము కేవలము రాముని కృపవలననే లభించును, అన్యత్రా లభించదు.

(ఈ గేయమునందు విషయాసక్తమగు కర్మను తులసీదాసు ఖండించెను. నిష్కామ కర్మను కాదు. హృదయ మలినము రామభక్తి వలననే తొలగించబడును.)

202. ఓ రామా! చిన్నవారు, పెద్దలు; చెడ్డవారు, మంచివారు; బలవంతులు లేక బలహీనులు అందరును నీవలననే నిర్వహించుట వలన నెరవేరుచున్నది. చెడుబుద్ధి ఈ విషయమును విని, తెలుసుకొని, మోహవశమున వికలత్వముతో నున్నది. ఎప్పటికిని శాంతిని పొందలేదని ప్రపంచమునందు, వేదములయందు ఈ విషయము ప్రసిద్ధి చెందివున్నది. అనగా అన్ని తెలిసియు కూడ విషయ వాసనల మోహమున గురిఅయి దుఃఖమును పొందుచున్నది. మానవుని ఈ బుద్ధి అతని వశమున నున్న తన చపలత్వమును వదలి, సదా ఒకే భావమున స్థిత ప్రజ్ఞుడయి అనగా స్థిరమయి వుండెడిది; మరి ప్రపంచమున హర్ష విషాదములను దుఃఖమును పొందక వుండును. మానవుడు కోరిన వస్తువును పొందెడివాడు. ఈ విధముగా ఏదో ఒక మాదిరి ఎవరి మనసులోను అభిలాష వుండదు. కోరికలన్నియు తీరినట్లయితే అందరు నిష్కామముగల వారగుదురు.

కాని ఈ విషయము సరికాదు. జీవుని యొక్క కర్మలన్నియు, కాలము, స్వభావము, గుణదోషములు అన్నియు మాయ వశముననే అగుచున్నవి. అనగా వాటిని నిర్మించునది మాయయే. ఇటువంటి మాయ భయముచేత భీతి నొంది, సదా ఆశ్చర్యమైన భావనతో రాముని భృకుటి (కనుబొమలు) చూచుచూ వుండును. రాముని రూపమును గుర్తించుటకు ప్రయత్నించును; రాముడు సంతోషముతో నున్నాడా లేక సంతోషము లేక వున్నాడా? భావము ఏమనగా మానవునిని నడిపించే మాయ భగవంతుడగు రాముని దాసి, ఈ మాయ శివుడు, ఇంద్రాది అష్టదిక్పాలకులు (దిశల అధిపతులు) మార్కండేయాది యోగీశ్వరులను, వశిష్ఠాది మునీశ్వరులను మీరు విడిపంచుట వలన వదలి పోవును, పట్టుకొనినచో పట్టుకొని బంధించును. అనగా గొప్ప, గొప్ప దేవతలు, యోగులు, మునులు మొదలగు వారు మాయ కనుసైగలతో నటించుచున్నారు. ఇటువంటి మాయ చాల శక్తివంతమయినది. ఈ మాయ వశవర్తిని.

అయిన ఈ మాయా రాజ్యమంతయు చదరంగము క్రీడవంటిది. అందులోని సామాన్లు రాజు, మంత్రి, ఏనుగులు, గుఱ్ఱములు ఒంటెలు పదాతిలము కర్రతో నిర్మించినవి. ఈ ప్రపంచము చదరంగము పోటీవలె అసత్యమైనది. సారము లేనిది. దీని అస్తిత్వము ఏమియును వుండదు. మాయకోరినట్లు నడిపించుచున్నది. ఓ మహారాజా! ఇటువంటి మాయారాజ్యము సామ్రాజ్యము (ప్రపంచము) నీవే రచించితివి. మొదట ఇది లేకుండెను. ఓ ప్రభు! ఇప్పుడు చదరంగములోని ఒక పోటీలో ఎత్తుగడయందు ఓడించుట, గెలిపించుట నీ చేతిలో వున్నది. నీవు కోరినట్లయితే మాయను తొలగించి నన్ను గెలిపించగలవు. లేనిచో మాయను విడపించుకోవటము నా వలన అసంభవమే అగును. ఈ విషయమును సరస్వతి అనేక వేషములలో, అనేక నోర్ల ద్వారా చెప్పినది. భావము ఏమనగా వేదములు, పురాణములు, శాస్త్రములు మొదలగు వాటి రూపమున సరస్వతి విభిన్న జ్ఞానుల, ఋషుల, మునుల, విద్వాంసుల (పండితులు) ద్వారా ఈ విషయమునే చెప్పినది.

(ఈ ప్రపంచమును మాయయే నడిపించుచున్నదనియు, అయినను భగవంతుని దాసిగా చెప్పబడినది. మాయయే భగవంతుని సంకేతము ప్రకారము తన వలను ఒడ్డియున్నది. ఇందువలన మాయ యొక్క ఈ వల నుండి ముక్తి కేవలము భగవంతుని కృప లభించినచో ముక్తి లభించును.)

203. ఓ జిహ్వా! నీవు రామనామమును జపించుము. (రామనామము యొక్క మహత్యమును) చక్కగా తెలుసుకొని ప్రేమతో దానియందు విశ్వాసము వుంచుము. రామనామము జపించుట వలన నీ హృదయములోని మంట (పీడ) అశాంతి తొలగిపోవును. నీవు రామనామము శరణుయందే వుండుము. సదా రామనామ మహిమనే కీర్తించుచూ వుండుము. కుటిలమైన కలియుగము యొక్క పాపములు, కష్టములు, దుఃఖములను దూరము చేయును. (తొలగించును). గణపతి, గణేష్ ప్రజల ద్వారా ఏ శుభకార్యము అయినా చేయునపుడు సదా మొదట పూజింపబడును; ఇది రామనామము యొక్క

ప్రభావమే. గణపతి తన కర్మల నన్నింటిని రామునికి వినిపించి యుండెను. ఏది దాచివుంచలేదు. ఈ రామనామము భవసాగరమును దాటుటకు వంతెన వంటిది. శివుడు తన భార్యయగు పార్వతితో, మోక్షమును పొందుటకు కాశిలోనున్నప్పటికి సదా ఆదరముతో ఈ రామనామమునే జపించుచూ వుందురు.

ఒక వాల్మీకి, వ్యాధుడు అపరాధమును లోతైన సాగరము. అనగా భయంకరమైన పాపి, అయినా అతడు కూడ రాముని వ్యతిరేక నామము మరా - మరా జపించుచూ దేవతలు, మునులు అతనిని నమస్కరించునంతటి గొప్ప వాడయ్యెను. వారు పూజించిరి. అగస్త్యముని ఈ నామబలము చేత వింధ్యచలమును ముందుకు పోవుట ఆపెను. సముద్రమునంతటి శుష్కింపచేసెను. ఆ సముద్రము బ్రాహ్మణుడగు అగస్త్యుని భయమున మనస్సున నిరుత్సాహ పడి ఉప్పుగా అయ్యెను. ఇటువంటి రామ నామము మహిమ అపారమైనది. శేషనాగుడు, శుక్రదేవుడు, విద్వాంసులు, వేదములు మాటిమాటికి తమ తమ బుద్ధి ననుసరించి దీనిని వర్ణించిరి, తులసీదాసుకు రామనామమును ప్రేమించుట, కామధేనువు, కల్పవృక్షమునకు సమానముగా కోరికల నన్నింటిని పూర్తిచేయునట్టి, మోహము అను అంధకారమును తొలగించునట్టి సూర్యునివలె తేజస్సుకలది.)

(పద్మ పురాణము నందు గణపతి ఒక దఫా తన ఐశ్వర్యమున మత్తుడయి ఋషుల, మునుల ఆశ్రమములను విధ్వంసము చేసెను. అనేక రకములైన ఉపద్రవములను సృష్టించెను. శివుడు తన కుమారుని ఈ ప్రవర్తనకు చాలా దుఃఃంచెను. అతడు భగవంతుని ధ్యానము చేసుకొనెను. భగవంతుడు ప్రత్యక్షము కాగా శివుడు ఆయనతో ఇట్లు అడిగెను. గణపతి సరియగు మార్గమునకు వచ్చు ఉపాయమును కోరెను. అతని నిందకూడ చేయకుండుటయు కోరెను. గణేశ్‌తో రామనామము జపము చేయించిచూడు అని చెప్పెను. శివుని ఆజ్ఞమేరకు గణేశ వేల సంవత్సరములు రామనామము జపించుటకు సమాధిస్తుడయ్యెను. రామనామము జపించెను. దాని ప్రభావము చేత మంగళ మూర్తిగా భావించబడిరి. దేవతల యందు ప్రథమము పూజనీయుడు అయ్యెను.

మొదట వింధ్యాచలము చాలా ఎత్తుగా వుండెను. సూర్యుని తాపము చేత దాని వృక్షములన్నియు జ్వలించు చుండెను. అప్పుడు అది క్రోధముతో నిండి సూర్యుని కప్పి వేయుటకు పెరుగసాగెను. లోకమున అశాంతి అల్లకల్లోలము వ్యాపించెను. దేవతలు, దైత్యులు అగస్త్యుని వద్దకు వెళ్ళి వింధ్యాచలము పెరుగుటను, ఆపుము అని ప్రార్థించిరి. అగస్త్యుడు రామనామము జపించుచూ వింధ్యాచలము పైకి వెళ్ళి దానిని క్రిందికి వంచెను. నేను దక్షిణము నుండి తిరిగి రానంతవరకు, ఇదేమాదిరి పడివుండుము.

ఒకదఫా అగస్త్యుడు సముద్రతటమున కూర్చొని పూజ చేయుచుండెను. పూర్ణిమ రాత్రి అయినందున సముద్రమున పొంగువచ్చినది. సముద్రము అలలు అగస్త్యుని పూజా సామాగ్రిని ప్రవహించి తీసుకొని పోయెను. మహర్షి క్రోధితుడయి రామనామము స్మరించుచూ మూడు దోసిల్లలో సముద్రము జలము నంతటిని త్రాగెను. తదుపరి దేవతలు ప్రార్థించిన

పిమ్మట దానిని మూత్ర రూపమున బయటికి పంపెను. అప్పటి నుండి సముద్ర జలము ఉప్పుగా అయినవని చెప్పెదరు.

శివుడు కాశీలో వున్నప్పటికి కాశి మోక్షము నిచ్చునది అయ్యెను. శివుడు పార్వతి సహితముగా మోక్షము కొరకు రామనామమును జపించెను. కాశీలో చనిపోవు ప్రతి ప్రాణికి మోక్షము నిమ్మని శివుడు రామనామమును జపించెనని ఆధ్యాత్మ రామాయణము నందున్నది.

. రామనామ స్మరణ పద్ధతిజ్ఞానము తెలుసుకొనవలెను. ఈ పద్ధతులు - వైఖరీ, మధ్యమా, పశ్యంతి పరా. తులసీదాసు కలియుగమున రామనామమును కల్ప వృక్షముగా భావించెను.

204. ఓ రామా! రక్షించుము, రక్షించుము. ఓ కళ్యాణ స్వరూపుడవగు రామచంద్రా! రక్షించుము. నేను నా చెవులతో నీ అందమయిన యశస్సువిని నీ శరణుజొచ్చితిని. ఓ దీనబంధు! నీవు దీనత్వము, దరిద్రము, జ్వలనము (పీడ) దోషములు, భయంకరమైన సహించలేనంతటి దుఃఖములను, భయము, దర్పము (అభిమానము, గర్వము) తొలగించునట్టివాడవు. ఎప్పుడైనా ప్రపంచము వలలోపడి (మాయ, మోహము, వాసనలలోపడి) నాకర్మల, కాలము చేత వ్యాకులుడనై, సర్వరాజులు, దుష్టులై, పృథ్వీభారము (అన్యాయములు, అత్యాచారులు, భ్రష్టాచారులు అయిరి; అప్పుడు నీవు శరీరమును పొంది (అవతారమెత్తి)తివి. భూభారమును (దుష్టరాజులు) తొలగించి మునులు, దేవతల, సాధువుల (బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్త సన్యాస), నాల్గు వర్ణములు (బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర) స్థాపించితివి. అనగా రక్షించితివి. భావము ఏమనగా అన్యాయము నిర్మూలించి న్యాయము, శాంతి అను సామ్రాజ్యమును స్థాపించెను.

రావణుడు ఎవరిని గౌరవముగా వుండనీయక, ముల్లోకముల యందున్నవారిని ఓడించి, సర్వదేవతలను, మనుష్యులకును భంగము కల్గించెను. అమరులు అని పిలువబడే వారందరు వారి ఖైదీలుగా నుండిరి. మేఘనాథుడు ఇంద్రున్ని జయించి నిర్బంధించివుండెను. అప్పుడు ఓ రామా! నీవే శరణుఇచ్చి వారి శోకమును తొలగించితివి. వారికి మరలా వారి వారి లోకములకు యజమానులుగా, రాజులుగా చేసితివి. రాముడా రావణుని వధించి, వారి బంధనములోవున్న ఇంద్రున్ని, యమునిని మొదలగు లోకపతులను ఉద్ధరించితివి. లోకమంతట ధర్మమును నాల్గుపాదములయందున్నట్లు (సత్య, తపము, దయ, దానము) రామరాజ్యమును స్థాపించెను.

పాషణము (రాయి) అహల్యను, నిషాదరాజు గుహుడు, జటాయు జాంబవంతుడు వంటి ఎలుగుబంట్లను, హనుమంతుడు, సుగ్రీవుడు మొదలగు వానరులను, విభీషణాదులగు రాక్షసులను, ఓ ప్రభూ! కొద్ది కాలములోనే, చిటికలోనే లోకమున తరింపచేసితివి. వారికి ఇతరాదులను తరింపచేయునట్టి పరమధర్మాత్ములనుగా, పూజ్యులను గావించెను. ఓ గజరాజును ఉద్ధరించిన దేవా! శీలమునకు సముద్రుని వంటి వాడవు.

తులసీదాసును గురించి నీ నిర్లక్ష్యము అనగా నీవు వీరినందరిని ఉద్ధరించితివి, ఇపుడు తులసీదాసు వంతు వచ్చినపుడు ఇంత అలసత్వము, నిర్లక్ష్యమును చూపెట్టుచున్నావు. తులసీదాసు గ్లాని (సిగ్గుచేత) చనిపోగోరుచున్నాడు. లేక తులసీదాసు ఎడ నిర్లక్ష్యము, అలసత్వము చూచి గ్లాని కూడా తనకు తానే కరిగిపోగోరుచున్నది. భావము ఏమనగా తులసీదాసు చాలా పాపాత్ముడు. నీవు గొప్ప గొప్ప పాపులను తరింపచేసితివి. అయినా నీవు తులసీదాసునగు నన్ను ఉద్ధరించక యున్నావు. ఈ సిగ్గు చేత తులసీదాసు చనిపోవుచున్నాడు. ఎందుకనగా ప్రపంచము అతనిని (రామదాసు) రాముని సేవకుడని భావించుచున్నది. గ్లానికి కారణము ఇదియే.

(ఈ గేయమునందు తులసీదాసు తన వ్యాకులత్వమును ప్రదర్శించెను.)

205. ఈ లోకమున ఎంతమంది స్వాములు (దేవీ దేవతలు, రాజులు) అయిరి. వీరి అందరిని గురించి నాకు బాగుగా తెలియునని, ఎరుగుదువని తులసీదాసు చెప్పెను. వారు అల్ప సంతోషులు. కొద్దిపాటులోనే క్రోధమును పొందెదరు. అనగా కొద్దిపాటి సేవ వలన సంతోషించెదరు. కొద్దిగా పొరపాటు అయిన క్రోధమును చెందెదరు. అనగా కొద్దిపాటి సేవవలన ప్రసన్నులయ్యేదరు. కొద్దిపాటి తప్పిదము వలన కోపము చేత ఎర్రగా బుర్రగా అయ్యేదరు. ఇటువంటి స్వాములు ప్రేమను నిర్వహించుట యందు విఫలము అయితే నీతి యందు (న్యాయ విషయములు) తెలియవు. వారి అందరి ప్రవర్తన బాగుగా లేదు. వీరు మాయలో పడియున్నారు. కాలపరిస్థితులు కర్మ బంధనములయందు చిక్కుకొని కర్మలకు కర్మలు చేయుచుందురు. మాయ, కాలము, కర్మ బంధనములయందు బంధింపబడి యున్నారు. అయిన వ్యాకులమగు జంబముననున్నారు.

ఇటువంటి స్వాముల నాధారము చేసుకొని శివ, బ్రహ్మ, మొదలగు స్వాములు, దానవులు, దైత్యులు మహత్తు కలిగి యుండిరి. తలపైకి ఎక్కుచుండిరి. ఉద్దండులగుచుండిరి. వారు ఈ స్వాముల బలమున నిరంకుశులై (ఇంద్రుడు, యముడు, కుబేరుడు) మొదలగు లోకపతుల (శాసకులు)ను జయించి యుండిరి. రావణుడు వీరినందరిని జయించి తన స్వాధీనము చేసుకొని యుండిరి. కాని వీరి స్వాములు మొదట బాగుగా సంతోషపడి అనేక వరములను ఇచ్చిరి. మరల తమ సేవకులకు రావణాదులపైన కోపగించుకొని వీరి గృహములను నాశనము చేసిరి. వీరిలో ఎవరును తమ శరణాగతుల భక్తుల వినాశము జరుగుచుండగ కొంచము కూడ సిగ్గు కలుగలేదు. తమ భక్తుల వినాశమును కల్గించుచుండిరి. భావము ఏమనగా శివ, బ్రహ్మ, మొదలగు వారు రావణుడు, హిరణ్య కశ్యపుడు మొదలగు దైత్య దానవులకు మొదట వరదానము చేసి అజేయులను చేసిరి. మరల వీరి అత్యాచారములతో ప్రపంచము బాధలు పడుచుండగా, విష్ణు భగవంతునిని స్వయముగా ప్రార్థించి వీరిని వధింప చేసిరి. అనగా వీరందరు స్వార్థముగలవారు. అస్థిరమైన చిత్తము గలవారు స్వాములు.

ఓ రామా! నీ ద్వారము వద్ద ఎవరైనా సేవ చేయచూచి వెంటనే హెచ్చరిక గలవాడవు అగుదువు. భావము ఏమనగా నీ సేవకుల క్షేమమును చేయుదువు. సరిఅయిన సామర్థ్యము గలవాడవు. సద్గుణములకు కేంద్రము పరమ పవిత్రుడవు. అందరి ఎడ కృపాదృష్టికలవాడవు. అందమయిన వాడివి సదాస్థిత ప్రజ్ఞుడవు. ఏకరూపుడవు. నీవు ప్రతి ప్రాణి ఘటమున (శరీరమున) నుండు వాడవు. ప్రతిప్రాణి రహస్యమును విశేషముగా ఎరుగుదువు. అనగా సర్వాంతర్యామివి. నీకు తెలియక ఏ రహస్యము వుండదు.

ఓ కృపగలవాడా! నీవలె దీనులను హరిరామ దేవుడు నాయటువంటి దరిద్రుడు లేడు. ఓ దేవా! దయయందు అన్ని ధర్మములు జీవించి యున్నవి. అనగా దయయే సర్వకర్మలకు మూలము నా మనస్సునందు కల్పవృక్షము నీడ వలె అన్ని సుఖములను ఇచ్చు నీ శరణులోనికి రావలెనని కోరిక వున్నది. తులసీదాసునగు నేను నీకు ధన్యవాదములు తెల్పుచున్నాను. కలియుగము యొక్క అధర్మముల వలన వ్యాకులుడనగుచున్నాను. అందువలన దయతో నన్ను రక్షించుము.

(ఈ గేయము నందు రాముని ఎడ తులసీదాసు సాటిలేని భక్తి సంకేతము వున్నది. దీనితోపాటు రాముని సామీప్యమును పొందగోరుట వున్నది. రాముడు తనను స్వీకరించగలడని ఉద్దేశ్యము.)

(శిబ్రహ్మలకంటె రాముని గొప్పదనము, స్థిరమైన స్వభావము యొక్క ప్రభావము చిత్రించబడినది.)

206. ఓ ప్రభూ! నాకు రెండవ స్వామి వుండుటకు రెండవ స్థానము లభించినచో, నిన్ను మాటి మాటికి పిలిచి కోపము వచ్చునట్లు చేయను. ఓ కృపానిధి! నీవు యటువంటి సోమరి అభాగ్యులను పోషించితివి. ఓ రాజ, రామా! నీవే నా రాజువు (స్వామివి) అయోధ్యయే నేను వుండుటకు తగిన పట్టణము. భావము ఏమనగనా నేను నిన్నే రాజుగను, అయోధ్యనే నివాస స్థానముగ భావించుచున్నాను. నేను దిక్పాలులను (వరుణ, కుబేరాదులను) సేవించలేదు. సరస్వతి, గణపతి, సూర్యుని, పార్వతికి సేవచేయలేదు. నా యోగ క్షేత్రము (ప్రాప్తి మరియు రక్ష) ఒక రామునిచే యున్నది. అనగా నేను కేవలము రామనామమునే ప్రాప్తించుకొని సదా హృదయమున సురక్షితముగా వుంచుకొన గోరినాను. నా నియమము నీ ప్రేమ ప్రతిజ్ఞయే అనగా నీ నామును ప్రేమించిన ప్రతిజ్ఞను పాటించుటయే నేను నా నియమమును కర్తవ్యమును భావించియున్నాను. అమలినము అజరమై, అమరత్వమును కల్గించునని విశ్వాసమున్నట్లు నాకు నీ నామము గురించి అంత విశ్వాసము వున్నది. ఇతర నాధనములన్నియు నాకు విషము వంటివి.

అనాధులకు నాథుడవు నీవు. నేను నా మిత్రుల సమాచారము ఎవరికి చెప్పి వినిపింతును? నా అనుచరులందరు దొంగలు - కాపలాదారులు - ఉభయులును. నీ

కామము, క్రోధము, మదము, మోహము, లోభము మొదలగునవి, దొంగలు. ఇవి నా వెంట తగిలి యుండును. ఇవి నా రామ నామమును రత్నమును దొంగలించుకొనుటకు పొంది యున్నవి. వివేకము, వైరాగ్యము, సంతోషము మొదలగునవి నా కాపలాదార్లు వీరందరూ రత్నమును రక్షించుటలో నిమగ్నమై ఉండును. నీవు దొంగలను మందలించి భయపెట్టి భయపెట్టి వీరిని జాగ్రత్త పరచుము. అనగా నా చెడు వాసనలను నాశనము గావించి వివేకాన్ని మంచి ప్రవృత్తులను మొదలగువాటిని జాగృతము చేయుము. నీవు నీ పనులు (ధర్మరక్షణ మరియు ముక్తి) దేవతల పని అసురులను వధించుట దుఃఖముల రక్ష, ముక్తి యందు ఎప్పుడూ ఆలస్యము చేయలేదు. ఇప్పుడు నా వంతు వచ్చినప్పుడు ఆలస్యము ఎందుకు అగుచున్నది. అనగా నారక్షణ మరియు ఉద్ధారము చేయునపుడు నీవు ఇంత ఆలస్యము ఎందుకు చేయుచున్నావు? కొంచెము ఈ విషయమును గురించి చూడుము. ఆలస్యమునకు కారణమేమో చూడుము.

నీ పద్ధతి (పతితులను ఉద్ధరించుట)ని వినియే నేను నీ యందు విశ్వాసము కల్గి నిన్ను ప్రేమించితిని. నేను కలియుగము యొక్క అత్యాచారములను చూచి, భయ భీతుడనయితిని. ఓ రామా! నీ శరణుజొచ్చు చున్నాను. నీవు స్వయముగా గాని, అన్యులనేవారు (హనుమంతుని)తో తులసీదాసు నావాడని, హృదయమున, నిరాశ, వికలత్వమును పడవద్దు అని చెప్పుము. నేను పడుదును. నేను నీ వాడనని కలియుగము తెలుసుకొని నీ భయము చేత అది నన్ను బాధించుట మానుకొనును.

207. ఓ రామా! నీ స్వభావము, గుణము, శీలము, మహిమ, ప్రభావమును శివుడు, హనుమంతుడు, భరతుడు ఎరుగుదురు. వారి హృదయ రూపముననున్న అందమైన పల్లెరముల యందు రాముని ప్రేమ అనెడి కల్పవృక్షము శోభాయమానముగానున్నది. అందు సుఖమనెడి సరసమైన పూజాఫలములు వుండును. అనగా వారు రాత్రింబవల్లు రాముని ప్రేమ యందు నిమగ్నమై యుందురు. సదా సుఖమును పొందుచున్నారు. నీవు నీ శీలస్వభావమున శివుని స్వామిగా, హనుమంతుని మిత్రునిగా, భరత లక్ష్మణులను తన సోదరులుగా చేసుకొంటివి. అయినా వీరందరూ నిన్ను స్వామిగా భావించి సదా జాగరూకులై నీ ప్రేమలోనుందురు. అనగా ఎల్లప్పుడు నీ ప్రేమ యందు నిమగ్నమైయుందురు. నీకు భయపడు చుండెదరు కూడ. ఎందుకనగా వారిలో పొరపాట్లు జరగక వుండుగాక. ఈ పద్ధతిలో స్వామి సేవకుని మధ్య ప్రేమ నిర్వహణ పరస్పరము వుండుట నిర్వహించుట అగును. ప్రేమ మర్యాదను నీతిగా పాటించెదరు. ఎవరును తమ పరిమితిని అధిగమించకూడదు. ఇట్లున్నప్పుడే ప్రేమ యొక్క ఈ నియమము నిర్వహించ బడుచూ వుండును. భావము ఏమనగా సేవకులను, స్వామిగణము రామునివలె తన సేవకులను ఆదరించవలెను. సేవక గణము, శివ, హనుమంతుడు, లక్ష్మణుడు, భరతుడు మొదలగు వారికి సమానముగా తమ పరిధి దాటి వెలుపలికి రాకూడదు. స్వామి శిరస్సుపైన

శుకదేవ; సనక సనందునులు, ప్రహ్లాదుడు, నారదుడు మొదలగువారు - రామ భక్తి విషయ వాసనల నుండి పూర్తిగా విరక్తి చెందిననే రాముని భక్తి లభించును. జ్ఞానము, లేకయే భక్తి మన జాలదు. జ్ఞానము ఉత్పన్నము కావలసియున్నది. ఓ నాథా! నీ చేతులయందు వుంది. అనగా నీవే అందరికి జ్ఞానమును కల్గించుచున్నావు. ఈ రహస్యమును తెలుసుకొనియే ఓ నాథా చతురులగు మానవులు నీ చరణములయందు వ్రాలుచున్నారు. భావము ఏమనగా వైరాగ్యము లేకయే ప్రాపంచిక విషయ వాసనలనుండి ఆసక్తి తొలగదు. వైరాగ్యము లేనిదే భక్తి కలుగదు. జ్ఞానము లేకయే భక్తి ఏర్పడదు. జ్ఞానము భగవంతుని కృపలేకయే ఉత్పన్నము కాదు. ఈ కారణము చేతనే ప్రజలందరు భగవంతుని కృప పొందుటకు ప్రయత్నము చేయుచున్నారు. ఈ కృపయే అందరికి వైరాగ్యము, జ్ఞానము, భక్తి మూలము. ఇవి లేకపోయిన ఏమియును వుండదు.

అరు శాస్త్రములు (సాంఖ్య, యోగ, వేదాంత, మీమాంస, న్యాయ, వైశేషిక) యందు ఈశ్వరుని గురించి పరస్పరము భిన్నముగానున్నవి. అనగా అన్నియు వేరు, వేరుగా విషయములను చెప్పుచున్నవి. వేరు వేరు పురాణములు అభిప్రాయము ఒకటిగా లేదు. వేదములు కూడ నిత్యము నేతి, నేతి (ఇంతయేకాదు ఇంతయేకాదు) అని చెప్పుచున్నవి. అనగా శాస్త్రములు, పురాణములు మొదలగు వేదములు ఈశ్వరుని యదార్థ స్వరూపమును బోధించలేకున్నవి. వీటి పరిస్థితి ఇట్లున్నచో అన్య అభిప్రాయముల గురించి చెప్పుట వ్యర్థము. తులసీదాసు నాయటువంటి నీచుడు, పాపి కూడా తరించుచున్నాడు. ఎప్పుడు రామనామము స్మరించుట వలన. అను ఈ విషయము ఇష్టమగుచున్నది. పైన పేర్కొనిన అభిప్రాయము, భేదాభిప్రాయములు భ్రమయందు యుంచును. కేవలము రామనామము మాత్రమే సర్వశ్రేష్ఠమైనది. ముక్తి ప్రదాయిని.

(రాముడు శివుని ఎడపూజ్య భావమును కల్గియుండిరి.)

208. ఓ తండ్రీ! నేను నా కర్మల చేతనే, నా విషయము చెడిపోయినది. ఓ రామా! నేను నీ శరణుజొచ్చుచున్నాను. ఒకసారి నాయటువంటి దురాశాపరుని అసత్యవాది చెడిపోయిన విషయమును చక్కదిద్దుము. ఎందుకనగా పరోపకార స్వభావము నీది. కావున అనేకుల విషయము చక్కబడినది. అనగా నేడు నా విషయమున నా యందు కృప చూపి నా చెడిపోయిన విషయమును చక్కదిద్దుము. నా శరీరము రోగములచే బంధించబడినది. చెడు కోరికలు కలిగియున్నందున మలినుడనగుచున్నాను. ఇతరులను నిందించి (పరనిందచేసి) వితండవాదము (కుతర్కము) చేయుటవలన, వాణి (నాలుక) విషమయినది. రామభక్తిని పొందుటకు సాధనములు కఠినముగానున్నవి. ఇందువలన నేను చేయలేకవున్నాను. సాధనము లేకయే సిద్ధి లభించదు. ఇపుడు కృపానిధి! నీ కృపవున్నందుననే

నేను ఈ ప్రపంచమునకు ముఖము చూపించుటకు యోగ్యుని అయితిని. భావము ఏమనగా నావలన కర్మకాండ చేయుటకు శక్తిలేదు. జ్ఞానమును ప్రాప్తము చేసుకొనలేను. నీభజన కూడ చేయలేకున్నాను. ఇపుడు కేవలము నీ కృప ఒకటే నాకు ఆధారము.

నీవు పతితపావనుడవు. దుఃఖితులకు, అనాధులకు రక్షకుడవు. ఆధారము లేనివారికి ఆధారము నీవే! దీనులకు బంధువు. నీవు సర్వులపైన కృప చూపెట్టుదువు. కాని నేను వీరిలో ఒకరిని కాలేకవున్నాను. (నీవు నాయందు కృప ఎందుకు చూపెట్టుదువు?) నేను ప్రపంచమును తెలుసుకొనలేదు. జ్ఞానమును పొందలేదు. (కామ క్రోధాదులను చెడువాసనలతో) యుద్ధము చేయలేదు. వీటిపైన విజయము పొందలేక పోయితిని. అనగా నేను ఈ చెడువాసనలను ఆపుటకు (అడ్డగించుటకు) ప్రయత్నమే చేయలేదు. ఈ కారణమున నేను మూడు విధములగు తాపములను దైహిక, దైవిక, భౌతిక వీటి చేత దగ్ధము అగుచున్నాను. నేను చేసుకొన్న కర్మ ఫలితమును అనుభవించుచున్నాను. అనగా కర్మ చేసుకొన్నట్లుగానే ఫలితమును అనుభవించుచున్నాను. నేను నా కపటమున సరలమగు సరియగు సాధువువలె నుండితిని అయినా నేను కలియుగము కంటె ఎక్కువ దురాచారుడను. పాపాత్ముడను. నాకు పరలోకపు మాటలు (పరమార్థము, జ్ఞానము, వైరాగ్యము మొదలగునవి) నీరసము (రసహీనముగా) కనబడుచున్నవి. అనగా వాటియందు నా మనస్సు లగ్నము కావుటలేదు. నాబుద్ధి సదా ప్రపంచము రంగులోనే రంగు అద్దబడియుండును. అనగా నేను ప్రాపంచిక విషయ వాసనలయందు సదా అనురక్తుడనై యున్నాను. ఓ మహారాజా! నేటివరకు నేను చెడు సాంగత్యమున ఉండి గడిపిన దినములు అన్నియు వ్యర్థమయ్యెను. ఇందువలన ఇప్పుడు చివరలో నేను నీకు శరణుజొచ్చినాడను.

నీవు రామనామము యొక్క ప్రభావము బాగా ఎరుగుదువు. నాకు సృష్టికర్త ఈ పేరు తప్ప మరొక మార్గము చూపెట్టలేదు. అనగా నేను దీని ద్వారానే ముక్తిని ప్రాప్తించుకొనగలను. ఇది నాకు నమ్మకమున్నది. నీకు నాపైన క్రోధము రావలసియున్నది. కావున నేను చేసిన కోట్ల కొలది కర్మలవలన నీకు క్రోధము రావలసియున్నది. నాలో ఒకే ఒక విశేషము ఇదే. అది చూచి నీవు సంతోషించెదవు, ప్రసన్నుడవు అగుదువు. అది నా సిగ్గులేని తనము. భావము ఏమనగా నీకు నాయటువంటి వాడు ఎవడును దొరకడు. లజ్జలేనివాడు అన్ని విధములుగా నేను అయోగ్యున్ని. అపాత్రాడనయినను నీకు నేను చేతులు జోడించుకొని, నన్ను ఉద్ధరించమని కోరుచూ పడివున్నాను.

209. ఓ రామా! నన్ను నీ శరణులో ఉంచుకొనుము. నీవు ఎల్లపుడూ సర్వదీనులను, పాపులను నీ శరణుయందు వుంచుకొనుచువున్నావు. వారికి శరణు ఇచ్చుచున్నావు. ముల్లోకముల యందు త్రికాలములయందు (భూత, వర్తమాన, భవిష్యత్) నీకు సమానమగు దయగలవాడు దుఃఖముతోనున్న వారికి శరణాగతులను పాలించువాడు మరొక రెండవ స్వామి లేడు. ఓ నాథా! నీ అసంఖ్యాకమైన అలసుల, భాగ్యహీనుల, పాపుల ఆలనపాలనా

చేసితివి. వారిని అన్ని విధములుగా సంతోష పరచితివి. అయినా నీవు అనాధుల నుండి ఋణ విముక్తుడవు కాలేదు. ఇటువంటి ఓ సమర్థమైన స్వామి! నేను ఎట్లున్నా నీవానినే! ఈ కలియుగము చెడు ప్రవర్తనలను చూచి చూచి నా మనస్సులో దీని ఎడ చాలా అసహ్యము (ఏవగింపు) ఉత్పన్నమగుచున్నది. ఎందుకనగా ఇది నన్ను నీ చరణముల నుండి దూరము వుంచుటకు ప్రయత్నము చేయుచూ వున్నది.

ఓ రామా! నేను నీ శరణు జొచ్చుచున్నాను. నీవు క్రోధముతో, సంతోషముతో, నవ్వి, కోపగించుకొని ఏ విధముగానైన సరే, ఒకసారి ఓ తులసీదాసు! నీవు నావాడవని చెప్పుము, ఇంత చెప్పినచో నా దుఃఖమంతయు వేర్లతో సహా తొలగిపోవును. సుఖములు నాకు అనుకూలమగును. అనగా నేను అన్ని విధములుగా సంతోషముతో నుందును. ఓ మహారాజా! ఓ రామా! నేను ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. నీవు ఇట్లు చెప్పిన వెంటనే ఆక్షణమే నాకు దుఃఖములు తొలగిపోవును. నేను సుఖముగా నుందును.

210. ఓ రామా! నీపేరే నామాతాపితలు. స్వజనులు, స్నేహితులు గురువు, స్వామి, సఖులు, మిత్రులవంటిది. రామనామముతో ప్రేమకల్గి యుండుట అను నా ప్రతిజ్ఞయే నాకు శాశ్వత ధనము. అనగా ఇతరుల ధనము వ్యయము చేసిన ఖర్చగును, తక్కువ అగును. నీ వందల కోట్ల కొలది చరిత్ర రూపమున నున్న పెరుగు సముద్రమును చిలికి రామనామమనెడి ఈ ఘృతము (నెయ్యి)ను వెలికి తీస్తాను. అనగా నీ అపారమైన చరిత్రము యొక్క సారము రామనామము ఆధారము, బలము నాల్గు ఫలముల ధర్మము, అర్థము, కామము, మోక్షము యొక్క ఫలము వున్నది. అనగా పైన పేర్కొనిన నాల్గు ఫలముల సారము (తత్వము) వున్నది. కపటత్యాగము, నిష్కపట భావముతో దీనిని స్మరణ చేసిన అధిక శ్రేష్ఠమయినది. దీనికి సమానమగు రెండవ యజ్ఞము లేదు.

ఈ రామనామము స్వార్థమును సాధించుటకు అనగా ప్రాపంచిక సుఖములను ఇచ్చునట్టిది. మోక్షము (పరమార్థమును) కల్గించునట్టిది. అనగా రామనామము స్మరించిన లోకము పరలోకము రెండును సార్థకమగును. రామనామమువలె శుభములను కల్గించునది వేరొకటి రెండవది లేదు. తులసీదాసు ఈ విషయమును సహజ స్వభావముగా చెప్పెను. అనగా తులసీదాసుకు ఈ విషయమున సహజమైన పూర్తి విశ్వాసమున్నది. నిజముగ సత్యమైనదిగా ఋజువు అగును. ఎందుకనగా నిష్కపట భావముతో చెప్పిన విషయము సదా సత్యమే అగును. సీతాపతి యగు రాముని పేరు చిత్తమునకు చిత్తము. అనగా చైతన్యమునకు కూడా చైతన్యమును కల్గించును. అనగా జ్ఞానులకు కూడ ఎక్కువ చైతన్యమును కల్గించునది. భావము ఏమనగా పరమార్థ స్వరూపమై జీవుని ఉద్ధరించును. (తులసీదాసు రాముని కంటే రామనామమే మహిమ గలదని చెప్పెను. తులసీదాసుకు ఈ అనన్యత యందే సహజమైన విశ్వాసమున్నది).

211. ఓ రామా! సాధువులకు, సజ్జనులకు, భక్తులకు నీ నామము కల్పవృక్షమునకు సమానమైనది. అనగా సర్వ కోరికలను పూర్తి చేయునది. దీనిని స్మరించినచో మూడు రకములైన తాపములు (దైహిక, దైవిక, భౌతికము) తొలగిపోవును. కోరికలన్నియు పూర్తి అగును. ఇది సమస్త పుణ్య రూపమనెడి కమలములకు సరోవరము. అనగా సమస్త పుణ్యములకు (కమలములు కొలనులో వికసించియున్నట్లు) కలసి యుండును. ఇది లాభమునకు లాభము, సుఖమునకు సుఖముగానుండి సర్వస్వమై యుండును. ఇది పతితులను పవిత్రులుగా చేయును. భయమునకు భయము భీతి కల్గించును. అనగా దీని వలన జీవుడు సంపూర్ణమైన (అన్నింటి) భయములనుండి ముక్తి పొందును. పూర్తిగా నిర్భయుడై యుండును. ఇది నీచ, ఉన్నత, దరిద్రుడు (పేద), రాజు మొదలగు వారందరికి సులభమగును. ఇతడు తన ఇంటివారివలె అందరికి సుఖమును కల్గించును. వేదములు, పురాణములు, శివుడు కూడ కేకవేసి, రామనామమును ప్రేమించుటవలన నాల్గు ఫలములు, ధర్మ, అర్థ, కామ, మోక్షములు అనగా వీటన్నిటి సారరూపము. భావము ఏమనగా ఈ నాల్గు ఫలములనుండి వ్యక్తికి లభించునది. భయమునకు భయభీతి కల్గించుచున్నది. రామనామమునుండి లభించును. ఎవరైతే రామనామమును ప్రేమించరో, అందులో విశ్వాసము లేనివారు నాదృష్టిలో గాడిదతో సమానము. మూర్ఖుడు, సోమరి, నీచుడు, మాతాపితలు, మిత్రులు, హితులు, బంధువులు. గురువులు, స్వామి మొదలగువారు ఈ నామమునకు సమానము కాదు. మహత్తు కలవారు కాదు. ఈ నామము బుద్ధి స్వరూపము శీలముగల చంద్రునివలె అందరికి శాంతిని, ప్రసాదించును. ఓ దయానిధి! నిన్ను ప్రశ్నించుచున్నాను. ఆశ్రయించుచున్నాను. నీవు నీ దాసుడగు ఈ తులసీదాసును, ఈ దీనుడనగు నేను నీ ప్రేమను, నామమును సదా నిర్వహించుటకు బలమును నొసంగుము. అనగా నిర్విఘ్నముగా నీ నామమును జపించునట్లు చేయుము. లేక ఈ తులసీదాసుకు మీ ఇంత మాత్రము వరము దానము లభించిన ఇదియే గొప్పది అనగా అన్నింటికంటే వరమే సిద్ధించును.

(భాగవతములో రాముని ఎడ విముఖన్ని గాడిద అని వర్ణించబడినది).

212. ఓ రామా! చెప్పకుండా వుండలేను. చెప్పుటలో రసము (ఆనందము) లేదు. ఆనందమంతయు వికలమగును. నీయటువంటి స్వామిని పొందియు కూడ నీ ఈ సేవకుడు మంచివాడు కాని చెడ్డవాడు కావచ్చు. కాలము, కర్మముల భయంకరమైన కష్టమును పొందుచు, సహించుచూన్నాడు. కష్టమువలన చెప్పకుండ నన్ను నేను ఆపుకోలేకున్నాను. నేను ఇన్ని కష్టములు అనుభించవలసి వచ్చినది - ఎందుకు? కాని దీని రహస్యము (కారణము) ఏ మాత్రము బొత్తిగా అర్థము కాలేదు. ఇతరులు ఇంత గొప్పదనము ఎక్కడినుండి పొందిరో తెలియకున్నది. అనగా అజామిలుడు మొదలగు నీచులు ఇంత గొప్పతనము (భక్తి వుండుటకు) ఎచ్చటినుండి ఎట్లు పొందిరి? అనగా

విషయవాసనలయందు నిమగ్నమగుచున్నాను. ఈ క్షేత్రమున (ఈ విషయమునందు నాకు సరియగు వారు వేరొకడు లేడు. ఇందువలన నీవు నాయటువంటి అసత్యవాది దురాశాపరుడు అనేక విధములుగా మోహము, కపటములు చేయువాడు, నీవాకిలివద్ద నుండి ఛీకొట్టి పారద్రోలుము (నీద్వారము వద్ద నిలబడివుండుటకు తగినవానిని కాదునేను) ఎందుకనగా సూకరము (పంది) నిర్మలమైన జలమున పడుకొని వాటిని మురికి చేయుచున్నది అదే మాదిరి నేను నిర్మల జలమువంటి నీ నిర్మలమైన యశస్సును మలినము చేయుదును. అనగా నన్ను చూచి, ప్రజలు చూడండి ఇతనిని (తులసీదాసును) రాముడు ఉద్ధరించలేదని చెప్పుదురు. కాని వాస్తవము ఏమనగా ఇట్లు చెప్పువారు నా కర్మలను చూడలేదు. అందువలన నా ఉద్ధారము జరుగలేదు. ఈ ప్రజలు నా బాహ్యమైన వేషమును చూచి, నన్ను రామభక్తుడని భావించుచున్నారు. నా కర్మల విషయము వారికి తెలియదు.

నన్ను చక్కదిద్ది నీ శరణులో వుంచుకొనుము లేక నాయటువంటి నీచున్ని చంపుము. ఈ రెండు విషయములందు ఆలోచించి నీకు ఇష్టము అయినట్లు చేయుము. నన్ను ఉద్ధరించమని నేను నీ ఎదుట బ్రతిమాలుచూ వుండను. నేను తులసీదాసును మాటిమాటికి గీతగీచి నామాటపైన బలముపూని, ఒకవేళ నీవు నా విషయమున నిర్లక్ష్యముతో కాలము గడపినచో శరణులోనికి తీసుకొనుము లేదా చంపివేయుము. ఇటుల చేయనిచో నేను నీ మహిమ అను పడవను చెడ్డపేరు అను సముద్రమున ముంచి వేయుదును. అనగా చతుర్దిశలనుండి నీ చెడ్డపేరును ప్రచారము చేయుచూ తిరుగుచుందును. రామనామము జపించుట వ్యర్థము, నిరుపయోగము. దాని నుండి ఏమియును లాభము లేదు. రాముడు పతిత పావనుడవు కావు, ఏమియును కాదు. అదియంతయును బూటకము.

(సిద్ధావస్థలో కూడ మనస్సు అప్పుడప్పుడు చలించి విషయ వాసనల ప్రక్కకు మరలుచుండును. తులసీదాసు రాముని మానసికముగా సాక్షాత్కరింప చేసుకొని వుండెను. సాధనావస్థను అధిగమించి, సిద్ధావస్థకు చేరుకొని యుండెను. అయినా మనస్సు చంచలత్వము అంతిమ రూపమున కూడ నష్టము కాలేదు. అద్భుతమైన ఆత్మ విశ్వాసము, చిత్తనైర్మల్యము (నిర్మలము) తేజస్సు కనపడుచున్నవి. వినయము చరమ సీమ వరకు చేరుకొన్నది. హృదయమున లోతైన కరుణ, పూర్తిగా ఆత్మ సమర్పణ భావము ప్రచ్ఛన్నముగా స్రవంతి ప్రవహించుచున్నది.)

215. ఓ రామా! నేను నీ మేలును అభినందిస్తూ ఇట్లు చెప్పుచున్నాను. నీ ద్వారా ఏర్పాటు చేయబడిన నా విషయము, నేను చెడగొట్టినచో (నా కర్మల ద్వారా చెడగొట్టిన) వేదములు ఏమి చెప్పుచున్నవి. దీనిని గురించి నాకు చింత లేదు. కాని ప్రపంచము ఏమని అంటుంది. దీనిని గురించి నాకు పెద్ద చింత (యోచన, దిగులు) వున్నది. భావము ఏమనగా వేదములు దేనిని చెప్పుచున్నవో దానిని చెప్పినవి. బ్రహ్మ సర్వశక్తి సంపన్నుడు. సర్వనియంత. ఈ విషయము నిజము కూడ. కాని నా ఈ దశను చూచి, భగవంతుని విషయమున వేదములు

చెప్పినట్లు, ఇతరులు చెప్పినట్లు అసత్యము చెప్పినవి. భగవంతుడు సర్వనియంత కాదు. నేను నీవు నిర్మించిన విషయము చెడగొట్టితిని. అందువలన నేను నీకంటె ఎక్కువ శక్తివంతమైన వానినిగా రుజువు అయ్యెను. ఇందువలన నాకు నిన్ను ఎక్కువగా చెడ్డపేరు వచ్చినట్లు చేసినందుకు ఎక్కువుగా బాధ కల్గుచున్నది. నీవు వుండగా కూడ నేను సన్మార్గమున పయనించలేక పోయితిని. ఓ రామా! నీవు నా ఎడ ఔదాసీన్యము చూపినచో, రెండవ ప్రక్కనా పాపముల ప్రభావము నన్ను బాధించును. ఇట్లయినచో ఓ దీనదయాలుడా! దీనబంధు! ఇటువంటి పరిస్థితిలో నాకు రెండు ప్రక్కలనుండి దుఃఖాగ్ని బాధించు చుండును. అనగా నీవు రక్షించెదవు. లేనిచో పాపములు ఇంకను ఎక్కువయి నేను ఎక్కువ దుఃఖములను పొందవలసి వచ్చును నీకు. నీవు నా ఎడ చూపు ఉదాసీనతను చూచి నేను నా ఎదపైన వజ్రమును వుంచుకొన్నాను. అనగా వక్షస్థలమును (హృదయమును) వజ్రమున కంటె కఠినముగా చేసుకొన్నాను. అటు నీ ఔదాసీన్యము చూసి కలియుగమునను నిస్సహాయునిగా భావించి, అణచి వేసినది. నేను పరవశమున (కలియుగము వశమున) దుఃఖములను అనుభవించుచున్నాను. వాస్తవము, నిజము అయిన ఈ స్థితిలో దుఃఖములను అనుభవించని వారెవరు? ఎందుకనగా రక్షించువాడే రక్షించకపోయిన అత్యాచారులు స్వేచ్ఛగా అత్యాచారములను చేయుచుందురు. ఓ దయానిధి ఇటువంటి స్థితి నీ నిర్మలమైన యశస్సును రక్షించుకొనవలసియే యున్నది. నన్ను కాపాడవలసియే యున్నది. నాకు చివరి దినములయందు, నాదుర్దశను చూచి, నీవు నీ మనస్సును నా ఎడ ఉదాసీనముగా ఉంచి చూచుచూ వుండలేవు. అప్పుడు నీకు బాధ్యత ఏర్పడి యమదూతల నుండి నన్ను రక్షించెదవు. అజామిలుని రక్షించినట్లు కాపాడెదవు.

కర్మకాండ, వర్ణాశ్రమ ధర్మములను పాటించువారు సాధువులు, భక్తులు, సన్యాసులు, భోగులు అందరు తమ తమ మేలును చూసుకొనుటలో నిమగ్నులై యున్నారు. తమ కర్మానుసారము అంతిమ పదవి స్వర్గము మొదలగునవి పొందుచువున్నారు. నా ప్రక్క నుండి నీవు విముకుడవయినందున నాయటువంటి పిరికివాడు, నీచుడు, నిర్బలుడు, పతితుడను ఇంకెవ్వరు స్వీకరించెదరు? అనగా ఎవరును స్వీకరించరు. ఓ దయాలుడా! కాలము కలసివచ్చినపుడు అందరి దినములు మారిపోవును. మంచి దినములు వచ్చును. కాని నీవు లేనిదే నన్ను ఎవరును కోరరు. అనగా నీవు లేనిది నా దినములు అనుకూలముగా మారవు. ఓ రామా! నేను నీ ఒట్టు పెట్టుకొని, మనసా, వాచా, కర్మణా రాముడవగు నీవు స్వామియగు, నా మీద (తులసీదాసు) నీద్వారానే నిర్వహించిననే నెరవేరును.

216. యజమాని విముఖుడైనచో ముఖ్యముగా నౌకరు కూడ నష్టపోవును. నా విషయము ఎంత? అనగా రాముని ముఖ్యనౌకరును కాదునేను. నేను ఇప్పుడు డంకా చాటున చెప్పుచున్నాను. నేను సర్వనాశనమగుచున్నాను. రాముని తుచ్ఛమైన నౌకరు నాశనమగునని సర్వులకు తెలియవలెను. నాకు నా చెడు కర్మలవలన లోకమున ఎక్కడను చోటు లేదు. అనగా నాకు ఈ లోకం చెడిపోయినది. పరలోకము ఏమి ఆధారము (స్వర్గము లభించునో

లేక నరకము లభించునో తెలియదు) ఓ రామా! నేను నిన్ను ఆశ్రయించుచున్నాను. నేను కేవలము నీ నామము మాత్రమే ఆధారమును స్వీకరించి యున్నాను. అనగా నాకు లోకమైనా పరలోకమైనా రామనామము ఒకటే.

నాకు కర్మ, స్వభావము, కామ, క్రోధములు, మోహరూపమనెడి పెద్ద పెద్ద మకరములు మిక్కిలి భయంకరమున నన్ను గట్టిగా బంధించియున్నవి. ఓ మహారాజా! నన్ను ఈ బంధనము నుండి విడిపించువాడవు. కేవలము నీవు ఒక్కడవే. బంధించునవి చెడువాసనలు అనెడి కోట్లాది యోధులు వున్నారు. ఇందువలన ఓ ప్రభు! నన్ను రక్షించుము, రక్షించుము. నేను మూడు విధములైన పాపములు, మూడు విధములైన తాపముల చేత జ్వలించుచున్నాను. ఓ ప్రభు! అందరు కోపగించుకొనుట, విశ్వాసము, ప్రేమ కేవలము నీ ద్వారము దగ్గరవే యున్నవి. అనగా ఇతరుల ఎంతోమంది దేవీ దేవతలు వున్నారో వారందరు నీ ద్వారము ప్రక్కకే రెప్పలార్చక నీ ద్వారము ప్రక్కకే చూచుచున్నారు. నేను వారి దగ్గరకు పోవుటయు వ్యర్థము. ఇందువలన నేను నేరుగా నీ ఇంటి వద్దకు వచ్చితిని. వారివద్ద పోకుండుటకు మరొక కారణము, పాలుకాంచినమజ్జిగను కూడ జాగ్రత్తగా వూది - వూది త్రాగుచున్నాను. అనగా ఒక దఫా వీరిసేవా సత్కారము పూజా పఠనములు మొదలగునవి చేసి మోసపోయితిని. ఇందువలన మరల వారి దగ్గరకు పోవుటకు భయము కల్గుచున్నది. నేను నీ పేరు వల్లించి వల్లించి అలసిపోయితిని. నాకులము, జాతి, మానము, మర్యాద అన్నియును నష్టమయినవి. నేను కేవలము నీ ఎంగిలి ఆహారమునకు ఆశపడుచున్నాను. కేవలము నీ ఎంగిలి చేసిన ముక్క (భాగము) కోరుచున్నాను. నేను పాలలో స్నానము చేయకోరలేదు. అనగా ఐశ్వర్యము నందు అభిలాష లేదు. నేను కేవలము కృపాదృష్టికి ఆకలి కల్గివున్నాను. ఇది లభించిన పూర్తిగా తృప్తుడను అగుదును. నాకు ఇంకేమియును వద్దు.

నేను వేరొక చోటికి వెళ్ళి అనగా ఇతర దేవీ దేవతల వద్దకు వెళ్ళి మంచి మార్గమున, సత్కర్మ చేయుచూ వుండకోరుటలేదు. నాకు ఏ విధమైన ధర్మము, కర్మలు, పూజా పఠనలు మొదలగునవి చేసి నామేలు చేసుకొన ఆశలేదు. నేను నీ ద్వారము దగ్గర తిరస్కరించబడినప్పటికి పడివున్నాను. అంటే ఇక్కడ శుభమే కల్గును. ఇతర చోట్ల అసంభవము ఎప్పుడో ఒక దఫా నీకు నాపైన దయ కల్గును. నేను ఇదియే తెలుసుకొని మనస్సుకు నచ్చ చెప్పుకొన్నాను. నేను నా స్వామి రామునితో విషయమంతయును చెప్పి, ఇప్పుడు రాముడు నన్ను ఉద్ధరించును. నాకు ఏ చింతయునూ లేదు అని నిశ్చింతగా వున్నాను.

(తులసీదాసు తన కర్తవ్యమును పూర్తి చేసియున్నాడు. రామునికి చెప్పడము, అయన చెప్పినది వినడము అంతయును అయినది. నన్ను ఉద్దరించేవంతు రామునిది ఈ పదము (గేయము) నందు ఒక అద్భుతమైన మొండితనము, నిర్లిప్తత మార్మికతను ఉత్పన్నము చేసెను. ఇపుడు వినయ పత్రిక తన చివరి భాగము చేరుకొనుచున్నదని తెలియవచ్చును.

వృద్ధి (త్రాగుట ఐశ్వర్యమును పొందుట).

217. ఓ రామా ఒకవేళ నేను కోట్లకొలది కల్పముల వరకు ప్రయత్నించిననూ నేను చక్కబడను. నీవు చక్కదిద్దిన నాల్గింట ఒక భాగము - రెప్పపాటు కాలములోనే అగును. ఓ కృపానిధి! నీవు స్వయముగా మహా చతురడవు. నేను నీకు ఏమి చెప్పవలయును? అనగా ఏమి చెప్పుదును (నీవు అన్నియును తెలిసినవాడవు) నేను మాణిక్యము అయిన అమూల్యమగు నా ఆయుస్సుకు బదులుగా విషయవాసనలనెడి రేగు పండ్లను కొంటిని. అనగా నాకు మిక్కిలి ఎక్కువ విలువైన ఈ మానవ శరీరము ఆయుస్సు రాముని భక్తి కొరకు లభించి యుండెను. కాని నేను వీటికి బదులుగా రామభక్తిని కొనక విషయవాసనలనెడి రెండు చిల్లిగవ్వల రేగుపండ్లు కొంటిని. నా అమూల్యమైన ఆయుస్సును విషయ వాసనలయందు నష్టమును చేసుకొంటిని. (దీని ఫలితము ఇట్లు అయ్యెను. నామనస్సుమలిన మయ్యెను) దాని పైన విషయ వాసనలనెడి మురికి వ్యాపించినది. కలియుగము యొక్క పాపములవలన నాకర్మలు ఇంకను పుష్టి చెంది (భయంకరమై) పెంపొందెను. అనగా భయంకరమైన కుకర్మలు చేయసాగితిని. నేను నా ఈ నాలుకతో నీ నామమును జపింపలేదు. నాద్వారా ఎప్పుడును పొరపాటుననైనా మంచి చేయబడలేదు. నేను నా బాల్యావస్థయందు కూడ ఎప్పుడైనా మంచి ఆట (రాముని చరిత్రకు సంబంధించి) కూడ ఆడలేదు అనగా మంచి మనస్సుతో ఒకమంచి పని చేయలేదు.

ఒకవేళ ఎప్పుడైనా ఒక మంచి పనిచేసి యుండినచో చూడుము. నేను కూడ మంచి కార్యము చేసితినని గర్వముతో చెప్పెదను. మంచి పని చేసి ప్రపంచమంతట దండోరా వేయించి తిరుగుచుంటిని. నేను ఈ మంచిపని చేసితిని. అనగా మంచి పనిని గురించి అందరికి చెప్పుచూ తిరుగుచుంటిని. నేను చేసిన చెడ్డపనులను దాచుచూ వుంటిని. ఇట్లు ప్రయత్నించితిని అనగా మంచి పనులను చెప్పుచూ తిరుగుచూవుంటిని. పాపకర్మలను దాచుచుంటిని. నేను నామనస్సునందు రాగ, క్రోధ, ద్వేషములు మొదలగు భావములను బాగుగా పోషించితిని. నేను స్వేచ్ఛగా ఇంద్రియముల భక్తిని సేవించితిని. అనగా ఇంద్రియములు చెప్పిన ప్రకారము బానిసవలె పోషింపబడితిని. ఇంద్రియములకు ఇష్టమైన పనులు చేసితిని. నేను సదా ఇంద్రియములకు దాసుడనై యుంటిని.

నేను నా భవిష్య, భూత, వర్తమాన కర్మలను గురించి అందాజు వేసుకొంటిని. అనగా నేను భూతకాలమున ఏ శుభకర్మలను చేయలేదు. నేడు చేయుటలేదు. భవిష్యత్తులో చేయుదునని ఆశలేదు. ఈ అందాజు వలన, నాగతి ఏమగునో తెలుసుకొన్నాను. ఎందుకనగా నేను ఎప్పుడును మంచి పని ఏదియును చేయలేదు. తులసీదాసుకు రాముని ప్రేమ, విశ్వాసమున్నదని ప్రపంచము చెప్పుచున్నది. ప్రపంచము ఇట్లు సత్యము చెప్పినా, లేక అసత్యము చెప్పినను ఏది ఐననూ సరే. అనగా ఈ విషయము సత్యమో, అసత్యమో, కాని తులసీదాసుకు మాత్రము ఒక రాముడే ఆధారము.

218. ఓ రామా! నేను చెప్పలేకయున్నాను. చెప్పకుండా వుండలేక యున్నాను. నేను నీకు ధన్యవాదములు తెలుపుచున్నాను. ఎందుకనగా పెద్దవారి ఎదుట నా పేదరికమును గురించి చెప్పిన చాలా సుఖములు లభించును. ఇందుకు చెప్పాచున్నాను. అనగా పెద్దవారు విని కొంతవరకు సహాయము చేయుదురని విశ్వసించుచున్నాను. నేను నా స్వామి గొప్పదనమును నేను నా లఘుత్వమును, తుచ్ఛమును అనగా స్వామి పవిత్రతయును, నాపాపముల దుష్టత్వమును ఆధిక్యతను చూచుచున్నాను. ఈ ఇరుపక్షముల పెద్ద వ్యత్యాసమును తెలుసుకొని నా మనస్సు సంకుచితమగుచున్నది. భీతిల్లుచున్నది. ఇటువంటి యజమాని ఎదుటికి ఏ ముఖమును పెట్టుకొని వెళ్ళెదను? అని భయపడుచున్నాను. నా స్వామి చాలా యోగ్యుడు. తగిన న్యాయము చేయును అని వినిన వెంటనే నా మనస్సు ఆయన వద్దకు వెళ్ళుచున్నది. ఓ నాథా! నేను నీకు తగిన న్యాయము చేయుదునని వినిన వెంటనే, నీచుడు కూడ నీవద్దకు వచ్చిన గుణగానము చేయును, హస్తములు జోడించి తలవంచి పోయిన, నీవు అతనిని కూడ నీ శరణులోనికి తీసుకొని నెరవేర్చెదవు. నీ ప్రేమ చాతుర్యము పద్ధతి ఇదియే. అనగా నీవు ప్రేమరీతిని నిర్వమించుటలో చతురుడవు. నీ ఆస్థానము లోనికి గర్వముగా పోవు వారికి వినష్టమగును. హాని అగును. ఇటువంటి రాజుగారి ఆస్థానము ఇది. ఈ ఆస్థానమున పేదరికము, వినయము ప్రదర్శించినచో ప్రజలకు క్షేమము అనగా అన్ని విధములుగ క్షేమము అగును. నీ శరణులో గర్వమును త్యజించి, దీనులుగ పేదవారు అయి వెళ్ళిన శుభములు కల్గును. రావణుని బలవంతుడు, విభీషణునివలె నిర్బలుడును ఎవరును లేరు. ఈ ఇద్దరి ఎడనీ ప్రవర్తన వలన, నీవు ప్రేమ అధికారమును ఎంత గొప్పగా భావించెదవో అనగా ప్రేమకు వశీభూతుడవయి, భక్తుని రక్షించెదవు. అతనిని బాధించువారిని సర్వనాశనము చేసెదవు. ఈ నీ ఆస్థానమునకు వచ్చి ఎవడు చతురుడగునో అతడు వేలమూర్ఖులతో సమానము అనగా మహామూర్ఖుడగును. ఇక్కడ నిరాడంబరమగు సరియగు విషయాలను ప్రకటించినచో గొప్ప మహాత్ముడుగా ప్రకటింపబడును. మలినత్వము తొలగిపోవును. పాపములు, దుర్గుణములు దూరమగును. భావము ఏమనగా సరిఅయిన నిష్కపట స్వభావముతో రాముని ప్రార్థించిన సర్వపాపములు, తాపములు తొలగిపోవును. మనస్సులో సదా గ్రద్ధయగు జటాయువు, రాయిగా అయిన అహల్య, అడవిజాతి శబరిని స్మరించిన రాముడు వీరిని స్నేహమును చూచియే తన వారినిగా స్వీకరించెను. స్వామి అగు రాముని ఎడ, నా ప్రేమ యందు కొరత ఏర్పడదు. భావము ఏమనగా వీరిలో గర్వము లేకుండెను. రాముని ఎడ ఎనలేని ప్రేమ వుండెను. ఇందువలననే రాముడు వీరిని స్వీకరించి యుండెను. ఈ ఆలోచనయే రాముని ఎడ ప్రేమ కల్గించుట తక్కువ చేయదు.

ఓ రామా! నీపేరు కల్పవృక్షమువలె కోరికలనన్నింటిని పూర్తిచేయును. ఓ కరుణానిధి! సీతాపతి రాముని భక్తి అనెడి గంగాజలమునందు చేపగా నుండునట్లు తులసీదాసునగు నేను ఒక వరమును మాత్రమే అడుగుచున్నాను. అనగా ఏ మాదిరి అయితే చేప జీవితము

(ఈ గేయమున తులసీదాసు మరల తన లఘుత్వమును, రాముని గొప్పతనమును వర్ణించి రాముని భక్తిని కోరెను. గర్వమును వదలి భగవంతుని శరణుజొచ్చిన వారి యోగక్షేమములు, భగవంతుడు తప్పక చూచును.)

219. ఓనాథా! నీవు నీ భక్తుల మనస్సులోని విషయమును బాగుగా తెలుసుకొనగలవు. నా బుద్ధి అనెడి స్త్రీకి నీవే ఆధారము. ఆమె కూడ నీ ప్రేమనే వ్రతముగా ధరించియున్నది. పతివ్రత స్త్రీవలె సదా నీ ప్రేమయందును, చింతన యందు నిమగ్నమైయుండును. తన దుష్కర్మల సత్కర్మలవలన నాకు మంచి చెడు సాంగత్యము చేయవలసివచ్చెను. ఇప్పుడు నేను ఇతరుల కర్మలను స్వయముగా నా కర్మలను పరీక్షించితిని. అనగా తన ఇతరుల కర్మలను తులన చేసియున్నాను. నా మేలు చేయుటకు రామునివంటి మంచి వ్యక్తి సిద్ధముగా నున్నాడని తెలిసినా ఇటువంటి నీచునకు ఏ మాత్రము చింతయును సందేహమును లేదు. నామేలు చేయుటకు నా స్వామి సిద్ధముగా నున్నాడు. ఇంక చింత సందేహమును ఎందుకు చూపెట్టవలెను. ఓ సీతాపతి రామా! ఈ విషయమున నీ సత్యమున ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. భావము ఏమనగా నేను నా స్వామి ఔదార్యము చూచి కర్మ ఫలముతో నిండిన నిష్కాముడనై, నిశ్చింతగా కూర్చొనియున్నాను. రాముడు నాకు తప్పక శుభమును కల్గించును. దీని నమ్మకము నాకు ధృడముగా నున్నది.

ఓ రామా! నీవు జ్ఞానమునకు, జిహ్వకు స్వామివి. అంతర్యామివి బయట, లోపల అంతయును ఎరుగుదువు. మరలా నేను నా హృదయములోని విషయమును, సుఖమును ఎట్లు దాచగలను? తులసీదాసు నీవాడు. నీనుండియే తులసీదాసుకు శుభము కల్గును. ఒకవేళ నేను ఈ విషయము దాచియుంచిన అనగా అసత్యము చెప్పిన నెయ్యిలో పడిన ఈగవలె అగుదును. అనగా ఈ విధముగా నెయ్యిలో ఈగపడిన బయటకు రాలేదు. విలవిల తన్నుకొని చనిపోవును. అదే మాదిరి నేను ఈ ప్రపంచములోని విషయ వాసనల యందు చిక్కుకొని వున్నాను. విలవిల తన్నుకొని ప్రాణము విడుచుటకు అందులోనే పడివున్నాను. అనగా నాకు ముక్తి ఎప్పటికి కలుగదు. ప్రపంచమంతయు నన్ను నెయ్యిలో పడిన ఈగకు సమానముగా తిరస్కరించుచూ వున్నట్లు తెలుసుకొని నానుండి దూరముగా నుండుము.

(ఈ గేయమునందు అనన్యతను గురించి సంకేతమున్నది.)

220. ఓ మనసా! మొదట నీవు నా మాట వినుము. నీకు బాగుగా నున్నది అదే చేయుము. నాల్గు నేత్రములు (రెండు బయట - రెండు జ్ఞాన నేత్రములు లోపలనున్న దృష్టి)తో ముల్లోకముల యందు చక్కగా చూడుము. తరువాత చెప్పుము. మూడు లోకములలో,

మూడు కాలములయందు భగవంతునికి సమానమగు హితమును కోరువాడు మరొకడు వున్నాడా? (లేడు); నీవు ఈ శరీరమనే ఇంటి యందువుండి క్రొత్త క్రొత్త ప్రేమల అనుభవమును చూచితివి. కపట ప్రేమను చూపెట్టువారిని చక్కగా కనిపెట్టితివి. అవసరమప్పుడు వారి ప్రేమ యొక్క నిరుపయోగము బయట పడును. అనగా ఎవరు కూడా సరియగు ప్రేమించువారులేరు. అందరు స్వార్థమునకు వశులై ప్రేమించువారు లేరు. ఆపద లేర్పడినపుడు సహకరించరు. మిత్రుల సమాజము నందు, సదా మోసము యొక్క లేనా-దేనా (ఇచ్చి తీసుకొనుట) వుండును. మిత్రులందరు మోసగాండ్రు. నీనుండి ఈ పని ఆటంకముగునో అప్పుడు వారు నీ పాదములయందు వ్రాలెదరు. నీతో కలిసెదరు. పని అయిన తరువాత లేక నీ పనిపడినచో నిన్ను ఒకమాట అడగరు.

నీవు తెలివిగల దేవతలను బాగుగా ఎరుగుదువు లేక లేదో? కోట్ల కొలది రెట్లు తీసుకొందురు. అనగా జపము, తపము, యజ్ఞము మొదలగువానియందు ఎక్కువ శ్రమ చేయించెదరు, అప్పుడు వారికి ఒక రెట్టింపు అనగా కొద్దిపాటి వరమునిచ్చి వెళ్ళిపోయెదరు. త్రోసిపుచ్చెదరు. వాస్తవము ఏమనగా రాముడు లేకయే సర్వకర్మల ధర్మములు చేయుట వ్యర్థము బూడిదలో పన్నీరు, ఊసర క్షేత్రమున వర్షము గురియుట నిష్ఫలమగును. ఏది అయితే ఆది, మధ్య, అంతమున మేలు వుంచుకొనును. అందరి మేలు కోరును. అతని యశస్సు వేదముల యందు వ్యాపించియున్నది. ఇటువంటి సీతాపతి రామునికి సమానము శీలము కేంద్రముగా కలవాడు మరొకరు ఎవరును లేరు. ఓ మూర్ఖ నీవు ఇటువంటి స్వామిని మరచి పోయితివి. మరలనీకు రేపు సుఖము ఎట్లు లభించును? శాంతి చేకూరును?

ఆ రాముడు జీవితములకు జీవనము. ప్రాణులకు హితము కోరువాడు. ప్రియతముడు, నీచులను పవిత్రులను చేయువాడు, ఇటువంటి రామునిని నీవు అనాదరము చేయుచున్నావు. ఓ తులసీదాసు! కృపగల కోసల నరేశుడు రాముడు చిత్రకూటమున నీకొరకు లీలలు చేసియుండెను. అతనిని నీవు హృదయమున స్మరించుము.

(తులసీదాసు స్వార్థపూర్ణమును గమనించెను. గృహస్థుల ప్రేమను స్వార్థమయినను మన్నించెను. భగవంతుడు మంచి జన్మ ఇచ్చును. జీవితమును సఫలము చేయును. అంతమున ముక్తి కల్గించును. ఒక దఫా తులసీదాసు చిత్రకూటమున ధ్యాన నిమగ్నుడై కూర్చొనియుండెను. ఇంతలోనే తన ఎదుట ఇద్దరు అపూర్వమైన రాజకుమారులు గుఱ్ఱములపైన కూర్చొని ఒక జింక వెనుక వేగముతో పోవుచుండగా చూచెను. తులసీదాసు ధ్యానమునందు విఘ్నము కలుగగా కన్నులు క్రిందికి వాల్చి కూర్చొని యుండెను. కొంతసేపైనా తరువాత హనుమంతుడు దర్శన మిచ్చి అడిగెను. నీవు రామలక్ష్మణులను చూచితివా లేదా? తులసీదాసు నిరాకరించగా హనుమంతుడు - ఇప్పుడే ఇద్దరు రాజకుమారులు వెళ్ళిరి. వారే రామలక్ష్మణులు. ఇది విని తులసీదాసు చాలా పశ్చాత్తాపపడెను).

221. ఓ నాథా! నేనునా శరీరమును పవిత్రముగా వుంచుకొన్నాను. (చెడు కర్మలు చేయను. నా మనస్సులో నిన్ను ప్రేమించవలయునని కోరికవున్నది. నానోటి ద్వారా ఇదియే చెప్పుచున్నాను. సీతాపతి రాముని సేవకుని, కాని కారణమేమో గాని, నా దురదృష్టము. రామునితో ప్రేమ సంబంధము సరిగా పొందిక కాలేదు. నేను నీటిని కోరుచున్నాను. కాని అగ్ని లభించుచున్నది. అమృతమును పొందకోరుచున్నాను. కాని అది విషమగుచున్నది. అనగా శీతల రామభక్తి అనెడి జలమునకు విరుద్ధముగా విషయాగ్ని లభించుచున్నది. గర్వము చేత అమృత రూపమున సత్కర్మ కూడ విషము వలె ప్రాణ హానిని కల్గించునది అగును. దాహమును కల్గించుచున్నది. భక్తులు, జ్ఞానులు కలియుగమున చెడు వర్తనలను గురించి వారు పరమార్థ కార్యములను కానివ్వరు. అది అంతయును సరియే నాకు సూర్యుడు (పగలు) రాత్రి భేద జ్ఞానము లేదు. నాకు అజ్ఞానము చేత ఏది చేయవలెనో ఏది చేయకూడదో తెలియకున్నది. ఇంత అజ్ఞాని అయితిని.

కలియుగము నన్ను మూర్ఖునిగా భావించి అడవి పులి నెయ్యిని నా కన్నులకు లేపనము చేయకోరుట అనగా నేను అడవి పులి పాలు పితికి వాటిని కాంచి నెయ్యి చేసుకోవలెను. కాని ఇది అసంభవము. ఎందుకనగా పులి దగ్గరకు వెళ్ళగానే నన్ను తినును. భావము ఏమనగా మాయపులి విషయ వాసనలు దాని పాలు అనగా విషయ వాసనల సారము కలియుగము వాసనల ద్వారా నా అజ్ఞానమనెడి చీకటిని దూరము చేయుటకు చికిత్స చెప్పుచున్నది. నేను అంధత్వమను చీకటి రోగము యొక్క వికారము చేత కూడిన చికిత్స విని మనస్సున ఇట్లు ఆలోచించుచున్నాను. ఈ చికిత్సను ఎట్లు చేయవలయునో? పులి నెయ్యి ఎట్లు సంపాదించగలను? ఇది ఆలోచించి నా హృదయములోని బలమంతయు, బుద్ధి అంతయును నష్టమగుచున్నది. అనగా నేను చాలా నిరుత్సాహపడుచున్నాను. భావము ఏమనగా ఆలోచించి ఈ నిర్ణయమునకు వచ్చితిని. కలియుగమున చెప్పబడిన ఈ ఉపచారము నా వశములో లేదు. ఇటువంటి పరిస్థితిలో నేను ఏమి చేయుదును. కాని నా ఆపద విషయమును నా స్వామికి చెప్పుటలో నాకు సంకోచము కల్గుచున్నది. నేను చెప్పు విషయము అనగా నా విషయము సారహీనము కాకుండుగాక. అనగా స్వామి మొదటివలె నా విషయమున ధ్యానము చేయక వుండుగాక ఓ నాథా! నేను నిన్ను అభినందించుచున్నాను. కృపయుంచి కలియుగమును తన దగ్గరకు పిలిచి మందలించుము. అది నన్ను తులసీదాసు వంటి మూర్ఖుని గురించి ధ్యానముంచుట వదలి వేయవలెను. అనగా నన్ను చెడుమార్గములో పోవు సలహా ఇచ్చుట నిలిపివేయుము. నన్ను దారి తప్పించి పోనివ్వకుండ వున్నంతవరకు నా మనస్సు నీ ప్రేమయందు నిమగ్నము కాలేను.

(భక్త సమూహము నాకు (అజ్ఞానికి) యోగ సాధన ఉపదేశము ఇచ్చుచున్నారు. కాని యోగ సాధననాకు ప్రాణ ఘాతుకము అసంభవమైనది. అడవి పులి నెయ్యిని పొందుట అసంభవమే మరి. అజ్ఞాని ఎట్లు యోగసాధన చేయగలడు? అనునది రెండవ అంశము. ఇక్కడ ప్రపంచము పులి మాయకు ప్రతీకలు యోగము ద్వారానే మాయను వశములో వుంచుకొనవచ్చును).

222. ఓ దయానిధి! నేను నీ దగ్గరకు రావలెనని ప్రయత్నించినట్లల్లా దూరమగుచూ వున్నాను. అనగా నీ భక్తి సంపాదించుకొనుటకు చేయు నా ప్రయత్నములన్నియును నిష్ఫలమగుచున్నవి. ఓ రామా! నీవు నాల్గు యుగముల యందు (సత్యయుగము, త్రేతాయుగము, ద్వాపర, కలియుగము నందు) సదా ఒక రసము తోనే (భావముతోనే) వచ్చియున్నావు. అనగా నీ స్వభావమున (పతితుల ఉద్ధరించుట మొదలగునవి) ఏ మార్పునూ రాలేదు. నేను కూడా సదా నీ వానినిగా వుండుటకు ప్రయత్నించుచూ వున్నాను. అయినను పాపములు, అవగుణములతో నిండి యున్నాను. భావము ఏమనగా నేను సదా పాపాత్మున్ని. దుర్గుణములు కలవానిని అయినా నీవు నన్ను స్వీకరించుచూ వచ్చితివి. (బ్రహ్మ - జీవుని సంబంధము శాశ్వతమైనది) కాని నేను మాయ ద్వారా ఉత్పన్నమైన అజ్ఞానము చేత దారి తప్పి తిరుగుచుంటిని నీచమైన కలియుగము నన్ను సాధనలోనే తన కపటముల ద్వారా మోసగించెను. అనగా నన్ను విషయ వాసనల యందు (వలయందు) ఇరికించెను. నేను జీవరూపమున స్వర్ణమువలె నిర్మలముగా, కాంతియుతముగా నుంటిని. ఈ నీచుడు నాపైన విషయ వాసనల బురద చల్లి నన్ను తగరమువలె (రంగులు పూసుకొన్నవానివలె) చేసెను. రాజుగా ఉన్న నన్ను బిచ్చగానిగా చేసెను. బుద్ధిమంతుడుగా ఉన్న నన్ను మూర్ఖునిగా చేసితివి. భావము ఏమనగా నేను మొదట శుద్ధమైన సచ్చిదానంద స్వరూపునిగా వుంటిని. ఇది నన్ను పథభ్రష్టుని చేసి, పతితునిగా, అజ్ఞానినిగా చేసెను. అప్పటినుండియే నేను నీ అన్వేషణతో, లెక్క లేనన్ని పర్వతముల, వనముల యందు దారి తప్పి తిరుగుచూ వున్నాను. అగ్ని లేకయే కాలిపోవుచూ వున్నాను. అనగా నా మనస్సుకు ఎప్పుడును శాంతి లభించలేదు. మనస్సు ఎల్లప్పుడు అశాంతితో వుండెను. కాని నేను చిత్రకూటము పోయినప్పుడు అక్కడకు వెళ్ళి కలియుగము యొక్క చెడు ప్రవర్తనలను చూచితిని.

ఇప్పుడు నేను నా భయముతోనే అనగా నేను చేసుకొన్న చెడు కర్మల ఫలితమువలన భయము చేత భీతిల్లుచున్నాను. ఓనాథా! నేను నీ ఎదుట, తలవంచి, హస్తములను జోడించి, ఓ ప్రభూ! నా కథను వినుము. గుర్తుపట్టిన దొంగ జీవున్ని చంపును అని చెప్పితివి. ఎప్పుడైనా ఒక వ్యక్తి దొంగను గుర్తెరిగిన ఆ దొంగ తనను పట్టించునేమో అను భయముతో ఆవ్యక్తిని చంపివేయును. నేను ఇప్పుడు ప్రభువుతో ఫిర్యాదు చేయునప్పుడు నా కర్తవ్యము నుండి విడుదల పొందితిని. అనగా ఇప్పుడు నీ పని కలియుగము అనెడి దొంగను పట్టుకొని, నన్ను రక్షించుము. లేనిచో ఇతడు నన్ను చంపివేయును

(ఈగేయమున తులసీదాసు కలియుగముతో బాధపడి భగవంతునితో తన మనస్సులోని శంకను వ్యక్తము చేసి, రక్షించుమని ప్రార్థించెను. మొదట జీవుడు బంగారువలె నిర్మలముగా, పవిత్రముగా ప్రకాశవంతమై సచ్చిదానంద స్వరూపుడుగా నుండెను. కాని మాయవచ్చి అతని ఈ రూపమును మలినము చేసెను. మొదట మాయ శరీర ఇంద్రియముల, మనస్సుపైన రాజువలె శాసనము చేయును. మొదట దాని బుద్ధి చైతన్యమై యుండును.

కాని ఇప్పుడు అది మనస్సు, ఇంద్రియములకు బానిస అయ్యెను. మొదట బుద్ధి చైతన్యమై ఈశ్వరుని చింత చేయుచుండెను. కాని ఇప్పుడు మూర్ఖుడయి, విషయ వాసనల యందు నిమగ్నమయివున్నది. తులసీదాసు ఒక దఫా చిత్రకూటమున తపస్సు చేయుచుండెను. కాని ఇప్పుడు మూర్ఖుడయి, విషయవాసనలయందు నిమగ్నమయివున్నాడు. తులసీదాసు ఒక దఫా చిత్రకూటమున తపస్సు చేయుచుండెను. ఇది చూచి కలియుగము చింతించెను, బాధపడెను. అది అతనిని భయపెట్టెను. దబాయించెను. కాని హనుమంతుని కృపచేత, అది అతనికి ఏమి హానియు కల్గించలేకపోయెను. తులసీదాసు ఆ సందర్భమును పేర్కొని కలియుగము వచ్చి పగతీర్చుకొనునేమో అని సంకేతము చూపెట్టెను.)

223. ఓ రామా! ఈ దినము ప్రతిజ్ఞ చేసి గర్వముతో నీ ద్వారమువద్ద పడివున్నాను. అనగా సత్యాగ్రహము చేసియున్నాను. నీవు నా వాడవు అని చెప్పనంతవరకు నేను జీవితమంతయును ఇక్కడ నుండి లేచిపోను. నేను ఈ విషయమున నీమీద ఒట్టుపెట్టుకొని నిశ్చింతగా వున్నాను. అనగా నీ ప్రతిన నాద్వారా అధిగమింపజాలదు. నా కోరిక నెరవేరనంతవరకు నేను అక్కడినుండి తొలగను. యముని దూతలు నాకు దెబ్బకొట్టి అలసిపోయిరి. కాని నేను నరక ద్వారము దగ్గరనుండి లక్షల ప్రయత్నము చేసినను తొలగి పోలేకపోయితిని. నేను ఈ ప్రపంచమున అనేక దఫాలు విభిన్న యోనులయందు జన్మము పొంది పొంది గర్భావస్థలోని అసహ్యమైన యాతన (బాధ) పొందితిని. అప్పుడు నరకము నుండి అవమానింపబడి వెడలనంపబడితిని. దీనివలన నీకు నా పట్టుదలను గురించి తెలిసియుండును. భావము ఏమనగా భయంకరమైన పాపములను చేసితిని. నరకమును అనుభవించితిని. కాని చివరకు నరకమువారు నావలన బాధపడిరి. ఇతడు చాలా హఠము కల మనిషి మాటిమాటికి వచ్చుచున్నాడు. చివరకు నేను తెలియకనే సత్కర్మ ప్రభావము చేత నరకము నుండి వెలుపలకు పంపబడితిని. ఇందువలన నా హఠములను గురించి నీకు తెలిసియుండును. నేను ఎంతో హఠము కల మనిషిని, సిగ్గులేని వాడను నీవు దెబ్బకొట్టి త్రోసినను కూడ నీ ద్వారము వద్ద నుండి తొలగను.

నేను చాలా పట్టుదల గలవాడను. నా వస్తువుకొరకు గర్వపడుచున్నాను. ఆ వస్తువు తీసుకొనియే వెళ్ళెదను. నీవు దయామయుడవు. ఇందువలన నీవు నా కోరికను తీర్చవలసియే యుండెను. నేను బలికావలసియున్నది. ఇప్పుడు నా వస్తువు ఇచ్చుటకు ఆలస్యము చేయవద్దు. నేను గ్లాని చేత కరగి పోవుచున్నాను. ప్రపంచము నన్ను పరిహసించుచున్నది. రాముని భక్తుడనయి కూడ ఇన్ని కష్టములు అనుభవించుచున్నాడను. ఒకవేళ నీవు ప్రత్యక్ష రూపమున ప్రకటన అనగా అందరి ఎదుట నన్ను స్వీకరించుటకు సంకోచము అయినచో ఎందుకనగా నేను చాలా అపరాధిని. కృపతో నన్ను నీ వానినిగా స్వీకరించుము మనస్సులో. ఎందుకనగా నేను కలియుగమును చూచి భయకంపితుడను అగుచున్నాను, భయము

కలియుగమునకు నన్ను పీడించు సాహసము వుండదు. ఎందుకనగా అది రామభక్తులనుండి దూరముగా నుండును.

(తులసీదాసు వంటి నేరస్తుని స్వీకరించిన లోకమాన్యతను ఉల్లంఘించినట్లు అగును. ఎందుకనగా లోకమునుబట్టి నేరస్థునికి దండన లభించవలసియున్నది. తులసీదాసు సేవన సేవక స్వభావము (దాస్యభావము) భక్తిని చేయుచుండిరి.)

224. ఓ రామా! నీవు నన్ను స్వీకరించితివి అను విషయము నాకు ఎప్పుడు తెలియును అనగా నా మనస్సు విషయ వాసనల మీదనుండి విరక్తి కల్గునపుడు ఈ మనస్సు తన స్వభావము నందు నిమగ్నమైయుండును. ఆ స్వభావము అనగా దృఢమగు భావమును, తన కష్టములను త్యజించి నిష్కపటమగు భావముతో నీతో సహనముగా ప్రేమించును. అపుడే నేను నీ చేత స్వీకరింపబడినట్లు భావింతును. ఈ మనస్సు పుత్రుల యెడ ప్రేమను చూపును. మిత్రుని యందు విశ్వాసము కల్గియున్నది. రాజుగారి భయము చేత అనగా రాజుగారి దండనకు భయపడుచున్నది అదే మాదిరి. ఇది నిన్ను ప్రేమించిన, నిన్ను విశ్వసించును. నీవు రాజు దండమునకు భయపడుదువు. తన స్వార్థమును, సదా నీ స్వార్థముగా భావించును. ఏ విధముగా తన నాల్గు స్వార్థములు ధర్మ, అర్థ, కామ, మోక్షములను సంపాదించకోరును. అదే మాదిరి నీ స్వార్థము, శక్తి, శీలము, సౌందర్యము స్థాపించవలెనని కోరిక వుండును. చాతక పక్షి స్వాతి నక్షత్ర జలమును సంపాదించుకొనుటకు, తన దృఢమైన ప్రతిజ్ఞయందు నిశ్చలముగా నుండును. నీ యెడ ప్రేమ, స్నేహము వుండవలెను. అప్పుడు నీవు నన్ను స్వీకరంచినట్లు భావించెదను.

ఇప్పుడు నా మనస్సు ఆదరణ పొంది మిక్కిలి సంతోషముగా నుండును. అవమానింపబడినప్పుడు దుఃఖముతో జ్వలింపబడును. హాని లాభము, సుఖము దుఃఖమునందు మంచి చెడు నందు అందరి ఎడ సమాన భావముతో నుండును. అనగా వాటిని పొంది వికలత్వము, ప్రసన్నత కలుగక సమరనుడనయి వున్నాను. మరియు కలియుగము యొక్క చెడు ప్రవర్తనలను త్యజించెదను. అప్పుడే నీవు నన్ను స్వీకరించితివని నేను తెలుసుకొందును. భగవంతుని గుణములను విని, నా మనస్సు మిక్కిలి సంతోషమును పొందును. నేత్రములనుండి ఆనంద భాష్పములు కురియును. తులసీదాసు రాముని వాడయినాడని సంతోషము కల్గును. అప్పుడు నీ ప్రేమ నా యందు వున్నట్లు తెలిసి హృదయము ఉప్పొంగి ఆనందము వ్యాపించును. అనగా నాకు బ్రహ్మానందము లభించును.

(ఈ గేయము నందు రామ భక్తుల లక్షణములు చెప్పబడినవి. భేదబుద్ధి లేక సమభావము కల్గియుండవలెను సాత్విక భావము వుండవలెను. తులసీదాసు మొదటి నుండి చివర వరకు రాముడు స్వయముగా స్వీకరించకోరెను. భక్తునికి రాముడు తనను స్వీకరించినట్లు ఎట్లు తెలియునని తులసీదాసు ఈ గేయమున వర్ణించెను. దీనికి సమాధానము పొందును. విరక్తుడయి, సమద్రష్ట అయి రామునికి సరియగు భక్తుడగును. భక్తుని ఈ లక్షణములు ఈ గేయమునందు చెప్పబడినవి).

225. ఓ రామా! నీవు నాకు, చేపకు నీరు ఎంత ప్రియము ప్రీతియో అంత ప్రేమను కల్గించుము. నీయెడ నాకు ప్రేమ యుండవలెను. నీయెడ నాకు భక్తి ప్రేమలు వుండవలెను. జీవునికి సుఖజీవనము, సర్పమునకు మాణిక్యము, లోభికి ధనము ప్రీతిగా నుండును. ఎటులైన యువకునికి, యౌవనమునందున్న యువతి సహజముగా మిక్కిలి ఎక్కువ ప్రీతిగా నుండును. అటులనే కరుణానిధి! నా మనస్సునందు నా పవిత్రమైన ప్రేమ పుష్టికరమై ప్రేమ కోరికను కల్గించుము. అనగా నేను తులసీదాసుడను కూడ వీటి అన్నింటివలెనే దృఢమైన ప్రేమను కల్గియుండవలెను. ప్రతి జీవుని ఘట, ఘటవాసి అని వేదములు చెప్పుచున్నవి. భగవంతుడవగు అందరికి మనస్సు కోరిన వస్తువులను ఇచ్చెదవు. అనగా అందరి మనస్సులోని కోరికలను తీర్చెదవు. ఓ దయానిధి! నేను నీ శరణుజొచ్చుచున్నాను. నేను తులసీదాసుడను దీనుడను. నేను నా మనస్సు కోరిన వస్తువును దానముగా ఇచ్చి అనగా తులసీదాసుకు ప్రాణము వలె ప్రియుడవు కావలెను.

(ప్రేమ క్షేత్రమున మీనమును (చేపను) నీటి ఎడ అనన్యతా భావము ఆదర్శముగా స్వీకరించడమైనది. మీనము ఒక క్షణ కాలములో నీటినుండి వేరుగా ఉంచిన విల విల తన్నుకొని చనిపోవును.)

226. ఓ రఘువీరా! ఎప్పుడైనా దయతో నా ప్రక్కకు చూచితివా? చూచెదవా? నేను మంచివానినో, చెడ్డవానినో ఎట్లయినా వుండనిమ్ము. అయినా నీవు నీ మనస్సులో నన్ను దాసునిగా భావించి నా అవగుణములను క్షమించగలవా? నా మనస్సు జన్మ జన్మాంతరముల నుండి నన్ను జయించుచూ వస్తున్నది. అనగా నాపైన విజయమును పొంది నాట్యమును చేయించుచున్నది. నన్ను నా మనస్సుపైన విజయము పొందుటకు తగిన యోగ్యునిని చేసెదవా? అనగా నేను నా మనస్సును నావశములో వుంచుకొనగల సమర్థుడను కాగలనా? ఇట్లు అయినచో నేను సరియగు అర్థములో సనాథుడను కాగలను. ఓ స్వామీ! ఒక వేళ నీవు నా లఘుత్వమును అనగా నీచత్వమును చూచి, భయభీతులు గలవారము కాము. నీవే అనాథపతి అయ్యెదవు అనగా ఒకవేళ నీవు నాయటువంటి భయంకరమగు నీచుని చూచి భయపడక నన్ను స్వీకరించెదవా? ఎందుకనగా అప్పుడే సరియగు అర్థములో అనాథపని అని చెప్పుటకు అధికారివి కాగలవు. ఎందుకనగా నాకంటె అనాథుడు నీకు మరొకడు ఎవరును లభించరు. నేను నా భయముల కారణమున నీతో నేను ఈ ప్రార్థన చేయుచున్నాను. ఎందుకనగా నాకు మీరు పరమ స్నేహితులు. భావము ఏమనగా ఒకవేళ నీవు నా నీచత్వమును చూచినా వలన భయభీతుడవయినచో నేను అనాథుడైయుండెదను. సనాథుడను కాను. దీని చేతనే నేను భయపడి నిన్ను ప్రార్థించుచున్నాను. నిన్ను కాదని తులసీదాసు ఎవరికి చెప్పగలడు? ఎందుకనగా నీవే నాకు అన్ని విధములుగా స్వామివి; గురువు, తల్లివి, తండ్రివి.

(ఈ గేయమునందు తులసీదాసు తన దీనత్వమును, కరుణ భావమును మిక్కిలి ఎక్కువ మార్మికమై ప్రభ విష్ణువై యున్నది.)

227. [illegible]
శరణు యందు వుండనిమ్ము. ఓ కృపాసాగరా! ఓ కోశలనరేశ! నీవు శరణాగత వత్సలుడవు. నీ స్వభావము ప్రకారము ఆచరించుము. అనగా నేను నీ శరణుజొచ్చితిని. తన స్వభావము మేరకు నాయందు దయకలిగి నన్ను రక్షింపుము. నేను ఎల్లప్పుడు చెడివున్నాను. ఇప్పుడు నీవు చెడినవానిని ఇంకను ఎక్కువ చెడుపు చేయవద్దు. భావము ఏమనగా నేను నా మనస్సు ఇంద్రియములకు వశుడనయినందున మొదటనే అనేక పాపములను చేసి యున్నాను. ఒక వేళ నీవు ఇప్పుడు ఛీత్కారములు చేసిన నేను ఇంకను ఎక్కువ పాపకర్మల యందు లిప్తుడను అయ్యెదను. నీవు ఎల్లప్పుడను అందరిని అన్ని విధములుగా చక్కదిద్దుము. అనగా నీవు ఎల్లప్పుడు పాపులను నీశరణుయందు వుంచుకొని వారిని ఉద్ధరించితివి. నన్ను కూడా ఉద్ధరించుము.

నాయటువంటి పాపిని స్వీకరించిన, ప్రపంచము నిన్ను పరిహసించునని భయపడుచున్నావా? కాని నీవు ఎల్లప్పుడు పాపులను స్వీకరించుచువున్నావు. ఉదాహరణకు నీవు వానరులను (కోతులను) హనుమంతుని, సుగ్రీవులను, నావికుడు నిషాదరాజు గుహుడు మొదలగు వారిని ఉద్దరించితివి. తన మిత్రులుగా భావించుచున్నావు. నీవు నీ శీలము, హృదయ సౌజన్యము కారణమున వీరిని స్వీకరించి యుంటివి. ఇప్పుడు నావంతు వచ్చినప్పటికి నీ అప్పటి స్వభావముచే పనిచేయుము. అనగా నన్ను కూడ వారివెలనే స్వీకరించుము. ఒకవేళ నేను అపరాధుడనే అయినా నేను నీ వాడనే (జీవుడు బ్రహ్మ అంశముగా నుండును). ఇందువలన నన్ను మరచి పోవద్దు. ఎందుకనగా చేయి విరిగి పోయినప్పుడు దానిని కోసి వేరుగా చేయకు ఆలింగనము చేసికొందుము. అనగా మెడలోకట్టుకట్టి అందులో ఆ విరిగిన హస్తమును వుంచబడును. కన్ను పగిలిపోయిన (కండ్లజబ్బు) అప్పుడు బాధను తొలగించుకొనుటకు దానిని ఉపచారము చేయుదుము. ఇదేమాదిరి నేను నీ అంశమునే. అపరాధిని అయినప్పటికి, నన్ను దూరముగా తొలగించి వుంచుట న్యాయము కాదు.

(జీవుడు, బ్రహ్మ అంశము. ఇందువలన అతని దుఃఖము, బ్రహ్మ దుఃఖము అగును. ఇది చెప్పి తులసీదాసు - భక్తుని పీడ భగవంతుని పీడగా ఐక్యముగా భావించెను. శరీరములోని ఒక అంశమునందు పీడకలిగిన దానిని కోసి వేరుచేయక, దానికి ఉపచారము చేయుదుము. అదేమాదిరి భగవంతుడు తన భక్తుని పీడను స్వయముగా అనుభవించి, అతని పీడను తొలగించుదురు. ఎందుకనగా భక్తుడు భగవంతుని యందు భేదములేదు. భక్తుడు భగవంతుని అంశమే.)

228. ఓ రామా! వినుము. నీవు నా తరపున నా మనస్సును మురికిగా చేయవద్దు. నా ఎడ విముఖుడవు కావద్దు. నాకు ఈ లోకమున, పరలోకమున నీవు తప్ప నా హితము కోరువారు ఎవరును లేరు. తమ స్వార్థము చేత స్వార్థపరులయి, నా స్వార్థ మిత్రులు నన్ను

గుణహీనుని, పనికిరాని, సోమరి, నీచుడు, చేతగానివాడని భావించి వదలివేసిరి. మరల తిరిగి నా ప్రక్కకు చూడలేదు. ఎటులయితే చలిజ్వరము వచ్చిన మంత్రగాడు మంత్రించిన వెనుకకు చూడక చెల్లునట్లు నన్ను భక్తిలేని, వేదముల యందు పేర్కొనిన మార్గముల బయట అనగా వేద మార్గమున వెళ్ళక చూచి, కలియుగము పాపములు ముట్టి చుట్టినవి. ఓ దేవా! దేవతలు కూడ, నన్ను వదలివేసిరి. అనగా వారు కూడ నా సహాయము చేయరు. అయిన ఇందులో అతనిది ఏ మాత్రము అన్యాయము లేదు. ఎందుకనగా నేను అందరికి అపరాధినే. అనగా నేను నా కర్మల చేత ఎవరిని కూడ, సంతోష పరచలేదు. ఒకవేళ దేవతలు నన్ను త్యజించినను ఇందులో వారు ఏ అన్యాయమును చేయలేదు. నేను దీనికి తగిన వాడను.

ఓనాథా! నేను నీ నామము ఆధారముగా చేసుకొని నాపొట్ట నింపుకొనుచున్నాను. అయినా నీ సేవకుడను అని అపిపించుకొనుచున్నాను. అనగా నేను నీ పేరు స్మరించుట బూటకము చేసి నా పొట్టను నింపుకొనుచున్నాను. నీ సేవకుడను కాదు. అయిన నీ సేవకునని పిలువబడుచున్నాను. ఇప్పుడు ఈ విషయము ప్రపంచమంతయును వ్యాపించినది - తులసీదాసు రాముని సేవకుడు. లోకము పెద్దదా, వేదములు గొప్పవా అనునది నీవు ఆలోచించుము. నేను వేదమార్గమున ప్రవర్తించక పోయినను, కాని దీని కొరకు ఎవరును నాతో చెప్పరు. నేను నీ సేవకుడనే అని ప్రపంచమునకు తెలుసు అనగా నేను వేద మార్గమున ప్రవర్తించపోయినను నీ సేవకుడనే. బాహ్యాడంబరమునగాని, ఒక వేళ నీవు నన్ను ఉద్ధరించక పోయిన లోకము నిన్ను చెడ్డవాడని అపకీర్తి కల్గించును. ఎందుకనగా లోకాభిప్రాయము మేరకు అందరు దానిని గౌరవించెదరు. వేదమతములో ఎవరో ఒకరిద్దరు ప్రవర్తించెదరు. ఇందువలన బేదాభ్రిప్రాయము కంటె లోకమతమే ఎక్కువ. ఇది తెలుసుకొనుము. తులసీదాసుకు ఎప్పుడో ఒకప్పుడు మేలు కల్గును. రాముని ద్వారానే, ఇందువలన ఓ దేవా! నేను సమర్పించుకొనుచున్నాను. నీద్వారా నన్ను స్వీకరించుటలో ఆలస్యము అయిన, నేను దినదినమునకు చెడిపోవుదును. (కోపగించుకొందును). ఇందువలన నన్ను త్వరగా స్వీకరించుము అనగా ఆలస్యము చేయుటలో నేను ఇంకా ఎక్కువ కోపగించుకొందును. చెడిపోవుదును. అప్పుడు నీకు చక్కదిద్దుటకు ఎక్కువ కష్టమగును, శ్రమపడవలసి వచ్చును.

229. ఓ దేవా! నేను ఎక్కడికి వెళ్ళను? నాయటువంటి దీనుడు, దుఃఖతుడునగు నాకు చోటెక్కడ వున్నది? నీయటువంటి సమానమైన దయగలవాడు వేరొకరు లేరు. అన్ని విధములుగ నిర్బలులను శరణు ఇచ్చువారు ఎవరు ఈ ప్రపంచములో ఇతర దేవీ దేవతలు (స్వాములు) వున్నారో వారందరు, గుణవంతులు, సేవచేయుటలో యోగ్యులైన వ్యక్తులను తమసేవ చేయుటలో వుంచుకొందురు. కాని నాయటువంటి నిర్ధనుని, గుణ హీనున్ని సోమరి మనుష్యులను పోషించుట కేవలము రామునికే శోభ కల్గించును. ఆయన నిత్య నూతనముగా ఉండును. అనగా కేవలము రాముడు మాత్రమే విసుగుకొనక అయోగ్యులగు

సేవకులను పోషించును. (ఇక్కడ నవీన అర్థము సదా కిశోరుడయి వున్న వాడు రామునితో తులన పేర్కొనబడును.)

ఓ ప్రభు! నేను నానోటితో ఏమి చెప్పను? నీవు స్వయముగా చతురుడవు (అంతర్యామి)వి నీవు నా మనస్సు తెలుసుకొందువు. తులసీదాసువంటి మలిన మైన మనస్సుగలవారు. ముల్లోకములయందు మూడు కాలములయందు నీవు ఒక్కడే ఆధారము. ఒకవేళ ఆధారము యొక్క అర్థము ప్రతిజ్ఞగా భావించినచో దీని అర్థము - తులసీదాసు యొక్క ఒకే ప్రతిజ్ఞ ఏమనగా నీ శరణులో వుండుట.

(రాముని ఎడ తులసీదాసుకు సాటిలేని భక్తి భావము ప్రకటన అగుచున్నది. తులసీదాసు అన్ని వదలి రాముని శరణులో పోగోరుచున్నాడు. ఇక్కడ తులసీదాసు భగవద్గీతలోని ఈ వాక్యమును పాటించుట ప్రకటన చేయబడినది "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ".)

230. ఓ రామా! నేను దంతములను బయటపెట్టి, పాదముల యందు వ్రాల ద్వారము, ద్వారము వద్దకు వెళ్ళి నా దీనత్వమును, పేదరికమును వర్ణించితిని. ఈ ప్రపంచమున దశదిశల ప్రపంచము వున్నంతవరకు పాపములను తొలగించుటకు సమర్థతగల దీనదయాలుడవు నీవు. అయినా వారిలో ఎవరునూ నాకు మాట కూడ చెప్పలేదు, అడుగలేదు. తల్లితండ్రులు తమ శరీరము నుండి పుట్టించుకొని కూడ నన్ను దుష్ట కీటకముల వలె (సర్పము) త్యజించిరి. ఈ విషయమునకు నేను క్రోధమును ఎందుకు చూపుదును? వారిని దోషులని ఎందుకు చెప్పవలెను. ఎందుకనగా నా దురదృష్టము వలన అందరును నా నీడకూడ స్పర్శించుటకు సంకోచించుచున్నారు. అశుభముహూర్తమున జన్మించిన తులసీదాసు పుట్టిన వెంటనే వారి తల్లితండ్రులు వానిని త్యజించియుండిరి. భావము ఏమనగా నేను దురదృష్టవంతుడనే అటువంటప్పుడు ఎవరిని దోషులను చేయుదును?

నేను దుఃఖముతోనుండగా చూచి, సత్పురుషులు నీవు మనస్సులో దిగులు పెట్టుకొనవద్దు అని చెప్పిరి. రఘువీరుడైన రాముడు నాయటువంటి పశువును, నీచున్ని పాపులను కూడ శరణుజొచ్చిన త్యజించక, చివరివరకు వారిని నిర్వహించెను. భక్తులమాట వినియే నేను నీ శరణుజొచ్చితిని. ప్రేమ, విశ్వాసము లేకయే నీ వానిని అగుటవలన సుఖముగా నున్నాను. భావము ఏమనగా ఒకవేళ నా మనస్సునందు, నీ ఎడ ప్రేమ, విశ్వాసము లేకున్నను, అయినా కూడా నీవు నన్ను నీ వానిగా చేసుకొన్నావు ఇప్పుడు. నేను ఇప్పుడు సుఖముగా నున్నాను. రామా! ఓ నాథా! నేను నీమహిమవలన, శీలము ద్వారా శుభముగలవాడిని అయితిని ఇది చూచి మనస్సునందే సంకోచించుచున్నాను. ప్రసన్నుని అగుచున్నాను. భావము ఏమనగా నీవు నీ శీలము, స్వభావము చేత నానోటి నుండి నీ నామస్మరణ చేసిన వినిన వెంటనే నాకు శుభమును కల్గించితివి. ఇది ఆలోచించి నేను

(మొదట పంక్తియందు ఉపలక్షణా పద్ధతి ప్రయోగము అయినది. నా తల్లిదండ్రులు నన్ను తమ శరీరము నుండి చెడు పురుగు పుట్టించుకొన్నట్లు భావించి తులసీదాసును త్యజించిరి. స్వర్గమునకు పోయిరి.)

231. ఓ రామా! నేను ఏ పని చేయలేదు. ఎక్కడెక్కడికి వెళ్ళలేదు. ఎవరెవరికి తలవంచలేదు. నీ దాసుడను కానందున మాటిమాటికి జన్మపొంది పొంది (విభిన్న యోనులయందు పుట్టి - పుట్టి) దశ దిశలు అనగా నల్దిశల దుఃఖమునే పొందుచుంటిని. అనగా నేను అన్ని విధములైన పనులను చేసితిని. అందరివద్దకు దారితప్పి తిరుగుచుంటిని అందరి ముఖస్తుతి చేసితిని. అయినా నీ భక్తి లేకయే జన్మజన్మాంతరముల నుండి దుఃఖమునే అనుభవించుచున్నాను. నేను నా కోరిక వశమున వీలులేక (గత్యంతరము లేక) నీచులగు యజమానులవద్ద స్వయముగా వారి ముఖ్యమైన నౌకరుగా అయి తెలియ చెప్పుచుంటిని. ప్రతి ద్వారము వద్దకు మాటిమాటికి వెళ్ళి హాహా కారము చేయుచు అందరికి తన పేదరికమును గురించి చెప్పుచూ చూపెట్టు చుంటిని. కాని నా తెరువబడిన నోటి యందు, ఎవరును దుమ్ము కూడ అందులోనికి వేయలేదు. అనగా ఎవరు కూడ మాటవరుసకు అయినను అడుగలేదు. (ఇక్కడ ముఖ్యమైన దాసుడు అనుటకు అర్థము జీవుడు బ్రహ్మ అంశము అయినందున అతనిని బ్రహ్మకు ముఖ్యమైన దాసుడని భక్తునిగా భావించిన ఈ అర్థమునకు ఈ విధముగా నుండును. నేను నీకు ముఖ్యమైన దాసుడను అయినప్పటికి నీచులైన యజమానుల వద్దకు వెళ్ళి నన్ను నేను వారికి ముఖ్యమైన దాసుడనగా నిరూపణకు ప్రయత్నించుచూ వుంటిని. అనగా వారిని అన్ని విధములుగా ముఖస్తుతి చేయుచూ వుంటిని.

నేను అన్న వస్త్రములు లేక పిచ్చి వానివలె లేచి లేచి ఇటు అటు పరుగెత్తు కొనుచూ వుంటిని. నేను ప్రాణులకంటె ప్రియముగ నా మహిమను, సన్మానమునకు, తిలోదకము లిచ్చి దుష్టుల ఎదుట క్షణక్షణము నా ఆకలిగొన్న పొట్టను తెరచి తెరచి చూపెట్టసాగితిని. (నేను ఆకలిగొన్న వానినని చెప్పితిని) ఓ నాథా! నేను దురాశ చేత, పేరాశపడుచూ ఇటు అటు తిరుగుచుంటిని. కానినా చేతులకు ఏమియును అందలేదు. ఇటువంటి నాట్యము ఏదియును లేదు. నేను నీచుడను, సిగ్గులేనివాడను, క్షుద్రుడను లోభము నా చేత ఏ ఆట ఆడించలేదు. అని నేను నీతో నిజము చెప్పుచున్నాను. అనగా లోభము చేత నేను అన్ని విధములైన కుకర్మలను చేసితిని. కపటములు చేసితిని. నా చెవులు, కన్నులు, మనస్సు తమ తమ దారిలో నిమగ్నమయి యుండెను. (చెవులతో పరుల అపవాదములని వింటిని. కన్నులతో స్త్రీలను చూచితిని, మనస్సునందు ఎల్లప్పుడు చెడు భావములు నిండియుండెను). నేను అనేకమంది రాజులను పరీక్షించితిని. అనగా చాలామంది రాజులవద్దకు వెళ్ళి - వెళ్ళి వారిని భిక్షము అడిగితిని. (అయిన ఎవ్వరును ఇవ్వలేదు) అప్పుడు చివరకు తలకొట్టుకొని, సర్వ ప్రయత్నములు చేసి మనస్సులో ఓటమిని ఒప్పుకొని, నామేలు చూచుకొని వ్యాకులడనయి నీ పాదముల శరణు చూచుచూ వుంటిని. నీ దగ్గరకు వచ్చితిని, అనగా

చుట్టు ప్రక్కల (నల్దిశల) నిరాశ చెంది, కేవలము నీతోనే నాకు మేలు అగునని చూచి నీ శరణు జొచ్చితిని నన్ను నీ శరణులో వుంచుకొనుము.

(ఉపలక్షణ పద్ధతి ద్వారా దీనత్వమును ప్రదర్శించెను. తులసీదాసు రాముని ఎడ అనన్య భక్తి భావము, దృఢమైన నిష్టకు ప్రతీక. పైపైన చూచిన సాధువుల, భక్తుల వర్ణనవలె నుండును. కాని తులసీదాసు యొక్క వ్యక్తి గత జీవితమును గురించి లోతైన ప్రకాశమును కల్గించుచున్నది. తులసీదాసు బాల్యావస్థనుండియే అనాథుడయి యుండెను. అయన బాల్యము చాలా సంఘర్షమై, తిరస్కారములు అను దెబ్బలు తినవలసి వచ్చెను. చివరకు రాముని ప్రక్కకు సుముఖుడయ్యెను.)

232. ఓ రాజా! రామా! నీవు తప్ప నా హితమును నిజముగా కోరువారెవరున్నారు? నేను స్వామి అనగా నీతోపాటు హాజరైన మనుష్యుల యందు రామ పంచాయితి పెద్దలు (సీత, భరతుడు, లక్ష్మణుడు, శతృఘ్నుడు, హనుమంతుడు) ఐదుమందితో చెప్పుచున్నాను. మీరందరు నా మాటవిని, దానిని గురించి విచారించి, ఒకవేళ ఇంకా ఎవరినైనా గొప్పవారని భావిస్తే రెండవ గీత (పంక్తి) గీయుము. అనగా నా సిద్ధాంతము స్వీకరించక, ఒక కొత్త సిద్ధాంతమును స్థాపించుము. భావము ఏమనగా నాకు రాముడే గొప్ప హితమును చేకూర్చువాడు; మరెవడు లేడు అని నేను భావించితిని. కాని మీరందురు రాముని కంటె గొప్పవాడు ఎవరైనా వుంటే, నా సిద్ధాంతము అసత్యమైనది. రాముని కంటె గొప్పవాడు, నా హితమును కోరువున్నారంటే, ఎవరో చెప్పుము. నేను మీ మాట ఒప్పుకొని (మన్నించి) అతనినే నా స్వామి అని భావించెదను.

ఒకవేళ మీరు ఈ నా ప్రపంచమునకు సంబంధించిన తల్లి, తండ్రి, భార్య, పుత్రులు, సోదరులు, బంధువులు మొదలగు వారు నా హితులు అయిన వారిని గురించి నా అభిప్రాయము, శరీరమున ప్రాణము వున్నంతవరకు జీవుడు (ప్రాణము) సంయోగము వున్నంత వరకు నా హితులుగ నుండవచ్చును. అనగా వ్యక్తి జీవించివున్నంతవరకు రక్తమునకు ప్రపంచ సంబంధములు వుండును. చనిపోయినచో ఈ రక్త సంబంధములన్నియు తొలగును. ఈ సంబంధములు చెల్లని నాణెములు అనగా మృత్యువు వచ్చి ఈ సంబంధములను ఛిన్నాభిన్నము చేసి, వీటి సారము లేని మిథ్యత్వమును రుజువు చేయుచున్నది. అనగా ప్రపంచములోని సంబంధములన్నియు అసత్యమైనవి. ఇందువలన నేను వీటిని నా హితమును గోరునవి కావు, అని భావించితిని ప్రపంచములోని అన్ని సంబంధములు విషయ వాసనలతో కూడినవి అసత్యమైనవి. దుఃఖమును కల్గించునవి. అలోచన చేసిన, అనగా జ్ఞాన దృష్టితో చూచి నట్లయితే, ఈ సంబంధములు అరటిపండు సారము వలె సారములేనివిగా నిరూపణ అగును. ఒకవేళ కండను గురించి అన్వేషణలో అరటి వృక్షమును చీల్చినట్లు చివరి వరకు కండ నీకు లభించదు. ఇదే మాదిరి ఈ ప్రపంచములోని సంబంధముల యందుకూడ ఈ విధముగానే సారము వుండదు.

అన్నియు అరటి బోదెలవలె మోహింపచేసి పుష్టిగా కనపడును. కాని పరీక్షించిన తత్త్వహీనముగా నిరూపణయగును. ఈ ప్రపంచములోని సంబంధముల యందు కూడ ఈ విధముగానే సారము వుండదు. ఈ ప్రపంచములోని. సంబంధములో మణులు, స్వర్ణము మధ్య గాజును పొదిగించి చేసిన ఆ భూషణములవలె అందరుగా కనపడుచుండును. మాణిక్యము బ్రహ్మ, స్వర్ణము జీవుడు, గాజు ప్రాపంచిక సంబంధములు. భావము ఏమనగా బ్రహ్మ జీవుని సంయోగము వలననే ప్రాపంచిక సంబంధములు అందముగా కనపడుచుండును. వాస్తవముగా తత్త్వహీనమై యుండును. గాజుముక్కలవలె ప్రాపంచిక సంబంధములు స్వతంత్ర రూపమున (మణి) బ్రహ్మ-జీవుల కలయికకు ఆటంకమును కల్గించి బాధించును. ఇందువలన వాటిని త్యజించవలెను. కాని బ్రహ్మ - జీవుల సంయోగము వలన అవి సత్యమగును. ఎందుకనగా జీవుడు బ్రహ్మ ఆకర్షణలో బ్రహ్మ ఎడ జీవుడు అత్యంత ప్రబలముగా నుండును. ఈ ఆకర్షణకు ప్రేరణ అగును. ఇందువలన గాజువలె ప్రాపంచిక సంబంధములు బాగుండును. ఇవి మణివలె ప్రతీతమగును. (అగుపించును) మనలో ప్రబలమైన ఆకర్షణ భావనను ఉత్పన్నము చేయును. జ్ఞాన దృష్టి కలిగిన మన ఆ ఆకర్షణ భావన బ్రహ్మ ప్రక్కకు పురోగమనమగును. అందువలన ప్రాపంచిక సంబంధముల సదామిథ్యగా కాక అప్రత్యక్షముగా శుభమును కల్గించునవిగా నిరూపణ అగును.

ఓ తండ్రీ! ఈ దీనుని వినయ పత్రికను నీవు స్వయముగా చదువుము. ఇతరులతో చదివించవద్దు. దీనిని తులసీదాసు తన హృదయమున బాగుగా ఆలోచించి, అనగా మననము చేసిన తరువాత వ్రాసితిని. నీవే చదివి వెంటనే స్వీకరించు వారు తమ స్వభావము ప్రకారము, మొదట తన స్వీకారము చేయవలెను. ఆమోద ముద్ర వేయవలెను. తదుపరి ఇతరులకు ఇంతమంది సీత, భరతుడు, లక్ష్మణుడు, శతృఘ్నుడు, హనుమంతుడు వీరి అభిప్రాయమును తీసుకొనవలెను. భావము ఏమనగా నీవు మొదట వీరితో సలహా తీసుకొనిన ఇందులో ఏమైనా దోషములు వున్నావేమో అని భయము కల్గుచున్నది. ఇందువలన నీవు దీనిపైన నీ అంగీకారము చెప్పినచో అందరును స్వీకారమును తెల్పుదురు.

(దేహ - జీవ భావము ప్రాపంచిక సంబంధముల యందు భగవంతుని ప్రాప్తిలో సహాయకారిగానుండును. వాటిని అసత్యమైనవిగా భావించక సత్యమనే భావించవలెను. సాధకులు వాటిని అసత్యములుగా భావించి త్యజించవలెను. రాముని ఈ పంచాయితి యందు రాముడు కాక ఆయన ముగ్గురు సోదరులు, సీత, హనుమంతుడుగా భావించబడిరి. మొదట రామునితో తన విన్నపమును అంగీకరింప చేసుకొనగోరును. తులసీదాసు ప్రార్థన చేయును. చివర పంక్తిలో ఈ విచిత్రమైన ప్రార్థన చేత మిక్కిలి ఉదాత్తమై, మోహనము అయి చాటు మాటు హాస్యము పెంపొందినది. ఇటువంటి శిష్ట హాస్యము మిక్కిలి దుర్లభము.)

233. రామునికి వినయపత్రిక సమర్పించిన పిమ్మట, తులసీదాసు రాముని ఆస్థానములోనున్న ఇతరులతో ప్రార్థించుచూవున్నారు.

ఓ హనుమాన్! ఓ భరత ప్రియ రత్నమా! ఓ లక్ష్మణా! నేను సమర్పించుకొనుచున్నాను. మీరు అందరు అవకాశమున్నప్పుడు దీనుడనగునన్ను రక్షించండి. మీరు ఇట్లు చేయుట వలన మీ ముఖ్యమైన దాసుని కోరిక నెరవేరును (పూర్తి అగును) అనగా స్వామి రాముడు నా వినయపత్రికను, స్వీకరించెదరు. రాజుగారి ఆస్థానమున, సాధువులు, సత్పురుషుల భక్తుల. యోగ్యతగల మానవుల గురిచి సందర్భము వచ్చినప్పుడు అందరు వారిని ప్రశంసించెదరు. అయిన మీయటువంటి వారందరు నాయటువంటి శరణులేని అనాథుడనగు నా విషయము స్వామియగు రామునికి సిఫారసు చేసినచో మీకు పుణ్యము వుండును. జగమంతటా మీ కీర్తి వ్యాపించును. నాకు స్వామి కృప లభించును. దానివలన నా స్వార్థము - పరోపకారము (పరమార్థము) సిద్ధించును. అనగా నా ఇహపరలోకములు రెండును సార్థకమగును. ఇందువలన మీరు మంచి సమయమున నా విషయమును సంబాలించి (నిర్వహించి) మీ దాసుడనగు తులసీదాసు స్థితిని (పరిస్థితిని) చక్కదిద్దవలెను. అనగా అవకాశమును చూచుకొని రామునికి నా సిఫారసు చేయవలెను. మీరు ఇట్లు చేయుటవలన, నా చెడిన కార్యము బాగు అగును. భక్తి వత్సలుడు, కృపగలవాడగు రామునికి మీరందరు నా ప్రతిని రీతిని తెలియచేయవలెను. కలియుగము భయము చేత పరాధీనుడగు తులసీదాసు ప్రేమకు హద్దు ఇదియే. భావము ఏమనగా నేను కలియుగము కారణమున ఏదేని సత్కర్మ చేయలేక పోయితిని. ఇందువలన రాముని చరణముల యందు నా ప్రేమకు సాక్షిగా ఈ నివేదికను తీసుకొని వచ్చి హాజరు అయివున్నాను. ఇదియే వారి ఎడ నాకున్న ప్రేమ రీతికి రుజువు (ప్రమాణము). మీరు ఇట్లు చెప్పినచో వారు దీనిని స్వీకరించెదరు.

విశేషము : ఈ గేయము నందు తులసీదాసు చాలా నేర్పుతో, మొదట హనుమంతునితో, పిదప లక్ష్మణునితో రామునికి సిఫారసు చేయండి అని మనవి చేసుకొనుచున్నారు. ఏలనగా వీరు ఉభయులు రామునికి మిక్కిలి ఎక్కువ విశ్వసనీయులు. రాముడు వీరిమాటను ఒప్పుకొనును (స్వీకరింతురు).

234 రాముని ఆస్థానము కొలువు తీరినది. సభ మధ్యలో రాముడు పంచముఖ్యులు వున్నారు ఈ సమయముననే తులసీదాసు వినయపత్రిక ఎదుటవుంచబడును. తులసీదాసు ఈ సందర్భమును గురించి వర్ణించుచూ చెప్పుచున్నారు.

హనుమంతుని, భరతుని మనస్సులలోని కోరిక (తులసీదాసుకు సిఫారసు చేయుట) చూచి లక్ష్మణుడు రామునితో, ఓ నాథా! (రక్షకుడు) ఈ కలియుగమున కూడ నీ ఒక దాసుడు భక్తుడు తులసీదాసు నీ పేరు ఎడ ప్రీతి, విశ్వాసము కల్గి నిర్వహించెను. అనగా తులసీదాసు నీపేరు ఎడ తన దృఢమైన విశ్వాసము సంపూర్ణమగు ప్రేమను అందముగా

నిర్వహించెను. లక్ష్మణుని ఈ మాట విని సభలోని వారందరు ఈ విషయమును సమర్థింపసాగిరి – మేము కూడ తులసీదాసు రీతిని ఎరుగుదుము. నిజముగా తులసీదాసుకు మీ పాదముల ఎడ అమితమైన ప్రేమ విశ్వాసములున్నవి. ఇదంతయును పేదల ఎడ దయగల రాముని కృపాఫలము, రాముడు పేదవారిని చూచిన వెంటనే వారిని చేతితో పట్టుకొని తన శరణులోనికి తీసుకొనును. భావము ఏమనగా రాముని కృప వలననే రామునిఎడ తులసీదాసు కలపేరుకల్గి విశ్వాసముతో నిర్వహించడము అయినది. ఎందుకనగా, రాముడు తులసీదాసుని దీనుడని తెలుసుకొని, మొదటనే తన శరణులోనికి తీసుకొని యుండెను.

సభాపదుల ఈ మాటవిని రాముడు చిరునవ్వు నవ్వుచూ మీ మాట సత్యమైనది అని అనెను. నాకు కూడ అతని విషయము తెలిసినది. అనగా నేను కూడ అతని ప్రార్థనను (మనవిని) వింటిని. ఇది విని తులసీదాసు మిక్కిలి ఆనందము చేత కంపమును చెంది; శిరస్సువంచి రామునికి నమస్కరించెను. అనాథుడగు తులసీదాసు పని చెడినది, బాగు అయ్యేను. (కార్యము సఫలము అయ్యేను) రాముడు తన చేతితో వినయపత్రిక పైన స్వీకారము (అంగీకారము) అను ముద్రవేసెను.

(తులసీదాసు వినయపత్రికను గురించి రామునికి ముందుగానే (పూర్వమే) తెలిసియుండెను. ఎందుకనగా జానకి వారికి (రామునికి) ముందే చెప్పియుండెను. తులసీదాసు వినయపత్రిక ప్రారంభముననే జానకికి మొరపెట్టుకొని యుండెను. రామునికి సమయము చూచి నన్ను గురించి నా కరుణ కథను వినిపించుము.

ఇందువలన రాముడు తులసీదాసు ఎడ కృపకల్గి యుండిరి. ఆయన కృపవలననే తులసీదాసు విఫలము అయిన కార్యము సఫలము అయ్యేను. మర్యాద పురుషోత్తముడగు రాముడు కేవలము సీత మాటవిని అప్రత్యక్ష రూపముగ తన వరద హస్తమును వుంచి యుండును. కాని ఆయన ప్రార్థనను సార్వజనీనముగా, తులసీ సిఫారసు అందరు చేసిన తరువాత ఆమోదము తెల్పెను. ఈ విధముగా రాముడు ఒక ప్రక్క లోక మర్యాదను రక్షించెను. రెండవ ప్రక్క తులసీదాసుకు మౌనముగా సహాయము చేయుచుండిరి.

ఇక్కడ హనుమంతుడు, భరతుడు, తులసీదాసును గురించి సిఫారసు చేయ కుతూహలముగా నుండిరి. కాని వారి మనస్సునందు దాస్య భావమున్నందున చెప్పుటకు సాహసించలేదు. లక్ష్మణుని ఎడ రామునికి వాత్సల్య భావము వున్నది. ఇందువలన లక్ష్మణుడు, హనుమంతుని, భరతుని మనస్సులోనున్న భావమును గుర్తెరిగి, రామునితో, కుమారుడు తండ్రికి అన్ని విషయములు చెప్పునట్లుగా చెప్పెను. హనుమంతుని భరత, లక్ష్మణుల స్వభావముల భేదము మనకు చూడనగును.

**వినతిపత్రము సమాప్తము.**